# ఇందులో....



**అబ్బాదుల్లా**
డైరెక్టర్
తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్
సందేశభవనం, లక్కడ్‌కోట్
ఛత్తాబజార్, హైదరాబాద్-2

# ప్రచురణకర్త మాట

భారత స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింలు నిర్వహించిన పాత్రను వివరిస్తూ సయ్యద్ నశీర్ అహ్మద్ రాసిన గ్రంథాలను ప్రచురించటం మాకు సంతోషం కల్గిస్తుంది. ఈ గ్రంథాలను ఇటు సాధారణ పాఠకులు అటు పండితులూ ఆదరించటంతో ఈ అంశం మీద మరిన్ని గ్రంథాల రచనకు రచయిత సిద్ధం కాగా, ఆ పరిశోధనాత్మక చరిత్ర గ్రంథాలను వరుసగా తెలుగు పాఠకులకు మేమందించాలనుకున్నాం.

ఆ క్రమంలో మా ఏడవ గ్రంథంగా **1857 : ముస్లింలు** వెలువరిస్తున్నాం. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 150 సంవత్సరాల సంబరాలను రాష్ట్ర ప్రభుత్వం - ప్రజలు జరుపుకోవాలని నిర్ణయించిన సందర్భంగా మాతృభూమి విముక్తి పోరాటంలో అద్వితీయ త్యాగాలతో చిర్మరణీయులైన ముస్లిం యోధుల సాహస చరిత్రలను ప్రజల దృష్టికి తీసుకురావలని ఆలోచించాం. ఆ ఆలోచన మేరకు సయ్యద్ నశీర్ అహమ్మద్ రాసిన **1857 : ముస్లింలు** ప్రచురించాం. ఈ పుస్తకం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల మహోన్నత పాత్రను మనకు తెలియజేస్తుంది.

శతాబ్ధాలుగా కలసిమెలసి సహజీవం సాగిస్తున్న మనదేశంలోని వివిధ సాంఘిక జన సముదాయాలు తమ తమ పూర్వీకులు మాతృదేశ విముక్తి కోసం, ఆ తరువాత స్వంత గడ్డ ప్రగతీ-వికాసాల కోసం చేసిన త్యాగాలనూ, సాగించిన కృషినీ అన్ని ప్రజా శ్రేణులు పరస్పరం తెలుసుకుంటే ఒకరి పట్ల మరొకరికి గౌరవభావం కలుగుతుంది. ఆ గౌరవభావం నుండి జన సముదాయాల మధ్య మంచి సదవగాహన, సద్భావన పరిఢవిల్లుతాయి. ఆ సద్భావన నుండి సహిష్ణుత జనిస్తుంది. ఆ దిశగా మా ప్రయత్నాలలో భాగంగా తెలుగు పాఠకులకు ఈ గ్రంథాన్ని అందిస్తున్నాం.

**- అబ్బాదుల్లా**



# ప్రమాణ వాక్యం


**డాక్టర్ ఇనుకొండ తిరుమలి**

చరిత్ర శాఖ, శ్రీ వెంకటేశ్వర కళాశాల
ఢిల్లీ విశ్వవిద్యాలయం, కొత్త ఢిల్లీ


## జ్ఞానకిరణమీ పుస్తకం

చరిత్ర రచన ప్రధానంగా దృక్పథానికి సంబంధించిందనేది నిర్వివాదాంశం: అది గతాన్ని గూర్చిన మన ప్రస్తుత అవగాహన. మన గతం తాలూకు అవగాహననీ, దృక్పథాన్నీ వర్తమానం నిర్వచించి నిర్దేశిస్తుంది. ఎటువంటి భావజాల ప్రభావమూ లేకుండా, పూర్తిగా వస్తుగత దృష్టితో చరిత్ర రాస్తున్నాం అంటే సంకోచించాల్సిందే! 'పరిపూర్ణ' వస్తుగతతత్త్వవాదుల రచనలు కూడా, కనీసం వారుపయోగించే పదజాలం ద్వారానైనా, ఏదేనీ ఒక దృక్పథాన్ని, అవగాహననూ స్ఫురింపజేస్తాయి. భారత జాతీయవాదులు, కమ్యూనిస్టులు, యితరత్రా అనేకమంది తమ-తమ దృక్పథాలతో, తమ తమ భావజాల ప్రచారానికై చరిత్ర రచనా వ్యాసాంగాన్ని చేపట్టి కొనసాగించారు/సాగిస్తున్నారు. వివిధ విశ్వవిద్యాలయాలలో పుట్టుకొచ్చిన చరిత్ర యిందుకు భిన్నంగా ఏమీ లేదు. 'పాఠ్యపుస్తకాలు'గా మనవారు 'నిర్ణయించే' చరిత్రల స్వభావం మనమంతా ఎరిగిందే: రాజ్యభావజాల ప్రచారాస్త్రాలివి ! విశ్వవిద్యాలయాలలో గత రెండు-మూడు దశాబ్దాలుగా జరుగుతున్న చరిత్ర బోధన, పరిశోధనలు 'పరిశోధన పరిశోధన కొరకే' నన్నట్లుగా, సమాజ అవసరాలతో సంబంధం లేకుండా తూ-తూ మంత్రంగా జరుగుతూ వస్తున్న విషాద వాస్తవం అష్టావక్రగా మనముందు సాక్షాత్కరిస్తోంది. విశ్వవిద్యాలయాలు సామాజికావసరాల పట్ల, ముఖ్యంగా అన్ని విధాలుగా అంచులకు నెట్టివేయబడ్డ సబాల్టర్న్ (అట్టడుగు సామాజిక శ్రేణులు) ప్రజల అవసరాల పట్ల స్పందించకుండా, insensitive గా మారిపోయిన కఠోర సత్యాన్ని కొంత మంది అసలుసిసలు 'మేధావులు' స్పష్టపరిచారు.

జ్ఞాన కేంద్రాలుగా విలసిల్లి, వేగుచుక్కల్లా వెలుగుతూ సమాజావసరాల పట్ల స్పందిస్తూ, సామాజిక సమస్యలకు పరిష్కారం చూపించాల్సిన విశ్వవిద్యాలయాల పరిస్థితి యింత ఘనంగా దిగజారిన సందర్భంలో అణగారిన వర్గాలే తమకు కావాల్సిన జ్ఞాన సంపదను సృష్టించు కుంటున్నాయి; జ్ఞాన ప్రచార/ప్రసార కార్యక్రమాలు చేపడుతూ జ్ఞాన సంపద ప్రజాస్వామీకరణకు శ్రీకారం చుడుతున్నాయి. దళితులు, స్త్రీలు, మత మైనార్టీలు తమ సమస్యల పరిష్కారాణు గుణ్యమైన దృక్పథాలతో పుస్తకాలు తెస్తున్నారు. ఇలాంటి పుస్తకాలు బహుళ జనాదరణ పొందుతున్నాయి; సామాజిక ఉద్యమాల నేపథ్యంల్లోంచి రావడం వల్ల వీటికి బలం, జనాదరణ కలుగుతున్నాయి. ఇలాంటి రచనలే ఒక అధ్యయనాంశంగా 'చరిత్ర' అవసరాన్ని నొక్కి చెబుతూ, దాన్ని ప్రధాన చర్చనీయాంశంగా మార్చాయి.

సయ్యద్ నశీర్ అహమ్మద్ రచనలను మనం ఈ నేపథ్యంలోనే అర్థం చేసుకోవాలి. ప్రజల్లోంచి వస్తున్న రచనలు కాబట్టే నశీర్ రచనలకు యింతటి ప్రజాదరణ లభిస్తుందని నేను బలంగా భావిస్తున్నాను. నశీర్ అహమ్మద్ పాత్రికేయుడు, న్యాయవాది, రచయిత. భారత స్వాతంత్ర్యోద్యమంలో ముస్లింల పాత్రను వివరిస్తూ ఇంత వరకు ఆయన రాసిన ఏడు పుస్తకాలు పలుమార్లు తిరగరాయబడి వివిధ ప్రచురణకర్తల ద్వారా ముద్రించబడ్డాయి. ఇటీవల పెచ్చరిల్లిపోతున్న మతతత్త్వ చరిత్రకు ఆయన రచనలు సమాధానం అని చెప్పాలి. ముస్లింలు ఈ సమాజ, దేశ చరిత్ర నిర్మాణంలో భాగస్వాములనీ, ఈ విషయంలో వారి contribution ఎవ్వరికీ తీసిపోనిదనీ ఆయన రచనలు రుజువు చేస్తాయి. ఈ విషయాన్ని నిర్ధారించే ఎన్నో చారిత్రక వాస్తవాలను ఆయన మనముందుంచుతున్నారు. ప్రస్తుత పుస్తకం దాని కొనసాగింపు.

1857 'తిరుగుబాటు' మీద ఎన్నో గ్రంథాలున్నప్పటికీ అందులో ముస్లింల పాత్రకు సంబంధించీ, ముస్లింల గూర్చి వివరించిన పుస్తకాలు చాలా అరుదనే చెప్పాలి. 1857 సంఘటనలను కొందరు 'ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం' అని, యింకొందరు 'తిరుగుబాటు' అని అన్నారు; మరికొందరు అది కేవలం మత స్వభావంగల 'సాంఘిక తిరుగుబాటు' అన్నారు. కానీ నశీర్‌గారు అందులోని 'ప్రజాస్వామ్య' కోణాన్ని చూపెడుతున్నారు. దీని నిరూపణార్థమై ఆయన పలు ఉదంతాలను చూపించడంతోపాటుగా పుస్తకం చివర్లో రెండు అనుబంధాలను కూడా పొందుపర్చారు. 'తిరుగుబాటుదారులు' ఢిల్లీ పాలనకై పరిపాలనా మండలి వేయడం; మండలి సభ్యుల మధ్య స్పష్టమైన శ్రమ విభజన ఉండటం లాంటి 'ప్రజాస్వామ్య' విధానాలు, నాటి సందర్భం దృష్ట్యా, నిజంగా కొత్త విషయమే! విక్టోరియా రాణి 'ప్రకటన'కు ప్రతిస్పందనగా

బేగం హజ్రత్ మహల్ వెలువరించిన ప్రకటన, అందులో ఆమె చర్చించిన విషయాలు 'భారతీయ' భావనను బలపరుస్తున్నాయి. పాలనా వ్యవహారాలకు సంబంధించిన వికేంద్రీకరణ సూత్రం 'ప్రజాస్వామ్య' సిద్ధాంతాన్ని తప్పక తలపింప జేస్తుంది.

1857 'అధికారిక' చరిత్రకారుడిగా పేరొందిన సురేంద్రనాథ్ సేన్ రచన Eighteen Fity Seven లాగా నశీర్ పుస్తకం ఎన్నో వాస్తవాలను బహిర్గతపర్చుతూ వ్యక్తులు మరియు సంఘటనలను వివరిస్తుంది. ఎన్నో కొత్త విషయాలతోపాటు వైయుక్తిక 'తిరుగుబాటు' దారుని/ దారురాలి వివరాలను పాఠకలోకానికి అందిస్తుంది. ఈ పోరాటంలో పాల్గొన్న నాయకులు, ప్రజలు 'భారతీయ' భావనతో బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడిన క్రమాన్ని రచయిత ఎంతో చక్కగా వివరించారు. దీనివల్ల వాస్తవికమైన, ఆచరణలో ఉన్న భారత ప్రజల సంఘజీవనం, హిందూ-ముస్లిం సహజీవన సంఘీభావాలు మనకీ రచనలలో ద్యోతకమౌతాయి. 'వారు' (బ్రిటీష్‌వారు) 'మనం' (భారతీయులం, హిందూ -ముస్లింలు కలసి) అనే స్పష్టమైన భావజాలంతో పోరాట నిర్మాణం, కొనసాగింపు జరిగాయన్న విషయం మనకు కొట్టోచ్చినట్లు కనబడుతుంది. మతపరమైన విభేదాలూ, విద్వేషమూ తర్వాతి కాలం నాటిదనేది స్పష్టపడుతుంది. మతపర బేధభావాలు లేని సమైక్య జీవన ఆలోచనావిధానానికి 1857 ఒక బలమైన ప్రతీక. 'హిందూ-ముస్లింలు ఈ విధంగా 'ఐక్యంగా' ప్రతిఘటించడం వల్లనే వలసపాలకులు తర్వాతి కాలంలో చాలా వ్యూహాత్మకంగా వ్యవహరించి రెండు సమూహాలను రెండు పరస్పర విరుద్ధ సాంస్కృతిక సమూహాలుగా ప్రచారం చేసి విభజించారు; తమ కార్యక్రమంలో సఫలమయ్యారు కూడా ! ఈ 'పరస్పర విరుద్ధ' భావజాలాన్నీ తెలిసో తెలియకో పలువురు 'జాతీయవాదులు' కూడా అనుసరించి 'జాతీయోద్యమం'లోకి చొప్పించారు. గోవులను తినేవారూ, గోవులను పూజించేవారూ, పందులను తినేవారు, పందులను అసహ్యంచుకునేవారు ఏకమై తిరగబడ్డారనీ భావించబట్టే ఆంగ్లేయులు హిందూ-ముస్లింల మధ్య స్పర్థల్ని సృష్టించగలిగిన, వారి ఐక్యతను ఛిన్నాభిన్నం చేయగలిగిన ప్రతి అంశాన్నీ వదలకుండా ఎంతో జాగ్రత్తగా వాడుకున్నారు. ఆనాడు హిందూ-ముస్లింలు చూపించిన సంఘీభావ శక్తి అంత బలమైనదన్నమాట.

1857 పోరాటంలో ముస్లింలు గణనీయమైన పాత్రను పోషించారు. వాళ్ళ పాత్ర ఎంత ఎక్కువంటే ఈ 'తిరుగుబాటు' ను వలసపాలకులు ఏకంగా 'ఇస్లామిక్ తిరుగుబాటు' గా చిత్రీకరించేటంతటి గొప్ప పాత్రన్న మాట! ముస్లింలను ఈ 'తిరుగుబాటు' కు ప్రధాన బాధ్యులుగా భావించబట్టే వాళ్ళను ఎంతో క్రూరంగా అణిచలివేగలిగారన్న విషయాన్ని నశీర్

సోదాహరణంగా తెలిపారు. ఆంగ్లేయుల దారుణ కృత్యాల విలయనృత్యాన్ని చూస్తే గుండెలు బద్ధలౌతాయి. ఉరికొయ్యలకూ, ఫిరంగి కుహరాలకూ బలైపోయిన వారి కథలు మనల్ని కన్నీరు పెట్టిస్తాయి.

సాధారణంగా దక్షణ భారతదేశంలో ఈ పోరాటం జరగలేదని అంటుంటారు; ఇది వాస్తమేనని మనమింతవరకూ నమ్మాం; అలా నమ్మించారు. కానీ ఇది ఎంతటి తప్పుడు అవగాహనో సాక్ష్యాధారాల్తో నిరూపిస్తుందీ పుస్తకం. హైదరాబాదులోని బ్రిటీష్ రెసిడెన్సీ పై పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ లాంటి వారి నాయకత్వంలో ప్రజలు ఎంత వీరోచితంగా దాడి చేశారో నశీర్ విపులంగా వివరించారు. నిజాం రాష్ట్ర భౌగోళిక హద్దులకే ఈ పోరాటం పరిమితం కాలేదు; ఆంధ్ర, రాయలసీమ ప్రాంతాలకు కూడా ప్రాకిందనీ, షేక్ పీర్‌షా (కడప) లాంటి అంధులైన యోధులు సైతం మాతృభూమికై ప్రాణాలొడ్డారనీ ఈ పుస్తకం ఘోషిస్తుంది. వివిధ వర్గాలు, ప్రాంతాలు, జండర్ నేపథ్యాలకు చెందిన ముస్లింల జీవన బలిదానాలనూ, మాతృ భూమికై పోరాడుతూ ఆ తల్లి ఒడిలో ఒరిగిపోయిన విధానాన్నీ దృశ్యీకరిస్తుందీ పుస్తకం. భారతదేశాన్ని వలసపాలకుల సర్పసంకెళ్ళ నుండి విముక్తి కావించడానికి తమ శక్తికొద్ది పోరాడి, బలైన ముస్లిం బిడ్డల అమూల్య బలిదాన కథనాల గని నశీర్ ఎంతో శ్రమకోర్చి మనకిచ్చిన ఈ పుస్తకం.

చరిత్ర సృష్టించిన 1857కు సంబంధించిన 150 సంవత్సరాల సంబరాలను భారత ప్రభుత్వం చేస్తున్న సందర్భంలో నశీర్ ఈ పుస్తకం రాయడం హర్షించదగిన విషయం. అంతకు మించి మతోన్మాద క్షుద్రశక్తులు విభజనరేఖల్ని గీసి, అగాధాలను తవ్వి భయవిహ్వల వాతావరణం సృష్టిస్తున్న సందర్భంలో ఈ పుస్తకం రావడం ఇంకా సంతోషించాల్సిన విషయం.

నేను నాదేశాన్ని (భారతదేశాన్ని) ప్రేమిస్తాను అని భావించే ప్రతి ఒక్కరూ చదవదగ్గ జ్ఞానకిరణం ఈ పుస్తకం. ఎంతో ప్రేమతో ప్రమాణవాక్యం రాయండని నన్నుకోరిన మిత్రులు సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు ధన్యవాదాలు.

★ ★ ★



# పరిచయ వాక్యం


మహబూబ్ బాషా, Ph.D

కోఆర్డినేటర్, చరిత్రశాఖ

బాబా సాహెబ్ భీంరావ్ అంబేద్కర్ కేంద్రీయ విద్యాలయం

లక్నో, ఉత్తర ప్రదేశ్.


## నిశ్శబ్ద కుట్రను బద్దలు కొడుతున్న రచన(లు)

వర్తమానాన్ని గుప్పెట్లో పెట్టుకొనేవారు గతం మీదా, గతాన్ని గుప్పెట్లో పెట్టుకోనేవారు భవిష్యత్తు మీదా తిరుగులేని ఆధిపత్యం చలాయించగలరని సుప్రసిద్ధ రచయిత జార్జ్ ఆర్వెల్ అన్నారు. భవిష్యత్తు మీద ఆధిపత్యం సాధించడానికై గతాన్ని (చరిత్ర) గుప్పెట్లో పెట్టుకోవాల్సిన అవసరం ఎంతగా ఉందో దీని ద్వారా స్పష్టమౌతోంది. ఈ విషయం అణగారిన వర్గాల కన్నా అణిచివేసే వర్గాలకు బాగా తెలుసు. అందుకే ప్రపంచ వ్యాప్తంగా అన్ని సమాజాల్లోనూ ఆధిపత్యవర్గాలు చరిత్ర పరిజ్ఞానాన్ని తమ గుప్పెట్లో వుంచుకునే ప్రయత్నాలు చేస్తున్నాయి. తమ భావజాలానికి తోడ్పడి, ఆధిపత్యానికి అండగా ఉండే విధంగా చరిత్ర జ్ఞానాన్ని వడగట్టి దాన్ని మాత్రమే ప్రజలలో ప్రచారం చేశాయి/చేస్తున్నాయి: తమ ఆధిపత్యానికి గండిపెట్టగల జ్ఞానాన్ని, మరుగునపరచడమో, ధ్వంసం చేయడమో చేశాయి. తమ వర్తమాన, భవిష్యత్ రాజకీయ ప్రయోజనాలకనుగుణంగా గతాన్ని మలచడమూ, వ్యాఖ్యానించడమూ చేస్తూ వచ్చాయి. అయితే పీడిత వర్గాలు ఎలాంటి స్పందనా, ప్రతి చర్య లేకుండా మౌనంగా కూర్చోలేదు; ఆధిపత్య చరిత్రను పూర్తిగా అంగీకరించలేదు. అవి కూడా చాలా బలహీనంగానే అయినా, తమ ధిక్కార స్వరాన్ని వినిపించే ప్రయత్నంలో భాగంగా తమ గతాన్ని (చరిత్రను) సొంతం చేసుకోవడం, మలచుకోవడం, తద్వారా వర్తమానంలో ప్రేరణ పొందడం చేస్తూ వస్తున్నాయి.

భారతదేశ విషయానికొస్తే తమ వలసాధిపత్యానికీ, సామ్రాజ్యవాదానికీ నైతిక బలాన్నీ, చట్టబద్ధతనూ, భారత ప్రజల ఆమోదాన్నీ సాధించడానికి వలసవాదులు భారతదేశ చరిత్రను 'తయారు చేసి' ప్రజల్లో ప్రచారం చేశారు. వలసాధిపత్యాన్ని ప్రతిఘటించడానికి తగినంత

స్ఫూర్తినిచ్చేవిధంగా స్వాతంత్ర్యోద్యమ కాలంలో భారత 'జాతీయవాదులు' భారతదేశ చరిత్రను వ్యాఖ్యానించి జాతీయ అస్తిత్వ ప్రకటనకై ప్రయత్నం చేశారు. స్వాతంత్ర్యానంతరం భారత జాతిని 'సృష్టించే' లక్ష్యంతో రాజ్యం (Indian State) గతం మీద 'ప్రత్యేక' దృష్టిని సారించి భారత జాతి 'ఏకత్వ' నిరూపణకై పలు తంటాలు పడుతోంది. తమ క్షుద్ర రాజకీయ పన్నాగం పారించడానికి గత నాలుగు దశాబ్దాలుగా 'హిందూత్వ' కాలనాగులు 'చరిత్ర' ను ఎంతగా కాటేస్తున్నాయో మనందరికీ బాగా తెలిసిన విషయమే ! ఒకవైపు ఆధిపత్య వర్గాలు తమ పెత్తనానికి వత్తాసు పలికే విధంగా చరిత్రను మలచి దాన్నే 'సామాజిక చరిత్ర' గా నిరూపిస్తూ వస్తోండగా యింకోవైపు సామాన్య ప్రజల పక్షం వహించే మేధావులు మార్క్సిస్టు సిద్ధాంతాన్ని చారిత్రక వ్యాఖ్యానానికి జోడించి ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కన్పించకుండా పోయిన చరిత్ర నిర్మాతలైన సామాన్య ప్రజల చరిత్రను రచించే ప్రయత్నం చేస్తున్నారు.

వివిధ అస్తిత్వ ఉద్యమాలు విజృంభిస్తున్న సందర్భంలో చైతన్యవంతులవుతోన్న అట్టడుగు వర్గాల, అంచులకు నెట్టివేయబడిన కులాల ప్రజలు తమ వాస్తవ చరిత్ర ప్రాధాన్యతను గుర్తించి తమ చరిత్రను తామే సృజియించుకుంటున్నారు; తమ చరిత్రను తామే త్రవ్వి సొంతం చేసుకుంటున్నారు. వాస్తవ సొంత చరిత్ర పునాదిగా వర్తమాన, భవిష్యతుల్ని సొంతంగా నిర్మించుకోడానికి ఉద్యుక్తులవుతున్నారు. చరిత్ర నిర్మాణంలో తమ ఉనికిని పట్టించుకోని ఆధిపత్య చరిత్రల్లోని డొల్లతనాన్ని ప్రశ్నించడం ద్వారా పెత్తందారీ వర్గాల ఆధిపత్యాన్ని నిలదీస్తున్నారు. సమాజ సంపద సృష్టికర్తలైన దళితులు, వెనుకబడిన తరగతులు, ఆదివాసీలు, స్త్రీలు, మత'మైనార్టీలు' సొంత చారిత్రక చైతన్య ప్రేరణతో గొంతు విప్పుతున్నారు: మాక్కూడా 'ఘనమైన' చరిత్ర ఉందనీ, ఈ సమాజ నిర్మాణంలో తాము కూడా గణనీయమైన పాత్రపోషించామనీ దీన్ని అందరూ గుర్తించి గౌరవించాలనీ నొక్కి చెబుతున్నారు.

ప్రస్తుత పుస్తక రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ రచనలన్నీ ఈ నేపథ్యంలో వస్తున్నవే. తీవ్ర అణిచివేతకూ, నిర్మూలనకూ గురవుతున్న ముస్లిం సమాజానికి ఊయనందీస్తున్న అక్షరాయుధాలకు ప్రస్తుత పుస్తకం ఒక కొత్త చేర్పు. 1857 పోరాటంలో ముస్లిం సమాజం పోషించిన బృహత్తర పాత్రను వివరించడం దీని ప్రధాన లక్ష్యం. పోరాటంలో ముస్లింల బలిదానాలను ఒకవైపు వివరిస్తూ యింకోవైపు అన్యాపదేశంగా ముస్లింలకు సంబంధించిన అనేక యితర విషయాలను నశీర్ చర్చకు పెడుతున్నారు.

ఈ పుస్తకం లోపల విషయానికి వెళ్ళేముందు 1857 కు సంబంధించిన సంఘటనలను ఎవరెవరు ఏ విధంగా వ్యాఖ్యానించారో రేఖామాత్రంగా చూద్దాం. 1857 అన్న వెంటనే 'సిపాయీల తిరుగుబాటు' అనే భావన మన మనోఫలకం పై మెదులుతుంది: ఆంగ్లేయుల కాలం నుండీ నేటిదాకా ఈ భావనే dominant భావనగా చలామణీ అవుతోంది. 1857 వాస్తవ స్వభావాన్ని గుర్తించినప్పటికీ ఆంగ్లేయులు ఉద్దేశ్యపూర్వకంగా దీన్ని 'సిపాయీల తిరుగుబాటు' ('Sepoy Mutiny') అని ప్రచారం చేశారు: భారతీయులు కూడా ఈ భావాన్నే నమ్మాలని ఆశించారు. భారతీయులు ఇలా నమ్మడం వలసవాదుల రాజకీయాలకు ముఖ్యం. ఈ 'తిరుగుబాటు' అనే భావం 1857కు సంబంధించి అనేక యితర కోణాలపై మసిగుడ్డ కప్పుతుంది; పోరాటంలో ప్రజల భాగస్వామ్యాన్ని మరుగు పరుస్తుంది. ఒకవేళ సామాన్య ప్రజలు కూడా పాల్గొన్నారనే విషయం ముందుకొస్తే వారెందుకు పాల్గొన్నారన్న ప్రశ్న జనిస్తుంది. దీని ద్వారా వలసపాలకులు ప్రచారం చేసిన 'ఆంగ్లేయుల మెరుగైన పాలన' అనే పచ్చి అబద్ధపు మురికి మఖౌటా చిరిగిపోయి వలసపాలకుల 'వాస్తవ రూపం' బయట పడుతుంది. వారి నైతిక ఆధిపత్యానికి గండి పడుతుంది. ఇది వలస పాలకులకు ఎంత మాత్రం రుచించని విషయం. అందుకే వాళ్ళు రచించిన పుస్తకాలన్నీ 1857 పోరాటాన్నీ 'సిపాయీల తిరుగుబాటు' గా తగ్గించి చెప్పే ప్రయత్నం చేశాయి. ఈ భావాన్నే నాటి పాఠ్యపుస్తకాల ద్వారా కూడా ప్రచారం చేశారు.

జాతీయవాద ప్రభావంతో (యిది వాస్తవంగా అగ్రవర్గ, అగ్రవర్ణ, 'జాతీయవాదం') వి.డి సావార్కర్ మెదలైనవారు 1857 పోరాటంలోకి 'జాతీయభావాన్ని' చొప్పించి దాన్ని 'ప్రథమ స్వాతంత్ర్య పోరాటం' గా వ్యాఖ్యానించి దాని స్వభావాన్ని, ప్రభావాన్నీ ఆకాశానికెత్తి చూపించారు. 'స్వతంత్ర' భారత ప్రభుత్వం కూడా దీన్ని 'ప్రథమస్వాతంత్ర్య పోరాటం' గానే నమ్మి మనల్ని కూడా నమ్మంటుంది. ఇలా చేయడం ద్వారా వలసపాలకులకు వ్యతిరేకంగా నూటా తొంభై సంవత్సరాలు పోరాడి స్వాతంత్ర్యం సాధించిన 'ఘనత'ను ప్రచారం చేసుకుంటున్నది.

కానీ ఈ రెండూ వాదనలూ పూర్తిగా సత్యాలు కావన్న విషయాన్ని ఇటీవలి అనేక పరిశోధనలు బలమైన సాక్ష్యాధారాలతో నిరూపిస్తున్నాయి. పోరాట నిర్దిష్ట స్వభావాన్ని గూర్చి యింకా అనేక అనుమానాలున్నప్పటికీ పరిశోధనలన్నీ యిది కేవలం 'సిపాయీల తిరుగు బాటు' కాదన్న వాస్తవాన్ని నొక్కి చెబుతున్నాయి. ఎరిస్టోక్స్, రుద్రాంగ్షు ముఖర్జీ లాంటి వారు పోరాటంలో సామాన్య ప్రజల భాగస్వామ్యాన్ని బలంగా నిరూపించారు. ప్రధానంగా

వలసవాద ఆర్థిక విధానాలతో చితికిపోయిన రైతాంగం పోరాటంలో పాల్గొన్న వివరాలనూ, విధానాన్నీ చూపించారు. సిపాయీలు 'తిరుగుబాటు' చేయడంలోని రైతాంగ కోణాన్ని చూపించారు. సిపాయీలు వాస్తవంగా 'Peasants in uniform' (సైనికులుగా పనిచేస్తున్న రైతులు) అనే విషయాన్ని నిర్ద్వందంగా నిరూపించారు. ఒకవైపు ప్రజా భాగస్వామ్యాన్ని నిరూపిస్తూనే దీన్ని 'జాతీయ పోరాటం' అనడంలోని సమస్యల్ని మనముందుంచారు.

ఏది ఏమైనప్పటికీ విజృంభిస్తున్న జాతీయవాద హవాలో 1857 పోరాటాన్నీ 'జాతీయవాద పోరాటం'గా అంగీకరించడం పట్ల సాధారణ భారతీయులు మొగ్గు చూపు తున్నారు. రాజ్యం కూడా ఈ దిశగానే బలంగా ప్రచారం చేస్తోంది. ప్రస్తుత పుస్తక రచయిత సయ్యద్ నశీర్ అహమ్మద్ కూడా పోరాటంలో భారత జాతీయభావాన్నే చూస్తున్నారు. ఈ 'జాతీయ పోరాటం'లో ముస్లింల భాగస్వామ్యాన్ని నిరూపించే ప్రయత్నం చేస్తున్నారు: తన వాదనా నుగుణంగా పలు సాక్ష్యాధారాలను పొందుపరుస్తున్నారు.

తొమ్మిది అధ్యాయాలూ, విలువైన అనుబంధాలు ఉన్న ఈ పుస్తకంలోని ప్రతి అధ్యాయమూ ప్రత్యేక అంశానికి సంబంధించిన విలువైన సమాచారాన్ని అందించటం తోపాటు ముస్లిం సమాజం పట్ల కొనసాగుతూ వస్తోన్న పలు అపోహలూ, అనుమానాలూ, దురూహలను పరోక్షంగా బద్దలుకొట్టి వాస్తవరూపాన్ని మనముందుచుతుంది.

మొదటి అధ్యాయం 1857 పోరాటానికి సంబంధించిన కథను అంటే ప్రారంభం, కొనసాగింపు, వివిధ వర్గాల పాత్ర, పతనాలను రేఖామాత్రంగా వివరించి మనల్ని ప్రధాన వస్తువు అయిన ముస్లింల పాత్ర దగ్గరికి తీసుకెళ్తుంది.

రెండవ అధ్యాయంలో పోరాటంలో పురుషులకు దీటుగా పాల్గొని ప్రాణత్యాగం చేసిన మహిళల గూర్చి చర్చిస్తుంది. బేగం హజ్రత్ మహల్ లాంటి కొంతవరకు తెలిసిన రాణులతోపాటుగా మనకు ఏమాత్రం తెలియని బేగం అజీజున్, ముందర్, హబీబా, అస్గరీ బేగం, పచ్చదుస్తుల మహిళ బలిదానాలను తెలియజేస్తుంది. పురుష కేంద్ర చరిత్రను బద్దలు కొడుతూ మహిళలను ఒక ప్రత్యేక అధ్యాయంలో చర్చించడం పుస్తకానికి గొప్ప విలువను చేకూర్చింది. 'పర్దానషీన్' (పర్దాల మాటున్న వారు)లుగా భావించబడే ముస్లిం మహిళలు Public Space లోకి వచ్చి మాతృభూమి కోసం పోరాడి బలికావడమనే విషయం ముస్లిం స్త్రీల గూర్చి ఉన్న అపోహల్ని పటాపంచలు చేస్తుంది. కానీ ఈ ముస్లిం మహిళల్ని Icons గా తయారు చేసి, ప్రచారం చేసి ముస్లిం స్త్రీలలో ప్రేరణ కలిగిచడంలో యిప్పటి ముస్లిం సమాజం ఘోరంగా విఫలమైంది. ప్రభుత్వం ఏమీ చేయట్లేదని ముస్లిం సమాజం 'మేధావులు'

సణగొచ్చుగానీ ఆ బాధ్యత ప్రభుత్వం మీదకన్నా తమ మీదే ఎక్కువగా ఉందన్న విషయం యిప్పటికైనా గుర్తిస్తే మంచిది.

ఈ విషయంలో 'దళితులు' ఒక Model ని కూడా తయారుచేసి ఉన్నారు. ఉత్తర ప్రదేశ్‌లో 1857 పోరాటంలో పాల్గొన్న మహిళలైన ఊదాదేవి పాసి, ఝల్కారీబాయి మొదలైన 'వీరాంగన'లను Icons గా చేసి ప్రచారంలో పెట్టి దళిత సమాజ ప్రేరణ కోసం బృహత్తరమైన కార్యక్రమాలు జరుగుతున్నాయి. మరి తామెందుకు ఈ విషయంలో వెనుకబడ్డారో ముస్లింలు తమను తాము ప్రశ్నించుకోవాలి.

పోరాటంలో మౌల్వీలు (ఇస్లాం ధార్మిక పండితులు) నిర్వహించిన పాత్రను మూడవ అధ్యాయం చర్చిస్తుంది. మౌల్వీల గూర్చి సమాజంలో ఒక మూసపోత ఆలోచన ఉంది. వారు కేవలం ధార్మిక విషయాలకే పరిమితమౌతారనీ, సెక్యులర్ విషయాల్లో శ్రద్ధ చూపించరనీ పలువురు భావిస్తుంటారు. ఇంకొంచెం ఔత్సాహికులైన 'ఆధునికతా'వాదులు ముస్లిం సమాజం వెనుకబడడానికి కారణం ఈ మౌల్వీలే అనే తొందరపాటు నిర్ణయాలకు వస్తుంటారు. ఈ అధ్యాయం ఈ తప్పుడు అవగాహనలకు సమాధానం చెబుతుంది. 1857 పోరాటంలోనూ, తర్వాత 'జాతీయోద్యమం' లోనూ మౌలానాలు పోషించిన పాత్ర సరియైన ప్రచారానికి నోచుకోకపోవడం వల్ల మౌలానాల పాత్రను మనం సరిగ్గా అర్థం చేసుకోలేక పోతున్నాం. దియోబంద్‌కు చెందిన మౌలానాలు కానీ, యితరులు కానీ, మాతృభూమి కోసం చేసిన త్యాగాలు సంస్మరణీయమైనవి. మరి నేటి మౌల్వీలు వారినుండి ఏమాత్రం ప్రేరణ పొందుతున్నారనేది 'అల్లాంకా సూరా' అంతటి ప్రశ్న.

1857 పోరాటానికి కలంతో అండందలందించిన కలం యోధులను గూర్చి నాల్గవ అధ్యాయం వివరిస్తుంది. పోరాటయోధులలో ఉత్సాహం నింపడంలో ఉర్దూ జర్నలిజం ప్రబల పాత్రను పోషించింది. 'హిందూ-ముస్లిం' పోరాటకారులందరూ 'ఉర్దూ' లో వచ్చిన ఈ సాహిత్యం ద్వారా ప్రేరణ పొందారు. 'హిందువులు' సైతం తమ ప్రకటనలను 'ఉర్దూ'లోనే యిచ్చారు. అంటే 'ఉర్దూ'ను ముస్లింల తలలకు అంటగట్టి, మతం రంగు పులిమి తర్వాత్తర్వాత మతతత్వీకరించి 'భారతీయ' భాషా వినాశనానికి 1857 తర్వాతే బీజాలు పడ్డాయని మనకు స్పష్టమౌతుంది.

1857కు సంబంధించి 'ఉత్తర భారతం కేంద్రక (North Indian cetric) వాదనకు

ఐదవ అధ్యాయమైన ' ఆంధ్రప్రదేశ్ ముస్లింలు' బద్ధలు కొడుతుంది. పోరాటం ఉత్తర భారతదేశానికే పరిమితమమైందనీ, దక్షిణ భారతం దీనికి స్పందించలేదనీ ఒక dominant అపోహ యిప్పటికీ బలంగా ప్రచారంలో ఉంది. ఉత్తర భారత ఆధిపత్య వాదులు తమ ఆధిపత్యాన్ని పదిలంచేసుకోడానికి ఈ విషయాన్ని బాగా ఉపయోగించుకుంటూ వస్తున్నారు. సయ్యద్ నశీర్ అహమ్మద్ ఈ అధ్యాయంలో అందించిన సమాచారం ముందు ఇక ఈ వాదన మోకరిల్లాల్సిందే !

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో హిందూ-ముస్లింలలో వెల్లివిరిసిన ఐక్యతను సోదాహరణంగా వివరిస్తుంది ఆరవ అధ్యాయం. ఈ అధ్యాయంలో చాలా అపూర్వం అనదగిన విషయాలను రచయిత పాఠకులకు అందించారు. అప్పట్లో మతాలకు అతీతంగా ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకంగా హిందూ-ముస్లిం ప్రజానీకం మధ్య వ్యక్తమైన బలమైన స్నేహభావాన్ని అనేక ఉదాహరణలతో వివరించారు. ప్రభువుల నుండి ప్రజల వరకు మతాలకు అతీతంగా మమేకమై ఉమ్మడి శత్రువు మీద సాగించిన పోరులోని విశేషాంశాలు పాఠకుల్ని ఆకట్టుకుంటూ ఆ model ను నేడు అనుసరించాల్సిన ఆవశ్యకతను పరోక్షంగా నొక్కి చెబుతుంది. మతతత్త్వ భావజాలం అనేక మాధ్యమాల ద్వారా విశృఖలంగా వ్యాపిస్తూ హిందూ-ముస్లింల మధ్య అగాధాలు యేర్పడుతున్న నేటి దుష్కర సందర్భంలో 1857 నుండి ఐక్యతా పాఠాలు నేర్చు కోవాల్సిన అవసరం ఎంతో ఉంది.

వలసవాదుల దోపిడీ విధానాలపై సమరశంఖం పూరించిన రాజులు-రాణులు, ప్రజల పట్ల ఎంత హింసాత్మకంగా కంపెనీ ప్రభుత్వం వ్యవహరించిందో వివరించే ఏడవ అధ్యాయం 'నాగరికతా' రాయబారులూ, ప్రచారకులూ అని డంబాలు పలికిన ఆంగ్లేయుల అసలు నాగరికతా బండారాన్ని బయటపెడ్తుంది. ప్రజలను terrorise చేయడమనేదాన్ని వలసవాదులు ఒక 'విధానం'గా ఎలా రూపొందిచుకున్నారో తేటతెల్లం చేస్తుంది.

స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో ఆంగ్లేయులకు తొత్తులుగా వ్యవహరించిన వారు తర్వాతి కాలంలో 'పదహారణాల జాతీయనాయకులు' గా ఎలా అవతారమెత్తారో ఎనిమిదవ అధ్యాయం వివరిస్తుంది. ఈ అధ్యాయం త్యాగాలొకరు చేస్తే భోగభాగ్యాలనుభవించేది యింకోరా అని ప్రశ్నిస్తుంది.

ఈ పుస్తకంలో ఎవరినైనా ప్రత్యేకంగా ఆకట్టుకొని చెంప ఛెళ్ళుమనిపించే ప్రశ్నల

వర్షాలు కురిపించేది చివరదైన తొమ్మిదవ అధ్యాయం. 1857 పోరాటంలో పాల్గొని సర్వమూ కోల్పోయి, తర్వాతి కాలంలో కూడా వలసవాదుల దాష్టీకానికి గురైన ముస్లింల చరిత్ర తగినంత ప్రచారానికి నోచుకోక విస్మరణకు గురవుతోందన్న బలమైన ప్రశ్నాస్త్రాన్ని మన మీదికి ఎక్కుపెడుతూ, చరిత్ర రచనా శాస్త్రానికి సంబంధించిన పలు కోణాలను స్పృశిస్తుంది. అయిష్టంగా పోరాటంలో పాల్గొనాల్సి వచ్చిన ఝాన్సీలక్ష్మీ బాయికి అంత ప్రచారం ఎందుకు లభించినట్టు? కత్తి చేతబట్టి గుర్రం మీద ఠీవిగా కూర్చొని ఉండే ఆమె విగ్రహాలు అన్నిచోట్లా ఎందుకు తామరతంపరగా వెలిసినట్టు? ఝాన్సీ రాణి కన్నా మరింత అంకిత భావంతో, సాహసంతో ఆంగ్లేయులను ధిక్కరించిన బేగం హజరత్ మహల్‌కు అంత ప్రాధాన్యత, ప్రచారం ఎందుకు లభించలేదు? Popular memory లో లక్ష్మీబాయికి అంత పటిష్ట స్థానం ఎలా, ఎందుకు లభించింది లాంటి ప్రశ్నలు మనసుల్ని ముసురు కుంటాయి. దీన్ని లోతుగా పరిశీలిస్తే స్వాతంత్ర్యోద్యమ కాలంనాటి మన 'జాతీయ' నాయకుల మనసుల్ని శోధించే అవకాశం కలుగుతుంది. జాతీయోద్యమ నాయకులు చేతనంగానో, అచేతనంగానో 'హిందూ' Iconsని మాత్రమే జాగ్రత్తగా సొంతం చేసుకున్న పొరపాటు రాజకీయం బయటపడుతుంది; 'హిందూ' imagery ని బలంగా ముందుకు పెట్టి ప్రచారం చేసిన అసలు 'జాతీయత' బండారం బయటపడుతుంది. శౌర్యప్రతాపాలను ప్రతీకగా లక్ష్మీబాయిని తయారు చేయడంలో ఎవరికీ అభ్యంతరాలు ఉండకూడదు గానీ, అంతకన్నా సాహసంతో వ్యవహరించిన హజరత్ మహల్ కనీసం ప్రస్తావనార్హం కాకపోవడం మాత్రం తప్పక కలవరపరుస్తుంది.

'హిందూ' రంగుతో ప్రసారమైన అగ్రవర్గ, అగ్రవర్ణ జాతీయ భావన వల్ల ముస్లిం సమాజమే కాకుండా 'దళిత' సమాజం కూడా తీవ్ర అన్యాయానికి గురైంది. అందుకే మన 'ప్రామాణిక' చరిత్ర పుస్తకాల్లో గానీ, పాఠ్యపుస్తకాల్లో కానీ, దళిత పోరాటకారుల ప్రస్తావన అస్సలు ఉండనే ఉండదు. ఒక వేళ ఎవరైనా ఉంటే 'followers' (అనుచరులు) గా మాత్రమే ఉంటారు కానీ, leaders ('నాయకులు') గా ఉండరు! ఎందుకుండరనేది బహిరంగ రహస్యమే !! ఈ విధంగా అందరూ మనసుపెట్టి తీవ్రంగా ఆలోచించాల్సిన అవసరముందని నొక్కి నిశ్శబ్దకుట్రను బద్ధలు కొట్టమని మనల్ని తొందరపెడ్తుంది ఈ అధ్యాయం.

1857 లో 'ముస్లిం' పాత్రను 'ప్రత్యేకంగా' చెప్పాల్సిన అవసరముందా అంటే తప్ప

కుండా ఉంది; ముఖ్యంగా మతోన్మాదశక్తులు విజృంభిస్తున్న ఈ సందర్భంలో దీని అవసరం యింకా ఎక్కువగా ఉంది.'పుట్టకముందే దేశద్రోహుల జాబితాల్లో' ముస్లింల నమోదు జరుగుతున్న విషమ సందర్భంలో దేశం కోసం ముస్లింలు చేసిన త్యాగాలను మళ్ళీ-మళ్ళీ గానం చేయాల్సిన అవసరం ఉంది. అంతకన్నా ముఖ్యంగా ఈ పుస్తకమే పరమ రాజకీయ ప్రయోజనాన్ని నెరవేరుస్తుంది. వలసవాదుల దాస్యశృంఖాలాల నుండి 'మాతృభూమి' ని విముక్తం చేయడానికి గర్జిస్తున్న ఫిరంగి కుహరాలను అద్వితీయ ధైర్యంతో ఆలింగనం చేసుకొనీ, చెట్ల కొమ్మలకు ఉరితీయబడి ఊయలలూగి ఇంకా ఇలా ఎన్నో రకాలుగా రక్తతర్పణ చేసినందుకూ, సర్వం త్యాగం చేసినందుకూ స్వతంత్ర్య భారత ప్రభుత్వం ముస్లింల కేమిచ్చింది? త్యాగాల బాటలో సాగినందుకు స్వతంత్ర భారతంలో వాళ్ళకు ఒరిగిందేంటి? లాంటి బలమైన ప్రశ్నలతో ముస్లిం సమాజం భారత ప్రభుత్వాన్ని నిలదీయాల్సిన అవసరముందని పరోక్షంగా చెప్తుంది. సమాన భాగస్వాములై పోరాడినందుకు సహజవనరుల్లో సమాన వాటాను డిమాండ్ చేయగలిగే నైతిక బలాన్నీ, హక్కునీ ముస్లిం సమాజానికి అందజేస్తుందీ పుస్తకాస్త్రం. వివక్షారహిత, అసమానతారహిత భారతదేశాన్ని కోరేవారందరికీ యిలాంటి అక్షరాస్త్రాలను అందచేస్తున్న నశీర్‌కు హృదయపూర్వకంగా సలాం.

1857 గూర్చి ఉధృతమైన చర్చ జరుగుతున్న సందర్భంలో ఈ పుస్తకం రావడం, అందునా తెలుగులో రావడం ముదావహం. మన భాషలో మన కథను మనకు ఒపిగ్గా చెప్పిన సయ్యద్ నశీర్ అహమ్మద్‌కు అస్సలాం.

★ ★ ★



# రచయిత మాట

సయ్యద్ నశీర్ అహమ్మద్
వినుకొండ-522647
గుంటూరు జిల్లా
సెల్: 94402 41727

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం జరిగి 150 సంవత్సరాలు పూర్తయిన సందర్భంగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు నూటాయాభై సంవత్సరాల సంబరాలను జరపాలని నిర్ణయించాయి. ఈ మేరకు వార్తలు, కార్యక్రమాల వివరాలు వెలువడ్డాయి. ఆ సందర్భంగా ఒకరోజు 'తెలుగు స్కూల్ ఆఫ్ జర్నలిజం అండ్ మాస్ కమ్యూనికేషన్స్' (హైదరాబాద్) కార్యాలయంలో కూర్చోని, ఇతర మిత్రులతో కలసి స్కూల్ ద్వితీయ సంవత్సరం ప్రణాళికను తయారు చేసే ప్రయత్నంలో ఉన్నాం.

ఆ సమయంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ 150 సంవత్సరాల సంబరాల గురించి యథాలాపంగా మాట్లాడుకుంటుండగా, 1857 మీద ఒక ప్రత్యేక సంచిక తీసుకు వస్తే బాగుంటుందని 'గీటురాయి' వారపత్రిక బాధ్యులు అబ్దుల్ వాహెద్ తన ఆలోచనను మిత్రుల ముందుంచి, ఆర్టికల్స్ పరంగా సహకరించాల్సిందిగా నన్ను కోరారు. కాదనేముంది. ఆ సమయంలో మాతోపాటు సమావేశంలో ఉన్న 'తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్ ట్రస్ట్' సంచాలకులు అబ్బాదుల్లా తక్షణమే స్పందిస్తూ 1857లో ముస్లింల పాత్ర మీద గ్రంథం కూడా తెస్తే బాగుంటుందన్నారు. గీటురాయి కోసం రాయబోయే సమాచారాన్ని గ్రంథంగా ప్రచురిద్దాం అన్నారు. ఆ ప్రస్తావనతో నా బాధ్యత మరింత ఎక్కువయ్యింది.

ఆ సమావేశంలో సాగిన చర్చల ఫలితమే ఇప్పుడు మీ చేతుల్లో ఉన్న **1857: ముస్లింలు**. ఈ గ్రంథాన్ని మొత్తంగా తొమ్మిది అధ్యాయాలుగా విభజించాను. మొదటి అధ్యాయంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆరంభం నుండి అంతం దాకా పూర్తి కథనాన్ని ఒక వరుస క్రమంలో, ఆయా సంఘటనలు, ఘట్టాలు, ఆయా ఘట్టాలలోని

పాత్రధారులు తదితర వివరాలను సంక్షిప్తంగా వివరించాను. రెండు, మూడు, నాల్గవ అధ్యాయాలలో వరుసగా మహిళలు, మౌల్వీలు, నాటి కలం యోధులు-పత్రికలు నిర్వహించిన పాత్రను కొంత విస్తారంగా పేర్కొన్నాను. ఐదవ అధ్యాయంలో 1857లో ఆంధ్రప్రదేశ్‌లోని ముస్లింలు సాగించిన పోరాటాన్ని వివరించాను. ఈ చారిత్రాత్మక పోరాటంలో ఉమ్మడి శత్రువుకు వ్యతిరేకంగా హిందూ – ముస్లిం జనసముదాయాలలో వెల్లివిరిసిన అద్వితీయ ఐక్యతను ఆరవ అధ్యాయంలో, ఆ సందర్భంగా ఆంగ్లేయులు ప్రదర్శించిన రాక్షసత్వాన్ని ఏడవ అధ్యాయంలో తెలియచేశాను. ఆనాడు వలసపాలకుల మీద ఉమ్మడి పోరాటం జరిపిన యోధుల బిడ్డల పరిస్థితులను, ఆంగ్లేయులకు వత్తాసుగా విద్రోహానికి పాల్పడిన విభీషణ మనస్కులైన ద్రోహుల వారసులు అందలాలెక్కి భోగభాగ్యాలను అనుభవిస్తున్న వాస్తవాన్ని ఎనిమిదవ అధ్యాయంలో వివరించగా, తొమ్మిదవ అధ్యాయంలో అలనాటి యోధుల త్యాగాలు ఎందుకు విస్మరణకు గురవుతున్నాయన్న విషయాన్ని చర్చకు అవకాశం కల్పిస్తూ పాఠకుల ముందుంచాను.

ఈ విధంగా తొమ్మిది అధ్యాయాలుగా విడగొట్టబడి సాగిన గ్రంథ రచనలో కొన్ని విషయాలను చర్చించేటప్పుడు ఆ సమాచారాన్ని మరింత పరిపుష్టం చేసి, పాఠకులకు సమగ్ర దృష్టి కలుగజేసే ప్రయత్నంలో పునరుక్తి అక్కడక్కడా తప్పలేదు. అలాగే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో అమరగతిని పొందిన యోధులకు సంబంధించిన సమాచారం గతంలోని నా గ్రంథాల ద్వారా తెలుగు పాఠకులకు అందించి ఉన్నాను కనుక '1857 : ముస్లింలు' గ్రంథంలో ఆ వివరాలను ఇవ్వలేదు.

ఈ గ్రంథంలో చేర్చిన పలు చిత్రాలు, ఫోటోలు వివిధ వెబ్‌సైట్‌లు, భారత ప్రభుత్వం ప్రచురించిన పలు పుస్తకాలు మరియు పశ్చిమ బెంగాల్ రాష్ట్ర ప్రభుత్వం ప్రచురించిన గ్రంథం నుండి సమకూర్చుకొన్నాం. సమరయోధుల కొన్ని చిత్రాలను ఆంగ్లేయ అధికారులు తమ గ్రంథాలలో పేర్కొన్న వర్ణనలను బట్టి ఊహించి ప్రముఖ చిత్రకారుల సహకారంతో రూపొందించడం జరిగింది.

ఈ పుస్తక రచనకు అవసరమగు విశేష సమాచారాన్ని సేకరించటంలో చాలా శ్రమించాల్సి వచ్చింది. ఆ శ్రమను చాలా మేరకు తగ్గిస్తూ బహుగ్రంథ రచయిత Prof. Shamshul Islam ( Delhi University, Delhi) ప్రధానంగా తోడ్పాటునిచ్చారు. నా రచనలను స్వయంగా పరిశీలించటమే కాకుండా అవసరమగు గ్రంథాలను సూచించి, ఆ గ్రంథాలు లభ్యంకాక నేను అవస్థలు పడుతుంటే, వ్యయ ప్రయాసల కోర్చి, ఆ

గ్రంథాలను వివిధ ప్రాంతాల నుండి  తాను స్వయంగా సేకరించి నాకు అవసరమగు భాగాలను జిరాక్స్ కాపీలు తీయించి పంపించడమే కాకుండా, తన స్వంత గ్రంథాలయం లోని గ్రంథాలను, తాను సేకరించిన పలు విలువైన చరిత్ర పత్రాలను కూడా జిరాక్స్ తీయించి ఇచ్చారు.

అదే విధంగా Baba Saheb Bhimrao Ambedkar Central University Lucknow చెందిన చరిత్ర శాఖాధిపతి Mr.Mahaboob Basha ఎంతో వ్యయప్రయాసల కోర్చి పలు ప్రాంతాల నుండి నాకు అవసరమగు, నాకు అవసరమని తాను భావించిన గ్రంథాలను సేకరించి,  మరికొన్ని అమూల్య గ్రంథాలనూ, హిందీ, ఆంగ్ల భాషలలోని పలు పత్రికలను  జిరాక్స్ తీయించి పంపి సమాచార సేకరణలో నాకెంతో తోడ్పాటు నందించారు.

నేను సభ్యత్వం కలిగియున్న Centre For Study of Society and Secularism (Mumbai), నాకు పరిచయం ఉన్న  Indian Association of Muslim Social Scientists (New Delhi), Institute of Objective Studies (New Delhi) లాంటి సంస్థల నుండి కూడా చాలా ఉపయుక్తమగు సమాచారం లభించింది. Jawahar Lal Nehru University (New Delhi), Alighar Muslim University (Alighar) ల గ్రంథాలయాల నుండి చాలా సమాచారం సమకూర్చుకున్నాను.  సమాచార సేకరణలో మద్రాసులోని కన్నెమరా గ్రంథాలయం, విజయవాడలోని Ram Mohan Free Library & Readig Room, గుంటూరులోని ప్రాంతీయ గ్రంథాలయం, వినుకొండ లోని శాఖా గ్రంథాలయం, హైదరాబాదు, అలీఘర్, ఢిల్లీ, మద్రాసు, బొంబాయి, పాట్నా, వేటపాలెం, రాజమండ్రి తదితర ప్రాంతాలలో గల పలు గ్రంథాలయాల అధికారులు, సిబ్బందీ నాకెంతో సహకరించారు.

ఈ పుస్తకానికి ప్రమాణవాక్యం రాసిచ్చి Prof. I. Thirumali, Head of the Department of History, Sri Venkateswra College,  Delhi University (Delhi) నా ప్రయత్నాలను ప్రోత్సహించారు. బాబాసాహెబ్ అంబేద్కర్ కేంద్రీయ విశ్వవిద్యాలయం (లక్నో) చరిత్ర శాఖాధిపతి మహబూబ్ బాషా పరిచయవాక్యం రాసివ్వడమే కాకుండా పుస్తకాన్ని విమర్శనాత్మక దృష్టితో చదివి అవసరం అన్పించిన మార్పులు చేర్పులను కూడా సూచించారు.

ఈ విధంగా నాకు అన్ని  విధాల సహకరించిన-ప్రోత్సహించిన పెద్దలు, మిత్రులకు, ఈ గ్రంథం చిత్తుప్రతిని చదివి, పలు సూచనలు చేసిన ప్రముఖ పాత్రికేయులు

అబ్దుల్ వాహెద్ గారికి (గీటురాయి–హైదరాబాద్), ప్రూఫ్ రీడింగ్‌లో సహకరించిన ముహమ్మద్ అబ్దుల్ మతీన్ ఉమ్రి గారికి (గీటురాయి–హైదరాబాద్), ముఖచిత్రాన్ని అందంగా డిజైన్ చేసిన ప్రముఖ చిత్రకారులు అబ్దుల్లా గారికి (విజయవాడ), పుస్తకాన్ని సెట్ చేసిన లంకా లక్ష్మీనారాయణ (గీటురాయి–హైదరాబాద్) గారికి, నా ప్రతి ప్రయత్నాన్ని తన ఆశీస్సులతో బలం చేకూర్చిన మా అమ్మ సయ్యద్ బీబిజాన్‌కు, అన్ని సమయాలలో నన్ను ప్రోత్సహిస్తు, నా రచనా వ్యాసంగానికి ఏ విధమైన అటంకం కలుగకుండా తోడ్పాటునందిస్తున్న నా జీవిత సహచరిణి షేక్ రమిజా బానుకు నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

ఈ గ్రంథానికి రచయితను నేనైనా, సమాచార సేకరణ వద్ద నుండి, ఆ సమాచారం పుస్తకం రూపం తీసుకొని పాఠకులకు చేరేవరకు సాగిన ఈ నా ప్రయత్నంలో పైన పేర్కొన్న ప్రముఖులు, సన్నిహితులు, మిత్రులు ప్రత్యక్షంగా సహకరించినా, పరోక్షంగా చేయూత నిచ్చినవారు కూడా పలువురున్నారు. ఆ కారణంగా ఈ గ్రంథం 'వ్యష్టికృషి' గా నేను భావించటం లేదు; 'సమష్టికృషి' ఫలితమని గట్టిగా నమ్ముతున్నాను. ఈ సందర్భంగా నా కృషిలో అన్ని విధాల చేయూతనివ్వడమే కాకుండా, చక్కని సలహాలు–సూచనలనూ అందించిన ప్రతి ఒక్కరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

భారత దేశంలోని అన్ని సాంఘిక జనసముదాయాలు సదవగాహనతో, సద్భావనతో, సామరస్య వాతావరణంలో, అన్ని రకాల అసమానతలను తొలగించుకుని, శాంతియుతంగా గౌరవప్రదమైన జీవితాలను సాగించాలన్నది నా ఆకాంక్ష. ఈ ఆశయ సాధన దిశగా నేను ఎన్నుకున్న రంగంలో రచయితగా నా అతి చిన్న ప్రయత్నానికి చేయూతనిస్తున్న ప్రతి ఒక్కరికి పేరుపేరునా ధన్యవాదాలు. ఈ గ్రంథాన్ని చదివిన పాఠక మిత్రుల నుండి మార్పులు–చేర్పులు, సూచనలు–సలహాలను, తప్పొప్పులను వినమ్రంగా ఆహ్వానిస్తున్నాను.

★ ★ ★

# అంకితం...

## ముస్లిం మహిళలకు

## మరియు

## ప్రియమైన అర్ధాంగి

## షేక్ రమిజా బానుకు

ఆత్మీయంగా...

## అధ్యాయం - 1



# ముస్లింలు

**1857** నాటి ప్రథమ **భారత స్వాతంత్ర్యసంగ్రామం** భారతదేశ చరిత్రలో మహోజ్జ్వల ఘట్టం. భారతీయుల పోరాట పటిమకూ, శౌర్యప్రతాపాలకూ, నిరుపమాన దేశభక్తికి నిలువుటద్దం. ఈ పోరాటంలో, భారతదేశపు అతిపెద్ద అల్ప సంఖ్యాక వర్గమైన ముస్లిం సమాజం అద్భుతమైన భాగస్వామ్యాన్ని అందిస్తూ ముందుకు సాగింది. ఈ పోరులో అగ్రభాగాన నిలచి ఆదర్శవంతమైన పాత్రను నిర్వహించి ఇతర జనసముదాయాలకు తలమాణికమయ్యింది. ముస్లిమేతర సాంఘిక జన సమూహాలతో మమేకమై, పరాయి పాలకులకు వ్యతిరేకంగా ఉవ్వెత్తున సాగిన సమరంలో నాయకత్వ పాత్రను చేపట్టి తన విద్యుక్త ధర్మాన్ని అపూర్వమైన రీతిలో నిర్వర్తించింది.

ఈ పోరాటంలో అపూర్వ త్యాగాలతో, అసమాన బలిదానాలతో ముస్లింలు పునీతులయ్యారు. ఆడ - మగ, బాలుడు-వృద్ధుడు తేడా లేకుండా సమరశీల పాత్ర నిర్వహిస్తూ, ఎక్కడా రాజీపడకుండా తమ ప్రాణాలను బలిపెట్టి స్వదేశం నుండి వలస పాలకులను తరిమి కొట్టాలన్న దృఢ సంకల్పంతో అనిర్వచనీయమైన త్యాగాలతో చరిత్ర సృష్టించారు. చివరకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం **ఇస్లామిక్ కుట్ర** అని ఆంగ్లేయులు భావించినంతటి ప్రధాన పాత్రను నిర్వహించారు.

ఈ సందర్భంగా భారతావనిలోని ప్రధాన సాంఘిక జనసముదాయాలైన హిందూ- ముస్లింల మధ్య పటిష్టమైన ఐక్యత వ్యక్తమైంది. ఈ ఐక్యతను గమనించిన బ్రిటీష్ పాలకులు కలవరపడ్డారు. ఈ ఐక్యత తమ అధికార ప్రాభవవైభవాలకు గొడ్డలి పెట్టు కాగలదని భయపడిన ఆంగ్లేయులు **విభజించు-పాలించు** కుటిల నీతిని అమలుపర్చి, చరిత్రను వక్రీకరణలకు గురిచేసి, పలు కుయుక్తులకు పాల్పడి మొత్తం మీద భారతీయులను మతం పేరుతో మానసికంగా హిందువులు-ముస్లింలుగా విభజించటంలో కృతకృత్యులయ్యారు.

ఈ ప్రయత్నాలలో భాగంగా ముస్లింల మీద అసత్యప్రచారాలను అంబరాన్ని అంటేదాకా సాగించారు. ఆ ప్రచారాలకు అక్షరరూపం కల్పించి నిక్షిప్తం చేసి స్థిరపర్చారు. ఆ ప్రవాహంలో స్వదేశీ చరిత్రకారులు కొట్టుకపోయారు. చివరకు ఆంగ్లేయుల కుట్ర ఫలించి ఇండియా విభజన వరకు సాగింది. ఈ విధంగా విభజనకు దారితీసిన పరిస్థితులు, ఆ సందర్భంగా జరిగిన దారుణాలు, పొరుగు దేశంగా ఏర్పడిన పాకిస్తాన్‌తో జరిగిన యుద్ధాలు తదుపరి ఏర్పడిన ఉద్రిక్త పరిస్థితులు అలనాటి ఐక్యతకు తూట్లు పొడిచి విభిన్న జన శ్రేణులలో పరస్పరం ఉన్న సద్భావనకు చిచ్చుపెట్టాయి.

ముస్లిం సమాజం మీద మోపబడిన **విభజన** అను రుజువుకాని కాలేని నేరం సృష్టించిన ప్రత్యేక మానసిక పరిస్థితి చరిత్రకారులను, రచయితలను కూడా తాకింది. భారత విభజనానంతర పరిణామాల వలన అపరాధ భావనకు గురిచేయబడిన ముస్లిం సమాజం సుషుప్తావస్థలోకి నిష్క్రమించింది. ఆ కారణంగా విశృంఖలంగా ప్రచారమౌతున్న అపోహలను-అసత్యాలను ఆ దిశగా సాగుతున్న అనుచిత చర్యలను ముస్లిం సమాజం వాస్తవాలతో బలంగా తిప్పికొట్టలేకపోయింది. ముస్లిమేతర సమాజానికి తన పూర్వీకుల మహత్తర త్యాగమయ పాత్రను వివరించలేకపోయింది.

చరిత్రకారులు, పరిశోధకులు కూడా అసత్యాల జడివానలో కునారిల్లుతున్న ముస్లింలకు సంబంధించిన నిజానిజాలను నిర్ధారించి ప్రజలకు వాస్తవాలు అందించ లేకపోయారు. అలనాడు తమ స్వార్థం కోసం వలసవాద చరిత్రకారులు సృష్టించిన ముస్లిం వ్యతిరేక చరిత్ర అక్షర రూపంలో స్థిరపడినందున ఆ ప్రభావం నుండి స్వదేశీ చరిత్రకారులు కూడా బయటపడ లేకపోయారు. అందువలన ముస్లిం యోధుల త్యాగ చరితలు అక్షర రూపంలో నిక్షిప్తం కాలేకపోయాయి.

# ప్రజలకు చేరువకాని సమాచారం

అందువలన సాధారణ చరిత్ర గ్రంథాలలో త్యాగధనులైన ముస్లింలు చాలా వరకు కన్పించరు. ఒకరిద్దరు కన్పించినా అనన్య సామాన్యమైన వారి సాహసం, త్యాగాలు, అతి సాధారణ స్థాయి వివరణలతో వర్ణనలతో సరిపెట్టబడ్డాయి. బహుళ ప్రాచుర్యంలో ఉన్న పాపులర్ చరిత్ర గ్రంథాలలో ముస్లింల వీరోచిత గాథలు సరైన స్థానం పొందలేక పోయాయి. ఆయా కథనాలు ప్రాంతీయ చరిత్ర గ్రంథాలలోగాని, పాఠ్య పుస్తకాలలోగాని సక్రమంగా చోటు చేసుకోలేదు. ఫలితంగా భవిష్యత్తు తరాలకు అలనాటి అమూల్య సమాచారం అందకుండా పోయింది.



1856లో కొవ్వు పూయబడిన కొత్త రకం తూటాల వినియోగం తమ మత విశ్వాసాలకు విఘాతమని ఆగ్రహించిన భారతీయ సైనికులు తుపాకులను శుభ్రం చేసుకుంటూ చర్చించుకుంటున్న దృశ్యం.

సామాన్య చరిత్ర గ్రంథాల ద్వారా తెలిగ్గా సమాచారం లభించే అవకాశం లేనందున, కళారూపాలకు, సాహిత్య ప్రక్రియలకు, ప్రచార మాధ్యమాలకు ముస్లింల శ్లాఘనీయ త్యాగ చరిత్రలు కథా వస్తువు కాలేకపోయాయి. ఆ కారణంగా ముస్లింల త్యాగాలు, ఆనాటి వీరోచిత పోరాట ఘట్టాలకు మన సాహిత్యంలో సరైన స్థానం లభించలేదు. కళా-సాహిత్య మాధ్యమాల ద్వారా జనబాహుళ్యంలోకి వారి త్యాగాలు ప్రసరించకపోవటం వలన ఆ తరువాతి తరాలకు ఆయా చారిత్రక విషయాలు తగినంతగా పరిచయం కాలేదు.

భారతదేశంలోని హిందూ-ముస్లిం జనసమూహాల మధ్య సద్భావనకు, సదవగాహనకు యిలాంటి పరిణామాలే ఆటంకంగా మారి క్రమక్రమంగా ఆయా జనసముదాయాల మధ్య మానసిక ఎడం ఏర్పడటానికి ప్రధానం కారణమవుతున్నాయి. ఈ అగాథాన్ని మరింత పెంచి పోషించి ఒక సాంఘిక జనసమూహానికి ఏకైక ప్రతినిథులుగా ప్రకటించుకుని రాజ్యమేలాలని ఆశిస్తున్న రాజకీయ మతోన్మాదశక్తులు -వ్యక్తులు ఈ అవాంఛనీయ వాతావరణాన్ని బాగా వాడుకుంటున్నాయి.

ముస్లింలకు సంబంధించిన చరిత్రను మరింతగా వక్రీకరించి ముస్లిమేతర ప్రజల్లో అపోహలను-అపార్థాలను సృష్టిస్తున్నాయి. ఈ దుష్ప్రచారాన్ని చాలా పకడ్బందీగా కొనసాగిస్తూ కొంత మేరకు విజయం సాధించాయి. ఈ అసత్యప్రచారం ప్రజలను ఎంతగా ప్రభావితం చేసిందంటే ముస్లిమేతరులు మాత్రమే కాకుండా ముస్లింలు కూడా తమ పూర్వీకుల త్యాగాల పట్ల అజ్ఞానాన్ని వ్యక్తం చేసేంత స్థాయి వరకు సాగింది.

## అపూర్వ త్యాగాల చరిత్ర అందరికీ తెలియాలి

ఈ అవాంఛనీయ పరిస్థితిని చక్కదిద్దాల్సిన అవసరం ఎంతో ఉంది. భారత దేశంలోని అన్ని సాంఘిక జనసముదాయాల త్యాగాలు ప్రతి ఒక్క సముదాయానికి తెలియాల్సి ఉంది. బహుళ సంస్కృతీ సభ్యతలతో విలసిల్లుతున్న పలు సాంఘిక జనసముదాయాల గడ్డ అయినటుంటి ఇండియాలోని జనసముదాయాల మధ్య సుహృద్భావ వాతావరణం ఏర్పడడానికి చరిత్రలో ఆయా సమూహాలు నిర్వహించిన పాత్ర ఆ ప్రత్యేక సమూహానికి మాత్రమే కాకుండా ఇతర సముదాయాలకు కూడా తెలియాల్సిన అవసరం చాలా ఉంది.

భిన్నత్వంలో ఏకత్వం, ఏకత్వంలో భిన్నత్వాన్ని అంతర్వాహికగా అంగీకరిస్తూ, కలసిమెలసి నివసిస్తున్న బహుళ సముదాయాలకు మాతృభూమి సేవలో పునీతమైన జనసముదాయాల పాత్ర, ఆయా త్యాగాల చరిత్ర తెలిసినప్పుడు మాత్రమే వివిధ జనసముదాయాల మధ్యన పరస్పరం గౌరవం ఏర్పడుతుంది. ఆ గౌరవం ద్వారా ప్రేమాభిమానాలు స్థిరపడతాయి.

ఆ వాతావరణం భిన్న సముదాయాల మధ్య సదవగాహన, సద్భావన, సహిష్ణుతకు పునాది అవుతుంది. ఈ వాతావరణంలో మాత్రమే లౌకిక వ్యవస్థ పరిఢవిల్లుతుంది. ఈ సానుకూల మానసిక స్థితిలో మత విద్వేషాలు మట్టిలో కలసి శాంతి-

సామరస్యం మరింతగా పటిష్టమౌతుంది. శాంతి–సామరస్యాలతో విలసిల్లుతున్న సమాజంగాని, దేశంగాని నిరాటంకంగా అభ్యున్నతి దిశగా సాగిపోతుంది.

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావం

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ శంఖారావాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీ కొలువులో ఉన్న భారతీయ సైనికులు బెంగాల్‌లోని బరహంపూర్‌లో (Berhanpore) పూరించారు. ఈ తిరుగుబాటుకు తక్షణ ప్రధాన కారణం ఆంగ్లేయ సైనికాధికారులు ప్రవేశపెట్టిన కొత్తరకం తూటాలు కావటం విశేషం. ఈ తూటాలకు ముస్లింలు అపవిత్రమైన జంతువుగా పరిగణించే పందులు, హిందువులు పవిత్రంగా భావించే గోవుల నుండి తీసిన కొవ్వును పూయటం జరిగింది. ఆ తూటాలను ఉపయోగించాలంటే తప్పనిసరిగా ఆ కొవ్వును నోటితో కొరకాల్సి వస్తుంది. ఆ కారణంగా తమ విశ్వాసాలకు విఘాతం కల్గించే నూతన తూటాల వాడకం వలన మత భ్రష్టత్వం, కుల భ్రష్టత్వం తప్పదని సిపాయీలు భావించారు.

ఆంగ్ల సైనికాధికారులు కొత్త తూటాలను తప్పనిసరిగా వాడాలంటూ బలవంత పెట్టడంతో సిపాయీలు ఆగ్రహించారు. ఈస్ట్ ఇండియా కంపెనీలోని 19వ దళం సిపాయీలు నూతన తూటాలను వాడాల్సిందే నంటూ ఆంగ్లేయాధికారులు జనవరి 1857 లో హుకుం జారీ చేశారు. ఆ ఆదేశాలను స్వదేశీ సిపాయిలు పాటించ ఇష్టపడలేదు. ఈ నేపథ్యంలో ఆంగ్లేయాధికారుల ఆజ్ఞలను 1857 ఫిబ్రవరి 26న పశ్చిమ బెంగాల్ రాష్ట్రం ముర్షిదాబాద్ సమీపానగల బరహంపూర్‌లో సైనికులు అమలు చేయ నిరాకరించారు. ఆంగ్లేయుల ఆజ్ఞలను ఉల్లంఘిస్తూ తూటాల వాడకానికి ససేమిరా అన్నారు.

సిపాయీల మత విశ్వాసాలను ఏమాత్రం లెక్కచేయని అధికారులు తూటాల వాడకం తప్పనిసరని ప్రకటించారు. ఆ వాతావరణంలో క్రైస్తవ మతస్థులైన ఆంగ్లేయులు తమను ఉద్దేశ్యపూర్వకంగా మతభ్రష్టుల్ని చేయాలనుకుంటున్నారని సిపాయీలు భావించారు. ఆ కారణంగా తమ మీద ఒత్తిడి తెస్తున్న ఆంగ్లేయాధికారుల పట్ల ఆగ్రహం వ్యక్తం చేశారు. ఆ ఆగ్రహ వ్యక్తీకరణలో భాగంగా కలకత్తాకు సమీపాన బారక్‌పూర్‌లోని కంపెనీ సైనిక స్థావరానికి చెందిన 34వ స్వదేశీ సైనిక దళంలోని మంగళ పాండే మార్చి 29న సైనికాధికారుల మీద కాల్పులు జరిపారు. ఈ చర్యతో మండిపడిన ఆంగ్లేయాధికారులు మంగళ పాండే మీద సైనిక విచారణ జరిపి ఆయనకు 1857

ఏప్రిల్ 8న ఉరిశిక్ష విధించారు. ఈ సంఘటనతో సిపాయీలు మరింతగా రెచ్చిపోయారు. ఈ వాతావరణంలో స్వదేశీ సైనికుల నుండి తిరుగుబాటు ప్రమాదాన్ని ఊహించిన కంపెనీ సైనికాధికారులు బ్యారక్‌పూర్ సైనికస్థావరంలోని సిపాయీలను అవమానకర రీతిలో నిరాయుధులను చేశారు.

స్వదేశీ యోధుడు మంగళ పాండేను ఉరితీయడం, తమను నిరాయుధులను చేయడం లాంటి అవమానకర విధానాల వలన సిపాయీలు మరింతగా మండిపడ్డారు. ఆ ఆగ్రహం కంపెనీ ఆధ్వర్యంలోని ఇతర ప్రముఖ సైనిక స్థావరాలకు పాకింది. స్వదేశీ పాలకులకు చేసిన వాగ్దానాలను తప్పి, సామ్రాజ్య విస్తరణ కాంక్షతో స్వదేశీ సంస్థానాలను బలవంతంగా స్వాధీనం చేసుకుంటున్న కంపెనీ పాలకుల చర్యలు, వాటి పర్యవసానాలు, సిపాయీల ఆగ్రహాగ్నికి ఆజ్యం పోసింది. ఈ నేపథ్యంలో భారతావనిలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ పతాకం ఎగిరింది

## మీరట్‌లో రగిలిన తిరుగుబాటు జ్వాల

1799లో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా టిపూ సుల్తాన్ సాగించిన మహోజ్జ్వల పోరాట చరిత్ర ముగిశాక, 1857లో మొగల్ పాదుషా బహద్దూర్ షా జఫర్ నాయకత్వంలో భారతావనిలోని పలు ప్రాంతాలలో సాగిన సమరం భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్ర పుటలలో **ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం** గా ప్రసిద్ధి చెందింది. ఆంగ్లేయుల వివక్షాపూర్వక చర్యలు, మితిమీరిన పెత్తనం, అన్ని రంగాలలో అప్రతిహతంగా సాగుతున్న ఈస్ట్ ఇండియా కంపెనీ దోపిడీ మున్నగువాటిని సహించలేని సగటు భారతీయుడు, ఆంగ్లేయుల చర్యలకు కినిసిన ఈస్ట్ ఇండియా కంపెనికి చెందిన సిపాయీలు, తమ స్వంత సంస్థానాలలో కేవలం బ్రిటీషర్ల అభీష్టం మేరకు మాత్రమే నడుచుకోవాల్సిన దుస్థితికి గురైన, ఆత్మగౌరవం గల స్వదేశీ పాలకులు ప్రధానంగా ప్రథమ స్వాతంత్ర్య పోరాటానికి బీజాలు వేశారు.

1857 ఏప్రిల్ 24న నూతన తూటాల వాడకాన్ని మీరట్ సైనిక స్థావరంలోని సిపాయీలు ఖరాఖండిగా నిరాకరించారు. ఈ చర్యతో ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు సిపాయీలను నిర్బంధించి సైనిక విచారణ జరిపి ఖైదులో ఉంచారు. ఈ సందర్భంగా ఖైదులో తూటాల వాడకాన్ని నిరాకరించిన సైనికుల పట్ల ఆంగ్లేయాధి కారులు చాలా

దుర్మార్గంగా, అవమానకరంగా వ్యవహరించారు. కంపెనీ సైనికాధికారుల చర్యల పట్ల ఆగ్రహించిన సైనికులు మే 10 సాయంత్రం అధికారుల మీద తిరగబడి, ఎదురొచ్చిన అధికారులను అంతం చేసి, ఖైదులో బంధించబడిన తమ సహచరులను విడిపించుకున్నారు.

ఇండియాలో ఆంగ్లేయుల అతిపెద్ద సైనిక స్థావరమైన మీరట్ సైనిక స్థావరాన్ని విధ్వంసం చేసి, తగులబెట్టి స్థావరాన్నీ పరిసర ప్రాంతాలనూ తిరుగుబాటు యోధులు తమ ఆధీనంలోకి తెచ్చుకున్నారు. ఆ తరువాత 1857 మే 10 రాత్రికి మీరట్ నుండి బృందాలు బృందాలుగా బయలుదేరి మే 11 తెల్లవారు ఝామున ఢిల్లీ చేరుకుని



ఆంగ్లేయ అధికారుల ఆదేశాలను ఉల్లంఘించిన భారతీయ సిపాయిలను నిరాయుధులను చేస్తున్న దృశ్యం

యమునా నది మీద ఉన్న పడవల వంతెన మీదుగా నగర ప్రవేశం చేశారు.

ఈ సంగ్రామంలో ముస్లిం జనసముదాయాలు ప్రధాన పాత్ర వహించాయి. మీరట్ నుండి బయలు దేరిన స్వదేశీ యోధులు ఢిల్లీ చేరాక ఎర్రకోటలో ప్రవేశిస్తూ **దీన్...దీన్** అంటూ రణనినాదం చేశారని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో స్వయంగా పాల్గొన్న ఆంగ్ల సైనికాధికారులు వెల్లడిస్తున్న చరిత్రను బట్టి తెలుస్తోంది. ఈ వివరణ వలన ఆనాడు ముస్లిం సిపాయీలు పోరుబాటలో అగ్రభాగాన నిలిచారన్నది స్పష్టమౌతుంది. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులతో చివరివరకు సాగిన పోరాటంలో

ముస్లిం జనసముదాయాలు సాహసోపేత త్యాగాల బాటలో తమ ఆధిక్యతను నిలుపు కుంటూ వచ్చి తాము పుట్టి పెరిన గడ్డ రుణం తీర్చుకుంటూ, అత్యధిక సంఖ్యలో ఉన్న తోటి ముస్లిమేతర సోదరులతో కలసి స్వదేశం, స్వదేశీపాలకుల పట్ల తమలో ఉన్న విశ్వాసం, విధేయతలకు తిరుగులేని ప్రతీకలుగా నిలిచారు.

ఈ పోరాటంలో ముస్లింలు ఇతర జన సముదాయాలతో ఎంతగా మమేక మయ్యారో, ఎంతటి ప్రధాన ప్రాత పోషించారో ఆంగ్లేయాధికారి Henry Mead చేసిన ప్రస్తావన ప్రబల సాక్షీభూతంగా నిలుస్తుంది. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ముస్లింల పాత్రను ప్రస్తావిస్తూ **ప్రస్తుత దశలో ఈ తిరుగుబాటును సిపాయిల తిరుగుబాటు అనడానికి వీలులేదు. అది సిపాయిలతో మొదలయ్యింది గాని త్వరలోనే దాని అసలు స్వభావం బయట పండింది. అది ఇస్లామిక్ తిరుగుబాటు** అని అన్నాడు.

(This rebellion, in its present phase, cannot be called a Sepoy Mutiny. It did begin with the Sepoys, but soon its true nature was revealed, it was an Islamic revolt. - **Muslims in India**, S.Abdul Hasan Ali Nadvi, Islamic Research and Publications, Lucknow, 190, Page. 109)

బెంగాలు సివిల్ సర్వీసులో అధికారిగా పని చేసిన Henry Harrington Thomas కూడా 1858 లో తయారు చేసిన Rebellion in India and Our Future Policy అను ఒక కరపత్రంలో, **1857 తిరుగుబాటుకు పథకరచన చేసిన వారుగాని, ప్రధాన చోదకశక్తులు గాని హిందువులు కాదని ఇదివరకు రాశాను. అది మహమ్మదీయుల కుట్ర ఫలితమని చూపడానికి ప్రయత్నిస్తాను. తమంతట తాముగా హిందువులు అటువంటి పని తలపెట్టి ఉండేవాళ్ళు కాదు** అని వ్యాఖ్యానించాడు.

( 'I have stated that the Hindus were not the contrivers or the primary movers of the 1857 rebellion, and I now shall attempt to show that it was the result of a Mohammadan conspiracy...left to their resources, the Hindus never would or could have an compassed such an undertaking..' **Muslims in India**, S.Abdul Hasan Ali Nadvi, Islamic Research and Publications, Lucknow, 190, P. 111)

# ఎర్రకోట కేంద్రంగా ఎదిగిన పోరు

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం మీరట్‌లో సిపాయీల క్రియాశీలక తిరుగు బాటులో ఆరంభమై ఢిల్లీ చేరుకుని చివరి మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్ నాయకత్వంలో ఎర్రకోట కేంద్రంగా విజృభించింది. 1857 మే 11 నుండి ఢిల్లీలో ఆరంభమైన ఈ పోరు 1857 సెప్టెంబరు 21 వరకు సాగింది. ఈ పోరాటం ప్రేరణగా దేశంలోని పలు ప్రాంతాలలో తిరుగుబాట్లు ప్రజ్వరిల్లాయి. ఆయా ప్రాంతాలలోని ప్రతి స్వదేశీపాలకుడు మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్‌ను తమ చక్రవర్తిగా పరిగణిస్తూ, తమను తాము ఆ చక్రవర్తి ప్రతినిధులుగా ప్రకటించుకుంటూ, చక్రవర్తి గుర్తింపు కోసం అభ్యర్థిస్తూ తమ ప్రతినిధులను ఢిల్లీకి పంపారు. ఈస్ట్ ఇండియా కంపెనీ ఆధిపత్యాన్ని త్రోసిరాజని తమ సంస్థానాలలో గల ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలతో స్వదేశీ సైనికులు తలపడ్డారు.

ఈ అనూహ్య పరిణామాలకు బహదూర్ షా జఫర్ తొలుత కొంత ఆశ్చర్య పోయినా ఆ తరువాత చక్రవర్తిగా ఆయన అన్ని బాధ్యతలు స్వీకరించారు. అడ్డు వచ్చిన ప్రతి ఆంగ్లేయాధికారిని తిరుగుబాటు యోధులు అంతం చేశారు. ఆంగ్లేయాధికారులంతా నగరం వదలి పారిపోయారు. ఢిల్లీ నగరం పూర్తిగా తిరుగుబాటు యోధుల స్వాధీనంలోకి వచ్చింది. తిరుగుబాటు యోధుల సమ్మతితో మొగల్ రాకుమారులను సైన్యాధికారులుగా నియమిస్తూ బహదూర్ షా జఫర్ రాజ్యకార్యభారాన్ని చేపట్టారు. ఆ తక్షణమే ఆంగ్లేయుల మీద పోరాటానికి కదలి రావాల్సిందిగా ప్రజలను కోరుతూ ప్రకటన విడుదల చేశారు. పరాయి పాలకులను పాలద్రోలడానికి ఢిల్లీకి తరలిరావాల్సిందిగా ఇతర ప్రాంతాలలో గల స్వదేశీ పాలకులకు, స్వదేశీ సైనికులకు ఆయన లేఖలు రాశారు.

ఆ లేఖలలో, **ఏవిధంగానైనా ఆంగ్లేయులను ఇండియా నుండి తరిమి వేయా లన్నది నా ఏకైక ఆకాంక్ష. నేను స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలు గల ఇండియాను చూడాలను కుంటున్నాను. శత్రువును తరిమివేసి నేను రాజ్యమేలాలన్నది నా అభిమతం కాదు. రాజులైన మీరు ఖడ్గచాలనం ద్వారా శత్రువును తరిమేసి సమాఖ్య ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినట్టయితే సార్వభౌమాధికారాన్ని మీకు అప్పగించి నేను బాధ్యతలను నుండి విముక్తం కాదలచుకున్నాను**, అని ఆయన తన అభిమతాన్ని స్పష్టం చేశారు.

( To Drive away the Firangis from India by any means and at any cost is my only desire. I want to see the whole of India free and independent. Certainly it is not my desire to rule the country for myself by driving away the enemy. If you, rajas, draw your swords to drive away the enemy and then from a confederacy and government. I would gladly entrust the sovereignty to you and will thus be freed from responsibility - **Bahdur Shah II**, Mahdi Husain P. IXVII)

తొలిదశలో మీరట్ నుండి విచ్చేసిన యోధులు ఆంగ్లేయుల ఆధిపత్యానికి గండికొట్టడంలో ప్రధాన పాత్ర వహించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన ఢిల్లీలో అంతం అయ్యాక ఇతర ప్రాంతాల నుండి ఆంగ్లేయులను తరిమికొట్టాలని సంకల్పించిన యోధులు, ఆయా ప్రాంతాలలో తమ ఆధిపత్యం నిలుపుకుని కంపెనీ ప్రభుత్వం స్థానంలో స్వదేశీ రాజుల పాలనకు పునాదులు వేసి పెద్ద సంఖ్యలో ఢిల్లీ చేరుకున్నారు.

ఈ మేరకు ఢిల్లీ చేరుకుని ఎర్రకోట కేంద్రంగా మొగల్ దర్బారులో ప్రముఖ పాత్రవహించి చరిత్ర సృష్టించిన వారిలో ముహమ్మద్ భక్త్‌ఖాన్ ముఖ్యులు. ఆంగ్లేయ సైన్యంలో అధికారిగా 40 సంవత్సరాల అనుభవం గల ఈ నేత 1857లో బరేలిలో తిరుగుబాటు చేసి, కంపెనీ పాలకులను ఖంగుతినిపించి మొగల్ పాదుషా నాయకత్వంలో ఆంగ్లేయులతో పూర్తి స్థాయిలో తలపడేందుకు ఢిల్లీ చేరుకుని చక్రవర్తి ఆశీస్సులతో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల సర్వసైన్యాధిపతిగా పదవిని చేపట్టారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ మహాసేనానిగా చరిత్ర సృష్టించిన భక్త్ ఖాన్ స్వతంత్ర ఢిల్లీ పాలనకు **మహా పరిపాలనా మండలి** ఏర్పాటు చేయటంలో మొగల్ చక్రవర్తికి తోడ్పడ్డారు. ఈ మండలి ప్రజాస్వామ్యబద్ధంగా పాలన సాగించేందుకు 12 ప్రధాన మార్గదర్శక సూత్రాలతో ఒక రాజ్యాంగాన్ని ప్రజాస్వామిక సిద్ధాంతం ఆధారంగా తయారుచేశారు. అత్యధికుల అభిప్రాయాన్ని గౌరవించటం, ఆ నిర్ణయాల అనుసారంగా కార్యక్రమాలను సాగించటం ప్రధానమని భావించారు. సమావేశాలకు సభ్యుల కోరం, సభ్యుల హాజరు, ఇతరుల హాజరుపై నిషేధం, సభ్యుల ప్రతిపాదనలు, ఆ ప్రతిపాదనలు ప్రవేశ పెట్టేముందు మరొక సభ్యుని సమర్ధన, ప్రతిపాదిత అంశం పై ప్రతిపాదకుని ప్రసంగం, ఆ తరువాత చర్చ, సభ్యులు ప్రసంగిస్తున్నప్పుడు ఎవ్వరూ ఆటంకపరచరాదన్న నిబంధన లాంటి కీలక అంశాలను ఆ విధాన నిర్ణయ పత్రంలో వివరంగా పేర్కొన్నారు.

చివరకు ఈ పాలనా మండలిలోని సభ్యులు కూడా తమ చర్యలకు బాధ్యత వహించాలని నిర్ణయమైంది. అవినీతికీ అక్రమాలకూ పాల్పడితే మండలిలో చర్చించి, నిందితునికి సమాధానం చెప్పుకునే అవకాశం కల్పించి ఆ తరువాత తగిన చర్యలు తీసుకోవాలని విధాన నిర్ణయపత్రం పేర్కొనటం విశేషం.

ఈ వ్యవస్థ గురించి ప్రముఖ చరిత్రకారుడు M. Mujeeb తన గ్రంథం Indian Muslims (P. 426-429) లో వివరంగా చర్చించారు. ఆధునిక భారత దేశ చరిత్రలో తొలిసారిగా ప్రజాస్వామిక రాజ్యాంగ విధానాన్ని రూపొందించటం జరిగిందని M. Mujeeb తిరుగుబాటు యోధులు ప్రతిపాదించిన వ్యవస్థను ప్రశంసించారు.



1857 మే10 సాయంత్రం మీరట్‌లో సమరశంఖారావం పూరించి , అక్కడి ఆంగ్లేయ అధికారుల భరతం పట్టి, ఎర్రకోట మీద స్వతంత్ర పతాకాన్ని ఎగరేసేందుకు ఢిల్లీ దారి పట్టిన స్వదేశీ సైనిక బృందాలు

(' First instance in the history of Modern India, when Democratic Constitutional proceedure is devised..'. P. 429 ).

సర్వసేనాని భక్త్‌ఖాన్, ఆయన అనుచరులు ప్రజాస్వామిక పద్ధతులలో పరిస్థితులను చక్కదిద్దేందుకు యత్నించినా, ఈ వ్యవస్థ అసమర్థులైన రాజకుమారులు, పిరికి పందలు, విద్రోహుల కారణంగా విఫలమైందని M. Mujeeb ఆవేదన వ్యక్తంచేశారు. ('Bhakth Khan and his comrades, who sought to obtain control of premature and unplanned military uprising did have in them the makings of just and democratic rulers and organizers and it was tragic indeed

that their cause was ruined by dissolute and incompetent princes, and by cowards and traitors.' P. 429 ).

ఆంగ్లేయుల ఆధిపత్యానికి తొలిదశలో చరమగీతం పాడిన ఈ నాయకుడు తన అనుచరులతో కలసి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు గుండెలో దడ పుట్టించాడు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ చివరి దశలో ఏర్పడిన ప్రతికూల పరిస్థితుల సమయంలో బహదూర్ షా జఫర్ కనుక భక్త్‌ఖాన్ సలహాను పాటించి ఆయనతోపాటుగా లక్నో వెళ్ళిఉంటే భారతదేశ చరిత్ర మరోలాగుండేదని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ విశ్లేషకులు అభిప్రాయపడ్డారంటే ఆయన ముందుచూపు ఏలాంటిదో గ్రహించవచ్చు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం చివరి దశలో ఎర్రకోట వీడిన ఈ యోధుడు ఆ తరువాత పలు ప్రాంతాలలో ఆంగ్లేయ సైనికులతో తలపడుతూ చివరకు 1859లో కదనరంగాన కన్నుమూశాడు. అత్యంత ప్రతిభావంతుడైన ఆ యోధుని గురించి జవహర్ లాల్ నెహ్రూ ప్రస్తావిస్తూ, బహదూర్ షా జఫర్ స్వాతంత్ర్యసంగ్రామానికి తల, హిందూ-ముస్లింలు కాళ్ళూచేతులయితే, భక్తఖాన్ మెదడు లాంటి వాడని ప్రశంసించారు. (' If Bahadur Sha Zafar was head of the freedom struggle and Hindus and Muslims were legs and hands, then Bhakth Khan was the brain ' - **Muslims in First War of Independence**, Radiance Views Weekly, 31 August - 6 September 2003, Page. 24)

## జఫర్‌కు అండదండగా స్వదేశీ పాలకులు

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో మొత్తం మీద 72 సార్లు పలు ప్రాంతాలలో ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికులతో స్వదేశీ యోధులు తలపడ్డారు. ఈ పోరాటంలో ఫరూఖాబాద్ యోధులు అహమ్మద్ అలీ ఖాన్, తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్ తదితరులు మొగల్ పాదుషాకు ఆయుధాలు, ఆహార సామగ్రి అందించి అండదండలుగా నిలిచారు. ఆ కారణంగా అహమ్మద్ అలీ ఖాన్‌ను అరెస్టు చేసిన ఆంగ్లేయులు చాంద్‌నీచౌక్‌లో బహిరంగంగా ఉరితీసి శవానికి అంత్యక్రియులు కూడా జరుపకుండా ఎర్రకోట కందకం లోకి విసిరిపారేశారు. నవాబు తఫ్‌జుల్ హుస్సేన్ సరత్ జంగ్‌ను పలు హింసలకు గురిచేసి చివరకు ప్రవాసశిక్ష విధించారు.

ఆనాడు మొగల్ పాదుషా వెంట సాగిన వారందరికి వారెంతటి స్థానంలో

ఉన్నా సరే అవమానకరమైన శిక్షలతో, చిత్ర హింసలతో నిర్ధాక్షిణ్యంగా ఆంగ్లేయులు అంతం చేశారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అలహాబాద్ యోధుడు మౌల్వీ లియాఖత్ అలీ ఖాన్ సాయుధంగా తిరుగుబాటు చేసి అలహాబాద్ పరగణాకు విముక్తి ప్రసాదించారు. పాలనాధికారాన్ని చేజిక్కించుకున్నారు. ఆయన హిందూ-ముస్లిం యోధులతో కలసి సమాఖ్య తరహా పాలనచేశారు. చివరకు నమ్మకద్రోహం వలన ఆంగ్లేయ సైనికులకు చిక్కడంతో ఆయనను చిత్రహింసలు పెట్టి చివరకు అండమాన్ దీవులకు పంపారు.

చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రతినిధులుగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలతో తలపడిన కులీన వర్గాలకు చెందిన ప్రముఖులు, నవాబులు, స్వదేశీ పాలకులు ఎవ్వరూ కూడా బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేకత పర్యవసానం గురించి ఆలోచించలేదు. బ్రిటీష్ ప్రభుత్వం శక్తి సామర్థ్యాలు, ఆంగ్ల సైన్యం బలసంపన్నత మున్నగువాని మీద లేశమంతైనా దృష్టి సారించలేదు. మాతృభూమి విముక్తి కోసం బహదూర్ షా జఫర్ నేతృత్వంలో సాగుతున్న పోరులో పాల్గొనటం తప్ప మరో విషయాన్ని తమ మదిలోకి ఏమాత్రం రానివ్వక పోరుబాటన ముందుకు నడిచారు.

ఈ సందర్భంగా ఢిల్లీలోని ముస్లిం జనసముదాయాలు తమ ధనమాన ప్రాణాలను పణంగా పెట్టి స్వదేశీ యోధులకు తోడ్పడ్డారు, ఆంగ్లేయ సైనికులతో కలబడ్డారు. ఈ వీరోచిత కృత్యాలు ఎంతటి మహోత్తర స్థాయిలో ఉన్నా, అటు ప్రజలను ఇటు స్వేచ్ఛకోసం కత్తిపట్టి కదనరంగంలో శత్రువును తునుమాడేందుకు సిద్ధపడిన సైనిక శక్తులను, పాలనాధికారులను సమన్వయపర్చగల సమర్థవంతమైన నాయకత్వం కరువు కావడంవల్లా, స్వపక్షంలోని విభీషణ పాత్రధారుల కుయుక్తుల వల్లా ఆంగ్లేయుల మీద పూర్తి ఆధిపత్యం సాధించలేకపోయారు.

చివరకు మొగల్ సింహాసనం మీద మోజుతో అంతర్గత కలహాలకు కారకులైన మొగల్ పరివారంలోని కొందరి వలన పరాయి పాలకుల పంచన విలాసవంతంగా బ్రతుకుదాం అనుకున్న విద్రోహుల చర్యల మూలంగా స్వదేశీ యోధుల త్యాగాలు వృథా అయిపోయాయి. చివరి ఘట్టంలో విద్రోహుల వలలో చిక్కిన మొగల్ ప్రభువు బహదూర్ షా జఫర్ పోరాట యోధుడు భక్తఖాన్ యిచ్చిన సలహా పెడచెవిన పెట్టి కంపెనీ పాలకులకు లొంగి పోవడంతో తిరుగుబాటుకు ప్రధాన కేంద్రంగా మారిన ఢిల్లీ నగరం సెప్టెంబరు 19న తిరిగి ఆంగ్లేయుల వశమయ్యింది.

# ప్రజల మీద విరుచుకపడ్డ ఆంగ్ల సైనికులు

అప్రతిహతంగా సాగుతున్న తమ ఆధిపత్యాన్ని ప్రశ్నించిన స్వదేశీయోధుల మీద, ఆ యోధులకు సహకరించిన ప్రజల మీద ప్రధానంగా ఢిల్లీ ప్రజల మీద ఆంగ్లేయ సైన్యాధికారులు, సైనికులు విరుచుకుపడ్డారు. బహదూర్ షా జఫర్‌ను బంధించారు. మొగల్ వారసులెవ్వరూ బ్రతికి బట్టకట్టరాదన్న లక్ష్యంతో ఆయన కుటుంబీకులను ఆడ-మగ, పిల్లా-పాప, వృద్ధులు అని చూడకుండా ఊచకోతకోశారు. జఫర్‌కు ఇచ్చిన మాటతప్పి నిరాయుధులైన మొగల్ రాకుమారులను బహిరంగంగా కాల్చి చంపి మృతదేహాలను ఎర్రటి ఎండలో బండరాళ్ళ మీద గిరవాటు వేశారు.

ఆ రాకుమారుల మృతదేహాల నుండి వారి శిరస్సులను వేరు చేశారు. ఆ శిరస్సులను ఒక పళ్ళెంలో పెట్టి, దానిపై రుమాలు కప్పారు. **ఈస్ట్ ఇండియా కంపెనీ మీకు ఇవ్వకుండా ఆపివేసిన నజరానా ఇదిగో** అంటూ బహద్దూర్ షా జఫర్ ఎదుటకు తెచ్చి, శిరస్సుల మీద ఉన్న రుమాలు తొలగించారు. ఆ ఘోరకలి చూసిన బహదూర్ షా జఫర్ తన ఎదుటకు తన కుమారుల కంఠిత శిరస్సులను పళ్ళెంలోపెట్టి తెచ్చిన ఆంగ్లేయాధికారి హడస్సన్ కు సమాధానమిస్తూ **భగవంతుడికి ధన్యవాదాలు. తైమూరు వంశ సంతానం ఉజ్జ్వలమైన ముఖాలతో తండ్రి దగ్గరు ఇలాగే వచ్చేవాళ్ళు** అని సమాధానమిచ్చాడు. (**భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర**, ప్రచురణ కృష్ణా జిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘం, విజయవాడ, 1984, పేజీ. 24)

ఆంగ్ల సైనికులు ఢిల్లీ నగరాన్ని స్మశానం చేశారు. ప్రజలను, ప్రధానంగా ముస్లింలను, నగరంలోనికి ఆరు మాసాల దాకా రానివ్వలేదు. నగరంలో ఉన్నవారెవ్వరిని బయటకు పోనియ్యలేదు. నగరంలో తమ మానాన తమను బ్రతకనివ్వలేదు. అన్ని ముస్లిం వాడల మీద భయానక దాడులు చేశారు. ప్రత్యేకంగా ప్రతి ముస్లిం గృహాన్ని గుర్తించి గృహస్థులను దారుణంగా కాల్చి చంపుతూ, ఆస్తిపాస్తులను దోచుకున్నారు. భవనాలను అగ్నికి ఆహుతి చేస్తూ తీవ్ర విధ్వంసం సృష్టించారు. ఆంగ్లేయ సైనికులు, అధికారులు వారాల తరబడి నగరంలోని ప్రతి ఇంటిని దోచుకున్నారు. అత్యాచారాలకు పాల్పడ్డారు. ఈ కిరాతక చర్యవలన ఢిల్లీ నగరం పూర్తిగా శవాల దిబ్బగా మారిపోయింది. ఢిల్లీలోని ప్రతి గృహం, ప్రతి వీధి మృతదేహాలతో నిండిపోయింది.

మహిళల మీద యధేచ్ఛగా సాగుతున్న అఘాయిత్యాలను నివారించేందుకు అవకాశం లేకపోవటంతో ఆంగ్ల సైన్యాల చేతుల్లోపడి తమ మానమర్యాదలను కోల్పోవటం

కంటే మరణం మేలని భావించిన ఆడపడుచులు కన్పించిన బావుల్లోకి, సమీపంలోని నదిలోకి దూకి ఆత్మహత్య చేసుకున్నారు. ఈ విధంగా పెద్ద సంఖ్యలో మహిళలు ఆత్మ హత్యలకు పాల్పడటంతో నగరంలోని ఏ బావి చూసినా స్త్రీల మృతదేహాలతో నిండిపోయి కన్పించాయని ఆంగ్లేయాధికారులు తమ గ్రంథాలలో వివరించారు. ఈ అఘాయిత్యాలు అకృత్యాలను బ్రిటన్‌లోని తమ వాళ్ళకు రాసుకున్న ఉత్తరాలలో, తాము రాసుకున్న డైరీలలో, ఉన్నతాధికారులకు సమర్పించుకున్న నివేదికలలో ఆంగ్లేయులు సోదాహరణంగా పేర్కొన్నారు. ఈ నివేదికలు చదివిన ఆంగ్లేయ ఉన్నతాధికారులు కూడా తట్టుకోలేనంతగా ఆ చర్యలు ఉన్నాయని, ఆ వివరాలను తెలుసుకున్న ఆ ఆంగ్లేయాధికారులే స్వయంగా



ఎర్రకోటలోని బ్రిటిష్ ఆయుధాగారాన్ని స్వదేశీ సిపాయిలు పేల్చివేసిన దృశ్యం

తమ గ్రంథాలలో చెప్పుకున్నారంటే ఆంగ్లేయులు ఎంత క్రూరంగా వ్యవహరించారో అర్థం చేసుకోవచ్చు.

## ఎర్రకోట ప్రేరణతో వెల్లువెత్తిన తిరుగుబాట్లు

ఆంగ్లేయుల ఆధిపత్యానికి చరమగీతం పాడి ఢిల్లీలో బహదూర్ షా జఫర్ చక్రవర్తిగా అధికార పగ్గాలు చేపట్టారని తెలియగానే దేశవ్యాప్తంగా తిరుగుబాటు జ్వాలలు రగిలాయి. పరాయి పెత్తనం క్రింద నలుగుతున్న స్వదేశీ పాలకులు, ప్రజలు, స్వదేశీ సైనికాధికారులు, సైనికులు అందివచ్చిన అవకాశాన్ని వినియోగించుకున్నారు. తమ

ప్రాంతాలలో గల ఈస్ట్ ఇండియా కంపెనీ పెత్తనానికి చరమగీతం పాడి ఆంగ్లేయ అధికారులను తరిమికొట్టారు. ఆయా ప్రాంతాలను ఆంగ్లేయుల ఆధిపత్యం నుండి విముక్తం చేసి స్వదేశీపాలనను ఆరంభించారు.

ఉత్తరప్రదేశ్‌లోని ఫతేపూరుకు చెందిన సర్దార్ హిక్మతుల్లా ఖాన్ 1857 జూన్ 10న తిరుగుబాటు జెండా ఎగురవేశారు. ఆయన ఈస్ట్ ఇండియా కంపెనీ లో డిప్యూటీ కలెక్టరుగా బాధ్యతలు నిర్వహిస్తున్నారు. ఆయన ఆంగ్లేయుల పెత్తనాన్ని అంతం చేసి అన్ని సాంఘిక జనసముదాయాలకు చెందిన స్వదేశీయోధుల భాగస్వామ్యంతో స్వపరిపాలన ఏర్పాటు చేశారు. చేజారిన అధికారాన్ని చేజిక్కించుకోడానికి ఆంగ్లేయ సైనికాధికారులు ఫతేపూరును చుట్టుముట్టి హింసాత్మక పోరును సాగించి, కుయుక్తులతో సర్దార్ హిక్మతుల్లా, ఆయన సహచరులను అరెస్టు చేశారు. సర్దార్‌ను జూలై 12న బహిరంగంగా ఉరితీసి ఆయన అనుచరులలో, ప్రజలలో భయోత్పాతాన్ని కలుగచేసేందుకు ఆయన మృతదేహాన్ని ఉరికంబానికి వేలాడదీసి ఉంచారు.

బీహార్‌కు చెందిన పీర్ అలీ తన సహచరులతో ఆంగ్లేయ సైన్యాలపై తిరగబడ్డారు. స్వదేశీ యోధులకు తొలి దశలో విజయం లభించినప్పటికీ ఆ తరువాత అదనంగా వచ్చి చేరిన ఆంగ్లేయ బలగాలు పీర్ అలీనీ ఆయన అనుచరులనూ అరెస్టు చేశారు. ఈ సందర్భంగా తిరుగుబాటు రహస్యాలు చెప్పమని, అలా చెప్పినట్టయితే ప్రాణభిక్ష పెట్టగలమని ఆంగ్లేయాధికారులు పీర్ అలీని మాలిమి చేయసాగారు. ఈ సందర్భంగా నీచమైన పద్ధతులకు పాల్పడుతున్న బ్రిటీష్ సైనికాధికారులవైపు చూస్తూ ఆగ్రహంతో పీర్ అలీ ఇలా అన్నారు :

**'..ప్రతి ఒక్కరి జీవితంలో ఒక్కొక్కసారి ప్రాణాలను రక్షించుకోడానికి తెలివిగా వ్యవహరించాల్సిన అవసరం వస్తుంది. అయితే అన్ని సమయాలలో ప్రాణాలు కాపాడు కోవటమే ప్రధానం కాదు. కొన్ని సమయాలలో ఆశయాల కోసం, మాతృభూమి గౌరవ ప్రతిష్ఠల కోసం జీవితాలను పణంగా పెట్టాల్సివస్తుంది. మాతృభూమి కోసం బలికావటం తన భూమి పట్ల గల ప్రేమకు నిదర్శనం అవుతుంది...నా సహచరులను నా కళ్ళ ఎదుటనే ఉరి తీసారు. ఇంకా చాలామందిని ఉరి తీయగలరు. నన్నూ చంపగలరు. అయితే ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకోండి. బలమైన స్వేచ్ఛా కాంక్షతో, స్వాతంత్ర్యం కోసం రక్తతర్పణలకు సిద్ధమౌతున్న ఈ పుడమి తల్లి బిడ్డలను నిలువరించటం మీకు కాదు కదా మరే శక్తికీ సాధ్యం కాదు. ఈ రణంలో చిందిన మా నెత్తురు చుక్కల నుండి**

**స్వాతంత్ర్య సమరయోధుల శరీరాలలో అగ్ని పుడుతుంది. ఆ అగ్ని జ్వాలల వేడిమిలో మీ ప్రభుత్వం, మీరూ మాడి మసైపోవటం తథ్యం.** ఈ విధమైన ధిక్కారంతో బ్రిటీష్ పాలకుల భవిష్యత్తును పీర్ అలీ స్పష్టంగా ప్రకటించారని ఆంగ్లేయ అధికారి విలియం టేలర్ తన గ్రంథంలో పేర్కొన్నాడు. ( **Hindusthani Musalmano Ka Jang-e-azadi mein Hissa** (HIndi), Syed Ibrahim Fikri, Published with the Financial Assistence of Govt. of India, New Delhi, 1999, P. 21).

చివరకు పీర్ అలీని జూలై 3న ఉరితీసి ఆ యోధునికి గౌరవప్రదమైన అంత్యక్రియలు కూడా లేకుండా చేసి ఈస్ట్ ఇండియా కంపెనీ ఆంగ్లేయాధికారులు తమలోని క్రూరత్వాన్ని వెల్లడించుకున్నారు.

ఉత్తరప్రదేశ్‌లోని అవధ్ రాజ్యంలో విజృభించిన మౌల్వీ అహ్మదుల్లా షా ఫైజాబాది ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో నూతన చరిత్ర సృష్టించారు. యువకుడిగా ఉన్నప్పటి నుండి ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ వచ్చిన మౌల్వీ 1857 జూన్‌లో ఆంగ్లేయుల చెఱసాల నుండి విముక్తుడై తన అనుచరులతో కలిసి పోరుబాటన సాగారు. ఆంగ్లేయ సైనికులు తారసపడిన చోటల్లా ఎదుర్కొని వారిని మట్టి కరిపించారు. స్వదేశీ యోధుల విజయపరంపరను కొనసాగిస్తూ ఆయన అవధ్ మహారాణి బేగం హజరత్ మహల్‌తో కలిసి ఆంగ్లేయులను ఎదుర్కొనేందుకు లక్నో చేరుకున్నారు. ఈ క్రమంలో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులను పలు పోరాటాలలో ఆయన పరాజితుల్ని చేశారు. ఈ యోధుని విక్రమాన్ని ఎదుర్కొలేకపోయిన కంపెనీ అధికారులు ఆయనను పట్టిచ్చిన వారికి 50 వేల రూపాయల నజరానా కూడా ప్రకటించాల్సి వచ్చింది. చివరి వరకు రాజీలేని పోరు సలిపిన ఆయన ఈస్ట్ ఇండియా కంపెనీ తొత్తు సాగించిన నమ్మకద్రోహం వలన హతమయ్యారు.

ఈ విషయాన్ని వి.డి. సావార్కర్ తన **1857** స్వరాజ్య సంగ్రామం లో ప్రస్తావిస్తూ **'..రాజా ప్రక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీ పై గురిచూసి కాల్పులు జరిపాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడైపోయాడు. ఆ పిరికిపందలు..మౌల్వీ శిరస్సు ఖండించి, దాని పై గుడ్డ కప్పుకొని చేరువనే 13 మైళ్ళ దూరాన ఉన్న బ్రిటీషు ఠాణా - షాజహన్‌పూరుకు తీసుకు వెళ్ళారు...రక్తం ఓడుతున్న ఆ పవిత్ర శిరాన్ని ఆ నీచులు ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి వారి పాదాల చెంత మోకరిల్లారు...నీచమైన**

**దేశద్రోహానికి తలపడిన ఆ పోవెన్ పశువుకు 50 వేల రూపాయల పారితోషికం లభించింది!'** అని రాశారు. (పేజి. 156-157)

మౌల్వీ ఖండిత శిరస్సును తెప్పించుకున్న అధికారులు **' ఉత్తర భారత దేశంలో బలిష్టమైన శత్రువును '** అంతం చేశామని ఆనందించారు. ఆ యోధుని శౌర్యప్రతాపాలను మాతృభూమి మీద ఆయనకు గల గౌరవాభిమానాలను ప్రస్తావిస్తూ బ్రిటీష్ సైనికాధికారి General Holems తన **The Sepoy War** అను గ్రంథంలో **'...ఆక్రమంగా విధ్వంసం కాబడిన తన మాతృదేశ స్వాతంత్ర్యం కోసం కుట్రపన్ని, యుద్ధం చేసే మనిషి దేశభక్తుడు అయినట్లే మౌల్వీ తప్పకుండా నిజమైన దేశభక్తుడు. ఆయన ఖడ్గం హత్యలతో రక్తం రంగుపులుముకోలేదు. ఆయన హంతకులతో చేతులు కలుపలేదు. తన దేశాన్ని ఆక్రమించుకున్న పరాయి దేశస్థులకు వ్యతిరేకంగా రణరంగంలో పౌరుషంగా, గౌవరనీయంగా, అకుంఠితంగా మొనగాడిలా యుద్ధం చేశాడు. ఆయన స్మృతి అన్ని దేశాల్లోని ధైర్యవంతుల, సహృదయులు శ్రద్ధాంజలికి అర్హమైనది'** అని ప్రస్తుతించాడు.

ఆ అంగ్లేయుడు అంతటితో ఆగలేదు. ఆ గ్రంథంలోనే మరొక చోట,'...A man fitted both his spirit and his capacity to support a great cause and to command a great army. This was Ahamadullah, the Moulivi of Fyzabad.." (Quoted in S.Abul Hasan Ali Nadvi, ' **Muslims In India**' at P. 107), అంటూ మౌల్వీ శక్తి సామర్థ్యాలను వివరించాడు.

బ్రిటీష్ చరిత్రకారుడు సర్ థామస్ సీటన్ 'అతనొక సమర్థుడైన గొప్ప వ్యక్తి... అకుంఠిత దీక్ష,అసమాన ధైర్యసాహసాలు గల తిరుగుబాటు నాయకులలో అగ్రశ్రేణికి చెందిన వాడు', అన్నాడు. (Sir Thomas Seaton described him to be a man of great abilities, of undaunted courage, of stern determination and by far the best soldiers among the rebels..' - **The Indian Mutiny of 1857**, Colonel G.B. Malleson, London,1906, P.17 ).

మౌల్వీ అహమ్మదుల్లా షాతో పలు పోరాటాలు చేసిన కల్నల్ జి.బి.మాల్సన్, (G.B Malleson) మౌల్వీ చర్యలను సమర్థిస్తూ **'..తన దేశాన్ని ఆక్రమించుకుని ధ్వంసం చేస్తున్న వాళ్ళకు వ్యతిరేకంగా,కుట్రపన్ని, యుద్ధం చేసి,స్వాతంత్ర్యం సంపాదించుకోవడం దేశభక్తి అయితే తప్పకుండా మౌల్వీ గొప్ప దేశభక్తుడు... ఆయన అమాయకుల ప్రాణాలు**

తీయలేదు....తన దేశాన్ని వశంచేసుకున్న విదేశీయుల మీద గౌరవప్రదమైన యుద్ధం చేశాడు. వీరుడుగా, నీతిమంతుడుగా గుర్తించబడిన ఆయన అన్ని దేశాలు గౌరవించదగిన యోధుడు..', అని ప్రశంసించాడు.

('If a patriot is a man who plots and fights for independence, wrongfully destroyed, of his native country, then the Moulvi was a true patriot...he had fought manfully, honourably and stubbornly in the battle field against the strangers, who had seized his country, and his memory is entitled to the respect of the brave and the true-hearted of all nations '. **The Indian Mutiny of 1857** : Colonel G.B. Malleson)



1857 జూన్ 8న ఢిల్లీలోని ' రిడ్జి ' ప్రాంతాన్ని కంపెనీ బలగాలకు దక్కనివ్వరాదన్న ధృఢ సంకల్పంతో ప్రాణాలకు తెగించి భీకర పోరును సాగిస్తున్న సమరయోధులు.

## స్వదేశీ పాలకులను ప్రేరేపించిన యోధులు

ఆంగ్లేయుల అజేయశక్తిని ఊహించుకుని, తిరగబడితే ఎదురయ్యే పర్యవసానలను లెక్కలు గట్టి కంపెనీ పాలకుల మీద తిరగబడటానికి చాలా మంది స్వదేశీ పాలకులు సంకోచించారు. ఆ తరుణంలో ఆయా పాలకుల వద్ద బాధ్యతలు నిర్వహిస్తున్న పలువురు ముస్లిం యోధులు తమ తమ పాలకుల వెంట ఉండి మాతృభూమి విముక్తి కోసం తిరుగుబాటు చేయాల్సిన ఆవశ్యకతలను వివరించి తాము స్వయంగా పోరుబాట పట్టడమే కాకుండా స్వదేశీపాలకులను కూడా ఆ దిశగా ప్రోత్సహించారు. ఈ తరహా వీరులలో

ఝాన్సీ రాజ్యానికి చెందిన జైళ్ళ అధికారి బక్షీష్ అలీ ఒకరు. 1857 జూన్ 6న ఆయన తన ఆధీనంలో ఉన్న స్వదేశీయులను జైలు నుండి విడుదల చేసి తిరుగుబాటుకు తెరలేపారు.

ఆనాడు ఝాన్సీ రాణి లక్ష్మీబాయి తొలుత ఆంగ్లేయుల మీద తిరుగుబాటుకు అంగీకరించలేదు. ఆమె తొలిదశలో ఆంగ్లేయుల తోడ్పాటును ఆశిస్తూ 1857 జూన్ 12న ఆ తరువాత 14న WC Erskine కు రాసిన రెండు లేఖలో తిరుగుబాటు యోధులు తిరుగుబాటులో పాల్గొనాల్సిందిగా తన మీద **ఒత్తిడి** తెస్తున్నారని రాశారు. ఆ క్రమంలో 1858 జనవరిలో ఆంగ్లేయాధికారి F.D. Gordon కు ఆమె లేఖ రాస్తూ '..these shortsighted individuals (the rebels) seem unmindful of the British supremacy and do their best to ruin myself and the whole country' (**The Politics of a Popular Uprisings - Bundelkhand in 1857**, Tapti Roy, OUP, 1994), అని ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులకు విన్నవిం చుకున్నారు.

ఆ తరువాత కంపెనీ పాలకుల నుండి ఎదురైన ప్రతికూల పరిస్థితుల కారణంగా ఆమె కదనరంగంలోకి ప్రవేశించాల్సి వచ్చింది. ఆ సమయంలో ఆమెకు నచ్చచెప్పి రణరంగానికి రప్పించటంలో బక్షీష్ అలీ లాంటి ప్రముఖులు తమదైన పాత్ర వహించారు. చివరి వరకు బక్షీష్ అలీ ఆమె వెంట నడిచి ప్రాణాలర్పించారు. (**Eighteen Fifty Seven**, Surendra Nath Sen, Govt. of India publications,1957, P. 283 ).

## కదన రంగానికి కదిలిన స్వదేశీ పాలకులు

ఆంగ్లేయుల ఆర్థికబలాన్నీ, సైనికబలాన్నీ అత్యధికంగా అంచనా కడుతూ పరాయి పాలకుల ఎదుట మోకరిల్లకుండా వారి పెత్తనాన్ని ఏమాత్రం సహించకుండా చాలా మంది స్వదేశీపాలకులు తిరుగుబాటు పర్యవసానాన్ని పెద్దగా పరిగణించకుండా చావోరేవో తేల్చుకునేందుకు సిద్ధపడ్డారు.

ఉత్తర ప్రదేశ్‌లోని అవధ్ రాజ్యానికి నవాబైన వాజిద్ అలీషా సతీమణి బేగం హజరత్ మహల్ ఆంగ్లేయుల మీద తిరుగుబాటు పతాకాన్ని విజవంతంగా ఎగురవేశారు. రాజ్య విస్తరణకాంక్షాపరులైన ఆంగ్లేయాధికారులు కుయుక్తులతో బేగం హజరత్ మహల్ భర్త నవాబ్ వాజిద్ అలీషాను ఓ పథకం ప్రకారంగా ప్రజలలో అప్రతిష్ట పాల్జేసి, ఆయనను అరెస్టు చేసి, అవధ్‌ను పూర్తిగా స్వాధీనం చేసుకున్నారు. మాతృభూమి

పరుల పాలవడంతో ఆగ్రహించిన బేగం అవధ్ ప్రజలు, స్వదేశీయోధుల అండదండలతో బ్రిటీష్ సైన్యంపై విరుచుకుపడి తిరిగి తన రాజ్యాన్ని సొంతం చేసుకున్నారు.

ఉత్తర భారతంలో అత్యంత సంపన్నమూ, కీలకమూ అయిన అవధ్‌లో తమ ఆధిపత్యానికి గండిపడడం సహించలేని కంపెనీ అధికారులు అవధ్ రాజధాని లక్నోను అపార సైనిక బలగాలతో చుట్టుముట్టి ప్రతీకారచర్యకు పూనుకున్నారు. ఆ క్లిష్ట పరిస్థితులలో ఏమాత్రం అధైర్యపడకుండా తన పదమూడు సంవత్సరాల బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించి అతని సంరక్షకురాలిగా ఆమె అవధ్ రాజ్య పాలనా బాధ్యతలు చేపట్టారు. స్వదేశీ పాలకులను, ప్రముఖులను, ప్రజలను మతాలతో ప్రమేయం లేకుండా ఐక్యపర్చారు. పరిపాలనలో హిందూ-ముస్లింలకు ప్రతిభను బట్టి సమాన స్థాయీ పదవులూ కల్పించారు; అధికారాలు ఇచ్చారు.

బ్రిటీష్ సైనికదళాల పడగ నీడలో కూడా ఎంతో సాహసంతో పలు మాసాల పాటు శత్రువు ఎత్తులను చిత్తుచేస్తూ, సమర్థవంతమైన పాలన సాగించారు. ఈ పరిస్థితులను గుర్తించిన ఆంగ్లేయుడు విలియం రస్సెల్ '...**బేగం మాతో అప్రకటిత యుద్ధం ప్రారంభించింది... ఈ రాణులు, బేగంల శ్లాఘనీయ, శక్తివంత చరిత్రలను గమనించాక, అంత:పురంలో పర్దాల చాటున ఉంటూ కూడ ఎంతటి శక్తి యుక్తులు సంతరించుకోగలరో తెలుసుకున్నాం**...' అని వ్యాఖ్యానించాడు. (Bharath Ki Swathantra Sangram Mien Muslim Mahilavonka Yogadan, Dr. Abeda Samivuddin, IOS, New Delhi, 1997 P. 42)

చరిత్రకారుడు H. Beveridge 1857 నాటి '..**తిరుగుబాటుకు బేగం ఆత్మలాంటిది** '. అని ప్రస్తుతించాడు. ( **A Comprehensive History of India**, H. Beveridge, 1887 Ed. Vol. III, P. 842. Quoted in Mr. Srivasthava **Freedom Fighters of Indian Mutiny 1857**, P.105) '...**ఆమె పర్దానషీన్ మహిళ కానట్టయితే మిగతా పురుషుల కంటే గొప్ప పోరాట యోధురాలుగా ఖ్యాతి గడించేది**...', అని ప్రముఖ చరిత్రకారుడు Abdul Haim Sharar వ్యాఖ్యానించాడు. (Quted in **Freedom Fighters of Indian Mutiny 1857**, Srivasthava, P.105).

ఈ సందర్భంగా విక్టోరియా రాణి ఓ ప్రకటన చేసింది. ఆ ప్రకటనలో స్వదేశీ పాలకులనూ, సిపాయిలను ప్రజలనూ మంచి చేసుకునేందుకు పలు తాయిలాలు ప్రకటించింది. క్షమాబిక్ష ప్రసాదిస్తానని హామీలు కుమ్మరించింది. ఆ ప్రకటనకు ప్రతిగా

స్వదేశీపాలకులనూ, ప్రజలనూ హెచ్చరిస్తూ, ఆంగ్లేయుల కుట్రలను తేటతెల్లం చేస్తూ, తన కుమారుడు బిర్జిస్ ఖదీర్ పేరిట బేగం హజరత్ మహల్ చారిత్రాత్మక ప్రకటనను విడుదల చేశారు. ఆ ప్రకటనలో '**... హిందూ-ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, సంపద అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంట కలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు...హిందూ-ముస్లింలను హెచ్చరిస్తున్నాం. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీ పాలన కోసం శత్రువులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీకండి...మాతృ దేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములవ్వండి. శత్రువుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి...**' అని పిలుపునిచ్చారు.

హజరత్ మహల్ మీద కత్తి గట్టిన ఈస్ట్ ఇండియా పాలకులు లక్నోను అపార సైనిక బలగాలతో ముట్టడించినా, ఏ మాత్రం అధైర్యపడక ఆమె స్వయంగా రణరంగ ప్రవేశం చేసి, తన సైనిక దళాలను ముందుకు నడిపి వీరోచితంగా పోరాడారు. భారీ సంఖ్యతో చుట్టుముట్టిన బ్రిటీష్ సైనికమూకలను ఎదుర్కొనడం కష్టతరమైన తరుణంలో, తిరిగి దాడి చేసేందుకు, తాత్కాలికంగా యుద్ధరంగం నుండి వైదొలిగి నేపాల్ పర్వతాల్లోకి నిష్క్రమించారు. ఆ అడవుల్లో కాన్పూరు ప్రభువు నానాసాహెబ్, మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా లాంటి యోధులను కలిసి ఆంగ్లేయుల మీద పోరు సాగించేందుకు బలగాలను మళ్ళీ సమీకరిస్తూ, నేపాల్ అడవుల్లో సాహసి బేగం హజరత్ మహల్ సామాన్య మహిళగా 1874లో కన్నుమూశారు.

## విముక్తి బాటలో మొగల్ రాకుమారులు

స్వదేశీపాలకుల రాణులు మాత్రమే కాకుండా రాకుమారులు కూడా ప్రజలతో కలసి పరాయిపాలకుల మీద యుద్ధం ప్రకటించారు. ఢిల్లీలో బహద్దూర్ షా జఫర్ చక్రవర్తిగా బాధ్యతలు చేపట్టగానే మొగల్ రాకుమారులు మిర్జా మొగల్, మిర్జా ఖైజర్ సుల్తాన్ తిరుగుబాటు యోధుల దళాలకు నాయకత్వం వహించారు. ఈ సందర్భంగా కంపెనీ బలగాల మీద పోరుకు స్వయంగా నడుంకట్టారు. ఢిల్లీ పతనం తరువాత

చక్రవర్తి తోపాటుగా మిర్జా మొగల్, మిర్జా ఖైజర్ సుల్తాన్‌లతోబాటు చక్రవర్తి మనుమడు మిర్జా అబూబకర్ కూడా హుమాయూన్ సమాధి వద్ద ఉండగా ఆంగ్లేయాధికారి కెప్టన్ హడ్సన్ వారిని నిర్బంధించడానికి బలగాలతో సహా వచ్చాడు.

ఆ సమయంలో రాకుమారుల వద్ద సాయుధులైన మూడువేల మంది అనుచరులు ఉన్నారు. ఆంగ్ల సైనికులకు లొంగిపోవటం కంటె పోరాడి చావటం మేలని నిర్ణయించుకున్న రాకుమారులు తమ అనుచరులతోపాటుగా పోరుకు సిద్ధమయ్యారు. అప్పుడు హడ్సన్ వద్ద వందమంది సైనికులు మాత్రమే ఉన్నారు. ఈ విషయం తెలుసుకున్న బ్రిటీషర్ల తొత్తు, చక్రవర్తి వద్ద నమ్మినబంటుగా నిలచిన రాజవైద్యుడు హకీం హసనుల్లా



ఎర్రకోటను ఆంగ్లేయుల పరం కానివ్వకుండా వీరోచితంగా పోరాడుతున్న స్వదేశీ యోధులు

ఖాన్ రంగప్రవేశం చేసి, ఈపోరాటం జరిగితే ఆంగ్లేయులకు నష్టం వాటిల్లగలదని భావించి, పోరాడకుండా లొంగిపోవాల్సిందిగా రాజకుమారులకు సలహా ఇచ్చాడు. బేషరతుగా లొంగిపోయినట్టయితే వారి ప్రాణాలకు ముప్పురాకుండా ఆంగ్లేయాధికారులను ఒప్పించగలనని రాకుమారులను నమ్మించాడు.

ఆంగ్లేయుల తొత్తు హకీం హసనుల్లా ఖాన్ మాటలను విశ్వసించిన రాకుమారులు హుమాయూన్ సమాధి నుండి బయటకురాగా కెప్టన్ హడ్సన్ వారిని నిర్బంధించాడు. యద్ల బండిలో రాకుమారులను ఢిల్లీకి తీసుకెళ్ళటం ఆరంభించాడు.

రాకుమారుల అనుచరులు కూడా వెంట రావటం గమనించి వారిని వెనక్కు వెళ్ళ వలసిందిగా ఆజ్ఞాపించాడు. అనుచరుల ఆయుధాలను తీసుకుని యద్లబండిలో వేయించాడు. రాకుమారుల భద్రతకు ముప్పు లేదనుకున్న అనుచరులు వెనక్కు తగ్గగానే బండ్లను వేగంగా ఢిల్లీ వైపుకు పరుగులు తీయించాడు. ఆ విధంగా కొంత దూరం వెళ్ళాక రాకుమారులు ఉన్న బండిని ఆపించి ఆంగ్ల సైనికులు చుట్టుముట్టారు. కెప్టన్ హడ్సన్ ముందుకు వచ్చి రాకుమారుల బట్టలను ఊడదీయించి, వారిని నిరాయుధులను చేసి, కాల్చి చంపాడు. ఆ తరువాత రాకుమారుల మృతదేహాలను ఎడ్ల బండిలో వేసుకుని ఢిల్లీ నగరం ప్రధాన వీధుల గుండా తీసుకెడుతూ ప్రజలలో భయోత్పాతాన్ని కలిగించాడు. చివరకు చాంద్‌నీచౌక్ వద్దగల రాళ్ళగుట్టల మీద రాకుమారుల భౌతికకాయాలను గిరవాటు వేయించాడు. ఈ విధంగా పోరుబాటన సాగిన మొగల్ రాకుమారులను ఆంగ్లేయులు నిర్దాక్షిణంగా అంతం చేశారు.

## ఆంగ్లేయులను సవాల్ చేసిన రాకుమారుడు

ఆంగ్ల సైన్యాల మీద తిరగబడి తొడగొట్టి సవాల్ చేసి నిలిచిన యోధులైన రాకుమారులలో మరొకరు ఫిరోజ్ షా. మొగల్ పాదుషా షా ఆలం మనుమడితడు. 1857లో మక్కా నుండి తిరిగి వచ్చిన ఆయన ఇక్కడ రగులుతున్న తిరుగుబాటు జ్వాలలను చూశారు. అందిన ఆయుధాన్ని చేతబూని ఆంగ్లేయుల మీద యుద్ధం ప్రకటించి 1857 ఆగస్టు 26న గ్వాలియర్ సంస్థానం మాండ్‌సోర్‌ను స్వాధీనం చేసుకున్నారు. ఆ ప్రాంతాన్ని కేంద్రంగా చేసుకుని 18 వేల మందితో స్వంత సైన్యం తయారుచేసుకుని ఆంగ్లేయుల మీద పోరాటాన్ని ఆరంభించారు.

కాన్పూరు నాయకుడు నానాసాహెబ్, అవధ్ మహారాణి బేగం హజరత్ మహల్, మౌల్వీ అహమ్మదుల్లా షా ఫైజాబాది లాంటి యోధులతో కలసి ఆంగ్ల సైన్యాల మీద ఉమ్మడి పోరు సాగించారు. స్వదేశీయులు ఆంగ్ల సైన్యాల మీద ఎక్కడ తిరగబడితే అక్కడ ఆయన ప్రత్యక్షమయ్యారు. చివరకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సఫలం కాకపోవటంతో మిగతా తిరుగుబాటు యోధులతో కలసి ఆయన అంతర్థానమయ్యారు. ఆయనను పట్టిచ్చిన వారికి ఈస్ట్ ఇండియా కంపెనీ బహుమతి కూడా ప్రకటించింది. ఆంగ్లేయుల ఆధిపత్యానికి గండికొట్టేందుకు శతవిధాల ప్రయత్నాలు సాగిస్తూ, ప్రతికూల

పరిస్థితులలో కూడా సంపద, సైన్యాల సమీకరణకు కృషిచేస్తూ 1877లో అతి దుర్భరమైన పరిస్థితులలో మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా కన్నుమూశారు.

ఆ తరువాత స్వదేశీ పాలకులలో మాతృభూమి పట్ల ప్రేమాభిమానాలను ప్రోదిచేసే లేఖలు రాసిన అజీముల్లా ఖాన్ గురించి చెప్పుకోవాలి. కాన్పూరు యోధుడు నానాసాహెబ్ పక్షాన పోరాటాల వ్యూహరచన చేసి శత్రువుతో అవిశ్రాంతంగా పోరాడిన ఆయన నానాసాహెబ్‌కు కుడిభుజంగా ఖ్యాతిగాంచారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నానా సాహెబ్ సాగించిన పోరాటాలకు మాత్రమే కాకుండా ఇతర స్వదేశీ పాలకులు సాగించిన పోరాటాలకు కూడా ఆయన ప్రేరణ అయ్యారు. యుద్ధవ్యూహ నిపుణుడు మాత్రమే కాకుండా అక్షర యోధుడిగా కూడా ఖ్యాతిగాంచిన అజీముల్లా స్వదేశీ పాలకులకు పలు లేఖలు రాస్తూ అందులో ఆంగ్లేయుల మీద పోరాటం సాగించాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పారు.

అజీముల్లా ఖాన్ స్వయంగా **పయామే ఆజాది** అను పత్రికను నడిపి ఆనాటి స్వాతంత్ర్య సమరయోధులకు ఉత్తేజపూరితమైన మార్గదర్శనం చేశారు. ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు **పయామే ఆజాది** పత్రికను హిందీ, ఉర్దూ భాషల్లో ప్రచురించారు. మరాఠి భాషలో కూడా ఆ పత్రికను నడిపేందుకు ప్రయత్నాలు జరిగాయి. ఆ పత్రికలో **'..భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం..'** అంటూ మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రజలకు ఇచ్చిన పిలుపును ప్రచురించారు.

మాతృదేశాన్ని అద్భుతమైన రీతిలో కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి విముక్తి కోసం పోరుబాట నడవమంటూ అలహాబాద్ తిరుగుబాటు నేత మౌల్వీ లియాఖత్ అలీ రాసిన **పైగాం-యే-అమల్** అను ప్రబోధ గీతం **పయామే ఆజాది** పత్రికలో ప్రచురితమైంది. ఈ గీతం ఆనాడు అలహాబాద్ ప్రాంతంలోని ప్రతి ఒక్కరి నాలుక మీద ఉత్సాహపూరితంగా నర్తించింది.

## భయమెరగని ఆడపడుచులు

ఆంగ్లేయుల ఆధిపత్యానికి గండికొట్టి మాతృభూమిని పరాయిపాలకుల నుండి విముక్తం చేయాలన్న దృఢ సంకల్పంతో అనాడు పలువురు మహిళలు పోరుబాటన

సాగారు. బహదూర్ షా జఫర్ భార్య జీనత్ మహల్ భర్త వెంటసాగారు. భర్తను ఆంగ్లేయులు అరెస్టు చేసి కలకత్తా తరలించిన మాతృభూమిని అంటిపెట్టుకుని అవధ్ మహారాణి బేగం హజరత్ మహల్ ఆంగ్లేయుల మీద యుద్ధం ప్రకటించారు.

ఆమె మార్గంలో విలాసవంతమైన జీవితాన్ని వదలి, కాన్పూరు పాలకుడు నానాసాహెబ్ పక్షాన పాతికేళ్ళ ఆడపడుచు బేగం అజీజున్ పోరుబాట పట్టారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ప్రాణాలు పణంగా పెట్టి పోరాడిన మహిళలలో అజీజున్ ప్రత్యేక స్థానం పొందారు. ఆమె తన సహచరుడు షంషుద్దీన్ సహకారంతో ఆయుధాలు ఉపయోగించటం, గుర్రపు స్వారి చేయటం నేర్చుకొని సైనిక దుస్తులు ధరించి రణరంగానికి సిద్ధమయ్యారు. మాతృదేశం పట్ల భక్తిభావనలు గల యువతులను సమీకరించి, ప్రత్యేక మహిళా సైనిక దళం ఏర్పాటు చేశారు. మహిళా సైనిక దళం ఏర్పాటు చేయటమే కాకుండా, వారికి స్వయంగా చక్కని శిక్షణ ఇచ్చి, ఎలాంటి ఉపద్రవాన్నైనా ఎదుర్కోన గలిగేట్టుగా తీర్చిదిద్దారు. తుపాకి పేల్చటం, కత్తి తిప్పటం, గుర్రపుస్వారి చేయటంలో ప్రత్యేక శిక్షణ కల్పించి సుశిక్షితులైన సైనికులుగా తయారు చేశారు. ప్రజల రక్షణతోపాటు, రాజ్యరక్షణ కోసం తమ ప్రాణాలను పణంగా పెడతామని శపథాలు చేయించి, శత్రువును దునుమాడేందుకు, ఏ క్షణాన్నైనా రణరంగ ప్రవేశం చేయడానికి మహిళా బలగాలను సర్వసన్నద్ధంగా ఉంచారు.

ప్రముఖ రచయిత ఆనంద స్వరూప్ మిశ్రా గ్రంథం **Nana Saheb Peshwa and the War of Independence** లో మహిళా సైనిక దళాన్ని స్థాపించిన ప్రప్రథమ మహిళగా అజీజున్‌ను అభివర్ణిస్తూ ఆమె కృషి గురించి చాలా వివరంగా పేర్కొన్నారు. తిరుగుబాటు యోధులకు ఆహారం, ఆయుధాలను సమకూర్చి పెట్టడం, నాయకులు, సైనికుల మధ్యన సంధానకర్తల్లా వ్యవహరించటం, బ్రిటీష్ సైనికుల కదలికలు గమనించి ఆ సమాచారాన్ని తిరుగుబాటు దళాల నాయకులకు చేరవేయటం తదితర బాధ్యతలను ఆమె తన దళాల ద్వారా సమర్థవంతంగా నిర్వహించి నానాసాహెబ్‌కు సహకరించారు. యుద్ధభూమిలో గాయపడిన స్వదేశీ సైనికుల చికిత్సకు సంబంధించిన కార్యకలాపాలను నిర్వహించటం పట్ల ఆమె శ్రద్ధను చూపారు. ప్రాణాలకు తెగించి పోరాడుతున్న వీరులు గాయపడి అనాథలుగా ప్రాణాలు విడవటం పట్ల కలతచెందిన ఆమె క్షతగాత్రులకు ప్రత్యేక శ్రద్ధతో సేవలందించారు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగుతున్న ఆ పోరాటంలో అన్ని విధాల తనదైన ప్రతిభను చూపెట్టిన ఆమె పోరాడుతూ శత్రువుచేత చిక్కారు. విచారణ కోసం ఆమెను సైనికాధికారి General Havelock ఎదుట హాజరు పర్చారు. ఆమె ధైర్య సాహసాలను విన్న General Havelock ఆమె రూపురేఖలను చూసి అవాక్కయ్యాడు. ఆ సుకుమారి రణరంగంలో అరివీర భయంకరంగా వ్యవహరించడాన్ని ఆ ఆంగ్లేయుడు నమ్మలేక పోయాడు. అపరాధాన్ని అంగీకరించి క్షమాపణ వేడుకుంటే ఆరోణలన్నీ రద్దుచేస్తాననీ, క్షమించి విడిచిపెట్టగలననీ ఆమెకు హామీ ఇచ్చాడు. ఆ ప్రతిపాదనలను బేగం అజీజున్ నిర్ద్వందంగా నిరాకరించారు. ప్రాణ భయం ఏమాత్రం లేని ఆమె ప్రవర్తన చూసి



1857 సెప్టెంబరు 14న భీషణ పోరాటం జరిగిన కాశ్మీర్ గేటు. భారీ సైన్యంతో మోహరించిన ఆంగ్లేయులు భారీ ఫిరంగులతో కాశ్మీర్ గేటును పేల్చివేసి కంపెనీ సైనికులు ఎర్రకోటలోనికి ప్రవేశించారు.

విస్తుపోయిన ఆ అధికారి చివరకు, **నీకేం కావాలి?** అని ప్రశ్నించాడు. నాకు **బ్రిటీష్ పాలన అంతం చూడాలనుంది** (I want to see the end of British rule ) అని ఆమె నిర్భయంగా సమాధానమిచ్చారు. ఆ సమాధానంతో మండిపడిన General Havelock ఆమెను కాల్చి వేయాల్సిందిగా సైనికులకు ఆదేశాలిచ్చాడు; ఆ ఆదేశాలు తక్షణమే అమలయ్యాయి.

కాన్పూరు సాహసి బేగం అజీజున్ మార్గాన సాగిన మరొకరు 60 సంవత్సరాల

అనామిక. ఆమె పేరేమిటో తెలియరావట్లేదు. ఆమె ఎల్లవేళలా ధరించే ఆకు పచ్చరంగు దుస్తుల వలన ఆమె **పచ్చరంగు దుస్తుల మహిళ**గా ఖ్యాతిగాంచారు. గుర్రం మీద స్వారి చేస్తూ, కత్తితో శత్రువు మీద విరుచుకుపడుతూ ఆంగ్లేయ సైనికుల మీద గెరిల్లా పోరాటం సాగించిన ఆమె బ్రిటీష్ సైనికదళాలలో భయోత్పాతం సృష్టించారు. శత్రువును సంహరిస్తూ తీవ్రంగా గాయపడిన తరువాత గాని పట్టుబడని ఆమెను అంబాలాలో గల బ్రిటీషు సైనిక స్థావరానికి పంపారు. ఈ సందర్భంగా **'ఈ వృద్ధురాలు బహు ప్రమాదకారి...తస్మాత్ జాగ్రత్త'** అంటూ 1857జూలై 29న అక్కడి డిప్యూటీ కమీషనర్‌ను హెచ్చరిస్తూ ఆమెను నిర్బంధించిన అధికారి ప్రత్యేకంగా లేఖ రాసి ముందు జాగ్రత్తలతో హెచ్చరికలు చేసాడంటే ఆ పచ్చదుస్తుల మహిళ ఎంతటి ఘటికురాలో ఊహించవచ్చు.

శత్రువును సాయుధంగా ఎదుర్కొన్న వారు, సాయుధ తిరుగుబాటు దళాలను ప్రోత్సహించిన వారు, ఆశ్రయం కల్పించి ఆదుకున్న మహిళలు ఎందరో ఉన్నారు. ఉరిని కూడా లెక్కచేయని సాహసి హబీబా బేగం, ఝాన్సీ రాణి వెన్నంటి నిలచి పోరాడుతూ ఆమెతోపాటుగా ప్రాణాలర్పించిన ముందర్, బ్రిటీషు సైనిక మూకలను సాయుధంగా ఎదుర్కొన్న ధైర్యశాలి బేగం రహిమా, తిరుగుబాటు యోధుల క్షేమం కోరుతూ సజీవదహనమైన అస్గరీ బేగం, సాయుధంగా ఆంగ్ల సైన్యాలను నిలువరించిన బేగం జమీలా, కత్తిపట్టి కదనరంగాన శతృవును సవాల్ చేసిన సాహసి బేగం ఉమ్దాలు వీరిలో కొందరు మాత్రమే !

ఆంగ్లేయులు ఈ మహిళల పట్ల చాలా క్రూరంగా వ్యవహరించారు. ఆశ్చర్యపర్చే విధంగా ధైర్యసాహసాలు ప్రదర్శించిన 11 మంది మహిళలను ఒక్కసారే ఉరికంబానికి ఎక్కించి బలి తీసుకున్న దారుణాలు ఎన్నో ఉన్నాయి. (**Who is Who Indian Martyrs**, Dr. P.N. Chopra, Govt. of India Publications, New Delhi.1973).

చరిత్ర నమోదు ప్రకారం ఆనాడు ఇతర సాంఘిక జనసముదాయాలకు చెందిన మహిళలతోపాటుగా వేలాది ముస్లిం మహిళలు కాల్చి వేయబడ్డారు, ఉరితీయబడ్డారు. సజీవ దహనాలకు, అవమానాలకూ, అత్యాచారాలకూ బలయ్యారు. ఈ సమాచారాన్ని బ్రిటీష్ అధికారుల డైరీలు, లేఖలు పచ్చిగా బహిర్గతం చేస్తున్నాయంటే, ఆ మహిళామణుల త్యాగాలు ఎంతటి మహత్తరమైనవో మనం అర్థం చేసుకోవచ్చు.

# ప్రజల మధ్య పటిష్ట సంబంధాలు

ఈ పోరాటం సందర్భంగా రాజరిక వ్యవస్థలో ప్రజాస్వామ్య ధోరణులు వ్యక్తం కావటంతో పాటుగా దేశంలోని ప్రధాన మతాలకు చెందిన ప్రజల మధ్య పటిష్టమైన స్నేహ సంబంధాలు ప్రదర్శితమయ్యాయి. ఢిల్లీలో హిందూ-ముస్లింలు తమ తమ మతాచారాలను కూడా దూరంగా ఉంచి, సోదర మతస్థుల మనోభావాలకు ఏమాత్రం విఘాతం కల్గించ కుండా మసలుకున్నారు.

ఈ విషయమై బహదూర్ షా జఫర్, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సేనాని ముహమ్మద్ భక్తఖాన్ తగు జాగ్రత్తలు తీసుకున్నారు. చివరకు ముస్లింల పండుగ రోజైన బక్రీద్ (ఈద్-ఉల్-జుహా) సందర్భంగా గోవధను సహించేది లేదని ప్రకటించారు. ఈ అవకాశాన్ని ఉపయోగించుకొని హిందూ-ముస్లిం మధ్య తగాదాలు పెట్టి చీలికలు తీసుకురావాలని ఆంగ్లేయాధికారులు చేసిన ప్రయత్నాలను వమ్ము చేస్తూ చక్రవర్తి బహదూర్ షా జాగ్రత్తలు తీసుకున్నారు. ఢిల్లీ నగరంలో గోవధకు పాల్పడిన వారికి ఉరిశిక్షలు తప్పవని హెచ్చరికలు చేశారు.

ఆంగ్లేయులకు అనుకూలంగా వ్యవహరిస్తున్న రాజవైద్యుడు అహసానుల్లా ఖాన్ (Ahsanullah Khan) గోవధను నిషేధించటం మతపరంగా తగదంటూ చక్రవర్తికి సలహాలిచ్చినా, హిందూ-ముస్లింల ఐక్యతావశ్యకత దృష్ట్యా రాజవైద్యుని సలహాలను కూడా చక్రవర్తి తోసిపుచ్చారు. ఈ హెచ్చరికలు ఎలా ఉన్నా ప్రజలు మాత్రం ఒకరి మతమనోభావాలను మరొకరు గౌరవిస్తూ ముందుకు సాగారు. ఆ కారణంగా బక్రీదు పండుగను అవకాశంగా చేసుకుని గోవుల ఖుర్బానీని ప్రోత్సహించి తద్వారా హిందువులను రెచ్చగొట్టి హిందూ-ముస్లిం ప్రజల మధ్య చీలిక తీసుకురావాలని ప్రయత్నించిన ఆంగ్లేయాధికారుల కుయుక్తులు సాగలేదు.

ఒక ఢిల్లీలోనే కాదు ఇతర ప్రాంతాలలోని స్వదేశీ పాలకులు కూడా హిందూ-ముస్లింల మధ్య ఐక్యతను పరిరక్షించుకుంటూ విభిన్న మతస్థుల మధ్యనున్న స్నేహ సంబంధాలను ఆంగ్లేయుల కుట్రల నుండి కాపాడేందుకు తగిన చర్యలు తీసుకున్నారు. చక్రవర్తి మర్యాదకు ఏమాత్రం భంగం కలిగించకుండా ఎప్పటినుండో అనుసరిస్తున్న విధివిధానాలను అనుసరిస్తూ మతసామరస్యాన్ని కాపాడారు. ఆ చర్యలకు అనుగుణంగా ప్రజలు కూడా మసలుకున్నారు.

ఈ ఐక్యతను ఉత్తర హిందూ స్థానంలోని రోహిల్‌ఖండ్ ప్రజలు చాలా స్పష్టంగా

చూపారు. ఆంగ్లేయులను తరిమివేసి స్వదేశీ పాలనను చేపట్టిన రోహిల్‌ఖండ్ అధినేత ఖాన్ బహదూర్ ఖాన్ తిరుగుబాటు చేయడమే కాకుండా వివిధ మతాలకు చెందిన స్థానిక పెద్దలను సమీకరించి సమాఖ్య తరహా ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి పదకొండు మాసాలపాటు నడిపారు. ఆయన ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాటన నడవాల్సిందిగా ప్రజలకు ప్రజాస్వామ్య పదజాలంలో పిలుపునిస్తూ **భారత దేశ ప్రజల్లారా !** (O People of India) అని సంబోధించి చరిత్ర సృష్టించారు.

ఈ ప్రాంతంలో ప్రజల మధ్య వ్యక్తమౌతున్న ఐక్యతను నజరానాలతో భగ్నం చేయాలని ఆంగ్లేయులు డబ్బుల సంచులు కుమ్మరించినా, మా మతాలు వేరైనా మా మాతృభూమి ఒక్కటే, మా మార్గం ఒక్కటే, మా లక్ష్యం ఒక్కటేనని భావించిన రొహిల్లా ప్రజలు డబ్బు సంచులను తిరస్కరించి, మతం పేరిట మనుషుల్ని చీల్చి పబ్బం గడుపు కోవాలనుకున్న బ్రిటీష్ పాలకుల ఎత్తులను త్రిప్పికొట్టారు. ప్రజలలో విభేదాలు సృష్టిం చేందుకు దిగుమతి చేసిన డబ్బుసంచులను గత్యంతరం లేక తమ ఖజానాకు ఆంగ్లేయాధి కారులు తిప్పి పంపారు. ఈ విషయాన్ని T. R Metcalf తన **The Aftermath of Revolt** గ్రంథంలో ' Sir James Outram (1803-63) failed to raise Hindus in Rohilkhand against the regime of Khan Bahadur Khan, and had to return money granted for the purpose unspent to the treasury' అని పేర్కొన్నాడు.

ఈ రకంగా దేశంలోని పలు ప్రాంతాలలో ఆత్మగౌరవం గల స్వదేశీ పాలకులు, ప్రజల, సిపాయీల నుండి పోరాటయోధులు ఉద్భవించి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని రక్తతర్పణతో సుసంపన్నం చేశారు.

## ఆయుధాలు చేపట్టిన ప్రముఖులు

ఆంగ్లేయుల పాలన నుండి విముక్తి కోరుతున్న ప్రజల, స్వదేశీ సైనిక యోధుల తొడ్పాటుతో పలు ప్రాంతాలు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ప్రకటించుకున్నాయి. ఈ విధంగా ప్రజల అండదండలతో అలహాబాద్ ప్రాంతాన్ని కంపెనీ పాలకుల చెఱ నుండి ధార్మికవేత్త, ఉపాధ్యాయుడు కూడా అయిన మౌల్వీ లియాఖత్ అలీ విముక్తం చేశారు. మౌల్వీ గొప్ప వ్యూహకర్త మాత్రమే కాకుండా మంచికవి కూడా.

ప్రజలను విముక్తి పోరాటం దిశగా నడిపించేందుకు, తిరుగుబాటు యోధులలో స్ఫూర్తిని కలుగ చేసేందుకు 'పైగామ్-యే-అమల్' (ఆచరణ సందేశం) అను కవితను రాశారు. ఈ కవితలో భారత దేశం ఔన్నత్యాన్ని ప్రశంసించటం మాత్రమే కాకుండా హిందూ-ముస్లిం-సిక్కుల మధ్య ఐక్యతను బలంగా ఆకాంక్షించారు. ఈ కవిత ఆనాడు అజీముల్లా ఖాన్ సంపాదకత్వంలో వెలువడిన **'పయామే ఆజాది'** అను పత్రికలో ప్రచురించబడింది.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో భాగంగా మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్‌ను తమ చక్రవర్తిగా స్వీకరిస్తూ ప్రత్యక్షంగా ఆంగ్లేయులతో తలపడి తమ ప్రాంతాలను,



1857 సెప్టెంబరు 21న ఢిల్లీలోని హుమాయూన్ సమాధి వద్ద లొంగి పోయిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నాయకుడు, మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్

సంస్థానాలను విముక్తం చేసిన స్వదేశీ పాలకులు, ప్రజా నాయకులు కొందరైతే మరికొందరు స్వదేశీపాలకులకు అన్ని రకాలుగా అండదండలు అందించారు. ఈ విధంగా అవధ్ మహారాణి బేగం హజరత్ మహల్ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగించిన పోరాటంలో ఆమెకు అన్ని విధాల బాసటగా నిలిచి అవధ్ తిరుగుబాటులో నవాబ్ ముహమ్మద్ జాన్, మమ్మూ ఖాన్ లాంటి యోధులు ప్రముఖ పాత్ర వహించారు.

ఈ తరహాలో మురాదాబాద్‌కు చెందిన నవాబ్ ఫజ్జూ ఖాన్ వలస పాలకులకు వ్యతిరేకంగా ఆయుధం చేపట్టారు. ఆయన తన అనుచరులను, ప్రజలను ప్రేరేపించి

తిరుగుబాటులో క్రియాశీలకంగా పాల్గొన్నారు. ప్రముఖ యుద్ధయోధుడుగా ఖ్యాతిగాంచిన కాలేఖాన్ ఆంగ్లేయ సైన్యాల పాలిట మృత్యుదేవతయ్యారు. బహదూర్ షా జఫర్ ప్రత్యేక సూచన మేరకు ఆంగ్లేయులతో పోరు సల్పేందుకు సైన్యాన్ని తయారు చేయటంలో ఆయన నిమగ్నమయ్యారు. ప్రజలను, స్వదేశీ సైనికులను తిరుగుబాటుకు ప్రేరేపించి స్వదేశీ సైనిక దళాలను ఏర్పాటు చేయటంలో శ్రద్ధ చూపారు. స్వయంగా ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాల మీద పోరుసల్పారు.

## తిరగబడ్డ ప్రభుత్వాధికారులు

ఈస్ట్ ఇండియా కంపెనీ ప్రభుత్వంలో ఉన్నతాధికారులుగా బాధ్యతలు నిర్వహిస్తూ ఉండి 1857లో ప్రజల అభీష్టం మేరకు తిరుగుబాటుకు నాయకత్వం వహించిన యోధులు కూడా పలువురు ఉన్నారు. అటువంటి వారిలో సర్దార్ హిక్మతుల్లా ఖాన్, మున్షీ జకీయుద్దీన్ అహమ్మద్ చెప్పుకోదగ్గవారు. ప్రముఖ ప్రభుత్వ న్యాయవాది అయిన మున్షీ జకీయుద్దీన్ బీహార్ రాష్ట్రానికి చెందిన జాంగాంవ్ **(Jamgaon)** నివాసి. జాగాంవ్ కేంద్రంగా మున్షీ అహమ్మద్ ప్రజల, ప్రధానంగా యువకుల, అండదండలతో తన ప్రాంతంలోని స్వదేశీ సంస్థానాధీశులతో సంప్రదింపులు జరిపి కంపెనీ పాలకుల మీద తిరుగుబాటుకు భారీ సన్నాహాలు చేశారు. ఈ రహస్య సన్నాహాల సమాచారం ఒక ద్రోహి కారణంగా ముందుగానే ఆంగ్లేయాధికారులకు చేరటంతో మున్షీ అహమ్మద్ ప్రయత్నాలు ఫలించలేదు.

మున్షీ జకీయుద్దీన్ అహమ్మద్ ప్రయత్నాలనూ, ఆయన దూరదృష్టినీ ఉటంకిస్తూ తిరుగుబాటు విఫలం కాకున్నట్టయితే తలెత్తే భయంకర పరిణామాలను కూడా ప్రస్తావిస్తూ ఆంగ్లేయుల పత్రికలు, అధికారుల రికార్డులు భయాందోళనలను వ్యక్తంచేశాయంటే మున్షీ అహమ్మద్ ఎంత పటిష్టంగా తన పథకాన్ని రూపొందించారో ఊహించవచ్చు. ఈ విషయాన్ని కలకత్తాకు చెందిన **English Man** అను పత్రిక 1857 జూలై 17 నాటి సంచికలో ఓ ఆంగ్లేయాధికారి మాటలను ఉటంకిస్తూ **ఒకవేళ వృద్ధ వకీల్‌ను కనుక తన పథకం ప్రకారంగా ముందుకు సాగనిచ్చిఉన్నట్టయితే అతను ఈ ప్రాంతంలో భయోత్పాతం సృష్టించి ఉండేవాడనటంలో ఏ మాత్రం సందేహంలేదు** అని పేర్కొనడాన్ని బట్టి మున్షీ ప్రయత్నాల తీవ్రత వెల్లడవుతుంది.

ప్రభుత్వ పదవిలో కొనసాగుతూ రహస్యంగా పోరాటానికి కొందరు సిద్ధపడగా మరి కొందరు పదవులను తృణప్రాయంగా త్యజించి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా

మేధోపోరాటం సాగించారు. ఆ కోవకు చెందిన వారిలో మౌల్వీ ఫజల్ హఖ్ ఖైరతాబాదీని ప్రముఖంగా చెప్పుకోవాలి. ఆయన తాను నిర్వహిస్తున్న తహశీల్దార్ పదవిని వదలుకుని మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్‌కు అండదండగా నిలిచారు. ఆంగ్లేయుల మీద యుద్ధానికి సిద్ధం కమ్మని ప్రజలకు పిలుపునిచ్చిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నాటి చారిత్రాత్మక ఫత్వాను తయారు చేయటంలో ఆయన భాగస్వాములయ్యారు. ఆంగ్లేయుల తరిమివేత తరువాత తయారుచేయబడిన **మహాపరిపాలనా మండలి** రాజ్యాంగ రూప కల్పనలో ఆయన పాలుపంచుకున్నారు. ఈ చర్యలకు గాను ఆయన ప్రవాస శిక్షకు గురై అండమాన్‌కు పంపబడిన తొలినాటి స్వాతంత్ర్యసమరయోధులలో ఒకరయ్యారు.

## స్వదేశీ పాలకుల కోసం తిరుగుబాటు మార్గం

బ్రిటీష్ పాలకులను ఏమాత్రం సహించలేకపోతున్న ఆయా ప్రాంతాల ప్రజలు, ప్రముఖులు ఆంగ్లేయుల మీద ఎవరు తిరగబడినా ఆ ప్రాంతంలో తిరగబడిన స్వదేశీ సంస్థానాధీశులకూ స్వదేశీ యోధులకూ, నేతలకూ అండగా నిలచారు.

ఈ విధంగా సర్వసంపదలను, చివరకు తన ప్రాణాలను కూడా పణంగా పెట్టిన యోధులలో ప్రముఖ సైనికనాయకుడు నబీబక్ష్ ఖాన్ ముఖ్యులు. బీహార్ రాష్ట్రానికి చెందిన జగ్దీష్‌పూర్ సంస్థానాధీశుడు బాబు కన్వర్ సింగ్‌కు ఆయన బాసటగా నిలిచారు. ఆ సమయంలో నబీ బక్ష్ ఖాన్ బాటలో షేక్ గులాం యహ్యా, షేక్ ముహమ్మద్ అజీముద్దీన్, తౌరబ్ అలీ, హైదరాలీ ఖాన్, అహ్మదాలీ ఖాన్, మెహది అలీ ఖాన్, హుసైన్ బక్ష్ ఖాన్ తదితర యోధులు కన్వర్ సింగ్ పక్షాన ఆంగ్లేయులను ఎదుర్కొన్నారు. ఆంగ్లేయులతో సాగిన పోరాటంలో చివరి క్షణం వరకు ఓటమిని అంగీకరించక నబీ బక్ష్ ఖాన్ పోరాడుతూ కదనరంగాన కన్నుమూశారు.

ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని అయోధ్య నవాబు రాజ్యంలో భాగమైన గోరఖ్‌పూర్‌కు శ్రీ హన్మంత్ సింగ్ సంస్థానాధీశుడు. ఆయనను ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు అవమానకరమైన రీతిలో పదవీచ్యుతుని చేశారు. ఆ అనుచిత చర్యపట్ల ఆగ్రహించిన సంస్థానానికి చెందిన నాజిమ్ ముహమ్మద్ హసన్ ఖాన్‌కు మీరట్‌లో రగిలిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఉత్సాహాన్నిచ్చింది. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులపై అవధ్ బేగం హజరత్ మహల్ పూరించిన సమర శంఖారావం ఆయనలో మరింత ఆత్మవిశ్వాసం కలిగించింది. దీంతో హసన్‌ఖాన్ గోరఖ్‌పూర్‌లో తిరుగుబాటు పతాకాన్ని ఎగురవేసి గోరఖ్‌పూర్‌ను స్వతంత్ర్య రాజ్యంగా ప్రకటించారు.

ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ, ఈ పోరాటం దేశవాసుల ఉమ్మడి ప్రయోజనాల కోసం మాత్రమే ప్రారంభించామనీ తాను పాలకుడ్ని కావాలని మాత్రం కాదనీ అన్నారు. అయోధ్య గద్దె మీద అటు నవాబు వాజిద్ అలీషానూ, గోరఖ్‌పూర్ సంస్థానంలో ఇటు శ్రీ హన్మంత్ సింగ్ పాలననూ చూడాలన్నది తమ ప్రధానాశయమని హసన్ ఖాన్ ప్రకటించారు. ఆ లక్ష్యం కోసం ఆయన తన ప్రాణాలను సైతం పణంగా పెట్టేందుకు సిద్ధమయ్యారు. చివరకు ఆంగ్ల సైన్యాలు గోరఖ్‌పూర్‌ను చుట్టుముట్టాయి. ఆ పోరాటంలో ఆంగ్ల సైన్యాలది పైచేయి కావడంతో ఆయనను అరెస్టు చేశారు. ఆ తరువాత సైన్యాధికారులు నిర్వహించిన విచారణలో తనకు తన ప్రాణం కంటే స్వేచ్ఛా -స్వాతంత్ర్యాలు ముఖ్యమని ముహమ్మద్ హసన్ ఖాన్ ప్రకటించారు.

ఈ విధంగా వ్యక్తిగత ప్రయోజనాల కోసం కాకుండా ప్రజల ఉమ్మడి ప్రయోజనాల నిమిత్తం, స్వదేశీ పాలకుల కోసం, మతాల ప్రమేయం లేకుండా తమ ప్రభుభక్తిని ప్రకటించుకుంటూ ఆంగ్లేయ సైన్యాలతో తలపడిన ముస్లిం యోధులు, ఉన్నతాధికారులు ఎందరో ఉన్నారు. ఈ యోధులంతా పోరుబాట సాగి, మాతృభూమి పట్ల తమలో ఉన్న అంతులేని గౌరవాభిమానాలను ప్రకటిస్తూ, తమ సర్వసంపదలతో పాటుగా ప్రాణాలను కూడా పణంగా పెట్టి శత్రువుతో పోరాడి షహీదులయ్యారు.

## కలం యోధుల తోడ్పాటు

ప్రథమ స్వాతంత్ర్యోద్యమంలో పర్షియన్, ఉర్దూ పత్రికలు బృహత్తరమైన పాత్రను నిర్వహించాయి. కంపెనీ పాలకుల చర్యలను తూర్పారాబడ్తూ, స్వాతంత్ర్యసమర యోధులను ప్రోత్సహిస్తూ, తిరుగుబాటు సమాచారాన్ని ప్రజలకు తెలుపుతూ స్వదేశాభిమానం గల పత్రికల సంపాదకులు, పాత్రికేయులు ప్రజలను తిరుగుబాటు దిశగా ప్రేరేపించారు. ఆనాడు ఢిల్లీ కేంద్రంగానూ, ఇతర ప్రాంతాల నుండి 'ఢిల్లీ అక్బార్', 'కోహినూర్', 'తారిఖ్-ఎ-భగవత్-ఎ-హింద్ ', 'ముషిర్-ఎ-దక్కన్', 'వకీల్ ' మున్నగు పత్రికలు ప్రజానీకంలో బ్రిటీష్ వ్యతిరేకతను సృష్టించడంలో సాహస వంతమైన, శ్లాఘనీయమైన పాత్రను పోషించాయి.

ప్రథమ స్వాతంత్ర్య సమరానికి తిరుగులేని నైతిక మద్దతునిస్తూ తిరుగుబాటు దార్లలో బ్రిటీష్ పాలకుల పట్ల తీవ్ర ప్రతిఘటన జ్వాలలను రగిలించింది 'ఢిల్లీ అక్బార్' పత్రిక. ఆ పత్రిక సంపాదకులైన మౌల్వీ ముహమ్మద్ బాకర్‌ను ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు అరెస్టు చేసి దారుణంగా చిత్రహింసలకు గురిచేశారు. పరమ కిరాతకుడిగా

ఖ్యాతి గాంచిన ఆంగ్లేయాధికారి హడ్సన్ ఆయనను హత్యగావించాడు. ఈ విధంగా భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రజల పక్షం వహించి పత్రికా స్వేచ్ఛకై పోరాడుతూ, అధికారుల చిత్రహింసలను భరిస్తూ చివరకు ప్రాణాలర్పించిన తొలి సంపాదకునిగా ముహమ్మద్ బాకర్ ఖ్యాతిగాంచారు.

ఆనాటి పత్రికలన్నీ విదేశీ పాలక శక్తుల మీద తమ అక్షర కవాతు చేయటంతో భీతిల్లిన ఆంగ్ల పాలకులు పత్రికలను నిషేధించి, సంపాదకులనూ, ప్రచురణ కర్తలనేకాక పాఠకులను కూడా తీవ్ర నిర్బంధాలకు గురి చేశారు. ఆ కారణంగానే 1853 నాటికి 35గా ఉన్న ఉర్దూ పత్రికల సంఖ్య కాస్తా 1858 నాటికి 12కు పడిపోయిందంటే బ్రిటీష్ పాలకులు ఎంత క్రూర నిర్బంధాన్ని విధించారో తేలిగ్గానే ఊహించవచ్చు.



చక్రవర్తికి ఇచ్చిన వాగ్దానాన్ని తప్పి1857 సెప్టెంబరు 22న ఢిల్లీ లోని ఢిల్లీ గేటు సమీపాన నిరాయుధులైన మొగల్ రాకుమారులను నిర్దాక్షిణ్యంగా కాల్చి చంపుతున్న కెప్టెన్ హడ్సన్.

## ఉధృతంగా సాగిన ఊచకోత

ప్రథమ స్వాతంత్ర్య సమరాన్ని ప్రారంభించినవారూ, అందులో పాల్గొన్నవారూ, దాన్ని ప్రోత్సహించిన వారూ ప్రధానంగా ముస్లింలేనన్న నిర్ణయానికొచ్చిన బ్రిటీష్ పాలకులు 27 వేల మంది ముస్లింలను వివిధ ప్రాంతాలలో ఉరితీశారని చరిత్ర రికార్డులు స్పష్టపరుస్తున్నాయి. ఈ సంఖ్య అధికారిక లెక్కల ప్రకారంగా వెల్లడించింది కాగా ఆనాడు కనబడిన చెట్టునల్లా ఉరికంబంగా మార్చి వేలాది సమరయోధులను ఆ చెట్లకు ఉరితీశారు.

కొమ్మలు కూడా కన్పించనంతగా కళేబరాలు వారాల తరబడి పలు గ్రామాలలోని చెట్లకు వేలాడాయని ఆంగ్లేయ చరిత్రకారులు తమ గ్రంథాలలో నమోదు చేసిన వివరాలను బట్టి తెలుస్తుంది.

ఈస్ట్ ఇండియా కంపెనీ తన ఆంగ్లేయ సైనికులకు పూర్తి స్వేచ్ఛనిచ్చి ముస్లింల ఊతకోచకు పురికొల్పింది. ఈ మేరకు లభించిన హద్దుల్లేని స్వేచ్ఛతో తిరుగుబాటు జరిగిన ప్రతి ప్రాంతాన్నీ కంపెనీ సైనికులు శ్మశానవాటికగా మార్చారు. ఇష్టారాజ్యంగా దోచుకున్నారు. వర్ణించలేనంతగా విధ్వంసం చేశారు. ఈ చర్యలను కంపెనీలోని సైనికాధి కారులు కొందరు స్వయంగా ఖండించారంటే ఆ విశృంఖల ఊచకోత–విధ్వంసం ఏ స్థాయిలో జరిగిందో ఊహించవచ్చు. ఆంగ్లేయ సైనికుల చేతుల్లో హతమైన స్త్రీ– పురుషుల వివరాలు పూర్తిగా లభించడం లేదు. ఆనాడు బ్రిటీషర్ల చేత అనుమానించబడి అరెస్టులకు గురయ్యి ఆ తరువాత అదృశ్యమైపోయిన వారి సంఖ్య మరో 30 వేల వరకు ఉంటుందని అంచనా.

(**Muslims in India,** S.Abul Hasan Ali Nadvi, Islamic Research and Publications, Lucknow, 1980; **Muslims In First War of Independece** Radiance Views Weekly, 31 August.- 6 September, 2003)

# ప్రవాసశిక్షలలో ప్రథములు

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో బ్రిటీష్ వ్యతిరేకతను తీవ్రస్థాయిలో వ్యక్తం చేసిన యోధుల బెడదను ఆంగ్లేయులు శాశ్వతంగా వదిలించుకోదలిచారు. భవిష్యత్తులో ఇటువంటి శక్తుల వల్ల ఎటువంటి ప్రమాదం జరక్కుండా చూడాలనుకున్నారు. అందువల్ల ఏమాత్రం వ్యతిరేకత కన్పించినా అటువంటి తిరుగుబాటు యోధులందరి మీద పలు ఆరోపణలు చేసి విచారణ 'తంతు' జరిపి చివరకు ప్రవాస శిక్షలు విధించారు. ఆ యోధులను తమ ప్రాంతాల నుండి, తమ కుటుంబీకుల నుండి దూరంగా ఉంచేందుకు గాను అండమాన్ దీవులకు పంపివేశారు. ఈ మేరకు పలువురు సంస్థానాధీశులు, వారి సహచరులు, అనుచరులు మాతృభూమి విముక్తి ప్రధాన ధ్యేయంగా గల సామాన్య ప్రజలు కూడా పెద్ద సంఖ్యలో ప్రవాస శిక్షలకు బలయ్యారు.

ఈ విధంగా పంపబడిన వారెవ్వరూ తిరిగి తమ కుటుంబీకులను చూడలేక పోయారు. దశాబ్దాల తరబడి ఆ దీవుల్లో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన చెరశాలల్లో మగ్గుతూ, చిత్ర హింసలు అనుభవిస్తూ కన్నుమూశారు. ఈ విధంగా ప్రవాసశిక్ష కోసం

అండమాన్‌కు పంపబడిన తొలి తరం స్వాతంత్ర్య సమర యోధులలో ముస్లింలు గణనీయమైన సంఖ్యలో ఉండటం భారతీయ ముస్లిం సమాజం గర్వించదగిన అంశం.

## త్యాగాలోకరివి- భోగాలోకరివి

1857 నాటి సంగ్రామంలో ప్రజల మధ్య పటిష్టమైన ఐక్యత వ్యక్తమైనా, అందరూ ప్రాణాలకు తెగించి పోరాడినా భారతీయులు పరాజితులు కావటం వెనుక గల ప్రధాన కారణాలలో ఒకటి ఆనాటి సంస్థానాధీశులలో కొందరు విద్రోహానికి పాల్పడటం. పరాయి పాలకులతో ఒకవైపు పోరాటం సాగుతుంటే పోరాటయోధులకు అండగా నిలవాల్సిన స్వదేశీపాలకులు కొందరు ఆంగ్లేయుల పక్షం వహించి స్వదేశీ పోరాట వీరులకు వ్యతిరేకంగా వ్యవహరించారు. ఈ విధంగా బ్రిటీషర్ల తొత్తులుగా మారిన వారి వల్లే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులకు విజయం దక్కింది. ఆ ద్రోహులే తమ విభీషణ చర్యల ద్వారా స్వదేశీయులకు పరాజయం ఆంగ్లేయులకు విజయాన్నీ తెచ్చిపెట్టారు.

ఈ విషయాన్ని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న ఆంగ్లేయాధికారులు, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు, 'తిరుగుబాటు'ను తమ పత్రికలకు రిపోర్టు చేయడానికి ఇండియాకు ప్రత్యేకంగా వచ్చిన పాత్రికేయులు చాలా స్పష్టంగా ప్రకటించారు. ఆనాటి గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ If Scindia Joins the rebels, I will pick off tomorrow....The Prince acted as the break waters to the strom which otherwise would have swept us in one wave అని వాస్తవం పలికాడు. (**'Untold history of Freedom Struggle'** by M. Burhanuddin Qasmi, **The Milli Gazette**, 16-31 May 2007 P. 4)

ఆనాటి స్వదేశీపాలకులలో ప్రముఖులైన, కాశ్మీర్, హైదరాబాద్, గ్వాలియర్, నభా, కపుర్తలా, ఉదయపూర్, జైపూర్, ఆల్వార్, కోతా, భోపాల్, పటౌడి, శిక్కు పాలకులు, మరాఠాలు, సింధియాలు, నేపాల్ సంస్థానాధీశులు, రాజస్థాని రాకుమారులు పెద్ద సంఖ్యలో బ్రిటీష్ పాలకుల తొత్తులుగా మారారు. ఆ కారణంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సానుకూల ఫలితాలను సాధించలేకపోయింది.

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధులు నానాసాహెబ్ 1858లో తన గురువుకు రాసిన ఒక ఉత్తరంలో ఈ చేదు వాస్తవాన్ని ప్రస్తావిస్తూ **ఈ పరాజయం కేవలం నాది మాత్రమే కాదు. సంపూర్ణ భారతదేశ పరాజయం.గూర్ఖాలు, సిక్కులు, దేశీ రాజసంస్థానాల**

మూలంగా ఈ ఓటమి కలిగింది...దుష్టులైన ఈ సంస్థానాధీశులు తమ స్వార్థం కోసం దేశాన్ని ఇంగ్లీషువారికి అప్పగించారు. లేకుంటే మన ఎదుట ఈ ఫిరంగులు ఏపాటివి? అని వాపోయారు. (జ్ఞాపకం చేసుకోండి ఎప్పుడైనా...అమరవీరుల ఉత్తరాలు, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1998, పేజి.15)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం వార్తలను లండన్‌లోని 'టైమ్స్' పత్రికకు పంపడానికి ఢిల్లీ వచ్చిన పాత్రికేయుడు విలియం రస్సెల్ తన పత్రికకు సమాచారం పంపుతూ **ఆనాడు పాటియాల, హర్యానాలోని జింద్ రాజుల సహకారం లభించకుండా ఉండి ఉన్నట్టయితే, శిక్కులను మన సైన్యంలో చేర్చుకోకుండా ఉన్నట్టయితే, ఢిల్లీ ముట్టడి మనకు చాలా కష్టమయ్యేది. లక్నోలో శిక్కు సైనికులు మంచి సేవలందించారు. శిక్కులు మన సైనిక బలగాలకు మంచి బలాన్నిచ్చారు**, అని 1858 మే 9నాటి పత్రికలో వార్త రాశాడు.

(Our Siege of Delhi would have been quite impossible if the *rajahs* (sic) of Patiala and of Jhind ( now known as Jindin Haryana) had not been our friends, and if the Sikhs had not recruited (in) our battalions, and remained quite in Punjab. The Sikhs at Lucknow did good service... as our armies were attending and strengthened by them in the field - ' Betrayal of the First War of Independence ' Prof. Shamshul Islam, The Milli Gazette, 16-31 May 2007, P.5)

ఈ విధంగా ఆంగ్లేయులకు వత్తాసుగా నిలచి వారి విజయానికి, స్వదేశీ యోధుల పరాజయానికి కారణమైనందున ఆంగ్లేయాధికారులు కృతజ్ఞతగా వ్యవహరించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పోరాడి ఓడిన యోధుల ఆస్తిపాస్తులను, సంస్థానాధీశుల సంస్థానాలను, ఆంగ్లేయులు తమ తొత్తులకు సంక్రమింపచేశారు. భారత దేశంలో తమకు తొత్తులుగా వ్యవహరిస్తూ, తమ పక్షాన నిలచినంత కాలం తామిక్కడ నిశ్చింతంగా స్థిరపడి ఇక్కడి సంపదను దోచుకోవచ్చనీ, ఇక్కడి ప్రజలను యధేచ్ఛగా పాలించవచ్చనీ ఆంగ్ల పాలకులు భావించారు. అందుకు తగిన విధంగా నజరానాలు-బహుమతులు-బిరుదులతో తొత్తులను మరింత మచ్చిక చేసుకున్నారు. ఆ కారణంగా అలనాటి బ్రిటీష్ తొత్తులుగా మెలగిన సంస్థానాధీశులు అన్ని సుఖభోగాలు అనుభవించారు. పలు బిరుదులను పొందారు. పోరుబాటన సాగిన యోధుల ఆస్తిపాస్తులను తమ సొంతం చేసుకోగలిగారు. ఆ తొత్తుల వారసులు కూడా వారసత్వంగా అన్ని భోగభాగ్యాలను అనుభవించారు. ఆ అపార సంపద తెచ్చిపెట్టిన శక్తిసామర్థ్యాలతో ఆ తరువాత రాజకీయ

రంగ ప్రవేశం చేసి అధికారంతోపాటు మరింత సంపద కూడబెట్టుకుని, అన్ని సౌఖ్యాలనూ ఈనాటికీ అనుభవిస్తున్నారు.

ఈ తిరుగుబాటులో ప్రముఖ పాత్రవహించిన ముస్లిం యోధుల మీద, చివరకు ప్రజల మీద కూడా పగతీర్చుకునేందుకు పలు దుర్మార్గపు చర్యలకు ఆంగ్లేయాధికారులు పాల్పడ్డారు. కంపెనీ సైన్యాలను ఎదుర్కొని తమ సర్వస్వం ధారపోసిన వలసపాలకులకు వ్యతిరేకంగా పోరుబాట సాగిన ప్రథమ స్వాతంత్ర్య సమరయోధులు, ఆ యోధుల వారసులు బ్రిటీషర్ల కర్కశ చర్యలకు బలైపోయారు. అనుమానితుడు మతపరంగా ముస్లిం అయి ఉంటేచాలు మరో విచారణ లేకుండా అతడ్ని నేరస్థుడిగా పరిగణిస్తూ వ్యతిరేక



ఆంగ్లేయుల నిర్బంధంలో ఉన్న ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ యోధుల అధినేత, మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్

నిర్ణయాలు తీసుకున్నారు. ఆనాడు తిరుగుబాటు బాటన సాగిన సంస్థానాధీశుల, స్వదేశీ పాలకుల సంస్థానాలను ఆంగ్లేయులు స్వాధీనం చేసుకున్నారు. భవంతులను కూల గొట్టారు. పర్యావసానంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల కుటుంబాలు వీధిన పడ్డాయి. ఆదుకునే వారు లేకపోవటంతో నానా కడగండ్లు పడుతూ కన్నుమూశారు. అక్కడక్కడా బతికి బట్టగట్టినా వారు అష్టకష్టాల పాలయ్యారు. ఆ యోధుల కుటుంబీకుల జీవితాలు చాలా దుర్భరమయ్యాయి.

ఈ క్రమంలో మాతృభూమి విముక్తి కోసం పోరాటాలు చేసి ఉరితీతలకు గురైన, ఫిరంగి పేల్చివేతలలో ప్రాణాలు కొల్పోయిన, కాల్పులకు గురైన, చిత్రహింసలకు

బలైన అలనాటి యోధుల వారసులలో అత్యధికులు అన్నీ కోల్పోయి ఈనాడు జీవిక కోసం రిక్షాలు లాగుతూ, టాక్సీలు నడుపుతున్న దుర్భర పరిస్థితులలో కునారిల్లుతుండగా, అలనాటి బ్రిటీష్ తొత్తుల వారసులు తమకు కలసి వచ్చిన అపార ధనసంపదల ఆసరాతో ఈనాడు రాజకీయ రంగాన్ని ఏలుతూ మంత్రులు, ముఖ్య మంత్రులు, గవర్నర్‌లుగా అందలాలెక్కి ఉన్నత పదవులను వెలగబెడుతుండటం చారిత్రక మహావిషాదం.

## తెలుగు బిడ్డల తిరుగుబాటు

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులపై తిరుగుబాటు చేసిన వారిలో తెలుగు గడ్డకు చెందిన ముద్దుబిడ్డలు ఎందరో ఉండటం తెలుగువారు గర్వించదగిన అంశం. కంపెనీ పాలకులకు వ్యతిరేకంగా పోరుబాట నడవటమే కాకుండా ఆంగ్లేయులతో స్నేహం చేస్తున్న నిజాం నవాబును ఆ దారి మళ్ళించాలని ప్రజలు, ప్రముఖులు ఆది నుండీ విఫల ప్రయత్నాలు చేశారు.

ఈ ప్రయత్నాలలో భాగంగా 1857కు ముందు నుండే ఆంగ్లేయాధికారులకు వ్యతిరేకంగా ధిక్కార స్వరాన్ని విన్పించారు. చాలా చోట్ల తిరగబడి శిక్షలు అనుభవించారు. ఈ రకంగా తిరుగుబాటు తత్వాన్ని ప్రదర్శిస్తూ వచ్చిన యోధులు చివరకు 1857లో బహిరంగంగా తిరుగుబాటు జెండాను ఉన్నతంగా రెపరెపలాడించారు.

ఈ తిరుగుబాటులో భాగంగా 1857లో బ్రిటీష్ రెసిడెన్సీ మీద జరిగిన సాహసోపేత దాడికి పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ నాయకత్వం వహించారు. ఆయన తన అనుచరులతో కలసి ఆంగ్లసైన్యాలతో తలబడ్డారు. చివరకు తప్పించుకుపోయిన ఆయనను పట్టిచ్చినవారికి 5 వేల రూపాయలు నజరానా కూడా ప్రకటించిన ప్రభుత్వం ఆయనను బంధించి ఉరితీసింది. ఆయన భౌతికకాయాన్ని ప్రస్తుతం హైదరాబాదులోని సుల్తాన్ బజారు పోలీస్ స్టేషన్ సెంటర్‌లో బహిరంగంగా వ్రేలాడదీసి ఆయన మీద తమలో రగిలిన కసినీ కంపెనీ పాలకులు పైశాచికత్వాన్నీ చాటుకున్నారు.

ఆ బాటలో నడిచి, తుర్రేబాజ్ ఖాన్‌కు అండదండలు అందించిన మౌల్వీ అల్లావుద్దీన్‌ను అరెస్టు చేసి ద్వీపాంతరవాస శిక్ష విధించి అండమాన్‌కు పంపగా ఆయన అక్కడే కన్నుమూశారు. ఆ క్రమంలో సయ్యద్ అహ్మద్ 1857 జులై 17న పోరుసల్పుతూ ప్రాణాలు విడిచారు. బోయనపల్లిలో బ్రిటీష్ సైనికాధికారి కల్నల్ డేవిడ్‌సన్‌ను చంపే ప్రయత్నంలో జహాంగీర్ ఖాన్ అను మరో యోధుడు కాల్చివేయబడ్డారు. ఈ విధంగా

ఆనాడు నిజాం సంస్థానంలోని పలు ప్రాంతాలలోని సైనికులు, ప్రజలు విజృంభించారు. పలువురు ప్రాణాలు అర్పించారు. రాజ్య బహిష్కరణకు గురయ్యారు. అసంఖ్యాకంగా జైళ్ళపాలయ్యారు.

# కడప గడపలో ధ్వజమెత్తిన షేక్ పీర్‌షా

ఈ పోరాట ప్రకంపనలు హైదరాబాద్‌కు మాత్రమే పరిమితం కాలేదు; చిన్నగా రాయలసీమకు కూడా పాకాయి. ఆ సమయంలో కడపజిల్లా ఎల్లంపేట నివాసి షేక్ పీర్ సాహెబ్ తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. 1857 ఆగష్టు 28న కడప కంటోన్మెంటులోని భారతీయ సైనికాధికారులను, సైనికులను తిరగబడమని ప్రోత్సహించారు. పుట్టుకతో అంధుడైన ఆయన పోరుబాటను ఎంచుకోవడమే కాకుండా మహర్రం పండగ సందర్భంగా తెల్లవారి పాలన తప్పక అంతరిస్తుందని ఎంతో ఆత్మవిశ్వాసంతో ప్రకటించారు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volumes I, Govt. of AP, Hyderabad, 1997, Page.161-163 )

ఈ రకంగా తెలుగు గడ్డ మీద అక్కడక్కడా సాగిన తిరుగుబాట్లకు మహర్రం పండుగ రోజును నిర్ధేశిత సమయంగా నిర్ణయించటం కాకతాళీయమా ? లేక మొత్తం మీద ఓ పథకం ప్రకారంగా తిరుగుబాట్లు సాగాయా ? అనే విషయం ఆసక్తిదాయకం. ఎందుకంటే ఇటు కడపలో తిరుగుబాటు యోధులు భారత దేశంలో మహర్రం పండుగనాడు ఆంగ్లేయుల అధికారం పతనమౌతుందని ప్రకటించగా, గోదావరి జిల్లాలలో కూడా అక్కడి యోధులు ఆంగ్లేయుల అధికారం సరిగ్గా మహర్రం పండుగ నాడే అంతం అవుతుందని ప్రకటించి ప్రజలను, ఉద్యమకారులను ఉత్తేజితులను చేశారు.

ఈ నిర్ణయానికి అనుగుణంగా స్వదేశీ సైనికులను ఆకట్టుకుని తిరుగుబాటుకు షేక్ పీర్ సాహెబ్ ముమ్మరంగా సన్నాహాలు ఆరంభించారు. ఈ పథకం పూర్తిగా అమలు లోకి రాకముందే, ఆయన చర్యలను పసికట్టిన బ్రిటీష్ సైనికాధికారులు పీర్ సాహెబ్‌ను అరెస్టుచేసి, విచారణ జరిపి 10 సంవత్సరాల జైలు శిక్ష విధించగా తిరునల్వేలి ఖైదులో ఆయన జీవితం ముగిసింది. (**దేశభక్తిని పెంపొందించిన షేక్ పీర్ షా** (ఆగస్టు 28, 1857,) డాక్టర్ జి.సాంబశివారెడ్డి, **గీటురాయి** వారపత్రిక, 9-1-2004, పేజి.18)

ఈ ప్రయత్నాలలో భాగంగా మహమ్మదీయ న్యాయశాస్త్ర అధికారిగా బాధ్యతలు

నిర్వహిస్తున్న మౌల్వీ సయ్యద్ అజీజ్ హుస్సేన్ ఇంటింటికి తిరిగి తిరుగుబాటుదారుల కోసం ఆహారపదార్థాలూ, డబ్బూ సేకరించారు. తుపాకులకు పూసే గ్రీసులో పంది, ఆవు కొవ్వు ఉంటుందన్న విషయం ప్రచారం చేసి బ్రిటీషర్లకు వ్యతిరేకంగా హిందూ-ముస్లిం సైనికులను రెచ్చగొట్టారు. ఫలితంగా కంపెనీ సైన్యాధికారులు ఆయనను అరెస్టు చేసి, ఆయన కార్యకలాపాలను రాజద్రోహ చర్యలుగా ప్రకటించి, పది సంవత్సరాల జైలు శిక్ష విధించి ఆయనను కూడా తిరునల్వేలి జైలులో నిర్బంధించారు.

## జ్వలించిన కృష్ణా-గుంటూరు గోదావరి సీమలు

నిజాం గడ్డ మీద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తిరుగుబాటు ప్రకటించినవారు, నిజాంకు, ఆంగ్లేయులకు సాహసోపేతంగా హెచ్చరికలు జారీ చేసిన యోధులు, ఉత్తరాదిలో జరిగిన తిరుగుబాట్లలో పాల్గొన్నవారు తమ తమ ప్రాంతాలకు తిరిగివచ్చి అక్కడి సాహసాలను వర్ణిస్తూ కథలు కథలుగా చెప్పడంతో సాహసులైన స్థానికులు ఆంగ్లేయుల మీద తిరగబడాలన్న బలమైన కోరిక కలిగి అక్కడక్కడా తిరుగబడ్డారు.

1857 జూలై మాసంలో మఛిలీపట్నంలో సిపాయీలు పెరేడ్ జరుపు మైదానం ఎదురుగా ఆకుపచ్చని పతాకాన్ని ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు ఎగుర వేశారు. **ఆంగ్లేయులను నరికి వేయండి** అంటూ హిందూస్థానీలో నినాదాలు రాసిన ప్లకార్డు కూడా ఆ జెండా కర్రకు కట్టి ఉంది. ఈ దృశ్యం ఆంగ్లేయాధికారులలో కలవరానికి కారణమైంది. నిందితులను పట్టుకున్న వారికి 500 రూపాయల బహుమానం కూడా ప్రకటించారు. ఆ సాహసానికి ఒడిగట్టిన వారెవరో తెలుసుకోడానికి అధికారులు ఎంతగా ప్రయత్నించినా ఆ దృశ్యాన్ని రూపొందించిన సాహసుల ఆచూకీని ఏ మాత్రం కనిపెట్టలేక పోయారు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volume I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, P.147)

1857 నంవంబరు 7న కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలోని ప్రభుత్వ కచేరి మీద దాడి జరిగింది. ఆయుధాలు చేపట్టిన నాలుగు వందల మంది రోహిల్లాలు కచేరి ఆవరణలోకి దూసుకొచ్చారు. ఈ ఆకస్మిక దాడికి కంపెనీ అధికారులు హడలిపోయారు. ఆ సమయంలో కంపెనీ సైనికుల ప్రతిఘటన అంతగా లేకపోవటంతో కోశాగారంలోని నగదును, ఆయుధాగారంలోని ఆయుధాలను స్వంతం చేసుకున్నారు. ఈ సాహసకృత్యంలో హిందూ-ముస్లిం యోధులు పాల్గొన్నారు.

1857 ఆగస్టు 21న స్వాతంత్ర్య సమరయోధుడు రహీంబేగ్ అరెస్టు అయ్యారు. మొహర్రం పండుగ సందర్భంగా రహీంబేగ్ తిరుగుబాటుకు సిద్ధమయ్యారు. ఆ రహస్యం బయటపడటంతో బేగ్‌ను ఆయన సహచరులు ఖాజీ మున్‌దార్ అలీ, హుసైన్ బేగ్, షబిబ్ బేగ్, మీరా హుస్సేన్, సిలార్ ఖాన్, మీర్ లుబ్బా ఖాన్, మీర్ వజీర్ అలీ, గాలిబ్ బేగ్, ముస్తాబ్ సాహెబ్, ఖాద్ ముహమ్మద్ అలీ ఖాన్ అలియాస్ దాదా సాహెబ్ తదితరులను అరెస్టు చేశారు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volumes I, P. 156)

ఈ తిరుగుబాటును ప్రస్తావిస్తూ ఆగస్టు 22న రాజమండ్రిలోని అధికారి



వీరోచిత పోరు తరువాత తిరుగుబాటు యోధుల నుండి ఆంగ్లేయుల పరమైన అవధ్ రాజధాని లక్నో నగరం

మద్రాసులోని ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి రాసిన లేఖలో భారీ కుట్రను మొగ్గలోనే తుంచగలిగామని చెప్పుకున్నాడు. ఈ తిరుగుబాటు కేవలం రాజమండ్రి వరకు పరిమితం కాలేదని, మచిలీపట్నం, గుంటూరు జిల్లాలను కూడా కలుపుకుని ప్రజలను రెచ్చగొట్టి ఒకేసారి తెల్లవారి మీద తిరుగబడేందుకు పెద్ద వ్యూహం పన్నారని, ముసల్మాన్లు ఇందులో ప్రధాన పాత్ర వహించారని ఆ అధికారి వివరించాడు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volumes I, PP. 60,156-157)

ఈ వార్తతో గుండెలదిరిన అధికారులు ముప్పు కొద్దిలో తప్పిపోయిందని భావిస్తూ

అప్రమత్తులై ఉండాల్సిందిగా ఇతర ప్రాంతాల అధికారులకు హుటాహుటిన వర్తమానం పంపారు. అనుమానితుల పట్ల కర్కశంగా వ్యవహరిస్తూ దాడులు చేసి అరెస్టులను ముమ్మరం చేశారు. **ఈ అరెస్టులలో 14 సంవత్సరాల సయ్యద్ లాల్ అను యోధుడు కూడా ఉండటం విశేషం. ఈ యోధుడు 7 సంవత్సరాల కారాగార శిక్షకు గురయ్యారు.** ఈ విధంగా గుంటూరు, కృష్ణా, గోదావరి మండలాల్లో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ప్రభావం తీవ్రంగా కన్పించింది. (1857, యం.వి.ఆర్ శాస్త్రి, ఆంధ్రభూమి దినపత్రిక, 2007 జనవరి 14)

## ఉత్తరాదికి తరలి వెళ్ళిన యువకులు

స్వస్థానంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొనటమే కాకుండా, ఉత్తర భారతంలో స్వదేశీయ యోధులు సాధిస్తున్న విజయాల గురించి విన్న రాయలసీమ యువకులు అక్కడికి కూడా వెళ్ళారు. రాయలసీమ ప్రాంతం నుండి పలువురు ముస్లింలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న తిరుగుబాటుదారులతో కలసి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొనేందుకు ఉత్తర భారతావనికి వలస వెళ్లారని అప్పటి కడప మెజిస్ట్రేట్ మద్రాస్ గవర్నర్‌కు 1857 జూన్20న రాసిన లేఖలో పేర్కొన్నారు.

(**కడపజిల్లా స్వాతంత్ర్యోద్యమంలో కొన్ని ముఖ్యఘట్టాలు**, డాక్టర్ యం. నజీర్ అహమద్, ప్రచురణ : స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీర్, రాయలసీమలో స్వాతంత్ర్యోద్యమం, స్వతంత్ర భారత స్వర్ణోత్సవ సావనీరు కమిటి, అనంతపురం, 1998, పేజి. 55 మరియు **The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volumes I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, P. 147)

ఈ విధంగా 1857నాటి పోరాటంలో బ్రిటీషర్ల మీద తిరగబడిన జనులు, సైనికులు అనేకులున్నారు. ఆ యోధులందరి పట్ల ఆంగ్ల ప్రభుత్వం చాలా కఠినంగా వ్యవహరించింది. ఆ వీరులందరి చరిత్రలు చాలా వరకు నమోదుకు నోచుకోకపోవటంతో ఆ సాహసోపేత సంఘటనల వివరాలు చరిత్రగర్భంలో కలసిపోయాయి.

## 1859 జనవరి నాటికి చల్లబడిన తిరుగుబాటు

పరాయి పాలకులకు వ్యతిరేకంగా బరహంపూర్, మీరట్ యోధుల ప్రేరణతో

ఆరంభమైన పోరాటం అస్సాం, ఛోటా నాగపూర్, బీహార్, ఉత్తర ప్రదేశ్, ఢిల్లీ, ఆగ్రా, కాన్పూరు, ఝాన్సీ, బెనారస్, లక్నో, పంజాబ్, సింధ్, రాజస్థాన్, మహారాష్ట్ర, హైదరాబాద్, ప్రాంతాలను పూర్తిగా చుట్టేసింది. చివరకు వలస పాలకులను తమ గడ్డ మీద నుండి పూర్తిగా వెళ్ళగొట్టాలని దీక్ష వహించిన ప్రజలు, స్వదేశీ సైనికులు, స్వదేశీ పాలకులు ఏకమై సాగించిన పోరు 1859 జనవరి 21న పూర్తిగా బలహీనపడిపోయింది.

ఈ క్రమంలో చివరి యుద్ధం రాజస్థాన్‌లోని సీకర్ వద్ద జరిగింది. ఈ పోరాటంలో షెహజాదా ఫిరోజ్ షా, తాంతియా తోపే, నానా సాహెబ్‌ల నాయకత్వంలోని స్వదేశీ సైనికులు పాల్గొన్నారు. రాజస్థాన్‌లోని కొందరు స్వదేశీపాలకుల నమ్మకద్రోహం వలన చివరిపోరులో స్వదేశీ యోధులు విజయం సాధించలేకపోయారు. బేగం హజరత్ మహల్, అజీముల్లా ఖాన్, నానా సాహెబ్, తాంతియా టోపే లాంటి యోధానుయోధులు ప్రత్యక్ష పోరాటం నుండి తప్పుకోవడంతో బ్రిటీషర్లు ఊపిరి పీల్చుకున్నారు. ఈ పోరాటం తరువాత అక్కడక్కడా తిరుగుబాటు యోధులు ఆంగ్లేయులను ధిక్కరిస్తూ వచ్చినా ఆ పోరాటాలు అంతగా ప్రాధాన్యత సంతరించుకోలేదు.

ఈ పోరాటంలో ఈస్ట్ ఇండియా కంపెనీలో సైనికులుగా, సైన్యాధికారులుగా బాధ్యతలు నిర్వహిస్తున్న స్వదేశీ సిపాయిలు ప్రధానంగా పాల్గొన్నారు. ఆ కారణంగా కొందరు చరిత్రకారులు ఈ పోరాటాన్ని **సిపాయీల తిరుగుబాటు** అని పిలిచారు. ఈస్ట్ ఇండియా కంపెనీ నివేదికల ప్రకారంగా కంపెనీ సైన్యంలో 2లక్షల 35వేల 2వందల 24 మంది సైనికులు ఉండగా వీరిలో లక్షా 20వేల మంది స్వదేశీ పాలకులతో కలసి కంపెనీ బలగాలతో తలపడ్డారని తెలుస్తుంది.

భారత దేశంలో అత్యధిక సంఖ్యలో సుశిక్షితులైన సైనిక బలగాలను కలిగి ఉన్న వలస పాలకులను సువిశాల భారత దేశంలో సుమారు రెండు సంవత్సరాల పాటు సాయుధంగా ఢీకొనడం విశేషాంశం. స్వదేశీ సైనికులు మాత్రమే కాకుండా ప్రజలు, స్వదేశీ పాలకులు, స్వదేశీ ప్రముఖులు పాల్గొనటం వలన ప్రపంచ విముక్తి పోరాట చరిత్రలో అగ్రస్థానం పొందిన ఈ పోరు సాధ్యమైంది. ప్రజలు, ప్రముఖులు అంతా కలసి ఏకోన్ముఖంగా కంపెనీ పాలన మీద తిరగబడ్డారు కనుక ఈ పోరాటాన్ని a national revolt అని కారల్ మార్క్స్ అభివర్ణించాడు.

# తిరుగుబాటు కాదు స్వాతంత్ర్య సమరం

ఈ పోరాటంలో కేవలం సిపాయిలు మాత్రమే కాదు అన్ని వర్గాల-వర్ణాల -మతాల ప్రజలు ఏకమై పాల్గొన్నారు. ఈ విషయాన్ని ఆంగ్లేయాధికారి థామస్ లోయి (Thomas Lowe) తనదైన భాష-భావంలో **శిశుహంతకులైన రాజపుత్రులు, మతమౌఢ్యులైన బ్రాహ్మణులు, మతదురభిమానులైన ముస్లింలు, విలాసవంత జీవితాన్ని ఇష్టపడుతూ పొట్టలు పెంచిన అత్యాశాపరులైన మరాఠాలు లక్ష్యసాధనకు ఒక్కటయ్యారు. గోవులను చంపువాడు - గోవులను ఆరాధించేవారు, పందిని అసహ్యయించుకొనేవారు, పందిని తినేవారు, అల్లాహ్‌ను ఖుదాగా, ముహమ్మద్‌ను ఆయన పైగంబర్‌గా భావించే వారు, బ్రహ్మ రహస్యాలను కీర్తిస్తూ గానం చేసేవారు ఏకమై తిరగబడ్డారు,** అని అసహనాన్ని వెల్లగ్రక్కాడు.

('The Infancticide Rajputs, the bigoted Brahman, the fanatic Mussalman, and the luxary loving fat pauched, ambitious Marathas had joined together in the cause, Cow killer and cow-worshipper, the pig-hater and pig-eater, the crier of 'Allah is one and Mohammed his Prophet' and the Membler of mysteries of Braham revolted conjointly' - **Roots of Communalism In India**, MKA Siddiqui, P.18)

ఈ విషయాన్ని ఆంగ్లేయ సైనికాధికారి John william Kaye మరింత పరిపుష్టం చేస్తూ, **వాస్తవం ఏమిటంటే ఇండియాలోని నల్లవారంతా తెల్లవారికి వ్యతిరేకమయ్యారు,** అని అనగా, మరో ఆంగ్ల సైనికాధికారి Captain Hodson ఉన్నతాధికారులకు 1857 జూలై 26న పంపిన నివేదికలో **ఇండియాలోని భారతీయ సైనికులు మాత్రమే కాదు యావత్తు దేశవాసులు తిరుగబడ్డారు,** అని వ్యాఖ్యానించాడు. ఆ కారణంగా కొందరు ఆంగ్లేయులు కూడా 1857నాటి పోరాటాన్ని **సిపాయీల తిరుగుబాటు** అని మాత్రమే అనటం ఉచితం కాదన్నారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం సమయంలో ఇండియాలో బాధ్యతలు నిర్వహిస్తూ, భారతీయులతో, స్వదేశీ సైనికులతో పలు పోరాటాలు జరిపిన ఆంగ్ల సైనికాధికారులు John William Kaye, Thomas Lowe, Hodson తదితరులు ఈ పోరాటాన్ని సిపాయిల తిరుగుబాటు అనటం సరికాదని తాము రాసిన గ్రంథాలలో, తమ నివేదికలలో చాలా స్పష్టంగా పేర్కొనడాన్ని బట్టే మనం దాని స్వభావాన్ని అంచనా వేయవచ్చు.

# నిజమైన జఫర్ కలలు

ఢిల్లీ పతనం తరువాత బహదూర్ షా జఫర్‌ను ఆంగ్లేయులు అరెస్టు చేసి ఆయన మీద పలు ఆరోపణలు చేసి విచారణ ప్రారంభించారు. ఈ విచారణలో సహజ న్యాయసూత్రాలను ఏమాత్రం ఖాతరు చేయకుండా ఆంగ్లేయాధికారులు ప్రవర్తించారు. ఆ సమయంలో జఫర్ సన్నిహితులు ఆయనను క్షమాబిక్ష కోరమంటూ సలహాలిచ్చారు. కుటుంబీకులందర్నీ కోల్పోయి, ముగ్గురు వారసులు బహిరంగంగా కాల్చి చంపబడి వారి తలలు నరకబడినా ఏమాత్రం చలించకుండా మొగల్ ప్రభువుల గౌరవానికి



ఆంగ్లేయుల సైనికులచే విధ్వంసానికి గురైన లక్నోలోని సికిందర్‌బాగ్ మహల్

ఏమాత్రం భంగం కలుగని విధంగా సాహసోపేతంగా **భగవంతుడికి ధన్యవాదాలు. తైమూరు వంశ సంతానం ఉజ్జ్వలమైన ముఖాలతో తండ్రి దగ్గరకి ఇలాగే వచ్చేవాళ్ళు** అని వ్యాఖ్యానించి శత్రువును కూడా ఆశ్చర్యచకితుల్ని చేసిన మొగల్ ప్రభువు అబూ జఫర్ సిరాజుద్దీన్ ముహమ్మద్ బహదూర్ షాకు ఆ సలహా నచ్చలేదు.

సన్నిహితుల సలహాలను పూర్తిగా తిరస్కరిస్తూ చక్రవర్తి బహదూర్ షా జఫర్‌లోని కవి ఎంతో ఆత్మ విశ్వాసంతో **తిరుగుబాటు యోధుల హృదయాలలో రగులుతున్న ఆత్మగౌరవ జ్యోతులు** ఏమాత్రం వెలుగును కోల్పోకుండా ప్రకాశిస్తూ ఉన్నట్టయితే ఒక

**రోజున లండన్‌ను ఇండియా కదిలించి వేయగలదు** అని తన బలమైన ఆకాంక్షను వ్యక్తం చేశారు.

ఆ ఆకాంక్షకు అనుగుణంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం రగిలించిన స్ఫూర్తితో బహద్దూర్ షా జఫర్ కన్న కలలను నిజం చేసేందుకు భారత స్వాతంత్ర్య సమర యోధులు తమ హృదయాలలోని ఆత్మగౌరవ జ్యోతులను నిరంతరం ప్రజ్వరిల్ల జేస్తూ పరాయి పాలకుల మీద సుదీర్ఘంగా పోరాటాలు సాగించి చిట్టచివరకు ఆంగ్లేయ పాలకులను ఇండియా నుండి 1947లో నిష్క్రమింప చేశారు.

★ ★ ★

## అధ్యాయం - 2

# ముస్లిం మహిళలు

ప్రథమ స్వాతంత్రోద్యమ సమరోజ్వల చరిత్రలో మహిళలు పురుషులతో ధీటుగా తమదైన వీరోచిత పాత్ర నిర్వహించారు. మాతృభూమి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం ఈ గడ్డ ఆడపడుచులు ఆత్మబలిదానానికి సిద్ధపడ్డారు. విముక్తి పోరాట మైదానంలో శత్రువును సవాల్ చేసిన వీర వనితల చరిత్రలున్నాయి. యుద్ధ రంగంలో శత్రువుతో ముఖాముఖి తలపడిన సాహసోపేత సంఘటనలున్నాయి.

1857 మే 11న మీరట్ నుండి తిరుగుబాటు యోధులు ఢిల్లీ చేరుకుని మొగల్ పాలకుడు బహదూర్ షా జఫర్ ను చక్రవర్తిగా స్వీకరించి ఆంగ్లేయుల మీద పోరాటానికి శంఖారావం పూరించగానే చక్రవర్తి భార్య జీనత్ మహల్ కూడా భర్త వెంట ముందుకు సాగారు. మొగల్ సింహాసనాన్ని ఆంగ్లేయుల పరం కానివ్వకుండా తన బిడ్డడు మీర్జా జవాన్ బక్త్‌కు కట్టబెట్టాలని ఆమె ఎంతో ఆరాటపడ్డారు. ఈ సందర్భంగా ఆమె తన వ్యక్తిగత సంపదను పోరాటయోధుల కోసం వ్యయం చేశారు. తిరుగుబాటు యోధులకు ప్రధాన సైన్యాధికారిగా తన బిడ్డడు మిర్జా జవాన్ భక్త్‌ను నియమించమని కూడా ఆమె బహదూర్ షా జఫర్‌ను కోరారు. ఆ తరువాతి కాలంలో ఆంగ్లేయుల తొత్తులైనటువంటి

మీర్జా ఇలాహి బక్ష్, జఫర్ వ్యక్తిగత వైద్యులు హకీం ఎహసానుల్లా లాంటి స్వజనుల దుర్బోధల వలన బలమైన ఆంగ్లేయులతో వైరం సాగించినట్టయితే తన బిడ్డకు నష్టం వాటిల్లగలదన్న వ్యక్తిగత స్వార్థంతో కొంతకాలం తరువాత ఆంగ్లేయాధికారులకు అనుకూలంగా వ్యవహరించిన ఆమె అపఖ్యాతి మూటగట్టుకున్నారు. చివరకు ఢిల్లీ నగరం తిరిగి ఆంగ్లేయుల పరం కావటంతో భర్త జఫర్‌తోపాటు ప్రవాసశిక్ష అనుభవిచేందుకు ఆమె రంగూన్ వెళ్ళారు. 1840లో తన 19 సంవత్సరాల వయస్సులో 64 ఏండ్ల బహదూర్ షా జఫర్ ను వివాహమాడి, చివరి వరకు ఆయన వెంట ఉన్న ఆమె 1862లో జఫర్ మరణించిన తదుపరి అతిసాదా సీదా జీవితాన్ని గడుపుతూ చివరకు 1882లో కన్నుమూశారు.

చరిత్ర ప్రసిద్ధికెక్కిన ఈ పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన ముస్లిం సమాజానికి చెందిన స్త్రీలు తమ అపూర్వ త్యాగాలతో, ఆత్మార్పణలతో స్వాతంత్ర్యసంగ్రామ చరిత్ర పుటలను ఎరుపెక్కించారు. అటువంటి వారిలో ప్రముఖులు అవధ్ రాణి బేగం హజరత్ మహల్. బ్రిటీష్ పాలకులు కుయుక్తులతో ఆమె భర్త నవాబ్ వాజిద్ అలీషాను అరెస్టు చేసి అవధ్‌ను స్వాధీనం చేసుకున్నారు. ఆయనను కలకత్తా పంపి నిర్బంధంలో ఉంచారు. ఆ సమయంలో ఇతర రాణులతోపాటుగా నవాబు వెంట కలకత్తాకు వెళ్ళకుండా బేగం హజరత్ మహల్ అవధ్ రాజ్య రాజధాని నగరమైన లక్నోలో ఉండిపోయారు.

స్వరాజ్యం పరుల పాలవడంతో ఆగ్రహించిన ఆమె ప్రజల, స్వదేశీ ప్రముఖుల అండదండలతో బ్రిటీష్ సైన్యంపై విరుచుకుపడ్డారు. 1857 మే 31న లక్నోలోని ఛావనీలో తిరుగుబాటు ఫిరంగులు పేలాయి. ఆ పోరాటంలో స్వదేశీ సైనికుల సహాయసహకారాలతో తమ రాజ్యాన్ని ఆమె తిరిగి సొంతం చేసుకున్నారు. ఆంగ్లేయాధికారులు అవధ్ నుండి పలాయనం చిత్తగించారు. ఆ సమయంలో ఆమె ప్రజల నుద్దేశించి ఒక ప్రకటన చేశారు. ఈ ప్రకటనలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలంతా కత్తిపట్టాల్సిన అవసరాన్ని ఆమె వివరించారు.

ఆ ప్రకటన స్థూలంగా ఇలా సాగింది : **హిందూ- ముస్లింలకు ధర్మం, ఆత్మగౌరవం, ప్రాణం, ధనం అను నాలుగు అంశాలు ప్రధానం. ఈ అంశాలను కేవలం స్వదేశీ పాలనలో, స్వదేశీ పాలకులు మాత్రమే ప్రసాదించగలరు. కంపెనీ సైనికులు ప్రజలను దోచుకుంటున్నారు. ఆత్మగౌరవాన్ని మంట కలుపుతున్నారు. స్త్రీల మీద అఘాయిత్యాలు, అత్యాచారాలు జరుపుతున్నారు...హిందూ-ముస్లిం పౌరులను హెచ్చరిస్తున్నాం. ఆత్మ**

**గౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీయుల పాలన కోసం శత్రువులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీ కండి... మాతృభూమి విముక్తి కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములు కండి. శతృవుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి.**

అనంతరం పదమూడు సంవత్సరాల తన బిడ్డడు బిర్జిస్ ఖదీర్‌ను నవాబుగా ప్రకటించి అతని సంరక్షకురాలిగా ఆమె బాధ్యతలు చేపట్టారు. స్వదేశీ పాలకులను, ప్రముఖులను, స్వదేశీ సైనిక ప్రముఖులను, ప్రజలను ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఐక్యపర్చారు. పరిపాలనలో హిందూ- ముస్లింలకు సమాన స్థాయి కల్పించారు. బ్రిటీష్ సైనికదళాల పడగ నీడలో కూడా ఎంతో సాహసంతో 14 మాసాల పాటు బ్రిటీష్ వలస పాలకుల ఎత్తులను చిత్తు చేస్తూ, ఆంగ్ల సేనలతో పోరాటం సాగిస్తూ, స్వపరిపాలనను సమర్థవం తంగా సాగించారు.

స్వదేశంలో పరిపాలన కాస్త కుదుట పడ్డాక ఆమె తన భర్త వాజిద్ అలీషాను ఆంగ్లేయుల చెర నుండి విడిపించేందుకు కూడా సాహసోపేత మైన పథక రచన చేశారు. ఆంగ్లేయాధికారి Lord Canning అంగరక్షకుల సహకారంతో కలకత్తాలోని విలియం కోట (Fort William)లోని ఆయుధాగారాన్ని పేల్చివేసి కోటలో బందీగానున్న నవాబును విడిపించాలని ఆమె తలచారు. ఈ విషయాన్ని పసికట్టిన ఆంగ్లేయాధికారి Lord Palmerstan ఆ సమాచారాన్ని Lord Canning చెవిన వేయటంతో ఆమె రూపొం దించిన పథకం కాస్తా విఫలమైంది. (**Lucknow 1857**, Roshan Taqui, New Royal Book Co, Lucknow, 2001 Page. 21)

ప్రథమ స్వాతంత్ర్య సమరానికి ప్రధాన కేంద్రంగా భాసించిన ఢిల్లీ నగరాన్ని పూర్తిగా హస్తగతం చేసుకున్నా తిరుగుబాటు యోధులంతా తిరిగి లక్నో కేంద్రంగా ఏకమౌతున్న తీరును చూసి ఆంగ్లేయులు బెంబేలెత్తారు. ఈ వ్యతిరేక పరిణామాలతో బేగంపై కత్తిగట్టిన కంపెనీ పాలకులు అవధ్‌ను అపార సైనిక బలగాలతో ముట్టడించినా, ఏమాత్రం అధైర్యపడక ఆమె స్వయంగా రణరంగ ప్రవేశం చేసి, తన సైనిక దళాలను ముందుకు నడిపి వీరోచితంగా పోరాడారు.

ఆ సమయంలో సిపాయిలను, స్వదేశీ పాలకులను మంచి చేసుకునేందుకు బ్రిటన్ మహారాణి విక్టోరియా ఒక ప్రకటన విడుదల చేసింది. ఆ ప్రకటనలోని

కుటిలత్వాన్నీ, అందులోగల అవాస్తవికతనూ వెల్లడి చేస్తూ బేగం హజరత్ మహల్ తన కుమారుడు బిర్జిస్ ఖదీర్ పేరిట చరిత్రాత్మక ప్రకటనను జారీ చేశారు.

ఆ ప్రకటనలో స్వదేశీయుల ఆత్మాభిమానాన్ని ఆంగ్లేయులు ఏవిధంగా దెబ్బ గొట్టిందీ, స్వదేశీయుల మతధర్మాలను ఏవిధంగా కించపర్చిందీ, ప్రజా సమూహాల మత మనోభావాలను ఏ విధంగా అవమాన పర్చిందీ, తిరుగుబాటుకు భయపడి తిరగబడ్డ సైనికులను, నేతలను మాలిమి చేసుకునేందుకు ఎలాంటి ఆశలు చూపిందీ, గతంలో స్వదేశీ పాలకుల మీద ఎంతటి అఘాయిత్యాలకు పాల్పడిందీ, ఎన్నిసార్లు మాట తప్పి వ్యవహరించింది ఆ సుదీర్ఘమైన చారిత్రాత్మక ప్రకటనలో తగిన సాక్ష్యాధారాలతో సహా ఆమె సాధికారికంగా వివరించారు.

చివరకు **మా ప్రజలు మాదేశాన్ని కోరుతున్నప్పుడు ఆమె మాదేశాన్ని మాకెందుకు వదలి పెట్టదూ?** ('..Why does her Majesty not restore our country to us. when our people want it..' - **Encyclopaedia of Women Biography,** Vol. II, P.66) అని సూటిగా విక్టోరియా రాణిని బేగం హజరత్ మహల్ ప్రశ్నించారు. విక్టోరియా రాణి మభ్యపెట్టే మాటలను నమ్మవద్దని, మోసపోవద్దని ప్రజలకు, స్వదేశీ పాలకులకు ఆమె విజ్ఞప్తి చేశారు. మాతృభూమి మీద పరాయి పాలకులు సాగిస్తున్న పెత్తనాన్ని తుడిచి పెట్టేందుకు కంకణబద్ధులై కదలాలని ప్రజలను కోరారు.

అత్యంత ధైర్యసాహసాలతో, అద్భుతమైన విజ్ఞతతో, పరిపాలనా దక్షతతో అవధ్ రాజ్యాన్ని పాలిస్తున్న బేగంను ఎలాగానై పరాజితను చేయాలని ఆంగ్లేయ సైనికాధికారులు వ్యూహం పన్నారు. అవధ్‌ను ఆక్రమించుకునేందుకు భారీ సంఖ్యతో చుట్టుముట్టడంతో బ్రిటీష్ సైనికమూకలను ఎదుర్కొనడం చాలా కష్టతరమైన తరుణంలో కూడా ఆమె రణరంగం నుండి తప్పుకోడానికి ఇష్టపడలేదు. చివరకు, సహచరుల బలవంతం మీద ఆంగ్లేయుల ముట్టడి నుండి తప్పించుకుని, తిరిగి దాడి చేసేందుకు తాత్కాలికంగా యుద్ధ రంగం నుండి నిష్క్రమించిన ఆమె బ్రిటీష్ తొత్తు అయినటువంటి నేపాల్ అధినేత జంగ్ బహద్దూర్ తిరస్కారాన్ని కూడా లెక్కచేయకుండా నేపాల్ పర్వతాల్లోకి ప్రవేశించారు. ఈ విధంగా బేగం హజరత్ మహల్ అవధ్ రాజ్యంలో, ఆ రాజ్యం రాజధాని నగరం లక్నోలో రగిల్చిన పోరాటం 22 మాసాల పాటు పొగలుసెగలు కక్కుతూ బేగం నిష్క్రమణతో ముగిసింది.

నేపాల్ పర్వత ప్రాంతాలలో నానా సాహెబ్, మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా లాంటి యోధులతో కలసి బలగాలను సమీకరిస్తూ, మళ్ళీ పోరాటానికి సిద్ధపడ సాగారు. ఆ సమయంలో ఆమెకు 20 లక్షల భత్యం ఇవ్వగలమని, అందుకుగాను ఆమె లక్నోకు తిరిగి రావాలి. అవధ్ రాజ్యం మీద తన కుంటుంబానికి గల అధికారాన్ని పూర్తిగా వదలు కోవాలని ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారులు ఒక చిత్రకారుని ద్వారా రాయబారం పంపారు. ('Begum Hazarath Mahal-Freedom Fighter Par Excellence , Nayeem Raza **Radiance** Views Weekly, 31 August.- 6 September. 2003, P. 26).

ఆ ప్రతిపాదనను, ఆంగ్లేయులు సమర్పిస్తామన్న భారీ నజరానాలను బేగం హజరత్ మహల్ నిక్కచ్చిగా తిరస్కరించారు. బ్రిటీషర్ల బానిసగా తమ గడ్డ మీద తాను అడుగు పెట్టేది లేదన్నారు. మాతృభూమి విముక్తి తప్ప తనకు మరొకటి ఏమాత్రం సమ్మతం కాబోదని ప్రకటించిన బేగం హజరత్ మహల్ చివరి వరకు పలు కష్టాలను ఎదుర్కొంటూ 1874 ఏప్రిల్ 7న నేపాల్ అడవుల్లో సామాన్య మహిళగా కన్నుమూశారు. (**అవధ్–కీ–బేగం** (హింది), డాక్టర్ సుధా త్యాగి, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1992, పేజి. 20)

ప్రథమ స్వాతంత్ర్య సమరంలో బేగం హజరత్ మహల్ బాటన నడిచిన మహిళలను చరిత్ర పుటలు అక్కడక్కడా మనకు పరిచయం చేస్తాయి. ఆనాటి పోరాటంలో ప్రాణాలను సైతం పణంగా పెట్టి శత్రువును మట్టు పెట్టేందుకు కదనరంగానికి కదలిన వారిలో బేగం అజీజున్ ప్రముఖులు. ఆమె 1832లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని బితూర్‌లో జన్మించారు. తండ్రి హసీనా ఖాన్. చిన్ననాటనే తల్లి హమీదాను కోల్పోయారు. అజీజున్ మంచి రూపశి. ప్రసిద్ధ నర్తకి ఉమరావ్‌జాన్ బృందంలో అజీజున్ చేరి మంచి నర్తకిగా ఖ్యాతిగాంచారు. నాట్యకళ మీద మంచి అభినివేశాన్ని సాధించి ఆ కళను ప్రదర్శిస్తూ అపారంగా ధనాన్ని ఆర్జించారు.

మాతృభూమి పట్ల అపార ప్రేమాభిమానాలు గల ఆమె ప్రభుభక్తి పరాయణురాలు. కాన్పూరు అధినేత నానాసాహెబ్ తిరుగుబాటు శంఖారావాన్ని పూరించగానే ఆమె కూడా ఆయన పక్షాన యుద్ధరంగ ప్రవేశం చేశారు. అజీజున్ సమర్థవంతమైన నాయకత్వంలో మహిళా సైనిక దళాలు పలు కార్యక్రమాల భారాన్ని స్వీకరించి నానా సాహెబ్ పోరాటానికి

ఎంతగానో తోడ్పడ్డాయి. ఆమె తన బలగంతో నగరంలోని ప్రతి ఇల్లూ తిరుగుతూ యుద్ధభూమికి తరలి రాని యువకుల ఉద్దేశించి **మీ లాంటి యువకుల్లో రక్తం చల్లబడి పోయింది. మీలో పౌరుషం చచ్చిపోయిందా? మీ రక్తం ప్రతీకార జ్వాలతో వేడెక్కు తుందా? లేదా? మన మోచేతి నీళ్ళు తాగే కుక్కలు మన పై పెత్తనం చలాయిస్తున్నారు. దానిని మనం మౌనంగా భరిస్తున్నాం. మన వీరత్వం, శౌర్య పరాక్రమాలు ఏమైపోయాయి?** అని ప్రశ్నిస్తూ యువకుల్లో రోషాగ్నిని ప్రజ్వరిల్ల చేశారు. (**అజ్ఞాత వీర గాథలు**, గోవింద స్వరూప్ సింహాల్, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1999, పేజి. 30-31)

అజీజున్ స్వయంగా రణరంగ ప్రవేశం చేసి శత్రుసైన్యాలను అత్యంత ధైర్య సాహసాలతో ఎదుర్కొన్నారు. మరోవైపున సైనిక పటాలాలను, గూఢచారి దళాలను, ఆయుధాలు, ఆహారం అందించే బృందాలను నేర్పుతో ఏర్పాటుచేసి ఆంగ్లేయులతో నానాసాహెబ్ సాగించిన పోరుకు ఎంతగానో తోడ్పడ్డారు. చివరి వరకు పోరాడుతూ యుద్ధభూమిలో గాయపడి శత్రువు చేత చిక్కారు. ఆ సమయంలో ఆంగ్లేయాధికారి Col. William తయారు చేసిన **కాన్పూరు తిరుగుబాటుదారుల జాబితాలో** అజీజున్ మొదటి స్థానంలో ఉన్నారు. (**Encyclopaedia of Muslim Biography**,Vol. I, Ed. by Narendra Kr . Singh, APH, New Delhi, 2001, P.585)

ఆ తరువాత సాగిన విచారణలో ఆమెకు వ్యతిరేకంగా కాన్పూరుకు చెందిన ప్రముఖ వ్యాపారి జానకీ ప్రసాద్ సాక్ష్యం చెబుతూ **ఆమె ఎల్లప్పుడూ సైనికాధికారి దుస్తులలో ఉంటారు. నానా సాహెబ్ కోసం ఆమె మహిళా దళాలు పనిచేశాయి. ఆమెకు పీష్వా సైనిక దళాలతో కూడా ప్రత్యక్ష సంబంధాలున్నాయి. తిరుగుబాటు పతాకం ఎగరగానే ఆమె తిరుగుబాటు యోధులతో కలసి పోరుబాటన నడిచారు** అని ఆంగ్లేయ సైనిక న్యాయస్థానంలో వివరించాడు. ఈ మేరకు ఆమె తిరుగుబాటు యోధులతో కలసి పనిచేశారని ఆమె సాహసోపేత చర్యలను ప్రత్యక్షంగా చూసిన బ్రిటీషు అధికారులు, పలువురు ప్రముఖ వ్యక్తులు, ఇతర అధికారులు సాక్ష్యం పలికారు. (Encyc lopaedia of Muslim Biography, Vol.I, page. 585)

ఈ విచారణలో భాగంగా బేగం అజీజున్‌ను ఉన్నత సైనికాధికారి General Havelock ఎదుట హాజరు పర్చారు. ఆమె సాహసకృత్యాల గురించి విని ఉన్న ఆ

అధికారి, ఆమె రూపురేఖ లను చూసి ఆశ్చర్యపోయాడు. ఆమె కనుక తన అపరాధాన్ని అంగీకరించి, క్షమాపణ వేడుకుంటే ఆరోణపలన్నీ రద్దుచేస్తానన్నాడు. ఆ ప్రతిపాదనలను బేగం అజీజున్ నిరాక రించారు. ఆమె ప్రవర్తన చూసి విస్తుపోయిన ఆ అధికారి నీకేం కావాలి? అని ప్రశ్నిం చాడు. నాకు **బ్రిటీష్ పాలన అంతం చూడాలనుంది**, ('I want to see the end of the British rule ', - Encyc lopaedia of Muslim Biography, Vol.I, P.586), అని ఆమె నిర్భయంగా సమాధానమిచ్చారు. ఆ సమాధానంతో ఆగ్రహించిన General Havelock ఆమెను కాల్చి వేయాల్సిందిగా సైనికులకు ఆదేశాలిచ్చాడు.

ఆ ఆదేశాలను విన్న అజీజున్ చిరునవ్వు చిందిస్తూ, తుపాకి గుండ్లకు ఎదురుగా నిలబడ్డారు. బ్రిటీష్ సైనికుల తుపాకులు ఒక్కసారిగా గర్జించాయి. ఆ తుపాకుల్లో నుండి గుళ్ళు బయల్పడి ఆమె సుకుమార శరీరాన్ని ఛేదించుకుని దూసుకపోతుండగానే **నానా సాహెబ్ జిందాబాద్** అంటూ ఆమె నినదించారు. ఆ సింహనాదంతో ఆంగ్లేయ సైనికులు స్థాణువులు కాగా బేగం అజీజున్ ప్రాణాలు అనంతవాయువులలో కలిసిపోయాయి.

అజీజున్ మార్గాన సాగిన మరొకరు 60 సంవత్సరాల అనామిక. ఆమె పేరేమిటో తెలియదు. ఆమె ఎల్లవేళల ధరించే ఆకుపచ్చ రంగు దుస్తుల వలన ఆమె **ఆకుపచ్చ రంగు దుస్తుల మహిళ**గా ఖ్యాతిగాంచారు. గెరిల్లా పోరాటం సాగించిన ఆమె బ్రిటీష్ సైనికదళాలలో భయోత్పాతం సృష్టించారు. ఈ మహిళ సాహసాన్ని **బేగమత్ కి అంశూం** అను గ్రంథంలో రచయిత విస్తారంగా ప్రస్తావించారని తెలుపుతూ ఆ వివరణను **భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామ్ మేఁ ముస్లిం మహిళా ఓంకా యోగదాన్** అను పుస్తకంలో రచయిత్రి, అలీఘర్ ముస్లిం యూనివర్శిటీ ఆచార్యులు డాక్టర్ అబిదా సమీయుద్దీన్ (పేజి. 44లో) ఈ క్రింది విధంగా ఉటంకించారుః

**ఆ మహిళ అద్వితీయ ధైర్యశాలి. ఆమెకు మృత్యుభయం ఏ మాత్రం లేదు. ఫిరంగులు గర్జిస్తున్నా, తుపాకులు గుండ్లను వర్షిస్తున్నా అత్యంత ధైర్యశాలి అయిన సైనికుడి మల్లే ఆమె తుపాకి గుండ్ల వర్షంలో నింపాదిగా నడిచి వెళ్ళేది. ఆమెను కొన్ని సార్లు నడిచి వస్తుంటే చూశాం. మరికొన్నిసార్లు గుర్రం మీద స్వారీ చేస్తూ చూశాం. ఖడ్గ విన్యాసంలో, గురి తప్పకుండా తుపాకి పేల్చటంలో ఆమె మంచి నేర్పరి. ఆమె ధైర్య సాహసాలను చూసి ప్రజలలో ఉత్సాహం ద్విగుణీకృతమయ్యేది.**

ఈ వర్ణన ద్వారా ఆమె గెరిల్లా పోరు సాగించేదని మనం అర్థం చేసుకోవచ్చు. ఆమె ఎక్కడనుంచి వస్తుందో, ఎక్కడికి వెళ్ళిపోతుందో ఎవ్వరికీ ఏమాత్రం తెలియకుండా తన బలగాలతో శత్రువు మీద దాడులు జరిపిన తీరు ఆమె గెరిల్లా రణతంత్రాన్ని స్ఫురణకు తెస్తుంది. ఆంగ్ల సైన్యాలతో పోరాడుతూ గాయపడి ఆమె శత్రువు చేతికి చిక్కింది. ఆమెను అరెస్టు చేసిన సైనికాధికారి అంబాలాలోని ఆంగ్ల సైనిక స్థావరానికి పంపుతూ అంబాలా సైనిక స్థావరం డిప్యూటీ కమిషనర్‌కు 1857 జూలై 29న లేఖ రాశాడు.

ఆ లేఖలో **నేను మీ వద్దకు ఒక ముస్లిం ముదుసలిని పంపుతున్నాను. ఆమె విచిత్రమైన మహిళ. ఆమె ఆకుపచ్చ దుస్తులు ధరిస్తుంది. కంపెనీ మీద తిరుగుబాటు చేయమని ప్రజలను రెచ్చగొట్టడం ఆమె పని. స్వయంగా ఆయుధాలు చేపట్టి తిరుగుబాటు దారులకు నాయకత్వం వహించి మన స్థావరాల మీద దాడులు చేస్తుంది. పలుమార్లు మన స్థావరాలపై ధైర్యసాహసాలతో విరుచుకుపడింది. ఆమె ఆయుధం చేపడితే ఐదుగురు సాయుధ పురుషులతో పోరాడగల శక్తివంతురాలని, ఆమె బారిన పడిన మన సిపాయిలు, అధికారులు చెబుతున్నారు. ఆమె పట్టుబడిన రోజున, శిక్షణ పొందిన సైనికాధికారిలా నగరంలోని తిరుగుబాటుదారులను కూడేసుకుని, మన స్థావరాల మీద దాడి చేసి పోరాడుతూ పట్టుబడింది. ఆమె కడు ప్రమాదకారి. జాగ్రత్త సుమా**, అని పేర్కొన్నాడు.

ఈ లేఖను ఖుర్షీద్ ముస్తఫా రజ్వీ రాసిన **జంగ్-యే-ఆజాది 1857** అను ఉర్దూ గ్రంథంలో ప్రచురించారని, **భారత్ కే స్వాతంత్ర్య సంగ్రామ్ మేఁ ముస్లిం మహిళా వోఁకా యోగదాన్** (గ్రంథ రచయిత్రి డాక్టర్ ఆబిదా సమీయుద్దీన్ తన గ్రంథంలో పేజి.45) వివరంగా ఉటంకించారు. ఆమెను అంబాల పంపుతూ **ఈ వృద్ధురాలు బహు ప్రమాదకారి...జాగ్రత్త** అంటూ అక్కడి అధికారులను హెచ్చరిస్తూ ప్రత్యేకంగా లేఖ రాసి పంపి, ముందు జాగ్రత్తల గురించి హెచ్చరించారంటే, ఆంగ్లేయాధికారులు ఆమెను **జాన్ ఆఫ్ ఆర్క్‌**తో పోల్చారంటే ఆకు పచ్చదుస్తుల మహిళ ఎంతటి ఘటికురాలో మనం ఇట్టే ఊహించవచ్చు.

ఈ విధంగా శత్రువును సాయుధంగా ఎదుర్కొన్న మహిళలు, సాయుధ తిరుగుబాటు

దళాలను ప్రోత్సహించినవారు, ఆశ్రయం కల్పించి ఆదుకున్న మహిళలు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఎందరో దర్శనమిస్తారు. ఆనాడు మాతృభూమిని బ్రిటీషు పాలకుల నుండి విముక్తి చేయడానికి తమ ప్రాణాలను తృణప్రాయంగా భావించి పోరుబాట సాగిన ముస్లిం యువతులలో మరొకరు ముందర్. ఆమె ఝూన్సీరాణి లక్ష్మీబాయి అంగ రక్షకురాలు. రాణి లక్ష్మీబాయికి ముందర్ కేవలం అంగరక్షకురాలిగా మాత్రమే బాధ్యతలు నిర్వర్తింలేదు. ఆమె రాణికి ఇష్టసఖి మాత్రమే కాదు ఆంతరంగిక సలహాదారుగా కూడా వ్యవహరించారు. (1857 తిరుగుబాటు, తెలుగు అకాడమి ప్రచురణ, హైదరాబాద్, పేజి. 112).




ఆమె ఎల్లప్పుడూ రాణికి నీడలా వెన్నంటి నిలచి శత్రువుతో పోరాడిన ధైర్యశాలి. ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొంటూ, రాణితో పాటు ఆమె కూడా బ్రిటీష్ సైనికాధికారుల తుపాకి గుళ్ళకు బలయ్యారు. ఈ విషయాన్ని అప్పటి సెంట్రల్ ఇండియా ప్రాంతానికి గవర్నర్ జనరల్ ప్రతినిధిగా నియమించబడిన రాబర్ట్ హెమిల్టన్ 1858 అక్టోబర్ 30న అప్పటి భారత ప్రభుత్వ కార్యదర్శి ఎడ్‌సన్‌కు ఒక లేఖ రాస్తూ **రాణి వెన్నంటి ఒక ముస్లిం యువతి గుర్రం మీద అనుసరించేది. కొతాకి సరాయి ప్రాంతంలో రాణితో పాటుగా ఆమెకు తుపాకి గుండ్లు తగిలాయి. ఆమె రాణితోపాటుగా ఒకేసారి నేలకొరిగింది** అని వివరించాడు.

ఆ విషయాన్ని Dr. Surendra Nath Sen తన గ్రంథం **Eighteen Fifty Seven** లో వివరిస్తూ ఆంగ్లేయాధికారి రాబర్ట్ హెమిల్టన్ వివరణను ఉటంకించారు. ( '..The Rane was on Horse back, and close to her was the female (a Mohomaden) who seems never to have left her side on any occasion, these two were struck by bullets and fell ' ఆ యువతి ఎవరన్నది ఆ ఆంగ్లేయుడు పేర్కొనలేదు. భారత ప్రభుత్వం 1973లో ప్రచురించిన Who's who of Indian Martyrs, Vol. 3 లో మాత్రం ఝూన్సీ రాణితో పాటుగా పలు పోరాటాలలో పాల్గొన్న ముందర్ గురించి డాక్టర్ ఛోప్రా వివరిస్తూ **ఆ యోధురాలి పేరు ముందర్** (Mundar) అని స్పష్టం చేశారు. ( **Who's Who of Indian Martyrs**, Vol.3, Govt. of India Publications, New Delhi, 1973, P.102 ).

ఈ కోవలో మాతృదేశ విముక్తి కోసం ఉరిని కూడా లెక్కచేయని సాహసి హబీబా బేగం, బ్రిటీషు సైనిక మూకలను సాయుధంగా ఎదుర్కొన్న ధైర్యశాలి బేగం రహీమా, తిరుగుబాటు యోధుల క్షేమం కోరుతూ సజీవదహనమైన అస్గరి బేగం, సాయుధంగా ఆంగ్ల సైన్యాలను నిలువరించిన బేగం జమీలా, కత్తిపట్టి కదనరంగాన శత్రువును సవాల్ చేసిన సాహసి బేగం ఉమ్దా తదితరులు ఎందరో ఉన్నారు.

పుట్టిన గడ్డ గౌరవాన్ని కాపాడు కునేందుకు ఆత్మాభిమానులైన బిడ్డలు ఎంతటి త్యాగాలకైనా సిద్ధపడతారన్న విషయానికి నిలువెత్తు తార్కాణం హబీబా బేగం. 1833లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫ్ఫర్‌పూర్‌లో జన్మించిన ఈమె 1857లో తిరుగుబాటు యోధులతో కలసి రణరంగ ప్రవేశం చేశారు. సోదర తిరుగుబాటు వీరులతో కలిసి బ్రిటీష్ సైనికపటాలాల మీద లంఘించారు. ఆ పోరాటంలో ఆమెను ఆంగ్ల సేనలు నిర్బంధించాయి. పరాయి ప్రభుత్వంపై తిరగబడిన నేరానికి 1857లో బ్రిటీషు సైనిక న్యాయస్థానం ఆమెకు ఉరిశిక్ష విధించింది. ఆ శిక్షకు ఏ మాత్రం భయపడకుండా హబీబా సంతోషంగా ఉరిని స్వీకరించారు.

బ్రిటీష్ సైనికదళాల మీద విరుచుకుపడ్డ తిరుగుబాటు దళాలతో కలసి పోరుబాటను ఎంచుకున్న బేగం రహీమా ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూర్ జిల్లాలో 1829లో జన్మించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో బ్రిటీష్ సైనిక మూకల మీద ఆమె సమర శంఖారావం పూరించారు. ఆయుధం ధరించి తిరుగుబాటు దళాలతో

కలిసి శత్రుమూకలను సంహరించే కార్యక్రమంలో ఉత్సాహంగా పాల్గొన్నారు. ఈ పోరులో గాయపడిన ఆమె బ్రిటీష్ సైనికాధికారులకు బందీ అయ్యారు. ఆ యోధురాలికి కూడా సైనికాధికారులు ఉరిశిక్ష విధించారు. మాతృదేశం కోసం మరణించటం అత్యంత గౌరవంగా భావించిన బేగం రహీమా చిన్న వయస్సులోనే, పుట్టిన గడ్డకోసం ప్రాణాలను అర్పించారు. (Who is Who of Indian Martyrs, Dr. P.N. Chopra, Govt. of India Publications, New Delhi.1973, Page. 118)

పరాయి పాలకుల మీద పోరు సల్పుతున్న ప్రతి ఒక్కరూ తన బిడ్డలని ప్రకటించి వారి క్షేమం కోసం అహరహం కృషిసల్పిన మహిళామతల్లి అస్గరీ బేగం 1811 జులై 5న ఉత్తరప్రదేశ్ రాష్ట్రం ముజఫర్‌పూర్ జిల్లాలో జన్మించారు. ఆమె కుటుంబం ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామయోధుల కుటుంబం. 1857నాటి పోరాటంలో పాల్గొన్న ఖ్వాజీ అబ్దుల్ రహమాన్ ఆమె కుమారుడు. అబ్దుల్ రహమాన్‌ను బ్రిటీష్ ప్రభుత్వం ఉరితీసింది. ఆ తిరుగుబాటులో ఆమె కూడా పరోక్షంగా పాల్గొన్నారు. తిరుగుబాటు వీరులకు ఆశ్రయం కల్పించటం, ఆహార పానీయాలు అందించటంలో సహాయపడ్డారు. ఈ విషయం పసిగట్టిన ఆంగ్లేయ సైనికాధికారులు



బేగం హజరత్ మహల్ స్వతంత్ర ప్రభుత్వం అధికార రాజముద్రిక

ఆమెను బంధించి రాజద్రోహం ముద్రవేశారు. తిరుగుబాటు యోధుల రహస్యాలు చెప్పమని వేధించారు. రహస్యాలు చెప్పకుంటే సజీవదహనం చేస్తామని బెదిరించారు. ఆ బెదిరింపులు ఏవీ కూడా ఆమె పట్టుదలను సడలించలేక పోయాయి. చివరకు భయంకర చిత్రహింసల పాల్జేసినా ఆమె లొంగలేదు, పెదవి విప్పలేదు. అందుకు ఆగ్రహించిన అధికారులు ఆమెను సజీవదహనం చేయించారు. ఆంగ్లేయ సైనికాధికారుల హింసాత్మక చేష్టలను భరించిన అస్గరీ బేగం మాతృభూమి సేవలో చిరునవ్వుతో బలయ్యారు.

(**Freedom Movement and Indian Muslims**, Santimony Ray, P.P.H, New Delhi,1993, P.116 ; Who is Who of Indian Martyrs, Dr. P.N. Chopra, Govt. of India Publications,New Delhi.1973, P.118)

ఆంగ్లేయ పాలకుల నుండి సొంత గడ్డను విముక్తం చేసి స్వదేశీయుల పాలన చూడాలన్న ప్రగాఢకాంక్ష కలిగిన బేగం జమీలా విరుచుకుపడుతున్న ఆంగ్లేయ సైనికులను తిరుగుబాటు యోధులతో కలసి నిలువరించిన యోధులలో ఒకరు. ఆమె ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లాలోని ఓ గ్రామంలో 1835లో జన్మించారు. ఆమె పఠాను కుటుంబానికి చెందిన యువతి. పరాయిపాలకుల పెత్తనాన్ని ఏమాత్రం సహించని వారసత్వంగల ఆమె ఆంగ్లేయుల ఆధిపత్యాన్నీ, అధికారాన్నీ అంగీకరించలేదు. కంపెనీ పాలకులు మాతృభూమిని కబ్జా చేయటం భరించలేకపోతున్న ఆమె 1857 నాటి విముక్తి పోరాటంలో భాగస్వాములయ్యారు.

మాతృభూమి సేవలో ప్రాణాలను తృణప్రాయంగా భావించి ఎంతటి త్యాగానికైనా సిద్ధపడి తిరుగుబాటుయోధులతో కలిసి శత్రువుపై కలబడ్డారు. ఈ సందర్భంగా ఆంగ్లేయ సైన్యాలు ఆమెను అరెస్టు చేశాయి. బ్రిటీషు సైనిక న్యాయస్థానం విచారణ తంతును పూర్తిచేసి ఉరిశిక్షను ప్రకటించింది. పుట్టిన గడ్డను పరాయి పాలకుల నుండి విముక్తం చేయటంలో ప్రాణాలను అర్పించి బేగం జమీలా చరితార్థురాలయ్యారు. **(Who is** Who of Indian Martyrs Dr. P.N. Chopra, Govt. of India Publications, New Delhi.1973, Page. 64)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయ సైనికులతో పోరాడుతూ శత్రు సైనికులను నిలువరించటంలో గాని, తిరుగుబాటు యోధులకు సహాయసహకారాలు అందించటంలో గాని మహిళలు తమదైన పాత్ర నిర్వహించారు. అటువంటి మహిళా పోరాటయోధులలో బేగం ఉమ్దాది విశిష్ట స్థానం. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ముజఫర్‌పూరు జిల్లాలోని ఓ గ్రామంలో 1831లో జన్మించిన ఉమ్దా భయమంటే ఏమిటో ఎరుగని జాట్ కుటుంబానికి చెందిన యువతి. శత్రువుతో తలబడటంలో ఏమాత్రం వెనుకాడని వారసత్వ సంపద ఆమె స్వంతం. పరాయి పాలకులను పాలద్రోలి స్వదేశీయుల పాలనను ప్రతిష్టించుకో వాలన్నది ఆమె ఆకాంక్ష. ఆ లక్ష్యసాధన కోసం 1857లో పరాయి పాలకుల పెత్తనానికి చరమగీతం పాడాలనుకుంటున్న యోధుల సరసన చేరి స్వదేశీపాలకుల పక్షాన తిరుగు

బాటుకు తోడ్పడ్డారు. ఆ సందర్భంగా ఆంగ్లేయ సైన్యాలు ఆమెను అరెస్టుచేసి సైనిక విచారణ జరిపి ఉరిశిక్ష విధించాయి. ఆ శిక్ష అమలు జరుపుతున్న సమయంలో ఆమెతోపాటు మరో 11మంది యువతులను కూడా ఆంగ్లేయులు ఉరిశిక్షకు గురిచేశారు.

ఈ విధంగా బ్రిటీష్ సైనికులతో పోరాడి అమరగతి పొందిన వారు కొందరైతే, పోరును పునరుద్దరించడానికి శత్రువు కళ్ళుగప్పి తప్పించుకున్నవారు మరికొందరు ఉన్నారు. అదేవిధంగా తిరుగుబాటు యోధులకు వ్యతిరేకంగా పనిచేసిన వారిలో కూడా పలువురు మహిళలు ఉన్నారు. అటువంటి వారిలో బహదూర్ షా జఫర్ ముద్దుల భార్య జీనత్ మహల్ ఒకరు కాగా ప్రస్తుత మధ్యప్రదేశ్ రాష్ట్రరాజధాని భోపాల్ సంస్థానాధీశు


ఖాట్మాండులోని బేగం హజరత్ మహల్ సమాధి

రాలు నవాబ్ సికిందర్ జహాన్ బేగం మరోకరు. భోపాల్ సంస్థానంలోని పలు ప్రాంతాలలో తిరుగుబాటు ప్రజ్వరిల్లగా, ఆంగ్లేయులకు అనుకూలంగా నడుచుకున్న సికిందర్ జహాన్ బేగం ఆ తిరుగుబాట్లను పూర్తి స్థాయిలో సాగనివ్వలేదు.

ఈ మేరకు ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో అత్యంత ధైర్యసాహసాలతో ఆంగ్ల సైనికులను ఎదిరించి పోరాడిన మహిళలలో ముస్లిం మహిళలు గణనీయ సంఖ్యలో ఉండటం విశేషం. చరిత్ర నమోదు ప్రకారం ఆనాడు ఇతర సాంఘిక జనసముదాలతో పాటుగా వందలాది ముస్లిం మహిళలు కాల్చి వేయబడ్డారు; పలువురు సజీవ దహన మయ్యారు; ఉరి తీయబడ్డారు; అవమానాలకు, అత్యాచారాలకు గురయ్యారు. ఈ

సమాచారాన్ని బ్రిటీష్ అధికారుల డైరీలు, లేఖలు, ఉన్నతాధికారులకు సమర్పించిన నివేదికలు, ఆంగ్లేయాధికారులు తిరుగుబాటు గురించి స్వయంగా రాసిన చరిత్ర గ్రంథాలు బహిర్గతం చేస్తున్నాయంటే, పురుషులకు దీటుగా సాగిన ఆ వీరనారీమణుల త్యాగాలు ఎంతటి మహత్తరమైనవో అర్థం చేసుకోవచ్చు.

★ ★ ★

## అధ్యాయం - 3



# మౌల్వీలు

**బ్రిటీష్** పాలకులపై ప్రథమ స్వాతంత్ర్య సమరానికి సుమారు వంద సంవత్సరాల ముందే స్వదేశీయులలో ఆంగ్లేయుల పట్ల వ్యతిరేకత వ్యక్తమైంది. ఈ వ్యతిరేకతకు ధార్మిక గురువులు తాత్విక భూమిక అందించారు. మొగల్ పాలకులు బలహీనపడుతూ, ఆంగ్లేయుల పెత్తనం అధికం కావడంతో ఏర్పడిన ప్రత్యేక పరిస్థితులు సామాన్య ప్రజలతోపాటుగా ధార్మిక సంస్థలను కూడా బాగా ప్రభావితం చేశాయి. ఆ కారణంగా పలు ధార్మిక మార్గాలను అనుసరిస్తున్న ప్రజలు గల బహుళ సంస్కృతుల సమాజంలో చోటు చేసుకుంటున్న ధార్మిక ప్రతిష్టంభనలను చవిచూసిన ధార్మిక పండితులు స్వదేశీయుల లౌకిక-ధార్మిక చింతనకు ఏర్పడుతున్న దుస్థితిని గమనించారు.

ఈ దుస్థితికి ఇటు స్వదేశీపాలకుల బలహీనతలు, పరాయి పాలకుల చర్యల తోపాటుగా అటు ఇస్లాం బోధించిన మౌలిక సూత్రాల నుండి స్వజనులు మార్గం తప్పుతున్న వైనాన్ని గుర్తించారు. ఈ జటిల సమస్యను పరిష్కరించేందుకు ఇటు ధార్మిక, అటు రాజకీయ రంగాలలో మార్పుల కోసం ఆలోచనలు చేశారు. ఆ ఆలోచనల పర్యవసానంగా పరదేశీయులను పాలద్రోలడం, మార్గం తప్పిన స్వజనులను ఇస్లాం ప్రబోధించిన

స్వచ్ఛమైన ధార్మిక మార్గంతో పయనింపచేడం ప్రధాన లక్ష్యంగా మౌల్వీలు (ఇస్లామియా ధార్మిక పండితులు) రంగ ప్రవేశం చేశారు.

## 1857కు పూర్వం

పూర్వ వైభవ ప్రాభవాలను కోల్పోతున్న మొగల్ సామ్రాజ్యం 1707లో ఔరంగజేబు మరణానంతరం మరింతగా బలహీనపడుతున్న సందర్భంగా ప్రముఖ ధార్మిక వేత్త షా వలీయుల్లా (1703-1762) రంగ ప్రవేశం చేశారు. ప్రభువుల నుండి ప్రజల వరకు దిగజారిపోతున్న ఆధ్యాత్మిక-నైతిక విలువల 'పునరుద్ధరణ' కు ఆయన నడుం కట్టారు. 1731లో మక్కాకు వెళ్ళివచ్చాక తన కార్యాచరణను నిర్దేశించుకుని ప్రజలను-పాలకులను సన్మార్గం దిశగా పయనింపచేసేందుకు ఆధ్యాత్మిక బోధనలను ఆరంభించారు. మానవ విలువలను ఉన్నతీకరించేందుకు ప్రత్యేక పద్ధతులలో ప్రచారం చేపట్టారు. ఈనాటికి కూడా ఎంతో ప్రగతిశీలంగా భావించదగిన ఆ బోధనలను **హుజ్జతుల్లాహిల్ బాలిఘాహ్** (Hujjatullahil Baligha) గ్రంథంలో షా వలీయుల్లా పొందుపర్చారు.

ఈ గ్రంథంలో **సంపదకు మూలం శ్రమ. సమాజ ఔన్నత్యం కోసం ఎవరైతే శారీరకంగా, మానసికంగా పాటుపడతారో వారు మాత్రమే సంపదను కలిగి ఉండదానికి, అనుభవించడానికి అర్హులు. ప్రజలంతా సమానులు. పాలకులు స్వేచ్ఛ-న్యాయ వ్యవహారాలలో సాధారణ పౌరుని కంటె ఎటువంటి ప్రత్యేకత కలిగి ఉండరు. ఆస్తిని సపాదించుకొనే హక్కు, స్వేచ్ఛ-భద్రతలను పొందు హక్కులను జాతి, మతం, రంగు వివక్షతలు లేకుండా ప్రజలంతా సమానంగా కలిగి ఉండాలి** అని ప్రవచించారు. ఈ ప్రవచనాలు ప్రజలను బాగా ఆకర్షించాయి. ఆ కారణంగా సామాన్య ప్రజల నుండి ప్రముఖుల వరకు ఆయనకు శిష్యగణం ఏర్పడింది. (**Untold history of Freedom Struggle**, M.Burhanuddin Qasmi, Milli Gazette,16-31 May, 2007, P.4).

ప్రముఖ ధార్మికవేత్త షా వలీయుల్లా తాత్విక బోధనల ప్రచారం ఇలా సాగు తుండగా బెంగాలుకు చెందిన ఇస్లామియా ధార్మిక వేత్త మజ్నూషా ఫకీర్ 1763లో ఆంగ్లేయుల ప్రజా వ్యతిరేక విధానాలకు వ్యతిరేకంగా తిరుగుబాటు పతాకాన్ని ఎగుర వేశారు. ఆంగ్లేయులు సామాన్య ప్రజలకు ఇబ్బందులు కలుగ చేస్తూ ప్రజల ధార్మిక విషయాల్లో జోక్యం చేసుకుంటూ, హిందూ-ముస్లిం ధార్మిక సంస్థలకు మొగల్ ప్రభువులు

కల్పించిన ప్రత్యేక సదుపాయాలను హరించివేయడం ఆరంభించారు. ఈ చర్యలు ప్రజలను తిరుగుబాటుకు ప్రోత్సహించగా మజ్నూషా ఫకీర్ లాంటి ధార్మికవేత్తలు ఆ తిరుగుబాటుకు నాయకత్వం వహించారు. ఈ తిరుగుబాటులో శ్రీ భవాని పాథక్ నాయకత్వంలోని సన్యాసులు కూడా కలసి రావటంతో ఇది **ఫకీర్లు-సన్యాసుల ఉద్యమం** గా ఖ్యాతిగాంచింది. ఈ తిరుగుబాటు 1800 వరకు సాగింది.

ఫకీర్లు-సన్యాసుల ఉద్యమం ఉత్తర భారతంలో ఇలా సాగుతుండగా దక్షణ భారతదేశంలో బ్రిటీషర్ల రాజ్యవిస్తరణ కాంక్ష వలన రానున్న ప్రమాదాలను పసిగట్టి తిరుగులేని పోరాటం సాగించిన మైసూరు పులి టిపూ సుల్తాన్ యుద్ధరంగంలో శత్రువుతో పోరాడుతూ 1799లో అమరుడయ్యారు. ఆయన తరువాత ఒక వ్యక్తిగా ఆంగ్లేయులను ఎదుర్కొనగల శక్తివంతులు దేశ రాజకీయ చిత్రపటంలో చాలా కాలం వరకు కన్పించలేదు.

1803 ప్రాంతంలో కలకత్తా నుండి బ్రిటీష్ సైన్యం ఢిల్లీ నగర ప్రవేశించి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనను స్థిరపర్చుకుంది. ఆ సమయంలో షా వలీయుల్లా తనయుడు అబ్దుల్ అజీజ్ దెహల్వీ రంగం మీదకు వచ్చారు. **మన దేశం బానిసయ్యింది. స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాడి బానిసత్వాన్ని అంతం చేయటం మన విధి** అంటూ బ్రిటీషర్లకు వ్యతిరేకంగా ధర్మపోరాటానికి పిలుపునిస్తూ ఫత్వాను జారీచేశారు. ఆ ప్రకటన ఆ తరువాత ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ముస్లిం ధార్మికవేత్తల నాయకత్వంలో సాగిన పలు పోరాటాలకు భూమికయ్యింది. ఈ విధంగా ప్రజల మీద విస్తృత ప్రభావం గల ధార్మిక పండితులు మొదటి సారిగా ఆంగ్లేయుల మీద తిరగబడాల్సిందిగా పిలుపునిచ్చారు.

ఆ పిలుపుతో మరింత ప్రేరణ పొందిన ముస్లిం యోధులు, ఫకీర్లు-సన్యాసుల ఉద్యమం సమాప్తమైన రెండు దశాబ్దాల కాలంలోనే బ్రిటీష్ పాలకులను ఎదిరించేందుకు మళ్ళీ సిద్ధమయ్యారు. ఈసారి ఆ పోరుకు సయ్యద్ అహమ్మద్ బరేల్వి మార్గదర్శకత్వం వహించారు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రం రాయ్‌బరేలీకి చెందిన సయ్యద్ అహ్మద్ బరేల్వీ (1786-1831) ఆరంభించిన తిరుగుబాటు ఆ తరువాతి కాలంలో **వహాబీ ఉద్యమం** గా ఖ్యాతిగాంచింది. ఉత్తర భారతదేశంలో మాత్రమే కాకుండా వాయువ్య సరిహద్దు ప్రాంతాలలో, దక్షణాదినా పలు ప్రాంతాలకు కూడా విస్తరించి ఉద్యమానికి కార్యకర్తలు ఏర్పడటంతో **వహాబీ ఉద్యమం** ఇటు ఇస్లాంలో స్వచ్ఛతను కాపాడేందుకు, మార్గభ్రష్టత్వం చెందిన ముస్లింలకు సన్మార్గం చూపే ప్రయత్నంతోపాటుగా అటు బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో సాహసోపేత చరిత్రను సృష్టించింది.

సయ్యద్ అహ్మద్ బరేల్వి 1818 నుండి 1821 వరకు దేశ పర్యటన గావించారు. 1824లో వాయువ్యసరిహద్దు ప్రాంతంలోని గిరిజన జాతులతో స్నేహం కలిపి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం ఆంగ్లేయులు, వారి తొత్తుల మీద పోరాటం ఆరంభించారు. ఈ ప్రయత్నాలకు పరాకాష్టగా 1827 జనవరి 10న తాత్కాలిక ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశారు. ఈ విధంగా ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల ఆధిపత్యాన్ని నిరాకరిస్తూ వ్యవస్థాగత రూపంలో **బ్రిటీష్ వ్యతిరేక స్వతంత్ర ప్రభుత్వం** ఏర్పాటు చేయడం భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ప్రథమమని చెప్పవచ్చు.

ఆ క్రమంలో బ్రిటీషర్లకు వ్యతిరేకంగా మాత్రమే కాకుండా ఆంగ్లేయుల అడుగులకు మడుగులొత్తుతూ వారి మద్దతుతో పాలన చేస్తూ ముస్లింలను ఇక్కట్ల పాల్జేస్తున్న పంజాబ్ పాలకుడు రాజా రంజిత్ సింగ్‌కు వ్యతిరేకంగా సయ్యద్ అహ్మద్ బరేల్వి ఆయుధం చేపట్టారు. 1831 మే 6న బాల్‌కోట్ వద్ద రాజా రంజిత్ సింగ్ సైన్యాలతో ఆయన భీకర పోరాటం సాగించారు.

ఈ పోరాటంలో సయ్యద్ అహ్మద్ బరేల్వితోపాటుగా ఆయన ప్రధాన సహచరులు షా ఇస్మాయిల్ షహీద్, ఆయన సహచరులు మరో మూడు వందల మంది అమరత్వం పొందారు. ఈ పరాజయం తరువాత కూడా వహాబీలుగా ఖ్యాతిగాంచిన సయ్యద్ అహ్మద్ బరేల్వి అనుచరులు వాయువ్యసరిహద్దు ప్రాంతాలు, బీహార్‌లోని పాట్నా ప్రధాన స్థావరాలుగా చేసుకుని బ్రిటీషర్లకు వ్యతిరేకంగా తిరుగులేని పోరాటం కొనసాగించి స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తమకంటూ ప్రత్యేక అధ్యాయాలను సృష్టించుకున్నారు.

ఈ పోరాటాలు ఇలా సాగుతుండగా ఫరీద్‌పూర్‌కు చెందిన పీర్ షరియతుల్లా (1781-1840) నేతృత్వంలో 1804లో మరో పోరాటం ప్రారంభమైంది. ఇస్లాం ప్రకారంగా తప్పకుండా అనుసరించాల్సిన ఆచార సంప్రదాయల అనుసరణ మీద, అందుకు విరుద్ధంగా ప్రవర్తిస్తున్న స్వజనం తీరుతెన్నుల మీద షరియతుల్లా తొలిదశలో దృష్టి సారించారు. ఆ తరువాత ఈస్ట్ ఇండియా కంపెనీకి తొత్తులైన జమీందార్లు, వడ్డీ వ్యాపారులు, తేయాకు తోటల యజమానులు ఆ ప్రాంతం రైతుల మీద, సామాన్య జనం మీద సాగిస్తున్న పీడనకు వ్యతిరేకంగా ఈ తిరుగుబాటు ప్రారంభమైంది.

బ్రిటీషర్ల మీద పోరాటం ప్రతి ముస్లింకు **ఫర్జ్** గా (తప్పనిసరియైనది) షరియతుల్లా ప్రకటించారు. ఆ కారణంగా ఉద్యమకారుల అస్త్రశస్త్రాలు బ్రిటీష్ వలస

పాలకులవైపు గురి పెట్టబడ్డాయి. ఈ విధంగా ముస్లింల ఆచార సంప్రదాయాలలో ఖచ్చితంగా పాటించాల్సిన పద్ధతులను నిర్దేశిస్తూ, పరాయి పాలకులైన ఆంగ్లేయుల మీద పోరాటాన్ని ఫర్జ్ గా ప్రకటించినందున ఈ ఉద్యమం **ఫరైజీ ఉద్యమం**గా చరిత్రలో ఖ్యాతిగాంచింది.

ఈ ఉద్యమానికి హాజీ పీర్ షరియతుల్లా శ్రీకారం చుట్టినప్పటికీ ఆ ఉద్యమాన్ని సమరశీల పోరాటంగా మార్చి బ్రిటీషర్లను ఖంగు తిన్పించిన మహాయోధుడు దూదు మియా (1819–1859). ఆయన నేతృత్వంలో రైతాంగం, వివిధ వృత్తుల సామాన్య ప్రజలు, పలు సాంఘిక జనసమూహాలు కలసికట్టుగా ఆయన వెంట నడిచారు. ఆ



ఆంగ్ల సైన్యాలతో పోరాడుతున్న యోధులు

కారణంగా అతి త్వరలో ఫరాజీల పోరాటం పలు ప్రాంతాలకు వ్యాపించి 1830 నుండి 1900 వరకు సాగింది. ఈ పోరాటంలో దూదు మియాకు వారసులుగా నోయామియా, బనీ అమీర్ మియా తదితరులు ప్రధాన భాగస్వామ్యం వహించారు.

## 1857 నాటి పాత్ర

1857 నాటికి చాలా పూర్వమే చిగురుతొడిగి, బ్రిటీషర్లను తీవ్ర ఆందోళనకు గురిచేసిన ఈ పోరాటాలు ప్రారంభదశలో మతం పునాదుల మీద, మత సంస్కరణలు ప్రధాన లక్ష్యంగా, ధార్మిక పండితుల నాయకత్వంలో ఆరంభం కావటం గమనార్హం.

స్వచ్ఛమైన ఇస్లాం ఆచార సాంప్రదాయాలను ప్రజల చేత అనుసరింప చేయాలన్న ప్రధాన ఉద్దేశ్యంతో ధార్మికవేత్తలు తమ ఉద్యమాలను ఆరంభించినప్పటికీ ఆ తరువాత ప్రజల ధార్మిక విషయాలలో ఆంగ్లేయుల జోక్యం, ఆంగ్లేయాధికారుల దోపిడి, వలస పాలకుల రాజ్యవిస్తరణ కాంక్షకు తమ ప్రజలు, తమ ప్రదేశాలు, తమ ధార్మిక సంస్థలు గురికావడం గమనించి అచిరకాలంలో ఆ తిరుగుబాట్లు కాస్తా తమ దశను-దిశను మార్చుకున్నాయి. ఈ ధార్మిక పండితులంతా బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడటం ముస్లింల ధార్మిక విధిగా కూడా ప్రకటించటంతో ప్రజల భౌతిక అవసరాలు, ఆధ్యాత్మిక ఇక్కట్లు ప్రజలను తిరుగుబాటు మార్గం పట్టించాయి. ఆధ్యాత్మిక మార్గదర్శనం తోపాటుగా పరాయి పాలకుల దాస్యం నుండి విముక్తి కల్పించాలన్న మహోత్తర లక్ష్యంతో ఆ ప్రజా ఉద్యమాల నాయకులు కంపెనీ పాలకులు, ఆ పాలకుల తొత్తుల మీద పోరాటాలకు బాటలు వేశారు.

## పోరుబాట నడవమంటూ ప్రజలకు పిలుపు

షా వలియుల్లా లాంటి ధార్మికవేత్తల ప్రబోధాల అనుసారంగా హాజీ షరియతుల్లా, సయ్యద్ అహ్మద్ బరేల్వీలు చూపిన బాటలో ఆయా ధార్మికవేత్తల అనుచరగణం నాటి పోరాట స్ఫూర్తిని వారసత్వంగా స్వీకరించి స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం తమ ప్రాణాలను బలిపెడుతూ ముందుకు సాగింది. ఆ క్రమంలో అలనాటి పోరాట యోధుల వారసులు 1857 నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో కూడా ప్రవేశించారు.

ప్రజలను పోరాట దిశగా నడిపించేందుకు బలమైన ఆధ్మాత్మిక ఇంధనాన్ని అందించటం మాత్రమే కాకుండా ఆంగ్లేయ వ్యతిరేకత ప్రధాన చోదకశక్తిగా ధార్మికవేత్తలు 1857నాటి పోరాటంలో బహుళ పాత్రలను సమర్థవంతంగా పోషించారు. పలు ప్రాంతాలలో మౌల్వీలు సాయుధంగా విముక్తి పోరాటంలో స్వయంగా పాల్గొన్నారు. తిరుగుబాటు యోధులతో కలసి తమ సొంతగడ్డకు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను ప్రసాదిం చేందుకు ఆయుధం చేబట్టారు. మరికొన్ని చోట్ల ఆయుధధారణ చేయడం మాత్రమే కాకుండా ఆంగ్లేయుల నుండి విముక్తి పొందిన ఆ ప్రాంతాల పరిపాలనా భారాన్ని కూడా స్వీకరించి విజయవంతంగా నిర్వహించారు. ఇంకొన్ని చోట్ల స్వదేశీ పాలకులు

సాగించిన పోరుకు సంపూర్ణంగా నైతిక మద్దతు ప్రకటిస్తూ ఆయుధాల స్థానంలో అక్షరాలతో ప్రచారం చేసి తగిన తోడ్పాటునందించారు.

## బదర్ విజయం ప్రేరణ

ఆంగ్ల ప్రభుత్వం మీద పోరాటం గురించి ఆలోచనలు చేస్తున్న మౌల్వీలు 1856లో ఢిల్లీలో సమావేశమయ్యారు. ఈ సమావేశంలో మౌలానా హాజి ఇమ్‌దాదుల్లా ముహాజిర్, మౌలానా ఖాసిం నానాతవి, మౌలానా రషీద్ అహ్మద్ గంగోహీ, మౌలానా జాఫర్ థానేశ్వరి, మౌలానా ముహమ్మద్ హాఫీజ్ జమీర్ అహ్మద్ తదితర ప్రముఖులు పాల్గొన్నారు. ఈ సమావేశంలో మౌలానా ఖాసిం నానాతవి ప్రసంగిస్తూ **బ్రిటీషు వారు మన నెత్తి మీద కూర్చున్న విషయం మీకు తెలియదా ? బ్రిటీష్ వారు భారత దేశం పై పూర్తిగా తమ పరిపాలనాధికారపు వలను పరిచియున్నారు. వారి బానిసత్వం నుంచి విముక్తిని పొందగోరుతున్నట్టయితే నిర్ణయాత్మక పోరాటంలో పాల్గొనండి. బ్రిటీషువారితో పోరాడుదాం. లేదా మరణిద్దాం. కాని బ్రిటీషు వారికి భారత దేశాన్ని పరిపాలించే అవకాశం ఇవ్వబోం** అని ప్రకటించారు. ఆయన అభిప్రాయంతో ఏకీభవించే వ్యక్తులు మిన్నకుండగా మౌలానా షేక్ ముహమ్మద్ మాట్లాడుతూ, ముస్లిం బలహీనతలు, ముస్లింల వద్ద తక్కువగా ఉన్న వనరులు, బ్రిటీష్ వారి బలగాలను, ఆయుధాలను ప్రస్తావిస్తూ బ్రిటీష్ వారితో తలపడటం నష్టదాయకం కాగలదన్న అభిప్రాయాన్ని వ్యక్తంచేశారు.

ఆ సందేహానికి సమాధానంగా మౌలానా నానాతవి మాట్లాడుతూ, బదర్ యుద్ధంలో పాల్గొన్న ప్రవక్త సహచరుల వద్ద ఆనాడు ఉన్న బలగాలు, వనరులను ఉటంకిస్తూ తక్కువ బలగాలు, అతి తక్కువ ఆయుధాలు, వనరులు ఉన్నా కూడా ప్రవక్త సాధించిన విజయాన్ని సమావేశంలో వివరించారు. ఆ వివరణతో సమావేశంలో అంతవరకు ఇతమిద్ధగా ఏదీ నిర్ణయించుకోలేక పోతున్న మౌలానా ఇమ్‌దాదుల్లా ముహాజిర్ మక్కి లాంటి వాళ్ళు వెంటనే పోరాటానికి సిద్ధమని ప్రకటించారు. మౌలానా షేక్ ముహమ్మద్ మాత్రం **బ్రిటీష్ వారితో యుద్ధం ప్రమాదకరం** అని తన అభిప్రాయాన్ని పునరుద్ఘాటించి మిన్నకుండిపోయారు.

ఈ సమావేశంలో మౌలానా ఖాసిం నానాతవి ప్రధాన సైన్యాధికారిగా ఆంగ్లేయుల మీద పోరాటం జరగాలని నిర్ణయమైంది. ఈ యుద్ధం రెండు స్థావరాల

నుండి సాగాలనీ అందులో ఒకటి షామ్లి కేంద్రంగా మౌలానా ఇందాదుల్లా ముహాజిర్ మక్కి నాయకత్వంలో, మౌలానా జాఫర్ థానేశ్వరి నాయకత్వంలో అంబాలా వేదికగా చేసుకుని మరొకటి జరగాలని సమావేశంలో పాల్గొన్న ఉలమాలు పథక రచన చేశారు. (**భారత స్వాతంత్ర్య సాధనలో ముస్లిం త్యాగాలు**, ఉర్దూ కూర్పు : మౌలానా ముహమ్మద్ ఉబైదుర్రహ్మాన్, తెలుగుసేత : అఫ్రోజ్ అహ్మద్, ఇస్లాం కాంతి ప్రచురణలు, విజయవాడ, 2002, పేజి. 14)

ఈ ధార్మిక పండితులలో ఫిరంగీ మహల్ (లక్నో) కు చెందిన ప్రముఖ ధార్మికవేత్త మౌలానా ఫజలుల్ హక్ ఖైరతాబాది బ్రిటీష్ వ్యతిరేక భావాల ప్రచారంలో రచనా పరంగా ప్రధాన భూమిక నిర్వహించారు. ఆయన నిర్వహిస్తున్న ప్రభుత్వ పదవిని త్యాగం చేసి 1857 తిరుగుబాటు సమయంలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో కలం యోధునిగా తనవంతు పాత్ర నిర్వహించారు. ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామ సర్వసైన్యాని ముహమ్మద్ భక్త్ ఖాన్‌ను కలిసి ఆయనతో తిరుగుబాటు తీరుతెన్నుల గురించి చర్చించారు. చక్రవర్తి బహదూర్ షా జఫర్ ఆయనతో పలు విషయాల మీద సలహాలు సంప్రదింపులు జరిపారు. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా ఆయన సాగించిన ప్రచారం ఫలితంగా పలువురు మౌల్వీలు వచ్చి ఆయనతో చేతులు కలిపారు. ఆంగ్లేయుల మీద యుద్ధం అనివార్యమని, ఇది ధార్మికంగా కూడా ప్రతి ముస్లిం విధి అని ఆయన ప్రకటించారు.

ఈ ప్రకటనకు స్పందించిన మౌల్వి అబ్దుల్ ఖదీర్, ఖ్వాజి ఫైజ్ అహ్మద్ బదౌని, మౌల్వీ ముబారక్ అలీ రాంపూరి, ముఫ్తి సద్రుద్దీన్, డాక్టర్ వజీర్ అక్బరాబాది తదితరులు తిరుగుబాటు దిశగా ఆయన వెంట నడిచారు. (**Muslims and India's Freedom Movement**, Shan Muhammad, IOS, New Delhi, 2002, Page.22) ఈ సమావేశాల పర్యవసానంగా బ్రిటీషర్ల మీద తిరుగుబాటుకు సమాయత్తం కావడం **ప్రతి ముస్లిం విధి**గా ప్రకటిస్తూ మొత్తం మీద 30 మంది మౌల్వీల సంతకంతో ఫత్వా వెలువడింది.

ఈ విధంగా ఇస్లామియా పండితులు ఫత్వా జారీచేయటంతో అధికారులు ఖంగుతిన్నారు. మౌల్వీలతో ఎంతో కాలంగా పలు క్లిష్టతరమైన పోరాటాలు చేస్తూ వచ్చిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు, ఇటువంటి యుద్ధ పిలుపును హిందూ పండితులు

ఇంతవరకు ఇవ్వలేదని, ముస్లిం ధార్మిక పండితులు ఈ విధంగా ధర్మపోరాటానికి ముస్లింలను ప్రేరేపించటం వెనక ముస్లింల కుట్ర దాగుందని ప్రకటించారు. మౌల్వీల ఈ ఫత్వా ఆంగ్లేయాధికారుల మీద చాలా ప్రభావాన్ని చూపించింది.

ఆ కారణంగా బహదూర్ షా జఫర్ మీద విచారణ జరిపిన ఆంగ్లేయాధికారి Lt. Colonel, President M.Dawes, Deputy Judge Advocate, Major F.J Harriott లు 1858 మార్చి 9వ తేదినాటి తమ సుదీర్ఘ నివేదికలో ఈ విషయాన్ని చాలా స్పష్టంగా వివరిస్తూ, '..We came upon traces of Mussulman intrigue wherever our investigation has carried us, yet not one paper has been



ఒంటరైనా భీతినొందక ఆంగ్ల సైనికులతో భీకరపోరు సాగిస్తున్న స్వదేశీ యోధుడు

found to show that the Hindus, as a body, had been conspiring against us, or that their Brahmans and priests had been preaching a crusade against *(us)* .', ( **The Penguin 1857 Reader**, Ed. Pramod K. Nayar, Penguin Books, 2007 P. 241) అని పేర్కొన్నారు.

## 1857 సాయుధపోరులో మౌల్వీలు

1856 నాటి ఢిల్లీ సమావేశంలో తీసుకున్న నిర్ణయం మేరకు 1857 నాటి

సంగ్రామంలో స్వయంగా పాల్గొని ఆంగ్ల సైన్యాలతో తలపడిన ధార్మికవేత్తలలో ఉత్తరాదికి చెందిన మౌలానా హాజి ఇమ్‌దాదుల్లా ముహాజిర్, మౌలానా ఖాసిం నానాతవి, మౌలానా రషీద్ అహ్మద్ గంగోహీ, మౌలానా అబ్దుల్ హాయ్ ఉన్నారు. ఢిల్లీ సమావేశంతో సంబంధం లేకున్నా ఆంగ్లేయుల మీద ఉన్న వ్యతిరేకత భూమికగా మౌలానా ఫజలుల్ హాఖ్ ఖైరతాబాది, మౌల్వి అహ్మదుల్లా షా ఫైజాబాది, మౌల్వి లియాఖత్ అలీ ఖాన్ తదితరులు పోరుబాట నడవగా దక్షణాదికి చెందిన మౌల్వీ అల్లావుద్దీన్, మౌల్వీ ఇబ్రాహీం, మౌల్వీ అక్బర్ తదితరులను బ్రిటీష్ వారితో తలపడిన ఇస్లామియా పండితులలో ప్రముఖులుగా పేర్కొనవచ్చు.

మౌలానా హాజి ఇమ్‌దాదుల్లా ముహాజిర్, మౌలనా ఖాశిం నానాతవి, మౌలానా రషీద్ అహ్మద్ గంగోహీ, మౌలానా అబ్దుల్ హాయ్ తదితరులు ఉత్తరప్రదేశ్‌లోని షామ్లి కేంద్రంగా సాగిన సమరంలో ప్రధాన పాత్ర వహించారు. మౌల్వి అహ్మదుల్లా షా ఫైజాబాది ఉత్తర హిందూస్థానంలోని పలు ప్రాంతాలలో ఆంగ్ల సైన్యాలను పరాజితులను చేసిన మహాయోధుడు. మౌల్వీ లియాఖత్ అలీ అలహాబాద్‌ను కేంద్రంగా చేసుకుని విముక్తి పోరాటంలో విజయం సాధించిన పండితుడు.

మౌల్వీ సర్ఫ్రాజ్ అలీ లాంటి ధార్మికులు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సర్వసైన్యాధికారి భక్త్‌ఖాన్‌ను ఆంగ్లేయుల మీద పోరుసాగించమని ప్రోత్సహించిన సాహసి. ఢిల్లీ కేంద్రంగా చాలా కాలం గడపిన ఆయన ఆంగ్లేయుల మీద తిరబడమని ప్రజలను ప్రేరేపించారు. ముఫ్తి సదరుద్దీన్ ఖాన్ తిరుగుబాటు సమయంలో ఇటు ప్రజలకు అటు తిరుగుబాటు యోధులకు సంధానకర్తగా వ్యవహరించారు. 1857 అగస్టు ఒకటిన బక్రీద్ పండగ సందర్భంగా ఖుర్బాని విషయంతో తలెత్తిన వివాదాన్ని ఆయన సామరస్యంగా పరిష్కరించి తిరుగుబాటు యోధులలో చీలికను నివారించారు.

మౌల్వీ అల్లావుద్దీన్ హైదరాబాదు రెసిడెన్సీ మీద జరిగిన దాడిలో ప్రముఖ పాత్ర వహించగా మౌల్వీ ఇబ్రాహీం ఆనాటి పోరాట యోధులను ఉత్తేజపర్చుతూ తిరుగుబాటు పతాకంతో విప్లవకారులను ముందుకు నడిపిన యోధుడు కాగా మౌల్వీ అక్బర్ ప్రజలలో స్వేచ్ఛ-స్వాతంత్ర్యాభిలాషను రగిలించేందుకు సాహసోపేత చర్యలకు పూనుకున్న నిర్భయుడు.

# విప్లవ కేంద్రం థానా భవన్

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను పోరుబాట నడిపిన మౌలానా ఖాశిం నానాతవి (Moulana Qasim Nanawtawi) షామ్లి కేంద్రంగా విప్లవ కార్యకలాపాలను సాగించారు. రాజకీయంగా–ఆధ్యాత్మికంగా–సామాజికంగా సంస్కరణలను ఆశించే, విప్లవాత్మక భావాలు గల మౌల్వి ఖాసిం ఆంగ్లేయులకు బద్ధ వ్యతిరేకి. ఆధ్యాత్మిక–సాంఘిక సంస్కరణలో తన వ్యతిరేకులను ఏమాత్రం లెక్కచేయక ముందుకు సాగిన ఆయన ఆంగ్లేయులకు వ్యతిరేకంగా విప్లవకర పంథాను అనుసరించారు.

మీరట్‌లో రగిలిన తిరుగుబాటు ఢిల్లీ చేరి ఆంగ్లేయుల చెర నుండి ఢిల్లీ విముక్తం కాగానే మౌలానా నానాతవి తిరుగుబాటుకు పథక రచనచేసి పరాయి పాలకులకు వ్యతిరేకంగా పోరుబాట నడవాల్సిందిగా ప్రజలకు **బహిరంగంగా** విజ్ఞప్తి చేశారు. ఈ వినతి మేరకు స్వాతంత్ర్య సంగ్రామ యోధులైన మౌలానా రషీద్ అహ్మద్ గంగోహీ, మౌలానా అబ్దుల్ హయ్, మౌలానా హాజి ఇమ్మాదుల్లా ముహాజిర్ ఆయన వెంట నడిచారు. మౌలానా నానాతవి సహచరులలో ఒకరైన మౌలానా షేక్ ముహమ్మద్ మాత్రం ఆంగ్లేయులతో యుద్ధం వినాశకరం కాగలదన్న అభిప్రాయం మీద స్థిరంగా ఉండిపోయారు. ఆ విధంగా వ్యతిరేక అభిప్రాయాన్ని వ్యక్తం చేసినా ఆయన నానాతవి వెంట నడవటం మాత్రం వీడలేదు.

ఈ యోధులంతా ఉత్తర ప్రదేశ్‌లోని థానాభవన్ (Thana Bhavan) లో కలసి ఆంగ్లేయుల మీద పోరాటానికి పథక రచన చేశారు. ఆంగ్లేయుల మీద పోరుకు సిద్ధపడిన అనుచరులను, ప్రజలను సమీకరించారు. మౌలానా వానాతవి 'కమాండర్–ఇన్–చీఫ్' (సర్వసైన్యాధ్యక్షులు) గా భాధ్యతలు చేపట్టారు. మౌలానా ఇమ్‌దాదుల్లా మహాజిర్ కమాండర్‌గానూ, మౌలానా ముహమ్మద్ మునీర్, మౌలానా ముహమ్మద్ హఫీజ్ జమీర్ అహ్మద్‌లు రెండు బెటాలియన్లకు నాయకులుగానూ నియమితులయ్యారు.

ఈ స్వదేశీ సైన్యానికి చక్రవర్తి బహదూర్ షా జఫర్ నుండి అధికారిక గుర్తింపు కోసం మౌలానా నానాతవి ప్రయత్నాలు ఆరంభించారు. ఆయన ఢిల్లీ చక్రవర్తి జఫర్‌కు లేఖ రాస్తూ చక్రవర్తి ప్రతినిధులుగా ఆంగ్లేయుల మీద పోరాటం సాగించేందుకు అనుమతి అర్థించారు. ఆ ప్రయత్నాలలో భాగంగా నవాబ్ షబ్బీర్ అలీ సహకారంతో

చక్రవర్తి నుండి గుర్తింపు పొందారు. ఈ గుర్తింపుతో మౌలానా ఖాసిం నానాతవి పోరాటం విముక్తి పోరాటంలో భాగమయ్యింది. ఈ పరిణామంతో తిరుగుబాటు నాయకులలో, స్వదేశీ సైనికులలో ఎనలేని ఉత్సాహంతోపాటు ఆత్మవిశ్వాసం మరింతగా పటిష్టపడింది. (**Deoband Ulema's Movement for the Freedom of India**, Farhat Tabssam, Manak, New Delhi, 2006, P. 7)

## బాగ్-యే-షేర్ అలీ దాడి

ఆంగ్ల సైన్యాలు ఉత్తర ప్రదేశ్‌లోని షహరాన్‌పూర్ మీద దాడికి వెడుతున్నాయని మౌలానా నానాతవికి సమాచారం అదింది. ఆత్మవిశ్వాసంగల యోధులున్నా ఆయుధాలు లేకపోవటంతో స్వదేశీ యోధులలో ఆందోళన వ్యక్తమైంది. ఆ ఆందోళన నుండి **బాగ్-యే-షేర్ అలీ రోడ్డు దాడి** ఆలోచన వారిలో కల్గింది. ఆంగ్ల సైన్యం షహరాన్‌పూర్‌కు బాగ్-యే-షేర్ అలీ రోడ్డు గుండా పోవాలి. అ సమయంలో ఆంగ్ల సైన్యాల మీద సాహసిక దాడి జరిపి ఆయుధాలను కొల్లగొట్టాలని నిర్ణయమైంది. ఆ నిర్ణయం మేరకు మౌలానా ఇమ్‌దాదుల్లా నాయకత్వంలో 30-40 వరకు గల మెరికల్లాంటి యోధులు సిద్ధమయ్యారు. బాగ్-యే-షేర్ అలీ రోడ్డుకు ఇరుపక్కల గల తోటలోని గుబురు చెట్లలో విప్లవ యోధులు దాక్కొన్నారు. ఆంగ్ల సైన్యం దరిదాపులకు రాగానే మౌలానా ఇమ్‌దాదుల్లా ఆదేశాల మేరకు దాడి ఆకస్మికంగా ఆరంభమైంది. ఈ హఠాత్పరిణామానికి ఆంగ్ల సైన్యం కకావికలైంది.

ఈ సాహసిక దాడిలో స్వదేశీ యోధులకు విజయం లభించింది. మౌల్వీల వ్యూహరచన, సహచరుల ధైర్యసాహసాల ఫలితంగా కొన్ని ఆయుధాలు, ఒక ఫిరంగిని స్వదేశీ బలగాలు చేజిక్కించుకోగలిగాయి. శత్రు పక్షంలో ఒక సైనికుడు మృతి చెందగా స్వపక్షంలో ఎటువంటి నష్టం జరగకుండా విప్లవకారులు తమ స్థావరం చేరుకున్నారు. ఈ విధంగా విజయవంతమైన బాగ్-యే-షేర్ అలీ రోడ్డు (Bagh-e-Sher-Ali Road) దాడి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో ప్రత్యేక స్థానాన్ని సంతరించుకుంది. ఈ విధంగా ఖురాన్, హదీసుల జ్ఞానాన్ని పదిమందికీ పంచుతూ ఆధ్యాత్మిక బోధన ప్రధాన వ్యాపకంగా జీవితాలను గడిపే మౌల్వీలు పరాయి పాలకుల తరిమివేతకు ఆయుధాలు చేపట్టి సాహసిక ధాడిలో పాల్గొని సంచలనం సృష్టించారు.

ఏనాడూ ఊహించని రీతిలో, ఊహించని వర్గాల నుండి సాహసిక సాయుధ దాడి జరగటంతో ఆంగ్లేయాధికారులు ఆందోళన చెందటంతోపాటుగా ఆశ్చర్యానికి గురయ్యారు. ఎన్నడూ లేని విధంగా ఆంగ్ల సైన్యాలను గుప్పెడు మంది ఎదిరించటం ఆయుధాలను ఎత్తుకెళ్ళటం ఆంగ్లేయాధికారులకు తీవ్ర అవమానంగా తోచింది. ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు ఈ చర్యను తీవ్రంగా తీసుకున్నారు. ఈ చర్యకు ప్రతీకారంగా బాగ్-యే-షేర్ అలీ రోడ్డు (Bagh-e-Sher-Ali Road) దాడిలో పాల్గొన్న వారందర్ని తుదముట్టించాలన్న నిర్ణయానికి వచ్చారు. ఆ నిర్ణయం మేరకు ముజఫర్‌పూర్ కలక్టర్ షామ్లిలో గల థానా భవన్ ముట్టడికి ఆదేశాలు జారీచేశాడు.



మాతృభూమి సంరక్షణలో విజయమో వీర స్వర్గమో అంటూ తెగించి పోరాడుతున్న స్వదేశీ యోధులు

## చరిత్ర సృష్టించిన షామ్లి యుద్ధం

ఆంగ్ల సైన్యం విప్లవకారుల మీద దాడి జరిపేందుకు షామ్లికి బయలుదేరింది. ఆధునిక ఆయుధాలూ, అపార సైనికబలగం, ప్రత్యేక శిక్షణ పొందిన ఆంగ్లేయాధికారుల నాయకత్వంలో ఆంగ్ల సైన్యాలు షామ్లి చేరుకుని షామ్లి కోటను ఆక్రమించుకున్నాయి. స్వదేశీ యోధుల స్థావరంగా పేర్గాంచిన థానా భవన్‌ను పూర్తిగా చుట్టుముట్టాయి.

ఈ విషయం తెలుసుకున్న మౌలానా ఇమ్‌దాదుల్లా, మౌలానా ఖాశిం నానాతవిలు యుద్ధానికి సిద్ధమయ్యారు. అందుబాటులో ఉన్న యోధులను పోరాటానికి

సన్నద్ధులను చేసి శత్రువుతో తలపడేందుకు తయారయ్యారు. ఈ ముట్టడి విషయం తెలుసుకున్న మౌలానా శిష్యులు, అనుచరులు, సహచరులు, ప్రజలు పెద్ద సంఖ్యలో షామ్లి వైపుకు తరలి వచ్చారు. ఈ విధంగా షామ్లికి వచ్చిన యోధులు మౌలానా ఖాసిం, మౌలానా ఇమ్‌దాదుల్లాల నాయకత్వంలో శత్రువుతో అమీతుమీ తేల్చుకోడానికి ఏకమయ్యారు.

ఆధునిక ఆయుధాలు లేకపోయినా దొరకబుచ్చుకున్న ఆయుధాలతో, ఆత్మ విశ్వాసంతో యుద్ధానికి సిద్ధమై వచ్చిన స్వదేశీ యోధులు షామ్లిలోని ఒక మసీదును తమ స్థావరంగా చేసుకున్నారు. ఆ స్థావరం నుండి ఆంగ్ల సైన్యాలు మాటువేసి ఉన్న షామ్లి కోట (Shamli Gerri) మీదకు దాడిని ఆరంభించారు. ఈ పోరాటంలో మౌలానా ఖాశిం నానాతవి, మౌలానా ఇమాం రబ్బాని, మౌలానా రషీద్ అహ్మద్ గంగోహి ఎంతో సాహసంతో వ్యవహరించారు.

ఆంగ్ల సైనికులున్న షామ్లి కోటకు ప్రహరీగోడ లేకపోవటంతో అన్ని వైపుల నుండి ఆంగ్ల సైనికులు స్వదేశీ యోధుల మీద తుపాకి గుళ్ళను, ఫిరంగులతో నిప్పుల వర్షాన్ని కురిపించసాగారు. స్వదేశీ యోధులు కోటలో ప్రవేశించడానికి అవకాశం లభించలేదు. ఆ సమయంలో కోటలోని వెళ్ళడానికిగాను మౌలానా నానాతవి తన బలగాలను ముందుకు నడిపిస్తూ వేగంగా ముందుకు సాగారు. ఆయన స్వయంగా కోట గోడవారగా ఉన్న చప్పరం మీదుగా పైకి ఎక్కి కోట ప్రవేశం వద్దనున్న శత్రువుల ఫిరంగిని పేల్చి వేయడంలో కృతకృత్యులయ్యారు. ఆ కారణంగా స్వదేశీ యోధులు తేలిగ్గా కోటలోనికి ప్రవేశించగలిగారు.

ఈ విధంగా కోటలోకి ప్రవేశించిన స్వదేశీ యోధులు వీరోచితంగా శత్రువుతో ముఖాముఖి కలబడ్డారు. మాతృభూమి విముక్తి లక్ష్యంగా, పరాయిపాలకుల మీద కసితో పోరుబాటను ఎంచుకున్న యోధులతో కలబడటం ఆంగ్లేయుల కిరాయి సైనికులకు సాధ్యం కాలేదు. ఈ పోరాటంలో ఆంగ్ల సైనికుల మీద స్వదేశీ వీరులు పైచేయి సాధిం చారు. శత్రు సైనికులు పలాయనం చిత్తగించారు. స్వదేశీ యోధులు అతి సునాయాసంగా విజయం సాధించినా స్వదేశీ సైన్యంలోని ఒక దళానికి నాయకత్వం వహిస్తున్న యోధులు మౌలానా ముహమ్మద్ హాఫీజ్ జమీర్ అహ్మద్ కన్నుమూసారు. మౌలానా నానాతవి, మౌలానా రషీద్ అహ్మద్ గంగోహిలు గాయపడ్డారు.

ఈ పరాజయంతో ఆంగ్లేయాధికారులు ఆగ్రహోదగ్రులయ్యారు. ప్రతీకార జ్వాలతో రగిలిపోతున్న కంపెనీ అధికారులు భారీ సంఖ్యలో వచ్చి మరోసారి దాడి జరిపారు. ఆత్మవిశ్వాసం, సాహసం, నాయకత్వం పట్ల అంతులేని విధేయత తప్ప ఆయుధ శిక్షణగానీ, కనీస ఆయుధాలు గానీ లేని స్వదేశీ యోధులకు ఈసారి పరాజయం తప్పలేదు. చివరకు షామ్లి, థానా భవన్ ఆంగ్ల సైన్యాల పరమయ్యాయి. స్వదేశీయోధుల నేతలకు యుద్ధరంగం నుండి తప్పించుకోవడం మినహా మరో మార్గం లేకుండా పోయింది. ఆ విధంగా తప్పించుకున్న మౌలానా నానాతవి, మౌలానా ఇమ్దాదుల్లా, మౌలానా రషీద్ అహ్మద్ గంగోహిల కొరకు ఆంగ్లేయులు వేట ఆరంభించారు. విప్లవకారులను పట్టిచ్చిన వారికి భారీ నజరానాలు ప్రకటించారు. ప్రజల అండదండలతో స్వదేశీ యోధులు ఆంగ్ల సైన్యాలకు చిక్కకుండా తప్పించుకున్నారు.

ఆలా తప్పించుకున్న నాయకులలో మౌలానా ఇమ్దాదుల్లా కొన్ని రోజుల పాటు రహస్యంగా ఉంటూ ఆ తరువాత మక్కా వెళ్ళిపోయారు. మౌలానా నానాతవి మాత్రం మూడు రోజుల తరువాత అజ్ఞాతవాసం నుండి బయటకు వచ్చారు. ఆయన కోసం బ్రిటీష్ గూఢచారుల వేట ఇంకా కొనసాగుతున్నందున అజ్ఞాతంలోకి వెళ్ళాల్సిందిగా మిత్రులు సలహా ఇచ్చారు. **మూడు రోజుల కంటె ఎక్కువ కాలం అజ్ఞాతం లోకి (హిజ్రత్) వెళ్ళిపోవటం సున్నత్ యొక్క సాంప్రదాయం కాదు. ఎందుకంటే ప్రవక్త మక్కా నుండి మదీనాకు హిజ్రత్ చేసే సమయంలో సౌర్ గుహలో మూడు రోజులు మాత్రమే దాగియున్నారు** అంటూ మౌలానా బహిరంగంగా తిరగసాగారు. అయినా ఆయన పట్టుబడలేదు. (భారత స్వాతంత్ర్య సాధనలో ముస్లిం త్యాగాలు : పేజి.19 )

## పోరు సల్పమని ప్రజలకు ఫత్వా

ఈ విధంగా షామ్లి కేంద్రంగా సాగిన సాయుధ తిరుగుబాటు సమసిపోగా, ఫిరంగి మహల్‌కు చెందిన మరో ధార్మికవేత్త మౌలానా ఫజలుల్ హఖ్ ఖైరతాబాది (Moulana Fazal Huq Khairatabadi) తాను స్వయంగా కత్తి పట్టకున్నా తనకు ప్రజలలో ఉన్న పలుకుబడితో ప్రజలను పరాయి పాలకుల మీద తిరగబడాల్సిందిగా కోరుతూ కలంతో యుద్ధం ఆరంభించారు. ఆయన మౌలానా రషీద్ అహ్మద్ గంగోహితో కలసి ఆంగ్లేయలతో పోరు సల్పమని ప్రజలను కోరుతూ ఫత్వా జారీ చేశారు. ఈస్ట్

ఇండియా కంపెనీ ప్రభుత్వంలో మౌలానా ఫజల్ హఖ్ అధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్నా ప్రజలు ధర్మపోరాటానికి సిద్ధం కావాలని ఎంతో సాహసంతో ప్రకటించారు. (**Hindu-Muslim Question and Our Freedom Struggle**, KM Ashraf, Volume I, Sunrise Publications, New Delhi, 2005, P.18)

ఈ విధంగా ప్రకటించటం ఎంత ప్రమాదకరమో తెలిసి కూడా మౌలానా ఇమ్దాదుల్లా, మౌలానా ముహమ్మద్ హాఫీజ్ జమీర్ అహ్మద్ తదితరుల తోపాటుగా 30 మంది ప్రముఖ ధార్మిక పండితులు ఫత్వా మీద సంతకాలు చేసి తిరుగుబాటుకు తమ అంగీకారాన్ని తెలిపి ప్రజలను, తమ అనుచరులను బ్రిటీష్ పాలకుల మీద యుద్ధానికి పురికొల్పారు. (**Untold Story of Freedom Struggle** by M.Burhanuddin Qasmi Milli Gazette (Fortnightly), 16-31 May 2007, New Delhi, P. 4)

1857 పోరాటం ఆరంభం కాకముందే మౌల్వీలు తిరుబాటు భావాలను ప్రజలలో నాటడం ప్రారంభించారు. ఆ క్రమంలో చురుకుగా కృషి చేస్తున్న వహాబి ఉద్యమకారుడైన మౌల్వీ మహాది మీద ప్రజలను తిరుగుబాటుకు ప్రేరేపిస్తున్నాడన్న నేరారోపణ చేసి పాట్నా కలెక్టరు నిర్బంధించాడు. ఆ తరువాత షా ముహమ్మద్ హుసైన్, వాజుల్ హఖ్ అను ఇద్దరు మౌల్వీలను మంచి మాటలతో తన కార్యాలయానికి పిలిపించుకున్న కలెక్టరు వారిని నిర్బంధంలోకి తీసుకున్నాడు.

బ్రిటీషు వ్యతిరేక వాతావరణాన్ని 1857 ముందుగానే మౌల్వీలు సృష్టించి ఉండటంతో 1857 పోరు ఆరంభ కాగానే పాట్నాకు చెందిన గ్రంథ విక్రేత షేర్ అలీ నాయకత్వంలో పాట్నా కేంద్రంగా తిరుగుబాటు ప్రజ్వరిల్లింది. ఈ సంఘటను త్వరితగతిన అదుపులోకి తెచ్చిన ఆంగ్లేయాధికారులు పీర్ అలీతోపాటుగా సుమారు రెండు వందల మందిని బలి తీసుకున్నారు.

## ఆంగ్లేయులను పరుగులు పెట్టించిన అహ్మదుల్లా

మౌల్వీలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా షామ్లి కేంద్రంగా పోరాటం చేయగా అంతకంటె తీవ్ర స్థాయిలో ఉత్తర ప్రదేశ్‌లోని ఫైజాబాద్‌కు చెందిన ఇస్లామియా పండితుడు మౌల్వీ అహ్మదుల్లా షా ఫైజాబాది పరాయి పాలకులకు వ్యతిరేకంగా కత్తిపట్టి చరిత్ర సృష్టించారు. 16 ఏండ్ల వయస్సులోనే లండన్‌తో పాటుగా పలు విదేశాలను సందర్శించి

వచ్చిన ఆయన రాజపుతానాలో గల ఇస్లామిక్ పండితుల శిష్యరికంలో ఇస్లామియా ధార్మిక గ్రంథాలలో పరిజ్ఞానం సంపాదించారు. అనంతరం ధార్మిక ప్రచారం గావిస్తూ, గ్వాలియర్‌కు చెందిన గురుదేవులు హజ్రత్ మహరబ్ షా ఖలందర్ ఆదేశాల మేరకు స్వదేశీయుల మీద ఆంగ్లేయులు సాగిస్తున్న పెత్తనం, జులుం చూసి సహించలేకపోయారు. ఆగ్రాలోని ముఫ్తి ఇందాదుల్లా గృహాన్ని తన కేంద్రంగా చేసుకుని కలం స్థానంలో కత్తికి ప్రాధానత్యనిచ్చి ఆంగ్లేయుల మీద యుద్ధానికి ఆయన సిద్ధమయ్యారు.

ఆది నుండి ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని వ్యతిరేకిస్తూ వచ్చిన మౌల్వీని ప్రమాదరక వ్యక్తిగా పరిగణించి ఆంగ్లేయాధికారులు బంధించి చెరశాలలో వేశారు. 1857 జూన్‌లో



సమరశంఖారావం పూరించిన స్వదేశీ యోధులను ఫిరంగి గొట్టాలకుకట్టి పేల్చి వేస్తున్న ఆంగ్లేయులు

తిరగబడ్డ ప్రజలు ఆంగ్లేయుల చెరశాల నుండి ఆయనను విముక్తుడ్ని గావించారు. ఆ తరువాత ఆయన తన అనుచరులతో కలసి స్వంత సైన్యాన్ని తయారు చేసుకుని ఆంగ్లేయ సైనికులు తారసపడిన చోటల్లా వారిని ఎదుర్కొని పలుమార్లు మట్టి కరిపించారు.

ఈ పోరాటాలలో భాగంగా ఆయన స్వదేశీ యోధులైన నానాసాహెబ్, బేగం హజరత్ మహల్, షెహజాదా ఫిరోజ్‌షాల బలగాలకు తన బలగాలను తోడుచేసి ఆంగ్ల సైనికాధికారులను పరాజితులను చేశారు. ఈ యోధుని విక్రమాన్ని ఎదుర్కొలేకపోయిన కంపెనీ అధికారులకు ఆయనను పట్టిచ్చిన వారికి 50 వేల రూపాయల నజరానా

ప్రకటించాల్సిన దుస్థితి తటస్థించింది. నూటాయాభై సంవత్సరాల క్రితం ఒక వ్యక్తిని పట్టి బంధించి తెచ్చిన వారికి 50 వేల రూపాయల నజరానాను కంపెనీ ప్రకటించిందంటే, ఆ వ్యక్తి కంపెనీ పాలకుల మస్తిష్కాల్లోనూ, భౌతికంగా కంపెనీ సైనికల బలగాలల్లోనూ ఎంతటి భయోత్పాతాన్ని కల్గించాడో సులభంగా అర్థం చేసుకోవచ్చు.

ఈస్ట్ ఇండియా కంపెనీ చర్యలతో ఏమాత్రం భీతినొందని మౌల్వీ చివరి వరకు రాజీలేని పోరాటం సాగించారు. ఢిల్లీ కేంద్రంగా ఆరంభమైన తిరుగుబాటు సమసి పోవటం, స్వదేశీ పాలకుల పోరాటాలు నిర్వీర్యం అవుతున్న దశలో స్వదేశీ పాలకులను సమీకరించుకుని ఆంగ్ల సైన్యాలను మరింత బలంగా ఎదిరించాలని మౌల్వీ అహ్మదుల్లా భావించారు. ఆయన పోవెన్ రాజు జగన్నాథ్ సింహ్‌తో సంప్రదింపులు జరపాలను కున్నారు. ఆ ప్రయత్నాలలో భాగంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా స్వదేశీయులు సాగిస్తున్న పోరులో కలసిరావాల్సిందిగా జగన్నాథ్‌కు నచ్చ చెప్పేందుకు మౌల్వీ పోవెన్ వెళ్ళారు. ఆ సమయంలో జగన్నాద్ సింహ్ తమ్ముడొకడు మౌల్వీ మీద ఆకస్మికంగా కాల్పులు జరపటంతో ఆయన మృత్యువాతపడ్డారు.

ఈ విషయాన్ని విడి సావార్కర్ తన **1857** స్వరాజ్య సంగ్రామం లో ప్రస్తావిస్తూ, **'రాజా ప్రక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీ పై గురిచూసి కాల్పులు జరిపాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడైపోయాడు. ఆ పిరికిపందలు..మౌల్వీ శిరస్సు ఖండించి, దాని పై గుడ్డ కప్పుకొని చేరువనే 13 మైళ్ళ దూరాన ఉన్న బ్రిటీషు ఠాణా – షాజహాన్‌పూరుకు తీసుకువెళ్ళారు...రక్తం ఓడుతున్న ఆ పవిత్ర శిరాన్ని ఆ నీచులు ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి వారి పాదాల చెంత మోకరిల్లారు...నీచమైన దేశద్రోహానికి తలపడిన ఆ పోవెన్ పశువుకు 50 వేల రూపాయల పారితోషికం లభించింది!** అని రాశారు.

మౌల్వీ ఖండిత శిరస్సును తెప్పించుకుని చూసి ఆనందించిన అధికారులు, మౌల్వీ మరణాన్ని నిర్ధారించుకున్న తరువాత మాత్రమే **'ఉత్తర భారత దేశంలో బలిష్టమైన శత్రువును'** తొలగించుకోగలిగామని చెప్పుకున్నారు. ( The most formidable ememy of the British in Northern India ( **History of the Indian Mutiny** : General Holmes, P. 539) ఈ విధంగా మాతృభూమిని చెరపట్టిన పరాయి.పాలకుల మీద రాజీలేని పోరాటం సాగించిన మౌల్వీ అకుంఠిత దీక్షను, అద్వితీయ శక్తి సామర్థ్యాలను

బ్రిటీష్ సైనికాధికారులు, చరిత్రకారులు తమ నివేదికలలో, గ్రంథాలలో స్వయంగా సాక్షాత్కరింపజేశారు.

ఆయన కార్యక్రమాలలోని నిజాయితీని ప్రస్తావిస్తూ,' The Moulvi was a true patriot. He had not stained his sword with assassination. He had connived at no murders; he had fought manfully, honourably and stubbornly in the battle field against the strangers, who had seized his country, and his memory is entitled to the respect of the brave and the truehearted of all nations ' అని ఆంగ్లేయ అధికారులు మౌల్వీ అహ్మదుల్లా ఫైజాబాదిని ఎంతగానో కీర్తించాల్సి వచ్చింది. (**The Indian Mutiny of 1857** Vol. IV : Colonel G.B. Malleson, P.381 )

ఈ విధంగా ప్రఖ్యాత ఇస్లామియా పండితుడైన మౌల్వీ అహ్మదుల్లాషా ఫైజాబాది కలం స్థానంలో కత్తిపట్టి ఆంగ్లేయులను తుదముట్టించేందుకు స్వయంగా రణరంగ ప్రవేశం చేశారు. ఆయన ధైర్యసాహసాలు ఆనాడు ఇతర ప్రాంతాలలోని మౌల్వీలకు మాత్రమే కాకుండా స్వదేశీ పాలకులకు, సైనికులకు, ప్రజలకు గొప్ప ప్రేరణ అయ్యాయి.

మౌల్వీ ప్రేరణతో మౌలానా గులాం ఇమాం షహీద్, మౌల్వీ షేక్ అలీ బేగ్, మౌల్వీ ఇమాం బక్ష్ సాహబి, మౌల్వీ ఖ్వాజా తురబ్ అలీ, మౌలానా గులాం జిలాని, మౌల్వీ తుఫైల్ అహ్మద్ ఖైరతాబాది, మౌలనా ముహ్మద్ ఖాసిం దానాపూరి, మౌల్వీ ఫజల్ అహ్మద్ బదౌని, డాక్టర్ వజీర్ ఖాన్, మౌల్వీ కరీముల్లా షా లాంటి పలువురు ప్రముఖ ఇస్లామియా పండితులు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట సాగారు. (**Muslims and India's Freedom Movement**, Shan Muhammad, IOS, 2002 , Page.26)

## కలం స్థానంలో కత్తిపట్టిన ఉపాధ్యాయుడు

మౌల్వీ అహ్మదుల్లా ఫైజాబాది బాటలో నడిచిన వారిలో అలహాబాద్‌కు చెందిన మౌల్వీ లియాఖత్ అలీ ముఖ్యులు. ఆయన ధార్మిక పండితులు. ధార్మిక పాఠశాలల్లో, పలువురు ప్రముఖులకు ఆయన విద్యాబోధన చేశారు. ఈ క్రమంలో పలు ప్రాంతాలను సందర్శించిన మౌల్వీ స్వజనుల ఆంగ్ల అధికారులకు దాసోహం అంటున్న దుస్థితి చూశారు. ఆయన స్వయంగా ఆంగ్ల సైన్యంలో చేరి సైనికులను ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొట్ట సాగారు. ఆ కారణంగా ఆయనను సైన్యం నుండి తొలిగించారు. మంచి ధార్మిక

పరిజ్ఞానంగల ఆయన ధార్మిక భోధన ద్వారా ప్రజలకు చేరువయ్యారు. ఆ అవకాశాన్ని వినియోగించుకుని ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను రెచ్చగొట్టసాగారు.

ఆ విధంగా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగుతున్న మౌల్వీ లియాఖత్ అలీ ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో కలం స్థానంలో కత్తి పట్టారు. ఆయన స్వయంగా సాయుధుడై స్వదేశీ బలగాలను ముందుకు నడిపి ఆంగ్ల సైనికులతో పోరాడి అలహాబాద్‌ను ఆంగ్లేయుల చెరనుండి విముక్తం చేశారు. మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రతినిధిగా ప్రకటించి ఆయన స్వదేశీ పాలన సాగించారు.

మౌల్వీ గొప్ప వ్యూహకర్త మాత్రమే కాకుండా గొప్పకవి కూడా. ప్రజలను విముక్తి పోరాటం దిశగా నడిపించేందుకు, తిరుగుబాటు యోధులలో స్ఫూర్తిని కలుగ చేసేందుకు **పైగామ్-యే-అమల్** (ఆచరణ సందేశం) అను కవితను రాశారు. ఈ కవిత ద్వారా భారత దేశం ఔన్నత్యాన్ని ప్రశంసించటం మాత్రమే కాకుండా హిందూ-ముస్లిం-సిక్కుల మధ్య ఐక్యతను కోరారు. ఈ కవిత నానా సాహెబ్ ఆంతరంగి కుడు అజీముల్లా ఖాన్ తన సంపాదకత్వంలో ప్రచురితమైన **పయామే ఆజాది/ పైగామ్-యే-ఆజాది** అను పత్రికలో ప్రచురించారు.

ఈ పరిస్థితులను ఏమాత్రం జీర్ణించుకోలేక పోయిన ఆంగ్లేయాధికారులు సాయుధ బలగాలు, ఫిరంగులతో అలహాబాద్‌ను చుట్టుముట్టారు. శిక్షణ పొందిన సైనికులు లేకపోయినా, ఆయుధాలు అంతంత మాత్రంగానే ఉన్నా మౌల్వీ ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు. చివరకు చీమల దండులా ముంచుకొచ్చిన ఆంగ్ల సైనికులకు విజయం లభించింది. మౌల్వీ ఆంగ్ల సైనికుల కళ్ళుగప్పి 1857 జూన్ 17న అజ్ఞాతంలోకి వెళ్ళిపోయారు. ఆయనకు సంబధించిన సమాచారం అందిస్తే ఐదు వేల రూపాయల బహుమతిని కూడా ఆంగ్ల ప్రభుత్వం ప్రకటించినా ఆయనను నిర్బంధించటం చాలా కాలం వరకు సాధ్యం కాలేదు.

మౌల్వీ లియాఖత్ అలీ బొంబాయి చేరుకున్నారు. ఆ తరువాత కొంత కాలం గడిచాక వెంటాడుతున్న పోలీసులు అయనను అరెస్టు చేసి రాజద్రోహం, బ్రిటీష్ అధికారుల, సైనికుల హత్యా నేరం, ప్రజలను తిరుగుబాటుకు రెచ్చగొట్టడం మొదలైన నేరాలను కంపెనీ ప్రభుత్వం ఆరోపించింది. ఈ ఆరోపణల మీద 1857 జూలై 24న బొంబాయిలో విచారణ జరిగింది. ఈ విచారణ సందర్భంగా ఎంతో నిర్భయంగా మాతృభూమి పట్ల తనకున్న ప్రేమ, అభిమానాలను, వలస పాలకుల పట్ల ఉన్న విద్వేషాన్ని

స్పష్టంగా ప్రకటించారు. రాజద్రోహం నేరాన్ని ఆపాదించినందుకు తానేమీ చింతించడం లేదన్నారు. అలహాబాద్ పరగణాలోని బ్రిటీష్ అధికారుల దోపిడీ, అరాచకాల నుండి ప్రజలను కాపాడేందుకు ఆయుధం చేపట్టానని, ప్రజలను సమీకరించి తిరగబడ్డానని నిర్భయంగా పేర్కొన్నారు. బ్రిటీష్ పాలన అంతం కావాలన్నది తన లక్ష్యమనీ, బహదూర్ షా జఫర్‌ను మాత్రమే తాను చక్రవర్తిగా పరిగణిస్తాననీ మౌల్వీ ప్రకటించారు. బ్రిటీష్ పాలనను అంతం చేయాలన్న లక్ష్యంతోనే తాను పోరుబాట నడిచానన్నారు. ప్రజల తిరుగుబాటుకు నాయకత్వం వహించినందుకు చాలా గర్వపడుతున్నానని న్యాయమూర్తి ఎదుట అంగీకరించారు.



**ఆంగ్లేయుల నుండి మౌల్వీ లియాఖత్ అలీస్వాధీనం చేసుకున్న అలహాబాదులోని కోట**

భారతీయులు మానవతావాదులని, నైతిక విలువలకు అధిక ప్రాధాన్యతనిస్తారని ఆయన వివరిస్తూ, మహిళల పట్ల అత్యంత గౌరవం గలవారైనందున ఆంగ్ల మహిళలకు తన పరగణాలో ఎటువంటి హాని జరగకుండా చూశామన్నారు. స్వదేశీయుల పాలనను పునఃస్థాపించేందుకు తిరగబడిన ప్రజల నాయకునిగా తన ప్రాణాలను బ్రిటీష్ న్యాయస్థానాలు హరించినా తనకు ఎటువంటి బాధలేదన్నారు. మాతృభూమి విముక్తి కోసం ఆరంభమైన పోరాటంలో భాగంగా ప్రాణాలు విడవడాన్ని **మహత్తర అవకాశం**గా భావిస్తానన్నారు. విచారణ తరువాత బ్రిటీషు పాలకులు ఆయనకు ఆజన్మ ద్వీపాంతరవాస శిక్ష విధించి అండమాన్ దీవులకు పంపగా మౌల్వీ లియాఖత్ అలీ అండమాన్‌లో

ప్రాణాలు విడిచారు. (**Freedom Fighters of Indian Mutiny 1857**, M.P. Srivastawa, Allababad,1997, P.163-164)

# దక్షణాది యోధుడు మౌల్వీ అల్లావుద్దీన్

ప్రథమ భారత స్వాతంత్ర్యసంగ్రామంలో ఉత్తరాదికి చెందిన మౌల్వీలు ఏ మేరకు బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్నారో అందుకు ఏమాత్రం తీసిపోని విధంగా, తమ పరిమితుల మేరకు, దక్షిణాదిలో కూడా మౌల్వీలు తమదైన సాహసోపేత పాత్రను నిర్వహించారు. ఈ పోరాటంలో ప్రధానంగా పేర్కొనదగిన ఇస్లామియా ధార్మిక పండితులు మౌల్వీ అల్లావుద్దీన్. నిజాం రాజ్య రాజధానీ నగరం హైదరాబాదుకు చెందిన మౌల్వీ వంటి యోధులు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా వ్యవహరించారు. ఈ వ్యతిరేకతకు పరాకాష్టగా 1857 జూలై 17 సాయం సమయాన నగరంలోని బ్రిటిష్ రెసిడెన్సీ మీద దాడి జరిగింది. ఈ చారిత్రాత్మక దాడికి ప్రముఖ రోహిల్లా యోధుడు తుర్రేబాజ్ ఖాన్‌తో కలసి ఆయన నాయకత్వం వహించారు. ఈ ఇరువురి నేతల నేతృత్వంలో సుమారు 500 మంది రోహిల్లా వీరులు, పెద్ద సంఖ్యలో ప్రజలు రెసిడెన్సీ మీద దాడికి సిద్ధమయ్యారు. (**The Freedom Struggle in Hyderabad**, Volume II ; P.51)

బ్రిటీష్ రెసిడెన్సీ మీద దాడికి ప్రఖ్యాతి చెందిన మక్కామసీదు నుండి బయలు దేరిన యోధుల దళానికి మౌల్వీ ఇబ్రహీం తిరుగుబాటు పతాకంతో ముందు నడిచారు. అటు నిజాం ఇటు ఆంగ్ల సైన్యాల ధాటికి తట్టుకోలేక పోయిన స్వదేశీ యోధుల సాహసోపేత పోరు సఫలం కాలేదు. ఈ పోరాటంలో మొత్తం మీద 32 మంది తిరుగుబాటు యోధులు ప్రాణాలు కొల్పోగా పలువురు గాయపడ్డారు. చివరకు జూలై 18 ఉదయానికల్లా తిరుగుబాటు యోధులు అ ప్రాంతం నుండి పూర్తిగా తప్పించుకుని వెళ్ళిపోయారు. (Ibid.,P. 52)

ఆంగ్లేయుల చేత చిక్కకుండా మౌల్వీ అల్లావుద్దీన్ చాకచక్యంగా తప్పించు కున్నారు. ఆయన బెంగళూరు వెళ్ళి అక్కడ ఒకటిన్నర సంవత్సరం రహస్య జీవితం గడిపారు. ఆయనను బంధించి ఇచ్చిన వారికి నాలుగు వేల రూపాయలను ప్రభుత్వం ప్రకటించింది. ఆ తరువాత కొంతకాలానికి ఓ ద్రోహి అందించిన సమాచారం ఆధారంగా మంగలపల్లి వద్ద నిజాం-బ్రిటీషు సైన్యాలు ఆయనను నిర్బంధించ గలిగాయి. ఆయన

మీద పలు నేరారోపణలు మోపి విచారణ తంతు జరిపి ద్వీపాంతరవాస శిక్ష విధించారు. 1859 జూన్‌లో ఆయనను అండమాన్ తరలించారు. మౌల్వీ అల్లావుద్దీన్ అండమాన్ జైలులో దుర్భర జీవితం గడుపుతూ 1884లో కన్నుమూశారు.

1957లో హైదరాబాదులోని కోఠి సెంటరులో 1857 నాటి యోధుల గౌరవార్థం రాష్ట్ర ప్రభుత్వం ఒ స్మారక స్థూపాన్ని నిర్మించింది. ఆనాటి దాడికి నాయకత్వం వహించిన రొహిల్లా యోధుడు తుర్రేబాజ్ ఖాన్ భౌతికాయాన్ని బ్రిటిష్ ప్రభుత్వం బహిరంగంగా వేలాడ దీసిన ప్రస్తుత సుల్తాన్ బజార్ వీధిని తుర్రేబాజ్ ఖాన్ వీధిగా నామకరణం చేసింది.

## మౌల్వీలంటే ఉలికిపాటు

**ఉలమా** అంటే **ఆలిం** అను పదానికి బహువచనం. ఆలిం అంటే ఖురాన్, హదీస్ (ప్రవక్త ప్రచనాలు-ఆచరణ) పరిజ్ఞానంలో నిష్ణాతుడని అర్థం. ఆ కారణంగా మౌల్వీలు ఇస్లామియా పండితులుగా ప్రసిద్ధికెక్కారు. ఈ విధంగా ఖురాన్-హదీస్‌ల జ్ఞానాన్ని పదిమందికీ పంచుతూ ప్రశాంత జీవనం గడిపే ధార్మికవేత్తలు అందుకు భిన్నంగా ఆయుధం చేతబట్టి శత్రువులో భయోత్పాతం కలిగించారు.

ఇస్లామియా పండితులైన మౌల్వీల నుండి ఆంగ్ల సైన్యాలు భయానక యుద్ధ అనుభవాలను చవిచూడటం వలన ఆంగ్లేయాధికారులు **మౌల్వీ, మౌలానా** అని పిలువబడుతున్న వారందరినీ తిరుగుబాటుదారులుగా పరిగణించారు. మౌల్వీ, మౌలానా, ఉలేమా అను పదం వింటేనే ఆంగ్లేయులు ఉలిక్కిపడ్డారు. **మౌల్వీ** అను పదాన్ని **ఇస్లామియా పండితుడు** అని కాకుడండా **భయానక శత్రువు** అను భావం ఆంగ్లేయులలో కలగడంతో **మౌల్వీ** అను పదాన్ని వినటానికి కూడా బ్రిటీష్ అధికారులు ఇష్టపడలేదు.

ఆ కసితో మౌల్వీలను ఆంగ్లేయులు, ఆంగ్లేయ న్యాయస్థానాలు అధిక సంఖ్యలో బలి తీసుకున్నాయి. 1857 నాటి సంగ్రామం సందర్భంగా ఆంగ్ల సైనికుల చేతుల్లో సుమారు రెండు లక్షల మంది మృత్యువాత పడగా, 51,200 మందికి పైగా ఇస్లామియా పండితులు ఉన్నారని ఆంగ్లేయాధికారి ఎడ్వర్డ్ థామస్ స్వయంగా అంగీకరించాడు.

మౌల్వీ, మౌలానాలను **బద్ధ శత్రువులు**గా భావించిన ఆంగ్లేయులు ఒక్క ఢిల్లీలోనే 500 మంది మౌల్వీల మీద తిరుగుబాటుదారుల ముద్రవేసి వివిధ పద్ధతులతో అంతం

చేశారు. భారీ సంఖ్యలో నిర్బంధంలోకి తీసుకున్న మౌల్వీలను కారాగారాల్లో దీర్ఘకాలం బంధించి పెట్టారు. రాణి విక్టోరియా ప్రకటన తరువాత స్వదేశీయుల మద్దతు సంపాదించేందుకు కొందరు స్వదేశీ పాలకులను, తిరుగుబాటు యోధులను నిర్బంధాల నుండి విముక్తి కల్గించినప్పటికీ చాలా మంది మౌల్వీల విషయంలో ఆ మినహాయింపు ఇవ్వలేదు. ఆ కారణంగా చాలా కాలం మౌల్వీలు కారాగారవాసంలో దుర్భ జీవితాలు గడపాల్సి వచ్చింది.

1857లోనూ, ఆ తరువాతా మౌల్వీల మీద అంతులేని విద్వేషాన్ని పెంచుకున్న ఆంగ్లేయాధికారులు తమ ప్రతీకారచర్యలకు ఇస్లామియా పండితులను పెద్ద సంఖ్యలో బలిచేశారు. మౌల్వీలను వందల సంఖ్యలో ఫిరంగులకు కట్టి పేల్చివేశారు. తుపాకి గుండ్లకు గురిచేశారు; ఉరితీశారు. ఆ విధంగా కసితోపాటుగా భయం కూడా తీరక మౌల్వీలకు జీవితకాల ప్రవాసశిక్షలను విధించి వారి స్వస్థానాలకు, కుటుంబాలకు కడుదూరంగా అండమాన్ దీవులకు పంపివేశారు.

## అండమాన్‌కు తరలిన తొలి యోధులు

ఆంగ్లేయ సైనిక న్యాయస్థానాలు విధించిన శిక్షలలో భాగంగా అత్యధిక మౌల్వీలు అండమాన్ దీవులకు పంపబడ్డారు. ఆ విధంగా అండమాన్‌కు తరలించబడిన యోధులు జీవితకాలమంతా ఆ దీవులలో గడపాలని ఆంగ్ల న్యాయమూర్తులు కఠినంగా తీర్పులు చెప్పారు. ఆ తీర్పులకు అనుగుణంగానే మౌల్వీ అల్లాఉద్దీన్ లాంటి యోధులు 25 సంవత్సరాలకు పైగా అండమాన్ జైలులో దుర్భరమైన జీవితాన్ని గడిపి కన్నుమూశారు.

1857 నాటి యోధులలో అండమాన్‌కు తరలించబడిన మౌల్వీలలో అబ్దుల్లా ముహియుద్దీన్, మౌల్వీ అల్లాఉద్దీన్, ఆనీర్ ఖాన్, అన్వర్ ఖాన్ ప్యారే ఖాన్, భాయి ఖాన్, బుద్నయ్యా పీర్ సాహెబ్, ఫక్రు, ఫరాస్ ఖాన్ ఇమాం ఖాన్, మౌల్వీ ఫజల్ హఖ్ ఖైరతాబాది, గౌస్ గులాం, గులాబ్ ఖాన్, హిదాయతుల్లా, హుసేన్ గుల్జార్, హుసేన్ హటేలా, హుసేన్ ఇబ్రహీం, హుసేన్ షా ఫకీర్, కరీం ఖాన్, ఖిఫాయతుల్లా, మౌల్వీ లియాఖత్ అలీ, మహిబుల్లా, మమ్మూఖాన్, ముహ్మద్ ఇస్మాయిల్ హుస్సేన్ మునీర్, ముహ్మద్ యార్ ఖాన్, నాసిరా, నియాజ్ ముహ్మద్ ఖాన్, నుజ్జర్ ముహమ్మద్, ఖయూం ఖాన్, రహీం, మజ్నూషా, ఖుతుబ్ షా, సర్వర్ షా, షేక్ అలీ, షేక్ ఫర్మూద్ అలీ, షేక్

మన్నూ, సిరాజుద్దీన్, సయ్యద్ అహ్మద్, వజీర్ తదితరులు ఉన్నారు. (**The Heroes of Cellular Jail**, S.N .Aggarwal, Rupa & Co, New Delhi, 2006, Pp. 306 - 317) ఈ మౌల్వీలతోపాటుగా ఢిల్లీకి చెందిన ముఫ్తి మహజర్ కరీం, లక్నోకు చెందిన మున్షీ ఇనాయత్ అహమ్మద్‌లు కూడా అండమాన్ జీవితాన్ని గడిపిన తొలినాటి యోధులలో ఉన్నారు.

ప్రముఖ మౌలానా యహ్యా అలీ థానేశ్వరి అండమాన్ దీవుల్లో చనిపోయినప్పుడు ఆయన అంత్యక్రియలలో పాల్గొనేందుకు శిక్షలు అనుభవిస్తున్న మౌల్వీలను అనుమతిం చారు. ఆ సందర్భంగా ఆయన జనాజా నమాజ్‌లో సుమారు నాలుగు వేల మంది



స్వాతంత్ర్య సమరయోధులను కఠిన శిక్షలకు గురిచేసిన అండమాన్‌లోని సెల్యూలర్ జైలు

మౌల్వీలు పాల్గొన్నారని మౌలానా జాఫర్ అలీ థానేశ్వరి తన డైరీలో రాసుకున్నారు. ఈ సంఖ్యను బట్టి బ్రిటీష ప్రభుత్వం ఆ రోజుల్లో మొత్తం మీద నాలుగు వేల మందిని నిర్బంధించి అండమాన్ దీవుల పంపినట్టుగా అర్థమౌతుంది. ఈ విధంగా పంపబడిన వారిలో అత్యధికులు సన్నిహితులకు, బంధువులకు, కుటుంబీకులకు దూరంగా ఒంటరిగా గడిపి కన్నుమూశారు. ఈ విధంగా దశాబ్దాల పాటు అండమాన్ కారాగారంలో మగ్గిపోయి చివరకు కాలధర్మం చేసిన మౌల్వీలు వందల సంఖ్యలో ఉన్నారు.

1857 తిరుగుబాటు యోధులలో ప్రముఖులైన మౌలానా ఫజలుల్ హఖ్

ఖైరతాబాదిని కూడా ఆంగ్లేయులు అండమాన్‌కు పంపారు. ఆయన ఢిల్లీ రెసిడెన్సీలో తహశీల్దార్ బాధ్యతలు నిర్వర్తిస్తూ, తిరుగుబాటు ఆరంభం కాగానే తన పదవికి రాజీనామా చేశారు. ఆయన ప్రముఖ కవి మిర్జా గాలిబ్‌కు సన్నిహిత మిత్రుడు. బహదూర్ షా జఫర్ నేతృత్వంలోని ప్రభుత్వం రూపొందించిన రాజ్యాంగ రచనలో ఆయన భాగస్వామి. జ్ఞాన ప్రపంచంలో సుసంపన్నుడిగా పరిగణించబడిన ఆయన చేత అండమాన్ జైలులో అత్యంత కష్టతరమైన, అతి దుర్భరమైన చాకిరీ చేయించారు. అండమాన్ పంపబడిన మౌల్వీలను ఇతర యోధులను కరడుగట్టిన నేరస్థుల కంటే ప్రమాదకారులుగా జమకట్టడం వలన ఆంగ్ల అధికారలు, సైనికులు వారి పట్ల అత్యంత క్రూరంగా ప్రవర్తించారు.

ఈ విధంగా మాతృభూమికి, కుటుంబాలకు, సన్నిహితులకు కడు దూరంగా పంపబడిన యోధుల కడగండ్లను, ఆ యోధుల పట్ల బ్రిటీష్ ప్రభుత్వం వ్యవహరించిన భయంకర తీరుతెన్నులను మౌలానా ఫజల్ హఖ్ తాను రాసిన Risala-i-Ghadariyya బుక్‌లెట్‌లో చాలా వివరంగా పెర్కొన్నారు. (**The Heroes of Cellular Jail**, S.N .Aggarwal, op.Cit.,) అండమాన్ జైలులో ఆంగ్లేయులు తిరుగుబాటు యోధుల పట్ల ఎంత కఠినంగా ప్రవర్తించిందీ, ఎన్ని ఇక్కట్లు పెట్టిందీ ఆ కరపత్రం ద్వారా వెల్లడయ్యింది. ఈ కరపత్రం 1860లో అండమాన్ నుండి విడుదల అయిన ముఫ్తి ఇనాయత్ అహ్మద్ ద్వారా ఇండియాకు చేరుకుంది. ఆ తరువాత ఆ కరపత్రం నకలు మౌలానా అబుల్ కలాం ఆజాద్ తండ్రి మౌలానా ఖైరుద్దీన్ లాంటి కొందరు ప్రముఖులకు చేరింది. 1947 ప్రాంతంలో మౌలానా ఆజాద్ ఆ కరపత్రానికి సంబంధించిన ప్రచురణకు పరిచయ వాక్యం రాస్తూ ఈ కరపత్రం నకలు ఒకటి మక్కాలో గల తన తండ్రికి కూడా చేరిందన్నారు. (**Bahadur Shah II**, Mahdi Husain, P. 390)

## 1857 తరువాత కూడా తగ్గని ఆగ్రహం

ఈ విధంగా 1857లో తిరుగుబాటును ప్రోత్సహించిన, స్వయంగా తిరుగుబాటులో పాల్గొన్న మౌల్వీలు, మౌలానాలంటే ఆంగ్లేయులలో ఏర్పడిన విద్వేష భావం ఆ తరువాత కూడా కొనసాగింది. ఇస్లామియా పండితుల వేషధారణ కూడా ఆంగ్లేయులకు అనుమానం కల్గించేది. తల మీద టోపి, గడ్డంతో ప్రత్యేకంగా దుస్తులు ధరించిన వారెవ్వర్ని చూసినా మౌల్వీలుగా ఆంగ్ల పోలీసులు అనుమానించటం సర్వ

సాధారణమయ్యింది. ఈ అనుమానపు దృక్కుల నుండి రగిలిన విద్వేషాగ్నికి ఆంగ్లేయులతో ఏమాత్రం రాజీపడని వహాబీ యోధులు ప్రధానంగా బలయ్యారు. 1857 తరువాత ఆంగ్లేయాధికారుల మీద జరిగిన పలు విధాలైన దాడులలో పాల్గొన్న వహాబీల మీద పలు రకాల కఠిన శిక్షలు విధించబడ్డాయి.

ఈ యోధుల మీద పలు రకాల కుట్రకేసులను కూడా ఆంగ్లేయ ప్రభుత్వం బనాయించింది. ఈ కుట్ర కేసులలో 1864 నాటి అంబాలా కుట్రకేసు, 1865 నాటి పాట్నా కుట్రకేసులు చాలా ప్రధానమైనవి. ఇవి కాకుండా లాహోర్, థానేశ్వర్ తదితర ప్రాంతాలకు చెందిన బ్రిటీష్ వ్యతిరేక యోధుల మీద పలు నేరాలను మోపుతూ చాలా కుట్ర కేసులు నమోదయ్యాయి. ఈ కేసుల విచారణలో దోషులుగా పరిగణించబడిన పలువురికి ఉరిశిక్షలు విధించగా, అధిక సంఖ్యాకులను అండమాన్‌కు పంపారు.

ఈ విచారణలలో వహాబీ యోధులు మౌలానా యహ్యా అలీ, మౌలానా ముహమ్మద్ జాఫర్ థానేశ్వరి, మౌలానా ముహమ్మద్ లాహోరిలకు ఉరిశిక్షలు విధిస్తూ బ్రిటీష న్యాయమూర్తులు చేసిన వ్యాఖ్యలను పరిశీలించినట్టయితే ఇస్లామీ పండితుల పట్ల బ్రిటీషర్లలో గూడు కట్టిన కసి విద్వేషం అర్థమౌతుంది. ఈ కేసులలో ఒకదాని మీద తీర్పునిస్తూ **మీ ప్రాణాలు పోయేంత వరకు ఉరికి వేలాడదీస్తాం. మీ ఆస్తులను జప్తు చేస్తాం. మీ మృతదేహాలను మీ బంధువులకు అప్పగించక పోగా అత్యంత అవమానకర పద్ధతిలో జైలు ప్రాంగణంలోనే ఖననం చేస్తాం,** అని ఒక న్యాయమూర్తి ప్రకటించాడు.

(You will be hanged till death, your properties will be confiscated and your corpses will not be handed over to your reletives. Indeed, you will be burried contemptuously in the jail compound.- **Muslims In India**, S.Abul Hasan Ali Nadwi, Islamic Research and Publictions, Lucknow, 1980, P.113)

1871లో అబ్దుల్లా అను యోధునికి విధించిన ఉరిశిక్ష సందర్భంగా ఆయన మృతదేహాన్ని అంత్యక్రియల కోసం అప్పగించమని బంధువులు కోరినా, నిరాకరించిన ఆంగ్లేయాధికారులు, మత సంప్రదాయం ప్రకారంగా ఖననం చేయాల్సిన అబ్దుల్లా భౌతికకాయాన్ని తగులబెట్టించి, తమ రాక్షస ప్రవృత్తినీ, అబ్దుల్లా పట్ల ఉన్న భయాన్ని, ఆగ్రహాన్ని క్షుద్రంగా ప్రకటించుకున్నారు.

( " He was sentenced to death and in fury of revenge his body

was cremated by the British instead of being buried " - **Encyclopaedia of Muslim Biography Vol. I**, Ed. Nagendra Kr. Singh, A.P.H Publishing Corporation, New Delhi, 2001, P. 141)

ఈ శిక్షలకు ఏమాత్రం భయపడని యోధులు తమకు విధించిన శిక్షలను గౌరవప్రదంగా, సంతోషంగా స్వీకరించడాన్ని ఆంగ్లేయాధికారులు, న్యాయమూర్తులు సహించలేకపోయారు. బ్రిటీష్ న్యాయస్థానం విధించిన ఉరిశిక్షలకు, ఆ తరువాతి పరిణామాలకు ఏమాత్రం భయపడకుండా, **నా మాతృభూమి విముక్తి కోసం ఏనాడయితే నేను పోరాట దీక్ష చేపట్టానో, ఆనాడే నా ప్రాణం మీద తీపిని వదలుకున్నాను...మన శత్రువులలో ఒకరిని నేను అంతం చేసాను...నేను నా కర్తవ్యాన్ని నిర్వహించాను...నా పవిత్ర కార్యంలో భగవంతుని వద్ద మీరంతా నాకు సాక్ష్యం...నేను చేసిన పని పట్ల కించిత్తు బాధపడటంలేదు...ఎంతో గర్విస్తూ మరణాన్ని స్వీకరిస్తున్నాను** అని షేర్ అలీ లాంటి యోధులు న్యాయస్థానంలో బహిరంగంగా ప్రకటిస్తూ రావడంతో బ్రిటీష్ న్యాయమూర్తులు మండిపడ్డారు. (**Hindustan Musalmano Ka Jang-e-Azadi Mein Hissa** (Hindi), Syed Ibrahim fikri, New Delhi, 1999, P. 30)

శిక్షలు విధించి, ఉరిశిక్షలకు, కాల్చివేతలకు ఆదేశాలు జారీచేశాక శిక్షల అమలును చూసేందుకు ఆంగ్ల అధికారుల భార్యాపిల్లలు, బంధువులు కారాగారానికి వచ్చేవారు. ఆ సమయంతో ఆ యోధులు ఎటువంటి పశ్చాత్తాపాన్నిగానీ, భయాన్ని గానీ వ్యక్తం చేయకుండా ఎంతో ఆనందంగా గడపటం, ఆ శిక్షలతో తమ జీవితాలు సాఫల్యం పొందినట్టుగా సంతోషం వ్యక్తంచేస్తూ అమరత్వం పొందు అవకాశాన్ని కల్పించిన ఆ శిక్షల అమలు కోసం హర్షాతిరేకాలతో ఎదురు చూడటం, ఉరిశిక్షల మీద అప్పీలు చేసుకోడానికి అవకాశం కల్పించినా కూడా ఆ ప్రయత్నాలు చేయటం అగౌరవంగా భావించటం ఆంగ్లేయ కుటుంబీకులకు చాలా వింతగా తోచేది.

ఈ పరిణామాల ఫలితంగా ఉరిశిక్షలను ఆనందంగా స్వీకరిస్తున్న ఈ యోధుల పట్ల ఆంగ్ల ప్రభుత్వం తన విధానాన్ని మార్చుకుంది. ఉరిశిక్షను స్వీకరించడం అంటే పోరుబాటలో అమరత్వం పొందటం, షహీదులవ్వడంగా భావిస్తున్న యోధులకు ఆ అవకాశంగానీ, ఆ సంతోషం గానీ దక్కనివ్వరాదని నిర్ణయించుకుంది. ఆ కారణంగా బ్రిటీష్ ప్రభుత్వ వ్యతిరేక చర్యలకు పూనుకున్న విప్లవకారులకు ఉరిశిక్షలు విధించకుండా ద్వీపాంతరవాస శిక్షలను విధించి అండమాన్‌కు పంపివేయటం ఆరంభించారు.

ప్రసిద్ధి చెందిన అంబాలా కుట్రకేసులో విప్లవకారులకు న్యాయమూర్తి విధించిన మరణశిక్షలను ద్వీపాంతరవాస శిక్షలుగా మార్పించి ఆ విధంగా ఎందుకు మార్పించిందీ అంబాలా డిప్యూటీ కమీషనర్ వివరించారు. ఆయన వివరణ ఈ విధంగా సాగింది: **మీరు మరణ శిక్షలను అమరత్వం పొందు మంచి అవకాశంగా భావించి సంతోషిస్తున్నారు. అందువలన మీకు అయిష్టమైన శిక్షను విధించాలని ప్రభుత్వం నిర్ణయించింది. మీకు విధించిన మరణశిక్షను జీవిత కాలపు ద్వీపాంతరవాస శిక్షగా మార్చటం జరిగింది.**

(You rejoice over the sentence of death and look upon it as martyrdom. The Government, therefore, have decided not to award you



సమరయోధులను ఉరిశిక్షలకు బలిచేసేందుకు ఆంగ్లేయులు ఉపయోగించిన ఆండమాన్‌లోని ప్రత్యేక కట్టడం

the punishment you like so much. The death-sentence passed against you has been changed to that of transportation or life. - **Muslims In India**, S.Abul Hasan Ali Nadwi, op.cit., P.113)

1857కు ముందు, 1857 సంగ్రామంలో, 1857 తరువాత కూడా తమలో ప్రజ్వరిల్లుతున్న బ్రిటీష్ వ్యతిరేకతను ఏమాత్రం చల్లారనివ్వకుండా సతతం పోరుబాట నడిచి ఆంగ్లేయాధికారులకు కంటి నిండా నిద్రను కరువు చేసిన మౌల్వీల పాత్ర గురించి 1857 పోరాటంలో పాల్గొన్న ఆంగ్లేయాధికారి జనరల్ థామస్ వ్యాఖ్యానిస్తూ **They are the real heros of 1857** అని ప్రశంసించడాన్ని బట్టి మౌల్వీల బహుముఖ పాత్ర స్పష్టమౌతుంది.

1857లో మాత్రమే కాదు ఆ తరువాత కూడా జాతీయోద్యమంలో మౌల్వీలు సాహసోపేత పాత్రను నిర్వహించారు. పరాయిపాలకులను పాలద్రోలడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకున్న మౌల్వీలు ఆ లక్ష్యసాధన కోసం తమ సర్వస్వాన్నీ మాతృభూమి సేవలో సమర్పించారు; ప్రవాస జీవితాన్ని అనుభవించారు. అండమాన్ జైలులో అసంఖ్యాకంగా అసువులుబాశారు. స్వాతంత్ర్యోద్యమానికి మిత్ర దేశాల మద్దతు సంపా దించటం కోసం దశాబ్దాల తరబడి రహస్యంగా పర్యటిస్తూ తమ సంపూర్ణ జీవితాలను సమర్పించారు. మతం పేరుతో చీలికలు సృష్టించడం సరికాదంటూ చివరి వరకు భారత దేశ విభజనను చాలా తీవ్రంగా వ్యతిరేకించారు. ఈ విధంగా బ్రిటీష్ వ్యతిరేక పోరాటాలలోని అన్ని దశలలోనూ తమదైన పాత్రవహించి భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో తమదైన అధ్యాయాన్ని సృష్టించుకున్నారు.

ఆనాడూ అటు తరువాతా అంతటి మహోన్నత పాత్రను నిర్వహించారు కాబట్టే Jamaith-e-Ulema-e-Hind ప్రధాన కార్యదర్శిగా మౌలానా సయ్యద్ అహ్మద్ మదని పదవీ బాధ్యతలు చేపడుతున్న సందర్భంగా ఢిల్లీలో జరిగిన సభలో స్వతంత్ర భారత తొలి ప్రధాని పండిత జవహర్ లాల్ నెహ్రూ మాట్లాడుతూ, **ఈ ఉలమాల పాదధూళి నా కళ్ళకు సుర్మా లాంటిది. వారి పాదాలను ముద్దెట్టుకోవడం నేను గౌరవంగా భావిస్తా** అని అన్నారు.

( '... the dust under the feet of these Ulema is like corrylium for my eyes and kissing their feet would be a matter of great pride for me. - **They Too Fought For India's Freedom (The Role of Minoritiers)**, Ed. Ashghra Ali Engineer, Hope India, Gurgaon, 2006, P. 15)

ఈ వ్యాఖ్యలను బట్టి ఇస్లామియా పండితులైన మౌల్వీలు భారత స్వాతంత్ర్య సంగ్రామంలో నిర్వహించిన పాత్ర ఏమిటో, ఆ పాత్ర ప్రాధాన్యత మరియు ప్రాముఖ్యత ఏమిటో సులభంగా అర్థం చేసుకోవచ్చు.

★ ★ ★

## అధ్యాయం - 4



ఢిల్లీ ఉర్దూ అఖ్బార్....

# కలం యోధులు

**ప్రజల**ను ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం దిశగా కార్యోన్ముఖులను చేయడంలో కలం యోధుల పాత్ర చాలా ఉంది. స్వదేశీ సంస్థానాల మీద పెత్తనం చలాయిస్తూ, మాతృభూమి సర్వసంపదను దోచుకుంటూ, స్వదేశీ వర్తక-వాణిజ్యాలకు గండికొడుతూ, స్వదేశీ సైనికుల పట్ల తీవ్ర వివక్ష చూపుతూ, ప్రజల మత మనోభావాలు, ఆచార వ్యవహారాలలో జోక్యం చేసుకుంటూ, కడు దుర్మార్గంగా ప్రవర్తిస్తూ అన్ని రకాలుగా స్వదేశీయులను కడగండ్ల పాల్జేస్తున్న ఆంగ్లేయుల దుష్ట చర్యలను అనునిత్యం ప్రజల దృష్టికి తెస్తూ తిరుగుబాటు భావజాలం పరివ్యాప్తికి పత్రికలు 1857కు పూర్వమే పునాదులు వేశాయి.

పూర్వం మనదేశంలో గూఢాచారి వ్యవస్థ ఉంది తప్ప పత్రికా రంగం లేదు. ఒక విధంగా చెప్పాలంటే మొగల్ చక్రవర్తుల కాలంలో రాజ్యంలోని విశేషాలను తెలుసు కోనడానికి ప్రత్యేకంగా వార్తాహరుల నియామకం జరిగింది. ప్రముఖ సంఘటనలను రౌతుల ద్వారా, బృందాల ద్వారా సంబంధితులు రాబట్టుకునేవారు. ఆ విధంగా లభించిన సమాచారం పాలక ప్రభువుల దృష్టికి తీసుకెళ్ళి తద్వారా తగు నిర్ణయాలు తీసుకోవటం ఆనాటి రివాజు.

ఆ తరువాతి కాలంలో ఈ వార్తాహరుల యంత్రాంగాన్నే ఈస్ట్ ఇండియా కంపెనీ ఉపయోగించుకుంది. కంపెనీ కాలంలో వార్తాహరులు, వార్తాహరుల బృందాలు రెండు వర్గాలయ్యాయి. కంపెనీ ఇచ్చే జీతాల కోసం కొందరు కంపెనీ సేవలో గడిపారు. ఈ వర్గం అన్ని రకాల రుగ్మతలకు అలవాటు పడింది. స్వదేశాభిమానం గల వార్తాహరులు పాలకుల ప్రాపకం కోరకుండా స్వంత పత్రికలు నడిపారు. ఆ విధంగా స్వంత పత్రికలు నడిపినవారిలో అత్యధికులు, ఆ పత్రికలకు వ్యాసాలు రాసిన పండితులు, వార్తలను పంపిన పాత్రికేయులు పరాయి పాలకుల దౌష్ట్యాన్ని ఎండగడుతూ ప్రజలపక్షం వహించారు. ఆ తరువాత సంభవించిన పరిణామాలలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో ప్రజలను ఉత్తేజపరుస్తూ అక్షరమే ఆయుధంగా విదేశీయుల దుర్మార్గాల మీద కలం యోధులు విరుచుకుపడ్డారు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అక్షరాలను ఆయుధాలుగా చేసుకొని రచనలు చేసినవారు, కరపత్రాలను ప్రచురించి పంపిణిచేసినవారు, తమ ప్రసంగాలతో ప్రజలను ప్రభావితులను చేసినవారు ఎందరో కలరు. అటువంటి రచయితలలో మౌలానా ఫజలుల్ హక్ ఖైరతాబాది, ఢిల్లీ కళాశాల ఆచార్యులు మౌలానా ఇమాం బక్ష్, సెహబాయ్, ముహమ్మద్ బాఖర్, మిర్జా రహీముద్దీన్ హయా, ఖాన్ బహదూర్ ఖాన్ మారూఫ్, ఫైజ్ అహ్మద్ రుస్వా, మౌల్వీ ముహమ్మద్ జహీర్ అలీ తదితరులను ప్రధానంగా పేర్కొనవచ్చును.

ఈ అక్షరయోధులలో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అక్షరకవాతు చేసినందుకు మౌలానా ఫజలుల్ హఖ్‌ను అండమాన్‌కు తరలించగా, మౌల్వీ ముహమ్మద్ బాఖర్‌ను ఆంగ్లేయాధికారి కెప్టన్ హడ్సన్ కాల్చి చంపాడు. ఢిల్లీ పతనం తరువాత బహు గ్రంథ రచయిత, బహదూర్ షా జఫర్‌కు సన్నిహితుడైన ఇమాం బక్ష్ ఆంగ్ల సైనికులచే దారుణంగా కాల్చివేయబడ్డారు. ఆ సమయంలో కవిగా బహుద్దూర్ షా జఫర్‌కు మిత్రుడైన మిర్జా అసదుల్లా గాలిబ్ ఆంగ్లేయుల దారుణాల బారిన పడకుండా తప్పించుకోగలిగారు. ఢిల్లీలో తిరుగుబాటు యోధుల పోరాటం ముగిశాక ఆంగ్ల సైన్యాలు సాగించిన దారుణాలను గాలిబ్ తన రచనలలో హృదయ విదారకంగా వివరించారు.

అటు కవులూ ఇటు రచయితలూ, సంపాదకులూ, పాత్రికేయులూ ప్రజలపక్షం వహించి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తమ రచనల ద్వారా తిరుగుబాటుకు ప్రోత్స

హించారు. ఈ తరహాలో ప్రభుత్వానికీ, ప్రభుత్వాధికారుల చర్యలకూ వ్యతిరేకంగా సమాచారాన్ని, వార్తలను ప్రచురించిన పలు ఉర్దూ పత్రికలు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో తమదైన పాత్రను నిర్వహించాయి. ఈ పత్రికలలో ప్రముఖంగా పేర్కొదగినవి 1836లో ప్రారంభమైన 'ఢిల్లీ ఉర్దూ అఖ్బార్' (Delhi Urdu Akhbar, Delhi), 1850లో ప్రారంభించబడిన 'కోహినూర్' (Kohi-i-Noor, Lahonre), 1852లో స్థాపించబడిన 'రియాజ్-యే-నూర్' (Riazi-i-Noor, Multan), 1854 నుండి ప్రచురితమైన 'సాదిఖుల్ అఖ్బార్' (Sadiqul Akhbar, Delhi), లక్నో నుండి వెలువడిన 'తిల్సిం-యే-లక్నో' (Tilism-i-Lucknow), ద్వీపాంతరవాస శిక్షలను విధించి, లక్నో కేంద్రంగా 1856 నుండి వెలువడుతున్న 'సహర్-యే-సమ్రి', (Sahar-i-Samri) ఉన్నాయి.

ఈ ప్రతికలతో పాటుగా బహదూర్ షా జఫర్ పర్యవేక్షణలో ఆయన స్వంత దినపత్రిక **సిరాజుల్ అఖ్బార్** (Sirajul Akhbar) కూడా ఆనాడు ప్రధాన పాత్ర వహించింది. ఈ పత్రిక అంత:పురవాసులతో పాటుగా జఫర్ వ్యక్తిగత సిబ్బంది, రాజ సైనికులలో బాగా ప్రాచుర్యం పొందింది. ఆనాడు తిరుగుబాటును ప్రోత్సహిస్తున్న ఇతర పత్రికలు ప్రధానంగా **సిరాజుల్ అఖ్బార్** నుండి అధికారిక సమాచారాన్ని సమకూర్చు కునేవి. ఈ విధంగా సిరాజుల్ అఖ్బార్ అటు పండితులను ఇటు ప్రజలను, ఇతర పత్రికలను బాగా ఆకట్టుకుంది. ఈ దినపత్రిక ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ సమయంలో కూడా యథాతథంగా వెలువడింది. (**Bahudur Shah II and The War of 1857 in Delhi with Its unforgettable Scenes**, Mahdi Husain, M N Publishers and Distributors, New Delhi, 1987)

ఢిల్లీ ఉర్దూ అఖ్బార్, సాదిఖుల్ అఖ్బార్ పత్రికల్లాగే సిరాజుల్ అఖ్బార్ కూడా అటు ప్రజలకు సంబంధించిన ఇటు ప్రభువుల సమాచారాన్ని ప్రచురించింది. బహదూర్ షా జఫర్ వద్దకు మీరట్ నుండి తిరుగుబాటు యోధులు రావటం దగ్గర నుండి పోరాటం ముగింపుకు వచ్చేంత వరకు జరిగిన సమాచారాన్ని గుదిగుచ్చి సాదిఖుల్ అఖ్బార్ వెలువరించింది. ఆంగ్లేయుల పరాజయం, స్వాతంత్ర్య సమరయోధుల విజయాలను ఘనంగా ప్రచురించి ప్రజలలో ప్రేరణకు కారణమయ్యింది. (**Bahudur Shah II** : Mahdi Husain)

ఆనాడు పర్షియన్ భాష రాజభాష కాగా స్వదేశీ భాష అయినటువంటి ఉర్దూ ప్రజల భాషగా మన్నన పొందింది. ఆ కారణంగా తొలుత కొన్ని పత్రికలు పర్షియన్ భాషలో ప్రచురితమైనా, ప్రజల నుండి వ్యక్తమైన డిమాండ్‌ను బట్టి ఉర్దూ భాషలో వెలువడిన సంఘటనలు, తొలుత ఉర్దూలో ఆరంభించబడి ఆ తరువాత పర్షియన్ మరియు ఉర్దూ భాషలలో ప్రచురితమైన సంఘటనలు కూడా ఉన్నాయి. ఈ పత్రికల భాష ఏదైనా లక్ష్యం **ఈస్ట్ ఇండియా కంపెనీ పాలన అంతం,** స్వభావం **ప్రజల పక్షంగా** సాగాయి.

ఈ విధంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి మూడు దశలుగా పత్రికలు తోడ్పడ్డాయి. ప్రజలలో బ్రిటీష్ వ్యతిరేకతను ప్రోదిచేసి తిరుగుబాటు మనస్తత్వాన్ని పదిలం చేసేందుకు తొలిదశగా సహకరించాయి. సంగ్రామం ఆరంభమయ్యాక అప్రతిహతంగా ఆ పోరు ముందుకు సాగేందుకు ప్రజలను, స్వదేశీ పాలకులను, స్వదేశీ సైనికయోధులను ఉత్తేజపర్చుతూ రెండవదశలో చేయూత నిచ్చాయి. ఢిల్లీ కేంద్రంగా విముక్తి పోరాటం సమసిపోయాక కూడా ఇతర ప్రాంతాలలో రగులుతున్న పోరాట స్ఫూర్తిని సజీవంగా ఉంచేందుకు మూడో దశలో తమదైన ప్రత్యేక పాత్రను నిర్వహించాయి.

ఈ క్రమంలో పరిశీలిస్తే 1836లో బహు భాషాకోవిదుడైన మౌలానా ముహమ్మద్ బాఖర్ సంపాదకత్వంలో ఆరంభమై **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** (Delhi Urdu Akhbar) ఉర్దూ వారపత్రికను తొలిదశ నుండి మలిదశ వరకు బ్రిటీష్ వ్యతిరేకతను ప్రజలలో రెచ్చగొట్టిన వైనం వెల్లడవుతుంది. ఈ పత్రిక ఢిల్లీ నగరంలో ప్రారంభమైన తొలి ఉర్దూ పత్రికగా చరిత్ర సృష్టించింది. తొలుత సాధారణ సాహిత్య-సమాచార పత్రికగా ప్రజలకు అందుబాటులోకి వచ్చిన ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ 1857 నాటికి తన స్వభావాన్ని పూర్తిగా మార్చుకుంది.

ఆంగ్లేయ వ్యతిరేకతను పుష్కలంగా పుణికిపుచ్చుకున్న మౌలానా బాఖర్ సంపాదకత్వంలో ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ ఆంగ్లేయాధికారుల తప్పిదాలను, ఆశ్రితపక్షపాతాన్ని ఉటంకిస్తూ, ఆ చర్యలను విమర్శిస్తూ, వార్తలు ప్రచురిస్తూ, వ్యాఖ్యానాలు రాసింది. స్వదేశీయులకు ఎక్కడ అన్యాయం జరిగినా, మరెక్కడైనా అధికారులు స్థానిక ప్రజలపట్ల అనుచితంగా వ్యవహరించినా మౌల్వీ బాఖర్ మిన్నకుండా తన విమర్శనాత్మక వ్యాసాలతో ఆ అధికారుల గుట్టును రట్టు చేశారు. శాంతి భద్రతల విషయంలో అధికారుల

వైఫల్యాలను, ప్రజలు ఎదుర్కొంటున్న ఇక్కట్లనూ సోదాహరణంగా వివరించారు. అధికారుల అహంకారానికి గురైన బాధిత ప్రజల పక్షం వహించిన మౌలానా అక్షరాలను ఆయుధాలుగా మలచి దుర్మార్గంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయాధికారుల మీద పోరాటం సాగించారు.

పరాయి పాలకుల మీద అక్షరాలతో దండెత్తిన మౌలానా అంతటితో మిన్నకుండి పోలేదు. ఆంగ్లేయుల అండదండలను వత్తాసుగా తీసుకుని తమ కండబలంతో ప్రజల మీద హింస, దోపిడీలకు పాల్పడుతున్న దుర్మదాంధులకు వ్యతిరేకంగా ఎంతో ధైర్య సాహసాలతో విమర్శనాస్త్రాలను సంధించారు. ప్రజల పక్షం వహించిన ఆయన ప్రజలకు వ్యతిరేకమైన ప్రతి వ్యక్తినీ, ప్రతి వ్యవస్థనూ తన విమర్శనాత్మక వ్యాసాలతో దారిలోకి తెచ్చే ప్రయత్నం చేశారు.

ఈ విధంగా కంపెనీ పాలకులకు, ఆ పాలకుల తొత్తులకు వ్యతిరేకంగా ప్రజాభిప్రాయాన్ని కూడగట్టడంలో మౌల్వీ బాఖర్ ఎనలేని కృషిచేశారు. ఆ కారణంగా మౌలానా బాఖర్ ప్రాణాలకు ముప్పు ఏర్పడింది. అయినా ఆయన లెక్కచేయలేదు. ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ తన పంథాను మార్చుకోలేదు. ఈ మేరకు బహుళ ప్రచారం పొందిన ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ 1857కు ముందు నుండే ఢిల్లీ నగరవాసులలో మాత్రమే కాకుండా పరిసర ప్రాంతాల ప్రజల హృదయాలలో తిరుగుబాటు బీజాలు నాటి అవి ఏపుగా ఎదగడానికి అవసరమైన వాతావరణాన్ని సృష్టించింది. (**ఆంగ్లేయులను ముప్పుతిప్పలు పెట్టిన మౌలానా ముహ్మద్ బాఖర్**, షబ్నా, **గీటురాయి** వారపత్రిక, హైదరాబాద్, 18-7-2003, పేజీ. 18)

ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ బాటలో ఉత్తర ప్రదేశ్ రాష్ట్రం లక్నో నుండి ప్రచురితమైన **'తిల్సిం-యే-లక్నో'** ఉర్దూ వారపత్రిక తొలుత నుండి బ్రిటీష్ వ్యతిరేకతను వ్యక్తం చేస్తూ వచ్చింది. ఈ పత్రికకు ఫిరంగి మహల్‌కు చెందిన మౌల్వీ ముహమ్మద్ యాకూబ్ అన్సారి సంపాదకత్వం వహించారు. ఆయన స్వతంత్ర భావనలు గల స్వదేశాభిమాని. ఆంగ్లేయుల పెత్తనం సమసిపోవాలని కోరుకున్న మేధావి. ఆ కారణంగా బ్రిటీషర్లకు వ్యతిరేకంగా వ్యవహరిస్తున్న వ్యక్తులకు ప్రాధాన్యతనిస్తూ **'తిల్సిం-యే-లక్నో'** ద్వారా ఆ యోధులను ప్రోత్సహించారు.

ప్రథమ స్వాతంత్రసంగ్రామంలో ప్రముఖ పాత్ర వహించిన మౌల్వీ అహ్మదుల్లా

షా ఫైజాబాది ఆంగ్లేయులకు వ్యతిరేకంగా కత్తిపట్టాల్సిందిగా ప్రజలను కోరుతూ పలు పర్యటనలు చేశారు. ఆయన ఈ ప్రయత్నాలు చేస్తున్న సమయానికి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆరంభం కాలేదు. అయినా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను, స్వదేశీ సైనిక యోధులను మౌల్వీ కూడాగడ్తూ, ఆంగ్లేయుల పట్ల పచ్చి వ్యతిరేకతను ప్రజలలో రెచ్చగొడుతున్నారు. ఆయన పర్యటనలను, ఆయన చేస్తున్నస్తున్న ప్రసంగాల సారాంశాన్ని నిర్భయంగా వెల్లడిస్తూ, ప్రజలలో తిరుగుబాటు భావాలు ఏర్పడి, బలపడడానికి **'తిల్సిం-యే-లక్నో'** ఎంతగానో తోడ్పడింది.

ఆ ప్రసంగాల మూలంగా ఆగ్రహించిన ఆంగ్లేయాధికారులు మౌల్వీ అహ్మదుల్లాను నిర్భంధించారు. ప్రజల అండదండలతో బ్రిటీష్ చెరనుండి విముక్తి పొందిన మౌల్వీ అహ్మదుల్లా 1856 నవంబరులో ఉత్తర ప్రదేశ్‌లోని అవధ్ చేరుకున్నారు. అవధ్ నవాబు వాజిద్ అలీషా పట్ల ఆంగ్లేయులు వ్యవహరించిన తీరుతెన్నులను దుయ్యబడుతూ కంపెనీ పాలనకు వ్యతిరేకంగా ప్రసంగాలు చేశారు. ఆ సందర్భంగా మౌల్వీ విముక్తి ఉందంతాన్ని, ఆయన ప్రసంగాలను **'తిల్సిం-యే-లక్నో'** వెల్లడించింది.

మౌల్వీ ప్రసంగాల ధోరణిని ప్రస్తావిస్తూ, 1857 జనవరి 30 నాటి **తిల్సిం -యే-లక్నో** సంచికలో '..Ahamedullah shah...is very fearless in saying whatever he wishes to say and to large crowd is always there,...although he is unable to do anything, orally he always pleads for jehad..' అని పేర్కొందని S. Jaheer Hussain Jafri **Social Scientist** Vol. 26 Nos. 1- 4, Jan.- April1998, P. 42 **The Profile of Saintly Rebel - Moulvi Ahamadullah Shah** ' అను వ్యాసంలో ఉటంకించారు.

ఈ పత్రిక మౌల్వీ కార్యకలాపాలను ఉత్సాహపూరితంగా వార్తల రూపంలో ప్రచురిస్తూ ప్రజలలో నూతన ఉత్తేజాన్ని కల్గిస్తూ అక్షరాల పరంగా తిరుగుబాటుకు గట్టి పునాదులను ఏర్పర్చి లక్నోలో తిరుగుబాటు విజృంభణకు కారణమయ్యింది. ఈ తిరుగుబాటు అవధ్ బేగం హజరత్ మహాల్ నాయకత్వంలో విజయవంతమై పలు మాసాల పాటు స్వదేశీ పాలన సాగింది. ఈ తిరుగుబాటుకు, అ తరువాత స్వదేశీ ప్రభుత్వానికి ప్రజలు ఇతోధికంగా సహాయపడటంలో కూడా **తిల్సిం-యే-లక్నో** లాంటి పత్రికలు వ్యాప్తి చేసిన భావజాలం ఎంతోగానో తోడ్పడిందనడం సత్యదూరం కాబోదు.

ఈ తరహాలో లాహోర్ నుండి మున్షీ హర్‌సుఖ్ రాయ్ (Munshi Har Sukh Rai) స్థాపించిన 'కోహినూర్' (Kohi-i-Noor) ఉర్దూ పత్రిక కంపెనీ పాలకుల చర్యలను వ్యతిరేకించింది. ఉర్దూ జర్నలిజం మీద ఉక్కుపాదం మోపేందుకు ఆంగ్లేయాధికారులు చేస్తున్న ప్రయత్నాలను ప్రజలకు తెలిపింది; తెస్తున్న చట్టాలను వ్యతిరేకించింది. ఈ చట్టాలు రూపొందుతున్న విషయాన్ని విమర్శనాత్మకంగా ప్రజల దృష్టికి తెచ్చింది. ఈ దిశగా రూపొందుతున్న చట్టాల మూలంగా ఉత్పన్నమయ్యే పరిస్థితులను ప్రజలకు, పత్రికాధిపతులకు తెలియచేసింది.

ఆంగ్లేయాధికారుల చర్యల పట్ల ఇటు ప్రజలలోనూ అటు పత్రికాధిపతులలోనూ వ్యతిరేకతను కోహినూర్ ప్రోదిచేసింది. పత్రికల నోరునొక్కేందుకు ప్రభుత్వం తీసుకుంటున్న చర్యలను అడ్డుకోవాలనీ లేనట్టయితే ప్రతి ఒక్కరూ నష్టపోతారనీ తెలిపింది. ప్రభుత్వ చర్యలు సఫలమైనట్టయితే పత్రికా స్వేచ్ఛ హరించబడుతుందని, ఇక నుండి పత్రికలు ప్రచురించటం వృధా కాగలదని 1856 ఏప్రిల్ 29నాటి సంచికలో ప్రభుత్వ వ్యతిరేక సంపాదకీయం, వార్తల ద్వారా పాత్రికేయులను, ప్రజలను హెచ్చరించింది.

(**'Freedom Struggle and Urdu Journalism During the Nineteenth Century'** Mrs. Abida Sameeuddin, **' They Too Fought for India's Freedom-The Role of Minorities'** , Ed. Asghar Ali Engineer, Hope India, Gurgaon, 2006, P. 120).

ఆంగ్లేయులకు మాత్రమే వ్యతిరేకం కాకుండా ఆనాడు అవధ్ సంస్థానాధీశుడు నవాబు వాజిద్ అలీ ఖాన్ కంపెనీకి అనుకూలంగా వ్యవహరిస్తున్న తీరుతెన్నులను కూడా 'కోహినూర్' దుయ్యపట్టింది. నవాబు అలీషా ఎంత సానుకూలంగా ఉన్నా కూడా కంపెనీ పాలకులు నవాబును అక్రమంగా తొలగించి అవధ్‌ను, అవధ్ రాజధాని లక్నోను స్వాధీనం చేసుకున్న తరుణంలో ఆనాటి పరిస్థితులను వివరిస్తూ ప్రజలు ఎదుర్కొంటున్న ఇక్కట్లను, బ్రిటీష్ అధికారుల దుష్ట చర్యలను నిర్భయంగా బహిర్గతం చేసింది. ఆ కారణంగా ఆగ్రహించిన ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు కోహినూర్ సంపాదకులు మున్షీ హర్‌సుఖ్‌ను 1856 మార్చిలో అరెస్టు చేసి ఏడు సంవత్సరాల పాటు నిర్బంధంలో ఉంచారు. (' They Too Fought for India's Freedom-The Role of Minorities', Op. cit., P. 121).

ముల్తాన్ నుండి మున్షీ ముహమ్మద్ మెహది హుసైన్ ఖాన్ (Munshi Mohammad Mehdi Hussain Khan) సంపాదకత్వంలో వెలువడిన 'రియాజ్-యే-నూర్' (Riazi-i-Noor) కూడా ప్రజలలో స్వాతంత్ర్య కాంక్షను రగిలించే వార్తలను -సమాచారాన్ని ప్రచురించింది. ఆంగ్లేయాధికారులు ప్రజలను పీడిస్తూ ఇబ్బందుల పాల్జేస్తున్న సంఘటనలను యధాతథంగా ప్రచురిస్తూ అధికారుల ఆగ్రహానికి పలుమార్లు గురయ్యింది. ప్రజల పట్ల రాక్షసంగా వ్యవహరిస్తున్న ఒక తహశీల్దార్ (Tehsildar) స్థాయి ప్రభుత్వాధికారి గుట్టును రట్టుచేస్తూ వ్యాసం ప్రచురించగా, దానిని సాకుగా చూపి, మున్షీ హుసైన్ ఖాన్ రాతలను అడ్డుకునేందుకు 1856లో ఆయనను అరెస్టు చేసి **విద్రోహం** ముద్ర వేసి ఏడు సంవత్సరాల కఠిన కారాగార శిక్షను విధించింది.

ప్రజల పక్షం వహిస్తున్న పత్రికల మీద ఆంగ్లేయాధికారులు కిరాతంకంగా వ్యవహరిస్తున్నా స్వతంత్ర స్వభావాలు గల పత్రికలు మరిన్ని రంగలోకి రాసాగాయి. 1854లో ఢిల్లీ కేంద్రంగా 'సాదిఖుల్ అఖ్బార్' (Sadiqul Akhbar) పత్రిక సయ్యద్ జమీలుద్దీన్ సంపాకత్వంలో ఆరంభమైంది. ఈ పత్రిక ఆది నుండి ప్రజలలో బ్రిటీష్ వ్యతిరేక బీజాలు నాటడంలో ప్రధాన లక్ష్యంగా ముందుకు సాగి విజయం సాధించింది. ఆంగ్లేయులను ఈ గడ్డ నుండి వెళ్ళగొట్టమే తన లక్ష్యంగా ఎంచుకున్న సాదిఖుల్ అఖ్బార్ తన లక్ష్యసాధనకు అనుకూలమైన వార్తలకు ప్రాధాన్యతనిచ్చింది.

బ్రిటీషర్లను పాలద్రోలి మొగల్ పాదుషాను తిరిగి నెమలి సింహాసనం మీద కూర్చోబెట్టేందుకు గాను ఆఫ్ఘనిస్తాన్, ఇరాన్ నుండి సైన్యాలు కదలి వస్తున్నాయని, ఆంగ్లేయులకు ఈ గడ్డ మీద ఇక నూకలు చెల్లాయని, తెల్లవాళ్ళకు ఇక సమాధి కట్టడం ఖాయమంటూ ప్రజల్ని ఉత్తేజితుల్ని చేయగల వార్తలను సాదిఖుల్ అఖ్బార్ ప్రచురించింది. ఈ విధంగా ప్రజలను తిరుగుబాటుకు ప్రేరేపించే విధంగా సమాచారం ప్రచురిస్తున్నందున సాధిఖుల్ అఖ్బార్ యాజమాన్యం, సంపాదకుల మీద ఆగ్రహించిన ప్రభుత్వం సంపాదకులు జమీలుద్దీన్‌ను అరెస్టు చేసి విచారణ జరిపి మూడేండ్ల జైలు శిక్షను విధించింది. ( **They Too Fought for India's Freedom (The Role of Minorities)** : P. 121).

1857 నాటి ఈస్ట్ ఇండియా కంపెనీకి వ్యతిరేకంగా ప్రజలను సన్నద్ధులను చేయగల సాహిత్య-సమాచారాన్ని అందచేసి తిరుగుబాటుకు అనువగు మానసిక

వాతావరణాన్ని పత్రికలు నిర్మించాయి. ఈ రకంగా బ్రిటీష్ వ్యతిరేక పోరులో ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ సంపాదకులు మౌల్వీ ముహమ్మద్ బాఖర్ ప్రధాన పాత్ర నిర్వహించారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో అగ్నికణాల్లా ఎగిసిపడుతున్న విప్లవకారులకు మరింత ఉత్తేజాన్నిస్తూ, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల దౌష్ట్యాన్ని తూర్పారపడుతూ, మాతృభూమి విముక్తి కోసం ప్రాణాలను పణంగా పెట్టాల్సిన అవసరాన్ని ప్రజలకు నొక్కిచెప్పడంలో మౌల్వీ బాఖర్ చాలా ప్రముఖ పాత్ర వహించారు.

మౌల్వీ బాఖర్‌లో చిన్న నాటనే స్వతంత్రభావనలు పొటమరించాయి. విదేశీయుల బానిసత్వంతో మగ్గుతున్న స్వదేశం, స్వదేశీయుల పరిస్థితి పట్ల ఆయన తీవ్రంగా కలత చెందారు. ఢిల్లీ నగరంలోని ప్రసిద్ధ ఢిల్లీ కళాశాల విద్యార్థిగా ఉన్నత విద్యను పూర్తిచేశాక ఢిల్లీ కళాశాలలో కొంతకాలం అధ్యాపకునిగానూ, ఇతర పలు అధికార పదవులనూ నిర్వహించి చివరకు జర్నలిజం వైపు మొగ్గు చూపారు. అక్షరశక్తి ద్వారా తన ప్రజలను పరాయి పాలకులకు వ్యతిరేకంగా చైతన్యవంతుల్ని చేయాలని సంకల్పించారు. ఆ ఆలోచనల ప్రకారంగా చేస్తున్న ఉన్నత ఉద్యోగానికి తిలోదకాలిచ్చారు. ప్రజలను ఉత్తేజితుల్ని చేస్తూ స్వతంత్ర జీవనానికి మార్గదర్శకం చేసే సమాచారాన్ని ప్రజలకు మరింత చేరువచేయాలని భావించిన ఆయన 1836లో ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ (Delhi Urdu Akhbar ) ఉర్దూ పత్రికను ప్రారంభించారు. ఈ పత్రికలో ఆనాటి ప్రముఖ కవులు బహదూర్ షా జఫర్, మీర్జా గాలిబ్, హఫీజ్ గులాం రసూల్, మీర్జా ముహమ్మద్ అలీ భక్త్, మీర్జా హైదర్ షికో, మీర్జా జీవన్ భక్త్, మీర్జా నూరుద్దీన్ తదితరులు కవితలు రాశారు. ఈ పత్రిక ద్వారా పలు విషయాల మీద కవులు చర్చలు సాగించారు.

స్వేచ్ఛా-స్వాతంత్ర్యాలను కోరుకుంటున్న దెహలీ ఉర్దూ అఖ్బార్ పత్రిక 1857 మే 10న ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ప్రారంభం కాగానే మరింత చురుకుగా వ్యవహరించడం ఆరంభించింది. ఈ పత్రిక ఢిల్లీ కేంద్రంగా ప్రచురితమౌతున్నా, పలు ఇతర ప్రాంతాల సమాచారాన్ని రాబట్టుకునేందుకు తగిన వ్యవస్థను ఏర్పాటు చేసుకుని ఇతర ప్రాంతాల సమాచారాన్ని కూడా ప్రచురిస్తూ తనదైన ప్రత్యేకతను చాటుకుంది. తిరుగుబాటుకు సంబంధించిన విశేషాలను సేకరించి వాటిని 'సంగ్రామ విశేషాలు' అను శీర్షికతో ప్రత్యేకంగా ప్రచురించటం ఆరంభించింది. తిరుగుబాటు బాగా

ఊపందుకున్న ఢిల్లీ, అంబాలా, మీరట్, షహరాన్‌పూర్ లాంటి పలు ప్రదేశాలలోని పోరాటాల వివరాలను పాఠకులకు అందించింది.

ఆంగ్లేయ సైన్యాలతో తలపడుతున్న ప్రజలను, స్వదేశీ యోధుల త్యాగాలను, శౌర్యప్రతాపాలను ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ సంపాదకులు ముహ్మద్ బాఖర్ తన వ్యాసాలలో, వార్తలలో శ్లాఘిస్తూ వ్యాఖ్యానించారు. ఆనాడు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులకు, నేతలకు, తిరుగుబాటును ప్రోత్సహించే కవులు-రచయితలకు ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ అక్షర వేదికయ్యింది. ఈ పత్రిక ద్వారా బహదూర్ షా జఫర్ ప్రజలకు సందేశాలు, సమాచారం కూడా పంపించారు.

ఈ పోరాటం విజయవంతం కావాలంటే ప్రజలు హిందూ-ముస్లిం ప్రజల ఐక్యత అత్యవసరమని భావించిన మౌల్వీ ముహమ్మద్ బాఖర్ ఆ దిశగా కూడా పుంఖాను పుంఖాలుగా వ్యాసాలు ప్రచురించారు. ఐక్యతను మరింతగా పటిష్ట పర్చేందుకు ఆయన ప్రత్యేక శ్రద్ధను తీసుకున్నారు. అందుకు గాను చరిత్ర, ఇతిహాసాలు, పురాణాలను ఆధారంగా చేసుకుని అందులోని సమాచారాన్ని ఉపయోగించుంటూ ఉత్తేజం కల్గించే రీతిలో పలు వ్యాసాలు రాశారు. ఆయన రాసిన వ్యాసాలలోని కొన్ని వ్యాఖ్యానాలు ఈ విధంగా ఉండేవిః

**'.. యూరపుకు చెందిన ఈ నీచ జాతికి వ్యతిరేకంగా ఒక తిరుగుబాటు చేద్దాం !...మోసపూరితంగా మనతో పనులు చేయించుకుంటున్న ఈ దుష్ట నీచులను అంతమొందిద్దాం. వీరి నికృష్ట పాలన అంతమయ్యేదాకా మనకు నిష్క్రమణ లేదు... మన పూర్వీకుల వీరోచిత లక్షణాలను ఆవాహన చేసుకుని..స్వాతంత్ర్య సంగ్రామంలో ఆంగ్లేయులను అంతం చేద్దాం, (ఆంగ్లేయులను ముప్పుతిప్పలు పెట్టిన మౌలానా ముహమ్మద్ బాఖర్,** షబ్నా, గీటురాయి వారపత్రిక, 18-7-2003, పేజీ. 18)

ఈ విధంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఉధృతరూపం దాల్చేందుకు ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ ఎంతగానో దోహదపడింది. ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల క్రూరచర్యలకు ఏమాత్రం అదరకుండా బెదరకుండా నేరుగా తిరుగుబాటు యోధులను ప్రోత్సహిస్తూ తిరుగుబాటుకు మౌల్వీ బాఖర్ స్వయంగా పిలుపునిచ్చారు.

1857 జూన్ నాటి ఢిల్లీ ఉర్దూ అఖ్బార్‌లో తిరుగుబాటు యోధులను సంభోధిస్తూ **వీర సిపాయీల్లారా ! ఇంతకు ముందు రాజరికాల్లో కనపర్చిన మీ సాహసకృత్యాలు**

ఇప్పటికీ భద్రంగా ఉన్నాయి. మహాభారత కాలంలోని భీముడు, అర్జునుడు మీతో ఉన్నారు. ముస్లింలలో అమీర్ తౌ(తై)మూరు, చంఘీస్(జ్) ఖాన్, హలాఖు ఖాన్‌ల గొప్ప సైన్య సంపత్తి జ్ఞప్తికి తెస్తున్నాం...ప్రజలకు వీరంతా మార్గదర్శకులే. ఇదేవిధంగా మన స్వాతంత్ర్య సంగ్రామం కూడా చరిత్రలో లిఖించబడుతుంది. ప్రపంచ వ్యాప్తంగా మన వీరోచిత గాథలు చరిత్రలో శాశ్వితంగా నిలచిపోతాయి. మీ వీరత్వం ముందు ఫిరంగులు ఏపాటివి? స్వాతంత్ర్య సముపార్జన కోసం విజృంభించండి అని ఆయన పేర్కొన్నారు. (**గీటురాయి**, 18-7-2003, పేజీ.19)

మౌలానా బాఖర్ తన పత్రిక **ఢిల్లీ ఉర్దూ అఖ్బార్** ను 1857 జూలై 19 తేది నుండి **అఖ్బారుల్ జఫర్** (Akhbar-ul-Zafar) గా మార్చారు. ఆ సంచికలో ఆయన స్వయంగా రాసిన సంపాదకీయంలో, ప్రజలను **నా దేశ ప్రజలారా** అని సంబోధిస్తూ , **ఆంగ్లేయుల ఎత్తుగడలు, వక్రమైన తెలివితేటలు, అంతులేని ఖనాజాలను చూసి ఆంగ్లేయులను జయించటం అసాధ్యమని అధైర్యపడుతున్నారా?** అని ప్రశ్నిస్తూ హిందూ-ముస్లిలను తమ ధార్మిక గ్రంథాలలో నిర్దేశించబడి విషయాలను మననం చేసుకుంటూ, ఆ గ్రంథాల వెలుగులో **ఆదిపురుషుడు** తప్ప ఏదీ శాశ్వతం కాదని తెలుసుకుని ధైర్యంగా ముందుకు సాగమని ఈ క్రింది విధంగా ఉద్భోదించారు.

O my countrymen, looking at the strategy and devious cleverness of the English...and their overflowing treasuries you may feel disheartened and doubt that such a people could ever be overcome. But those who are my Muslim Brothers by faith, let them consider - if they are anxious and concerned out of worldly considerations- to look at their religious book, such as the Quran, the Tafsie and Hadis, and those who belong to the Hindu Dharm, let them by the light of their gyan (wisdom) and dharma (faith), illumine the hearts and first see that except the Adipururush, the Primeval Deity, nothing is permanent. (**Frontline**, June 29, 2007, P.18)

మౌలానా బాఖర్ కుమారుడు మౌలానా ముహమ్మద్ హుసైన్ ఆజాద్ కూడా తండ్రి బాటలో నడిచారు. ఆయన కూడా తిరుగుబాటును ప్రేరేపిస్తూ, పోరాట యోధుల శౌర్యప్రతాపాలను కీర్తిస్తూ ఢిల్లీ ఉర్దూ అఖ్బార్‌లో రచనలు చేశారు. మౌలానా బాఖర్ మార్గంలోనే ఆంగ్లేయుల దుష్ట చర్యలకు ఏమాత్రం భయపడకుండా మాతృభూమి విముక్తి ప్రధానంగా భావిస్తూ తన రచనా వ్యాసంగాన్ని సాగించారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ

సమయంలో ఆ పోరాటాన్ని ప్రస్తావిస్తూ **తారిఖే ఇంక్విలాబ్ ఇబరత్ అఫ్జా** శీర్షికతో మౌలానా అజాద్ రాసిన కవిత చాలా ప్రసిద్ధిగాంచింది.

ఈ మేరకు తండ్రీ-కొడుకులు కలసి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో కలాన్ని ఆయుధంగా వలసపాలకుల మీద అక్షరాగ్నులు కురిపించారు. ప్రజలను చైతన్యవంతుల్ని చేస్తూ పోరాట యోధులకు బాసటగా నిలిచారు. ఆ దిశగా మౌలానా బాఖర్ **'రిసాల-యే-జిహాద్'** (Risala-i-Jihad) అను శీర్షికతో ఓ కరపత్రం ప్రచురించారు. ఆ కరపత్రంలో బ్రిటీషు వారిని ఈ దేశం నుండి తరిమి కొట్టాల్సిన అవసరాన్ని వివరిస్తూ పరాయి పాలకులను నిర్దాక్షిణ్యంగా స్వదేశం నుండి పాలద్రోలాల్సింది గానూ, ఆ లక్ష్యంతో సాగుతున్న పోరాటాలో ప్రజలు పెద్ద సంఖ్యలో పాల్గొనాల్సిందిగానూ పిలుపునిచ్చారు. ఈ మహత్తర లక్ష్యాన్ని సాధించాలంటే దేశంలోని హిందువులు-ముస్లింలు ఐక్యంగా ఉమ్మడి శత్రువు మీద తిరుగులేని యుద్ధం సాగించాలని మౌలానా బాఖర్ ప్రజలకు విజ్ఞప్తి చేశారు.( **Who's Who of Indian Martyrs 1857**, Dr. P.N.Chopra, Vol.III, 1973, P. 95)

ఈ సందర్భంగా మౌల్వి బాఖర్ **రాఖిం ఆసిం** అను పేరుతో ఆంగ్లేయుల చర్యలను ప్రశ్నిస్తూ, పోరాటయోధుల చర్యలను సమర్ధిస్తూ ఓ సుదీర్ఘ లేఖను ప్రకటించారు. పటిష్టమైన సమాచార సేకరణ వ్యవస్థతో ఎప్పటికప్పుడు నూతన సమాచారాన్ని రాబట్టుకుంటూ, ఆయా పరిణామాలను తనదైన దృక్పథంతో విశ్లేషించారు. భారతావని అంతటా సాగుతున్న పోరాటాల సమాచారాన్ని సేకరించి ప్రజలను ఉత్తేజితులను చేసే రీతిలో ప్రచురిస్తూ, ఈ లేఖలో తిరుగుబాటుకు తన పూర్తి మద్దతును ప్రకటించారు. ఈ లేఖ ఆంగ్లేయుల కోపకారణమైంది.

1857 సెప్టెంబరు 18న తిరుగుబాటు విఫలమై, ఢిల్లీ నగరం తిరిగి ఆంగ్లేయుల స్వాధీనంలోకి వచ్చాక ఆంగ్లేయాధికారులకు కొరకరాని కొయ్యగా తయారైన మౌలానా ముహమ్మద్ బాఖర్ కోసం వేట ఆరంభమైంది. 1857 డిశంబరు 14న ఆంగ్లేయ సైనికులు ఆయనను నిర్బంధించారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న వారిలో అత్యధికులను నిరాయుధులను చేసి నిర్దాక్షిణ్యంగా కాల్చివేసిన దుష్ట చరిత్ర గల మేజర్ హడ్సన్ సమక్షానికి ఆయనను తీసుకొచ్చారు. మౌలానా బాఖర్ మీద మొదటి నుండీ

మండిపడుతున్న ఆ ఆంగ్లేయాధికారి మౌలానాను చిత్రహింసలకు గురిచేసి చివరకు స్వయంగా కాల్చి చంపాడు. అనంతరం ఆంగ్ల సైనికులు మౌలానా గృహం మీద పడి అందుబాటులో ఉన్న ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ పత్రికలను కాల్చివేశారు. పత్రికా కార్యాలయంలో విధ్వంసాన్ని సృష్టించారు. మౌల్వీ బాఖర్ కుటుంబానికి చెందిన ఆస్తిపాస్తులను దోచుకున్నారు. చివరకు బాఖర్ కుటుంబానికి నిలువ నీడ కూడా లేకుండా చేశారు.

ఈ విధంగా మాతృభూమి విముక్తి కోసం పరాయి పాలకుల మీద సాగిన సాయుధ పోరాటంలో కలాన్ని ఆయుధంగా చేతపూని అక్షరాగ్నులతో శతృసంహారం చేస్తూ ప్రాణాలు వదలిన ప్రప్రథమ పత్రికాధిపతిగా, ప్రతికా సంపాదకుడిగా మౌలానా మొహ్మద్ బాఖర్ భారత స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలోనే కాదు భారత పత్రికారంగ చరిత్రలో కూడా తనదైన ముద్రతో చిరస్మరణీయ ఖ్యాతిని గడించారు.

('..It is to pointed out that the first martyr of the Indian media to the cause of Independence was Moulvi Mohammed Baqar, Editor, Delhi Urdu Akhbar ' - **Media and Muslims in India Since Independence**, Ed. AU Asif,IOS, New Delhi,1998, P 6)

1857 నాటి పోరాట కాలంలో ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించడంలో, హిందూ-ముస్లిం-శిక్కు జనసమూహాల మధ్య ఐక్యతను ప్రోదిచేయడంలో, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు, సాయుధ పోరాట యోధులను ఉత్సాహపర్చేందుకు **'పయామే ఆజాది'** పత్రిక కూడా తనదైన పాత్ర వహించింది. ఈ పత్రికను ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు, కాన్పూరు అధినేత నానాసాహెబ్‌కు ప్రధాన అనుచరుడిగా ఖ్యాతిగాంచిన అజీముల్లా ఖాన్ వెలువరించారు. ఈ పత్రికను తన స్వీయ సంపాదకత్వంలో హిందీ, ఉర్దూ భాషల్లో ఆయన ప్రచురించారు. **పయామే ఆజాది** మరాఠీ భాషలో కూడా నడిపేందుకు ప్రయత్నాలు జరిగాయి.

ఆనాడు అజీముల్లాను సంప్రదించనిదే నానా సాహెబ్ ముఖ్యమైన నిర్ణయమేది తీసుకునేవారు కాదు. (**1857 స్వరాజ్య సంగ్రామం**, వి.డి సావర్కర్, పేజీ 23). నానా సాహెబ్ ప్రతినిధిగా అజీముల్లా ఖాన్ తిరుగుబాటుకు చక్కని వ్యూహరచన చేశారు. నానా ప్రధాన సహచరుడిగా తిరగబడిన స్వదేశీపాలకులను కూడగట్టేందుకు ఆయన

ప్రయత్నించారు. ఈ సందర్భంగా ఇతర ప్రాంతాల సైనిక నేతలకు, ప్రత్యేకించి బ్రిటిష్ సైన్యంలోని భారతీయ సైనికులకు ఆయన ఉత్తరాలు రాశాడు. ఈ లేఖలలో అజీముల్లా ఖాన్ ఆనాటి రాజకీయ పరిస్థితులను వివరిస్తూ, స్వదేశీ పాలకులు, ప్రజలు ఎందువల్ల ఐక్యంగా ఆంగ్లేయుల మీద ధ్వజమెత్తాల్సివుందో వివరించారు.

ఇంగ్లాండు తదితర ప్రాంతాల పర్యటనల సందర్భంగా ఆయన సంపాదించిన సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి, రహస్య సంకేతాలతో ప్రత్యేక లేఖలను తయారు చేసి స్వదేశీ పాలకులకు పంపారు. ఆ లేఖలు శత్రువు చేతబడినా ఉద్యమానికి, ఉద్యమకారులకు ఎటువంటి నష్టం కలుగకుండా ఆయన సాంకేతికంగా పలు జాగ్రత్తలు తీసుకున్నారు. ఆ ఉత్తరాలు **భారతీయ రాకుమారుడి లేఖలు** గా ప్రచురితమై విఖ్యాతిగాంచాయి. అజీముల్లా ఖాన్ రెండవ బాజీ రావు, నానాసాహెబ్ దర్బారులోని రోజువారి వ్యవహారాలను కూడా ప్రత్యేక డైరీలుగా రాయించారు. ఆనాటి రాజకీయ వాతావరణంతో పాటుగా, ప్రజల జీవితాల గురించి తెలుసుకోవటానికి ఆయన రాసిన డైరీలు, లేఖలు చరిత్రకారులకు ఎంతగానో ఉపయోగపడ్డాయి.

ప్రపంచ పర్యటన సందర్భంగా గమనించిన అక్షర ప్రచార ప్రాముఖ్యత, ప్రజల మీద పత్రికల ప్రభావం బాగా తెలిసిన వ్యక్తిగావడంతో అజీముల్లా ఖాన్ **పయామే ఆజాది** పత్రికకు అంకురార్పణ చేశారు. ఈ పత్రికను స్వయంగా పర్యవేక్షిస్తూ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి జవజీవాలు అందించడానికి ఎనలేని కృషి చేశారు. ఆ పత్రికలో **'..భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం..'** అంటూ మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ జారీ చేసిన ప్రకటనను ప్రచురించారు. హిందూ-ముస్లిం తేడాలను పూర్తిగా విస్మరించి ఉమ్మడి శత్రువు మీద యుద్ధానికి కదలి రమ్మని ప్రజలను, స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటంలో పాల్గొనాల్సిందిగా వివిధ ప్రాంతాలలోని స్వదేశీ పాలకులను, స్వదేశీసైన్యాధికారులను, సైనికులను బహుదూర్‌షా జఫర్ ఆ ప్రకటనలో పిలుపునిచ్చారు.

మాతృ దేశాన్ని కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి విముక్తి కోసం పోరుబాటలో ముందుకు సాగమంటూ దేశ ప్రజలను కోరుతూ రాసిన ఉత్తేజపూరిత 'పైగాం-యే-

అమల్' అను ప్రబోధ గీతం **పయామే ఆజాది** లో ప్రముఖంగా ప్రచురితమైంది. ఈ ప్రబోధ గీతాన్ని మౌల్వీ లియాఖత్ అలీ రాశారు. ఆయన 1857లో ఆయుధంతో అటు ఆంగ్లేయల మీద కలబడిన పోరాటయోధుడిగా, కలంతో ఇటు స్వదేశీయులను చైతన్యవంతుల్ని చేసిన ప్రముఖ కవిగా తన ప్రత్యేకత నిలుపుకున్న ప్రముఖ స్వాతంత్ర్యసమర యోధుడు. అలహాబాద్‌లో ప్రజలు ఆయన నాయకత్వంలో ఆంగ్లేయుల మీద తిరుగుబాటు చేసి చరిత్ర సృష్టించారు.ఆనాడు మౌల్వీ లియాఖత్ రాసిన ఈ గీతం ప్రతి సందర్భంలోనూ అలహాబాద్ ప్రజలు, పోరాట యోధులు పాడుకోవటం ఆనవాయితిగా మారటంలో ప్రధమ స్వాతంత్ర్య సంగ్రామ గీతంగా అది ప్రజల హృదయాలలో నిలచి పోయింది. (**Muslims Poets in Independence Struggle**, Faisal Hashmi, **Radiance** Views Weekly, 31August - 6 September 2003, P. 51).

ఉత్తరప్రదేశ్ రాష్ట్రం అలహాబాద్ జిల్లా చాయిల్ తహసిల్‌లోని ఓ గ్రామంలోని చేనేత కార్మికుల కుటుంబంలో జన్మించిన మౌల్వీ లియాఖత్ అలీ (మౌల్వీ లియాఖత్ హుసైన్) భారతీయ సైనికులను పరాయి పాలకులకు వ్యతిరేకంగా కూడగట్టేందుకు బ్రిటీష్ సైన్యంలో చేరారు. భారతీయసైనికుల మనస్సుల్లో ఆంగ్లేయ వ్యతిరేకతను నూరిపోయటం ప్రారంభించారు. మౌల్వీ ప్రయత్నాలను పసికట్టిన అధికారులు ఆయనను సైన్యం నుండి బహిష్కరించారు. ఆ తరువాత మౌల్వీ లియాఖత్ అలీ స్వగ్రామాన్ని చేరుకుని మహాగావ్‌ను ప్రధాన కేంద్రంగా చేసుకుని బ్రిటీష్ వ్యతిరేక ప్రచారాన్ని పునః ప్రారంభించారు. ప్రజల న్యాయమైన హక్కుల సాధన కోసం ప్రతి ఒక్కరూ ధర్మపోరాటం సాగించాలని ఉద్బోధించారు. (**Freedom Fighters of Indian Mutiny 1857**, M.P Srivastava, Ghugh Publications, Allahabad, 1997, Pp. 160-61)

ఆ ఉద్బోధ మరింత శక్తివంతంగా ప్రజలకు చేరడానికి, ప్రజలలో మాతృభూమి పట్ల ప్రేమాభిమానాలు మరింత పెరగడానికి, ఆంగ్లేయుల పట్ల వ్యతిరేకత మరికాస్త బలపడడానికి ఆనాడు మౌల్వీ లియాఖత్ అలీ ఉర్దూ బాషలో రాసిన కవిత ఇలా సాగింది.

**' హమ్ హైం ఇస్‌కే మాలిక్**
**హిందూస్థాన్ హమారా !**

పాక్ వతన్ హై ఖౌమ్‌కా జన్నత్‌సేభి ప్యారా
యే హై హమారీ మిల్కియత్,
హిందూస్థాన్ హమారా !
ఇస్‌కీ సలామియత్‌సే రోషన్ హై జగ్‌సారా
కిత్‌నా ఖదీమ్, కిత్‌నా నయీామ్
సబ్ దునియాఁసే న్యారాకర్‌తీ హై
జర్‌ఖేజ్ జిసే
గంగా జమునాకే ధారా !
ఊపర్ బర్ఫీలీ పర్వత్ పహరేదార్ హమారా !
నీచే సాహల్ పర్ బజ్‌తా, సాగర్ నక్కారా
ఆయా ఫిరంగీ దూర్‌సే ఐసా మంతర్ మారా !
లూటా దోనో హాథోఁ సే
ప్యారా వతన్ హమారా !
ఆజ్ షహీదోఁ నే తుమ్‌కో
అహ్‌లే వతన్ లల్‌కారా !
తోడో గులామీకే జంజీరేఁ, బర్‌సావో అఁగారా !
హిందూ, ముసల్మాన్, సిఖ్ హమారా
భాయీ భాయీ ప్యారా
యే హై ఆజాదికా ఝండా,
ఇసే సలామ్ హమారా ! '.

('భారత పత్రికల్లో ముస్లింల పాత్ర', ముక్తార్, గీటురాయి వారపత్రిక, 25-04-2003, పేజీ 23, హైదరాబాద్)

ఆనాడు మౌల్వీ లియాఖత్ అలీ రాసిన **'పైగామ్-మే-అమల్'** కవితను **'జాతీయ గీతం-1857'** శీర్షికతో రచయిత దివికుమార్ తెలుగులోకి అనువదించారు. ఆ అనువాదం జూలై 2007 నాటి ఇండియా మాసపత్రికలో ఈ విధంగా ప్రచురితమైంది.

హిందూస్తాను మనదేశం - దీనికి మనమే విధాతలం
పవిత్ర జాతి మా దేశం - స్వర్గం కంటే మహాప్రియం
సమస్త సంపద మాదేలే - హిందూస్తాను మనదేలే
దీని భాగ్యము శాంతి సౌఖ్యములు
వెలుగు చిమ్మును జగమంతా
అతి ప్రాచీనం ఎంతో ధాటి
దీనికి లేదుర ఇలలో సాటి
గంగా యమునలు పారు నిండుగ
మానేలల్లో బంగరు పండగ
దిగువున పరుచుకున్న మైదానాలు
దిగ్గున ఎగసే సంద్రపుటలలు
మంచునిండిన ఎత్తు కొండలు
కావలి దండిగ మాకు అండగ
దూరం నుండి వచ్చిన దుష్టులు
చేసిరి కంతిరి మాయ చేష్టలు
జాతికి ఘనమౌ దేశాన్నంతా-దోచివేసిరి రెండు చేతులా
అమరవీరులు విసిరిన సవాలు-దేశవాసులు వినరండి
బానిస సంకెలు తెంపండి
నిప్పులవానై కురండి
హిందూ ముస్లిం సిక్కులందరం
ప్రియాతి ప్రియమౌ సోదరులం
ఇదిగిదిగో మన స్వతంత్ర జెండా
చేస్తాం సలాము గుండెల నిండా !

ఈ విధంగా అటు స్వదేశీ పాలకుల ప్రకటనలతో పాటుగా, పోరాట యోధులు స్వయంగా రాసిన ప్రబోధ గీతాలను ప్రచురిస్తూ, పలు ప్రాంతాలలో సాగుతున్న స్వాతంత్ర్య సంగ్రామ పోరాట ఘట్టాలను, తిరుగుబాటు యోధుల ఘనవిజయాలను ఏకరువు పెడుతూ

అజీముల్లా ఖాన్ సంపాదకత్వలో వెలువడిన 'పయామే ఆజాది' (Payame Azadi) ప్రథమ స్వాతంత్ర్యోద్యమంలో ప్రజల పక్షం వహించి బృహత్తర పాత్రను నిర్వహించింది.

మౌల్వీ లియాఖత్ అలీ రాసిన 'పయాం-యే-అమల్' గీతం అలనాటిదైనా ఈనాటి ప్రజానీకంలో కూడా మాతృదేశ భక్తి భావాలను రగిలించే జాతీయ గీతం స్థాయి కలిగి భావి తరాలకు స్ఫూర్తిని అందిస్తుందనడం సత్యదూరం కాబోదు. ఆ కారణంగా ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం 150 సంవత్సరాల సంబరాల సందర్భంగా 150 సంవత్సరాల క్రితం మౌలీ లియాఖత్ అలీ రాసిన 'పయాం-యే-అమల్' గీతం దూరదర్శన్ ద్వారా ప్రజలకు వినబడటం సంతోషదాయకం.

ఢిల్లీ ఉర్దూ అఖ్బార్ తరహాలో పయామే ఆజాది, సాదిఖుల్ అఖ్బార్, కోహినూర్, తిల్సిం-యే-లక్నో, సహర్-యే-సమ్రి లాంటి పలు పత్రికలు, ఆ పత్రికల సంపాదకులు 1857 తిరుగుబాటు సాగుతున్నంత కాలం ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజల మనోభావాలను మరింత పటిష్టం చేస్తూ పోరాట యోధులకు తోడ్పడ్డాయి. స్వదేశీ సైనికులకు తోడుగా నిలవడానికి ఆఫ్ఘనిస్తాన్ బలగాలు తరలి వస్తున్నాయంటూ ఇటు ప్రజలలో అటు పోరాట వీరులలో పోరాట స్ఫూర్తిని సజీవంగా ఉంచగలిగాయి. ఆ కారణంగా ఆంగ్లేయాధికారుల క్రూరత్వానికి ఆ పత్రికల సంపాదకులు గురవుతూ వచ్చారు.

ఈ పత్రికలన్నీ 1857కు ముందు ఆరంభింపబడి 1857 తిరుగుబాటు కాలంలో ప్రజల పక్షంగా తమ బాధ్యతలను నిర్వహించాయి. బ్రిటీష్ ప్రభుత్వాధికారులు తిరుగుబాటుకు అనుకూలంగా వ్యవహరిస్తున్న పత్రికలు, ఆ పత్రికల సంపాదకుల పట్ల ఎంతటి నిర్దాక్షిణ్యాన్ని ప్రదర్శించినా స్వేఛ్చా-స్వాతంత్ర్యాల సాధన ప్రధాన లక్ష్యంగా గల పలువురు అక్షర యోధులు 1857 తరువాత కూడా పలు పత్రికలను ఆరంభించారు. ఈ పత్రికలు ఆనాడు జరుగుతున్న పోరాటాల సమాచారాన్ని ఉత్కంఠత కలిగించే విధంగా ప్రజల దృష్టి తెస్తూ సమరయోధులకు నైతిక బలాన్ని అందించటంలో కృతకృత్యులయ్యాయి.

1858లో ప్రారంభమైన 'అవధ్ అఖ్బార్' (Oudh Akhbar) ఆంగ్లేయుల అరాచకాలను ఎండగడుత్తూ ప్రజల ముందుకు వచ్చింది. ఈ పత్రికను మున్షీ నావల్ కిషోర్ స్థాపించారు. ఆంగ్లేయుల అరాచకాలను తట్టుకుంటూ నిలబడిన అవధ్ అఖ్బార్ 1874లో దినపత్రిక అయ్యింది. ఈ ప్రతిక ప్రధానంగా లౌకిక వ్యవస్థ పునాదుల మీద

హిందూ-ముస్లింల మధ్య ఐక్యత కోసం ఎంతగానో కృషిచేసింది. లౌకిక-సర్దుబాటు భావనలతో కొనసాగిన ఈ పత్రిక 90 సంవత్సరాల పాటు ప్రజల విశేష ఆదరణ పొందింది.

1859లో ఆగ్రా నుండి 'తారీఖ్-యే-బగావత్-యే-హింద్' (Tarikh-i-Baghavat-i-Hind) ప్రచురితమైంది. ఈ పత్రిక తన పేరులోనే 'తిరుగుబాటు చరిత్ర' అను మాటను చేర్చుకుని అందుకు అనుగుణంగా వ్యవహరించింది. తారీఖ్ -యే-బగావత్-యే- హింద్ ను డాక్టర్ ముకుంద లాల్ అను ప్రముఖులు ఆరంభించారు. ఆంగ్లేయుల అరాచకం పట్ల ఏమాత్రం భయపడకుండా ఆనాడు ప్రథమ స్వాతంత్ర సంగ్రామంలో భాగంగా జరుగుతున్న సంఘటనల వివరాలను ప్రజలకు తారీఖ-యే-బగావత్-యే-హింద్ అందించింది. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టమని ప్రజలను కోరుతూ ఆనాటి ప్రముఖ తిరుగుబాటు యోధులు జారీ చేసిన ప్రకటనలను యధాతధంగా ఈ పత్రిక ప్రముఖంగా ప్రచురించింది. ప్రజలను, తమ తమ మత ధర్మాలను అనుసరిస్తూ స్వదేశీ ప్రభువుల పక్షంగా పోరుబాట నడిచేందుకు, ప్రజలకు సేవలు అందించడానికి తరలి రావాల్సిందిగా కోరుతూ కాన్పూరు తిరుగుబాటు నాయకులు నానా సాహెబ్ జారీ చేసిన ప్రకటనను ప్రముఖంగా ప్రచురించింది.

1860లో అజ్మీర్ నుండి ప్రచురణ ఆరంభించిన 'ఖైరఖాహ్-యే-ఖలఖ్ ( Khairkhuah -i-Khalq) అను పత్రిక ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం పూర్తిగా 1859 డిసెంబరు నాటికి సమసిపోయినా తిరుగుబాటు వారసత్వాన్ని కొనసాగించింది. 1857 నాటి తిరుగుబాటు విఫలయ్యాక భారతీయ సైనికుల పట్ల ఘోరంగా వ్యవహరిస్తున్న ఆంగ్లేయాధికారుల దుష్టచర్యలను, వారి దుష్ట నైజాన్ని ఎండగడ్తూ, ఆయా సంఘటనల వివరాలతో సహా ప్రచురించింది. ఈ ధోరణి వలన అతి త్వరలో కంపెనీ పాలకుల ఆగ్రహానికి గురై ఖైరఖాహ్-యే-ఖలఖ్ నిషేధించబడింది.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభానికి పూర్వం నుండే తిరుగుబాటు బీజాలు ప్రజల హృదయాలలో నాటడానికి, తిరుగుబాటు ఆరంభమయ్యాక తిరుగుబాటు దిశగా ప్రజలను నడిపించల ప్రేరణ కల్పించేందుకు, పోరాట యోధులు శత్రువును తునుమాడుతూ ముందుకు సాగిపోగల పోరాట స్ఫూర్తిని

అందిస్తూ, తిరుగుబాటు సమసిపోయాక కూడా ప్రజలలో స్వేచ్ఛ–స్వతంత్ర భావాలను సజీవంగా ఉంచేందుకు ప్రజల పక్షం వహించిన పత్రికలు ఆ దిశగా అవిశ్రాంతంగా కృషి సల్పాయి.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను పోరుబాట నడిపించేందుకు కంకణం కట్టుకుని మరీ నిరంతరం అక్షరాగ్నులు కురిపించినందున ఈస్ట్ ఇండియా పాలకులు ఆ పత్రికల మీద, ఆ పత్రికల సంపాదకుల మీద కక్షగట్టి మరీ వెంటాడారు. పత్రికలను నిషేధించటం, ప్రతికల ఆస్తులను జప్తు చేయటం, ప్రతికల కాపీలను దహనం చేయటం, సంపాదకులను అరెస్టు చేసి చిత్రహింసల పాల్జేయటం నిత్యకృత్యమైంది.

ఈ విషపూరిత వాతావరణంలో పత్రికల మనుగడ కష్టతరమైపోవడంతో ప్రజల పక్షం వహించిన పత్రికలు క్రమంగా కనుమరుగయ్యాయి. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి ముందు అనగా 1853 నాటికి 35 ఉర్దూ పత్రికలు ప్రచురితమౌతుండగా 1858 నాటికి అవికాస్తా 12 వరకు తగ్గిపోయాయంటే ఆయా పత్రికలు, ఆ పత్రికల సంపాదకుల పట్ల బ్రిటీష్ పాలకులు ఎంత క్రూరంగా వ్యవహరించారో తేలిగ్గానే ఊహించవచ్చు.

★ ★ ★

## అధ్యాయం - 5




# ఆంధ్రప్రదేశ్ ముస్లింలు

**ప్రథమ** స్వాతంత్ర్య సంగ్రామానికి పూర్వమే భరతగడ్డ మీద వీచిన బ్రిటీష్ వ్యతిరేక పవనాలకు తెలుగుబిడ్డలు కూడా తగు విధంగా ప్రతిస్పందించారు. ఆ స్పందనల మేరకు ఆంధ్ర ప్రదేశ్‌లోని పలు ప్రాంతాలలో తగిన చర్యలకు పూనుకున్నారు. ఆ పోరాట స్ఫూర్తితో ప్రథమ స్వాతంత్ర్యపోరాటంలో కూడా తమదైన భాగస్వామ్యాన్ని అందించారు.

ఆంగ్లేయుల మీద సిపాయీల తొలి తిరుగుబాటు 1857లో జరిగినట్టు చెబుతున్నప్పటికీ అప్పటికి సుమారు 77 ఏళ్ళ క్రితమే అనగా 1780లోనే విశాఖపట్నంలో తెల్లదొరల పాలనకు వ్యతిరేకంగా జరిగిన **తొలి సిపాయీల తిరుగుబాటు** కు తగినంత స్థానం, ప్రచారం లభించలేదు.

ఆ కారణంగా విశాఖపట్నం సిపాయీల తిరుగుబాటు చరిత్ర పుటలలో మరుగున పడిపోయింది. 1857 నాటి స్థాయిలో విశాఖపట్నం యోధుల తిరుగుబాటు జరగనప్పటికీ సిపాయీల తొలి సమరసంఖారావం మోగింది తెలుగు గడ్డ మీద కాగా

ఆ సమరానికి నాయకత్వం వహించింది తెలుగు బిడ్డలు కనుక ఆ చారిత్మాక సంఘటను గురించి తెలుసుకోవాల్సిన అవసరం ఉంది.

ఈ తిరుగుబాటు తెలుగు గడ్డ మీద జరిగిన విషయంగానీ, ఆ తిరుగుబాటు మన తెలుగు బిడ్డడి నేతృత్వంలో జరిగిందన్న విషయంగానీ మన చరిత్ర గుర్తు చేయదు. ఆ ఉదంతాలు, ఆ చారిత్రక సంఘటనల నిర్మాతల పట్ల ప్రభుత్వాలకు శ్రద్ధలేదు, ప్రభుత్వాధి నేతలు పట్టించుకోరు.ఆ ఘన చరిత్ర ప్రజలకు తెలియదు. ఆ కారణంగా ఆ యోధుల సాహసోపేతమైన పోరాటం, ఆ పోరాటయోధుల చరిత్రలు మరుగున పడిపోతున్నాయి.

## విశాఖపట్నం యోధుల తిరుగుబాటు

తెలుగునాట సిపాయిల తిరుగుబాటు 1780 అక్టోబరు 3న విశాఖపట్నంలో జరిగింది. **ఉత్తరాంధ్రలో ఎదురు లేకుండా పెత్తనం చేస్తున్న ఆంగ్లేయులు ఈ పోతుగడ్డ చావు దెబ్బను తొలిసారిగా చవిచూశారు. స్వాభిమానానికి మారుపేరైన ఉత్తరాంధ్ర కొదమ సింహాలు జబ్బచరిచి** బొబ్బరించిన ఈ తిరుగుబాటుకు ఈస్ట్ ఇండియా కంపెనీలో సుబేదారుగా పనిచేస్తున్న షేక్ అహ్మద్ (షేక్ ముహమ్మద్) నాయకత్వం వహించారు. ఆయన గుంటూరు జిల్లా సత్తెనపల్లికి చెందిన వ్యక్తిగా ఆంధ్ర విశ్వవిద్యాలయం విశ్రాంత ఆచార్యులు డాక్టర్ ఇ.వి. గంగాధరం (Director, Centre For Marine Archaeology) కథనం.

1780లో స్వదేశీయోధుడు హైదర్ అలీ ధాటిని ఎదుర్కొడానికి, ఆయన సైన్యాల మీద దాడులకు ఆంగ్లేయులకు అదనపు సైన్యం అవసరమైంది. మచిలీపట్నం, ఏలూరు, విశాఖపట్నంలలో గల కంపెనీ సైనికులను 1780 అక్టోబరు 3న మద్రాసుకు తరలించేందుకు ఆంగ్లేయాధికారులు ప్రయత్నించారు. ఆ బలవంతపు ప్రయత్నాల ఫలితంగా స్వదేశీ సిపాయిలలో నివురుగప్పిన నిప్పులాగున్న అసంతృప్తి మరింతగా పెరిగి తిరుగుబాటు మార్గం పట్టింది.

ఈస్ట్ ఇండియా కంపెనీ విశాఖపట్నం సైనిక స్థావరంలో సుబేదార్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న షేక్ అహ్మద్ నాయకత్వంలో స్వదేశీ సైనికులు తిరుగుబాటు బావుటాను వినువీధుల్లో ఎగురవేశారు. ఈ అనూహ్య పరిణామాలతో ఖంగుతిన్న అధికారులు కకావికలయ్యారు. ఈ తిరుగుబాటులో కొందరు అధికారులు స్వదేశీ యోధుల తుపాకి

గుళ్ళకు బలయ్యారు. స్వదేశీ యోధుల ధాటికి తట్టుకోలేక ఆంగ్లేయాధికారులు పలాయనం చిత్తగించారు. ఈస్ట్ ఇండియా కంపెనీ విశాఖపట్నం సైనిక స్థావరాన్ని సుబేదార్ అహ్మద్ ఆయన సహచరులు పూర్తిగా స్వాధీనం చేసుకున్నారు. ఈ తిరుగుబాటు చర్యలలో స్థానిక ప్రజలు కూడా భాగస్వాములయ్యారు.

కంపెనీ సైనిక స్థావరాన్ని స్వాధీనం చేసుకున్న సుబేదార్ అహ్మద్ తన సహచరులను హైదరాబాదు దిశగా నడిపించేందుకు ముందుకు సాగుతుండగా స్థానిక జమీందారు నారాయణ గణపతి దేవ్ విశాఖపట్నం సైనిక స్థావరం అధికారి కాసామేజర్‌ను (Casamajor) స్వదేశీ సిపాయీల చెరనుండి విముక్తం చేయమని అహ్మద్‌కు సలహా ఇచ్చాడు. ఆ సలహా వెనుకనున్న ఆంతర్యం గ్రహించని తిరుగుబాటు యోధులు ఆంగ్లేయాధికారిని విడుదల చేశారు. ఆ అధికారి సత్వరమే తగు చర్యలు తీసుకుని, కకావికలమై ఉన్న తన సైనిక బలగాలను తిరిగి సమకూర్చుకున్నాడు. తిరగబడిన సైనిక యోధులకు స్వదేశీ జమీందారుల సహకారం ఏమాత్రం లభించకుండా జాగ్రత్తలు తీసుకున్నాడు. కంపెనీ సైన్యాలను సమీకరించుకున్నాక సుబేదార్ అహ్మద్‌ను, ఆయన అనుచరులను వెంటాడమని తన సైనిక బలగాలను పంపాడు. ఆ వేటలో చివరకు సుబేదార్ అహ్మద్ సహచరులను గుడ్డెరాల్లి వంక (Gudderally wanka) వద్ద అక్టోబరు 8 రాత్రిపూట ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు.

('The Sepoy Revolt of Vizagapatnam,1780', B. Kesavanarayana, Andhra Pradesh History Congress, Proceedings of Warangal Sessions, 1990, P. 184)

ఆ సమయంలో తప్పించుకున్న సుబేదార్ అహ్మద్ కొన్ని మాసాలు కంపెనీ సైన్యాన్ని ముప్పుతిప్పలు పెట్టి చివరకు పట్టుబడ్డారు. ఆంగ్లేయుల వెన్నులో వణుకు పుట్టించిన తొలినాటి సైనిక తిరుగుబాటుకు నాయకత్వం వహించిన సుబేదార్ అహ్మద్ మీద విచారణ జరిపి ఉరిశిక్ష విధించారు. విశాఖపట్నంలోని ప్రస్తుత అబుసరంగ్ స్ట్రీట్‌లో సుబేదార్ అహమ్మద్‌కు ఆనాబు ఉరిశిక్ష అమలు చేశారు.

ఈ సంఘటన గురించి విశాఖపట్నం సైనికస్థావరం అధికారి కాసామేజర్ మద్రాసు గవర్నర్‌కు లేఖ రాస్తూ **వైజాగ్‌పట్నం సిపాయిల తిరుగుబాటును తీవ్రమైన, ప్రమాదకరమైన సంఘటనగా అభివర్ణించాడు. సంస్థానాధీశుడు నారాయణదేవ్ సహాయం**

సహకారాలు లభించి ఉండకపోతే ఈ సంఘటనలో ఆంగ్లేయులు ఎవ్వరూ బతికి ఉండే వారు కారని, ఈ సంఘటన ఈ ప్రాంతంలో ఆంగ్లేయుల ప్రాబల్యాన్ని తేరుకోలేని స్థాయిలో దెబ్బతీసిందని ఆ లేఖలో వివరించాడు. (**The Sepoy Revolt of Vizagapatnam**, 1780, B.Kesavanarayana, P. 183).

ఈ **తిరుగుబాటు** విషయమై ఆంధ్ర విశ్వవిద్యాలయం చరిత్ర శాఖాధిపతి డాక్టర్ కొల్లూరు సూర్యనారాయణ రచయితతో మాట్లాడుతూ **భారత దేశంలోనే తొట్టతొలుత సిపాయీల తిరుగుబాటు 1780 అక్టోబరు 3న విశాఖపట్నంలో జరిగింది. ఆ తిరుగుబాటు శంఖారావాన్ని పూరించిన వ్యక్తి, నాయకత్వం వహించిన వ్యక్తి షేక్ సుబేదార్ అహ్మద్. అయితే దురదృష్టవశాత్తు మంగళపాండే మాత్రమే ప్రజలకు తెలుసు. ఈ తిరుగుబాటు నాయకుడైన తెలుగు బిడ్డడు సుబేదార్ అహ్మద్ సాహసకృత్యానికి, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి 77 ఏండ్లకు పూర్వమే తెలుగు గడ్డ మీద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా జరిగిన తొలి సిపాయిల తిరుగుబాటుకు తగినంత ప్రాచుర్యం లభించక పోవటం నిజంగా దురదృష్టకరం,** అన్నారు. (డాక్టర్ సూర్యనారాయణతో ఇంటర్వ్యూ, 28 నవంబర్, 2006)

1780లో విశాఖపట్నం సైనిక స్థావరంలో తిరుగుబాటు జరిగాక, 1806లో తమిళనాడు రాష్ట్రంలోని వెల్లూరు, 1824లో ఉత్తర ప్రదేశ్ రాష్ట్రంలోని గోరఖ్‌పూర్‌లలో సిపాయిలు తిరుగుబాటు చేసిన చారిత్రక సంఘటనలున్నాయి. ఆ తరువాత హైదరాబాదు, ఔరంగా బాదు లాంటి ప్రాంతాలలో 1857 కంటే ముందు సిపాయీలు తిరుగబడిన సంఘటనలు ఉన్నాయి.

ఆ సంఘటనల మీద ఆయా ప్రాంతాలలోని రాష్ట్రప్రభుత్వాలు దృష్టిసారించి, ఆ చారిత్రక సంఘటనలు జరిగిన ప్రాంతాలకు, ఆయా తేదీలకు తగినంత ప్రాధాన్యత కల్పిస్తూ తిరుగుబాటు యోధులను స్మరించుకుంటూ పలు కార్యక్రమాలు జరుపుతున్నాయి. ఈ విషయంలో తమిళనాడు ప్రభుత్వం మిగతా రాష్ట్రాలకు చాలా ఆదర్శంగా ఉంది. తమిళనాడు గడ్డ మీద జరిగిన ప్రతి చారత్రిక ఘట్టానికి అధిక ప్రాధాన్యతనిస్తూ, 1806లో వెల్లూరులో జరిగిన తిరుగుబాటు సంఘటనకు ప్రజలలో తగినంత ప్రాచుర్యం కల్పిస్తూ, అలనాటి యోధులను స్మరిస్తూ ప్రతి ఏటా కార్యక్రమాలు నిర్వహించటమే కాదు **తొలి సైనిక తిరుగుబాటు** తమ గడ్డ మీద 1806లోనే జరిగిందంటూ ప్రచారం

కూడా కల్పించింది. ఆ క్రమంలో ఈ మధ్యనే వెల్లూరు తిరుగుబాటు యోధుల గౌరవార్థం తపాలా బిళ్ళను కూడా తమిళనాడు ప్రభుత్వం విడుదల చేసింది.

## తొలినాటి తిరుగుబాటు ధ్వనులు

స్వాతంత్ర్య సంగ్రామంలో తెలుగు ప్రజల పాత్రను గమనించే ముందుగా ఆంధ్రప్రదేశ్‌గా ప్రస్తుతం పిలువబడుతున్న సర్కారు, రాయలసీమ, కోస్తా ఆంధ్ర, తెలంగాణాలు ఆనాడు ఎవరి ఏలుబడిలో ఉన్నాయో తెలుసుకోవాలి. పాలకులు, ఆ పాలకుల స్వభావం, పరిపాలనా వ్యవస్థలను బట్టి కూడా ఆయా ప్రాంతాల ప్రజల



1806లో ప్రస్తుత తమిళనాడు రాష్ట్రంలోని వెల్లూరులో స్వదేశీ సైనికులు తిరుగుబాటు చేసిన కోట

స్పందన- ప్రతి స్పందనలు ఉంటాయి కనుక రాజకీయ-భౌగోళిక అధ్యయనం అవసరం. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో అంతర్భాగమైన తెలంగాణా, రాయలసీమ, కోస్తా ప్రాంతాలు ఆనాడు పూర్తిగా అటు బ్రిటీషర్ల పాలన క్రింద గానీ లేక ఇటు నిజాం నవాబు ఏలుబడి క్రింద గానీ లేవు. ఈ ప్రాంతాలు ప్రథమంలో నిజాం నవాబు ఆధీనంలో ఉన్నప్పటికీ, ఫ్రెంచివారి ప్రాపకం కోసం 1753లో కొంత ప్రాంతాన్ని, బ్రిటీషర్ల అండ దండల కోసం 1800 సంవత్సరంలో మరి కొంత భూభాగాన్ని నైజాం నవాబులు విదేశీ పాలకులకు ధారాదత్తం చేశారు. ఈ భూభాగాలను ఉత్తర సర్కారు, సీడెడ్ ప్రాంతాలుగా ఆనాడు

పిలిచేవారు. 1800 నాటికి ఈ ధారాదత్త ప్రక్రియ సమాప్తమైంది. ఆనాటి ఉత్తర సర్కారు, సీడెడ్ జిల్లాలు కలిసి మద్రాసు ప్రెసిడెన్సీలో భాగమైన ఆంధ్రప్రాంతం ఏర్పడింది. మిగిలిన ప్రాంతాలు నిజాం పాలకుల ఏలుబడి క్రింద ఉండిపోయాయి. ఈ ప్రాంతం తెలంగాణాగా పిలువబడింది. 1857 నాటికి ఆంధ్రప్రాంతం మద్రాసు ప్రెసిడెన్సీలో భాగంగా ఈస్ట్ ఇండియా కంపెనీ ఏలుబడిలో ఉండగా, తెలంగాణా ప్రాంతం నిజాం నవాబు పాలన క్రింద ఉంది.

ఈ మార్పులు, నిజాం రాజకీయ నిర్ణయాల మూలంగా నైజాం సంస్థానంలో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల పెత్తనం హద్దులు మీరింది. ఈ పెత్తనాన్ని సహించలేని స్వదేశీయులు నిశ్శబ్దంగా వ్యక్తం చేస్తూ వచ్చి ఆత్మాభిమానంగల యోధులు చివరకు నిరసనకు రూపం ఇచ్చారు. ఆ విధంగా స్వజనుల మీద బ్రిటీషర్ల పెత్తనాన్ని సహించలేక, ఆంగ్లేయాధికారుల చర్యలను వ్యతిరేకించిన తొలినాటి ప్రముఖులలో నూరుల్ ఉమ్రా బహదూర్ ఒకరు. నిజాం దర్బార్‌లో ముఖ్యుడైన ఆయన బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా వ్యవహరించమని స్వదేశీ సైనికులను 1806 ప్రాంతంలో ప్రోత్సహించారు. ఆ కారణంగా నిజాం నవాబు ఆగ్రహానికి గురై దర్బారు నుండి బహిష్కరించబడి, ఉస్మానాబాద్ జిల్లాలోని ఔసా కోటలో జీవితకాల నిర్బంధానికి గురయ్యారు. నిజాం సంస్థానంలో ఆంగ్లేయ వ్యతిరేక బీజాలను నాటిన నూరుల్ ఉమ్రా చివరకు 1818లో కన్నుమూశారు.

ఉత్తర భారత దేశంలో ఆరంభమై వహాబీల ఉద్యమ ప్రభావంతో ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనలో ఉన్న మద్రాసు ప్రెసిడెన్సీ, నిజాం సంస్థానాలలో తిరుగుబాటు పతాకాలు ఎగిరాయి. నూరుల్ ఉమ్రా తరువాత మరో నిజాం వంశ ప్రముఖుడు మీర్ గోహర్ అలీ ఖాన్ బ్రిటీష్ వ్యతిరేక పోరాట వేదిక మీదకు వచ్చారు. ఆయన నిజాం నవాబ్ సికిందర్ ఝా బహదూర్ కుమారుడు, అప్పటి హైదరాబాదు నవాబు నాసిరుద్దౌలా సోదరుడు. ఆయన అసలు పేరు మీర్ గోహర్ అలీ ఖాన్ అయినప్పటికీ ఆయన ముబారిజుద్దౌలాగా ప్రఖ్యాతుడు. బ్రిటీషర్ల అడుగులకు మడుగులొత్తే నవాబుల నైజానికి ముబారిజుద్దౌలా బద్ధ వ్యతిరేకి.

నూరుల్ ఉమ్రా పోరాట వారసత్వాన్ని చేపట్టిన స్వేచ్ఛా-స్వతంత్ర భావాలు గల ముబారిజుద్దౌలా ఆంగ్లేయుల పెత్తనాన్ని నిరసిస్తూ 1815లో తిరుగుబాటుకు

శ్రీకారం చుట్టారు. ఆ తరువాత 1830లో అరబ్బు, ఆఫ్గన్ జాతీయులతో కలిసి తిరగబడ్డారు. ఆయన తిరుగుబాటు నిజాం, బ్రిటీషర్ల సంయుక్త బలగాల ముందు ఊపిరి పీల్చుకోలేక పోయింది; చివరకు ఆయన నిర్బంధానికి గురయ్యారు. ఆ తరువాత 1839లో మరోమారు ముబారిజుద్దౌలా పోరుకు సిద్ధపడగా, బ్రిటీష్ రాణికి, నిజాం రాజ్యానికి వ్యతిరేకంగా కుట్ర పన్నారన్న ఆరోపణ మీద రాజద్రోహం నేరం మోపి ఆయనకు జీవిత ఖైదు విధించారు. ఈ పోరులో ఆయనకు సహకరించిన అనుచరులకు 10 సంవత్సరాలకు పైబడిన జైలు శిక్షలు పడ్డాయి. చిట్టచివరకు ముబారిజుద్దౌలా జైలుశిక్షను అనుభవిస్తూ గోల్కొండ కోటలో 1854 జూన్ 25న కన్నుమూశారు.

బ్రిటీషు వ్యతిరేక ఉద్యమంలో కర్నూలు నవాబు గులాం రసూల్ ఖాన్, ముబారిజుద్దౌలాతో చేతులు కలిపారు. ఈ విషయాన్ని పసికట్టిన బ్రిటీష్ అధికారులు టి.యల్.బ్లేన్ అను సైనికాధికారిని విచారణ కోసం నియమించారు. ఆ విచారణ తరువాత 1839 అక్టోబర్ 18న ఆంగ్ల సైన్యాధికారి ఎ.బి.డైస్ నాయకత్వంలో ఆంగ్లసైన్యం కర్నూలు నవాబు సంస్థానం మీద దాడి చేసింది.

ఆ పోరాటంలో నవాబు గులాం రసూల్ ఆంగ్ల సైన్యాలను సమర్థవంతంగా ఎదుర్కొన్నప్పటికీ పరాజితులయ్యారు. ఆయనను అరెస్టు చేసి తిరుచునాపల్లి ఖైదుకు తరలించారు. ఆ జైలులోనే గులాం రసూల్ తన సేవకుని చేతిలో హత్యకు గురయ్యారు. ఆ ఘాతుకానికి పాల్పడిన గులాం రసూల్ హంతకుడికి ఉరిశిక్ష పడింది. ఈ విధంగా గులాం రసూల్ పోరాట జీవితం ముగిసింది.

('The Political Relations Between The Nawabs of Kurnool and The English East India Company', Syed Moosa Miah, Andhra Pradesh History Congress, Proceedings of the Ninth Session, Kurnool, 1985, P. 156 -157)

బ్రిటీషర్ల పెత్తనం సహించలేక, 1846 ప్రాంతంలోనే కర్నూలు జిల్లాకు చెందిన ప్రజానాయకుడు నరసింహారెడ్డి బ్రిటీషర్ల మీద తిరగబడితే ఆయనకు ఆ ప్రాంతానికి చెందిన మరో యోధుడు ముహమ్మద్ ఖాన్ అండగా నిలిచారు. ఆ సందర్భంగా నరసింహారెడ్డికి హైదరాబాదుకు చెందిన సలాం ఖాన్ అను నాయకుడు కూడా సహకరించారు.

(**1846 Revolt of Rayalaseema : Some Releflections**, N.Raghavendra, Andhra Pradesh History Congress, Proceedings of the Tenth Session,Guntur, 1986, P. 197)

ఆ సాహసయోధుడు నరసింహారెడ్డి చరిత్ర టెలీ సీరియల్‌గా కూడా ప్రసారం అయ్యింది. ఆ తిరుగుబాట్లు పటిష్టమైన పోరాట రూపాలుగా పరిణితి చెందక ముందే ఆధునిక ఆయుధాలు, శిక్షణ పొందిన సైనిక బలగాలు గల ఈస్ట్ ఇండియా కంపెనీ ఆ తిరుగుబాట్లను నలిపి వేయడం, ఆ పోరాటాలకు పాపులర్ చరిత్ర గ్రంథాలలో తగిన చోటు లభించకపోవడంతో అవి ప్రజల మదిలో లేకుండా పోయాయి.

## 1857లో విజృంభించిన యోధులు

ప్రథమ స్వాతంత్ర్య సమరానికి పూర్వమే తిరుగుబాట్ల అపూర్వ వారసత్వం గల తెలుగు బిడ్డలు 1857లో తిరుగుబాటు యోధులు పూరించిన సమర శంఖారావాన్ని అందిపుచ్చుకుని బ్రిటీషర్ల పెత్తనాన్ని ఇక ఏమాత్రం సహించేది లేదని సాయుధులై కదిలారు. ఆయా ప్రాంతాలలో ఉన్నటువంటి రాజ్యవ్యవస్థ లేదా పాలనా వ్యవస్థను బట్టి ఆయా ప్రదేశాలలోని ప్రజానీకం స్థాయీ భేదాలతో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా **ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం**లో పాల్గొన్నారు.

ప్రథమ స్వాతంత్ర్య సమరం సృష్టించిన ప్రకంపనలు నిజాం ప్రాంతాలలో కన్పించినంతగా, మద్రాసు ప్రెసిడెన్సీ ప్రాంతమైన ఆంధ్ర ఏరియాలో కన్పించలేదు. భారత దేశంలోని ఇతర ప్రాంతాలలో లాగా మద్రాసు ప్రెసిడెన్సీ ప్రాంతమైన ఆంధ్రలో పదవీచ్యుతులు గావించబడిన స్వదేశీపాలకులు లేకపోవటం దీనికి ఒక ప్రధాన కారణం కావచ్చు. నిజాం ప్రాంతంలో స్వదేశీ పాలకుడున్నా కూడా, అక్కడ బ్రిటీష్ రెసిడెన్సీ అధికారుల ఆధిపత్యం సాగుతున్నందున, స్వదేశీ సంస్థానాధీశుడు ఈస్ట్ ఇండియా కంపెనీ నుండి సైనిక సహాయం స్వీకరించి, ఆంగ్లేయుల పెత్తనాన్ని పూర్తిగా అంగీకరించినందున తమపై సాగుతున్న విదేశీయుల పెత్తనానికీ, ఆధిపత్యానికీ వ్యతిరేకంగా ప్రజలు, స్వాభిమానంగల యోధులు విజృంభించారు.

ఉత్తర భారత దేశంలో రగులుతున్న బ్రిటీష్ వ్యతిరేకత తిన్నగా దక్షిణ భారత దేశాన్ని కూడా చుట్టేశాక, నిజాం సంస్థానంలో కూడ ఆ ప్రభావం బలపడసాగింది. ఈ పోకడలు ఎంత వరకు పోయాయంటే సంస్థానాధీశుడి పట్ల ఉన్న అభిమానం వలన ప్రభూ! **పోరుబాట నడవండి మేం మీవెంట ఉంటాం** అంటూ నేరుగా సంస్థానాధీశుడ్ని కోరేంత వరకు బ్రిటీష్ వ్యతిరేకత ఊపందుకుంది.

# అఫ్జలుద్దౌలా... పోరుబాట నడవండి !

ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులకు వ్యతిరేకంగా, ఆంగ్లేయుల ఆధిపత్యాన్ని నిరసిస్తూ ప్రజలు ముందుకు రాసాగారు. ఈ మేరకు సాగిన ఆంగ్లేయ వ్యతిరేక ప్రచార కార్యక్రమాలలో ప్రధానంగా ముల్లాలు, మషాయక్‌లు, పేష్ ఇమాంలు పాల్గొన్నారు. ఆంగ్లేయులకు బద్ధ విరోధులుగా మారి రాత్రింబవళ్ళు బ్రిటీష్ వ్యతిరేక కార్యకలాపాలలో వారు పాల్గొన్నారు. ఆనాడు ప్రజలలో పొడచూపిన ఈ వ్యతిరేకత ఆంగ్లేయుల వరకు పరిమిత మైంది. నైజాం సంస్థానాధీశుడి పట్ల గౌరవం కలిగిన ప్రజలు ఆయనను ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడాల్సింది గానూ, ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు పెత్తనం నుండి, ఆధిపత్యం నుండి విముక్తం కావాల్సింది గా కోరుతూ తొలిదశలో విజ్ఞప్తులు పంపుకున్నారు.

ఈ కదలికకు ఉత్తర భారతదేశంలో ప్రారంభమైన తిరుగుబాట్లు ప్రేరణగా నిలిచాయి. పరాయి పాలకుల మీద సమరం సాగించేందుకు సరైన అవకాశం కోసం ఎదురుచూస్తున్న పోరాటశక్తులు తక్షణమే ఆయుధాలను చేపట్టి బ్రిటీష్ పాలకులను సవాల్ చేశాయి. ఉమ్మడి శత్రువును ఎదుర్కొనేందుకు హిందూ-ముస్లింల ఐక్యతను కాంక్షిస్తూ ప్రజలను పోరాటదిశగా సాగమని ప్రతి ఒక్కరినీ కోరారు. ఆ ప్రయత్నాలలో భాగంగా సాగిన విజ్ఞప్తులకు స్పందించని నిజాం నవాబును హేళన చేస్తూ తిరగబడ మంటూ, కాదు కూడదంటే గాజులు తొడుక్కొని కూర్చోమని ప్రకటనలు, ప్లకార్డులు హైదరాబాదు నగరంలో వెలిశాయి.

ఆ ప్లకార్డులలో **బహదూర్ అఫ్జలుద్దౌలా మీద భగవంతుని, ముహమ్మద్ ప్రవక్త దయ ఉంది. ఆయన భయపడకుండా ఉండాలి. ఒకవేళ భయపడినట్టయితే గాజులు తొడుక్కొని ఇంటి దగ్గర కూర్చోవడం మంచిది...ఈ పోస్టర్లలో రాసిన ప్రకారంగా బహుదూర్ ప్రవర్తించనట్టయితే ఢిల్లీ నుండి ఇంకోక సుబా వస్తుంది** అని వ్యంగంగా రాశారు. (**నిజాం-బ్రిటీష్ సంబంధాలు (1727-1857)**, సరోజినీ రెగానీ, మీడియా హౌస్ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2002 పేజి. 319-320)

చివరకు ఈ పరిస్థితి ఎంత దూరం పోయిందంటే, ఈ వినతిని చదివిన వ్యక్తులు గాని, ఈ విషయం తెలుసుకున్న ఎవరైనా గాని ప్రకటించిన మేరకు నిజాంకు, ఆయన దివాన్‌కు ఆ విషయం తెలుపకున్నా, ప్రకటనలను అక్కడి నుండి తొలగించినా

అటువంటి వారు దేవుడు, ప్రవక్త శాపానికి గురవుతారని తీవ్రంగా హెచ్చరించే వరకు వెళ్ళింది. ఈ రకమైన ప్రకటనలో వెలిబుచ్చిన అభిప్రాయాలను, అందులో పొడచూపిన వ్యంగాన్ని, ఎత్తిపొడుపులను గమనిస్తే ప్రజల పట్టుదల, ఆగ్రహం ఏస్థాయిలో ఉందో అర్థం చేసుకోవచ్చు.

(" The aid of the Almighty and his prophet is present with Afzal-ud-Doula Bahadur who should not fear and be apprehensive. If fearful he should wear bangles and sit at home...If Afzal-ud-Doula does not act on this paper, another Soobah will be ready from Delhi...If after reading these papers on hearing of it a representation is not made to the king (Nizam) or his Diwan,....the oath of the swine is on him and if in case of a Hindu the oath of cow...if this paper removed from this place the curse of God and his prophet will rest on the person removing it..." - **Highlights of the Freedom Movement in Andhra Pradesh - The Freedom Struggle In Hyderabad**, Volume II (1857—1885) Govt. of A.P, 1956, P.8-9 )

ఈ ఆహ్వానాలు, ప్రజల విజ్ఞప్తులు నిజాం నవాబుకు ఏమాత్రం పట్టలేదు. బ్రిటీషర్లు మాత్రం ముంచుకొస్తున్న ప్రమాదాన్ని గ్రహించారు. సంపన్నవంతమే కాకుండా ఓ బలమైన మద్దతుదారుడైన నిజాం తమకు దూరమైతే అంతా దూరం కాగలదని భయపడ్డారు. దక్షణాది నుండి నిజాం కనుక తిరుగుబాటులో పాల్గొన్నట్టయితే తమ ఆధిపత్యం అంతం కాక తప్పదని భావించిన ఆంగ్లేయులు **నిజాం జారిపోయినట్టయితే అంతా జారి పోయినట్లే** అనే స్థిరాభిప్రాయానికి వచ్చారు. తిరుగుబాటు ప్రభావానికి, ప్రమాదానికి నిజాం సంస్థానం ఏమాత్రం గురికాకుండా ఉండేందుకు ఆంగ్లేయులు శాయశక్తులా కృషి చేశారు. చివరకు నిజాంను మంచి చేసుకుంటూ, ఆయనకు అంతులేని ఆశలు కల్పిస్తూ, బహుమతులు అందజేసుకుంటూ తిరుగుబాటుకు దూరంగా ఉంచగలిగారు.

## తెల్లవారిని తరిమి...తరిమి కొట్టండి !

ఈ వాతావరణం నచ్చని నైజాం సంస్థానంలోని ప్రజలలో సహనం నశించింది. నవాబు మీద గౌరవంతో తిరుగుబాటుకు ముందుకు రావాల్సిందిగానూ, ఆంగ్లేయుల పెత్తనం నుండి విముక్తం కావాల్సిందిగానూ ఆహ్వానం పలికిన స్వాతంత్ర్య కాంక్షాపరులు

అది సానుకూలం కాకపోవడంతో తమ ఆగ్రహాన్ని తెల్లవారి మీదకు మళ్ళించారు. ఆ ఆగ్రహజ్వాలల నుండి **తెల్లవార్ని తరిమి కొట్టమని, మట్టుబెట్టమని** ప్రజల నుండి నినాదాలు పుట్టుకొచ్చాయి. ఆ నినాదాలు కాస్తా నగరంలో ప్రకటనల రూపంలో కన్పించాయి. ("...Faithful to murder the feringhee" - **History of the Deccan Vol-II**, JDE Gribble, Mitttal Publications, NewDelhi,1990, P. 257).

ఆంగ్లేయాధికారులను భయపెట్టేందుకు ప్రజలు, నిజాం సంస్థానంలోని ప్రముఖులు కూడా ఉద్దేశ్యపూరకంగా పలు విధాలుగా ప్రచారాలు కూడా సాగించారు. ఈ విషయాన్ని ఆంగ్లేయాధికారి బ్రిగ్స్ వివరిస్తూ **నైజాం సంస్థానంలోని మంత్రులు, ఉన్నతాధికారులు తేనెపూసిన కత్తుల్లా వ్యవహరించే వారు. పైకి స్నేహపూరితంగా ఉంటూనే మీరు ఇక్కడి నుండి వెళ్ళిపోండి అని సలహా ఇచ్చేవారు. ఇక్కడి పరిస్థితులు బాగాలేవు. మీ ప్రాణాలకు ముప్పు ఏర్పడవచ్చు అని చెబుతూనే పారిపోయేలా చేసేవారు. పారిపోతే అధికారి పరువుపోతుంది. బ్రిటీష్ ప్రభుత్వపు నైతిక బలం దెబ్బతింటుందని వారి ఉద్దేశ్యం** అని రాశాడు. (**1857 తెలుగునాట తిరుగుబాటు**, డాక్టర్ కె మహంకాళిరావు, నవయుగ భారతి, భాగ్యనగర్, 2001 పేజి. 17-18).

ఆ సమయంలో షంషుల్ ఉమ్రా చిన్న కుమారుడు ఇఫ్తెకారుల్ ముల్క్ హైదరాబాదులో బ్రిటీష్ వ్యతిరేక ఉద్యమాన్ని లేవదీశాడని అప్పటి కల్నల్ డేవిడ్‌సన్ ఉన్నతాధికారులకు రిపోర్టు చేశాడు. నిజాం, బ్రిటీషు వారికి విరుద్ధంగా మాట్లాడిన వారినందరిని బెదిరించి వదిలేయటం కాకుండా వారందరిని నిర్బంధించాలని కూడా ఆ ఆంగ్లేయాధికారి ఆజ్ఞాపించాడు. (**హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర**, వెల్దుర్తి మాణిక్యరావు, పేజి.31).

## పోరుబాటలో మౌల్వీల మహత్తర పాత్ర

ప్రధానంగా సైనికులలో, ప్రజలలో ఆంగ్లేయుల పట్ల విద్వేషం మరింతగా పెంపొందిచటంలో ధార్మిక పండితులైన మౌల్వీలు ప్రధాన పాత్ర వహించారు. ఆనాటి చారిత్రక తిరుగుబాటుకు మౌల్వీలు వెన్నెముకగా నిలిచారు. ప్రజలను ప్రేరేపించి పోరుబాట నడిచేందుకు వారిని సన్నద్ధులను చేయటంలో మౌల్వీల బహుముఖ పాత్ర ఉంది. మౌల్వీలు ప్రజలను ప్రేరేపించటం, ప్రోత్సహించటంతో సరిపెట్టుకోలేదు కదనరంగంలో కూడా

ముందు నిలిచారు. కత్తిపట్టి ముందుకు నడిచి ఇతరులకు మార్గదర్శకులయ్యారు. బలమైన స్వేచ్ఛ-స్వాతంత్ర్య కాంక్షకు, కరడుకట్టిన బ్రిటీష్ వ్యతిరేకతకు మౌల్వీలు ప్రతీకలయ్యారు.

మౌల్వీ ఇబ్రాహీం, మౌల్వీ అక్బర్, మౌల్వీ అల్లాఉద్దీన్ తిరుగుబాటును ప్రోత్సహించటమే కాకుండా యోధులకు ముందు నిలచి వారిని నడిపించారు. నైజాం సంస్థానం రాజధాని హైదరాబాదు గడ్డ మీద తొలిసారిగా మౌల్వీ ఇబ్రహీం తిరుగుబాటు బావుటాను ఎగురవేశారు. మౌల్వీ ఇబ్రహీం ఉద్బోధ వలన 1857 జూన్ 10న ప్రజలు తిరుగుబాటు చేస్తారని నిజాం, బ్రిటీష్ రెసిడెంటు అనుమానించారు. ఈ తిరుగుబాటుకు మౌల్వీ ఇబ్రాహీం నాయకత్వం వహిస్తార్న మిష మీద ఆయనకు వ్యతిరేకంగా చర్యలు తీసుకోవాల్సిందిగా బ్రిటీష్ రెసిడెంటు కోరగా మౌల్వీని నిజాం పిలిపించి, హెచ్చరించి పంపి వేశాడు. ఆ కారణంగా మౌల్వీ అరెస్టు నుండి తప్పించు కోగలిగారు.

ఆ తరువాత జూన్ 13న చార్మినార్ సమీపాన గల చారిత్రక మక్కా మసీదులో మద్రాసు నుండి వచ్చిన ఇరువురు వ్యక్తులు నమాజ్ తరువాత మధ్యలో లేచి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నినాదాలు చేస్తూ ప్రజలను స్వాతంత్ర్యపోరాటానికి మద్దతు ఇవ్వాల్సిందిగా కోరుతూ ప్రసంగించారు. ఈ విషయం తెలిసిన ఆంగ్లేయులు వారిరువుర్ని బంధించేలోగా ప్రజలు చాకచక్యంగా వ్యవహరించి వారిద్దర్ని అక్కడి నుండి తప్పించారు. ఆ విధంగా అదృశ్యమైన ఆ యోధులను ఖామోషా అను ఫకీరు రక్షణ కల్పించారని బ్రిటీష్ గూఢాచారులకు ఆచూకి అందినా ప్రజల సహాయనిరాకరణ మూలంగా వేరెవ్వరినీ అరెస్టు చేయలేకపోయారు.

మౌల్వీ అక్బర్ నగరంలో ప్రసిద్ధి చెందిన మక్కా మసీదులో ప్రజల సమావేశం ఏర్పాటు చేసి బ్రిటీషు ప్రభుత్వం పెత్తనానికి వ్యతిరేకంగా తిరగబడమని ప్రజలను రెచ్చగొట్టేందుకు ప్రయత్నించారు. ఆ సందర్భంగా మక్కా మసీదు మీద స్వతంత్ర పతాకం ఎగురవేసేందుకు ఆయన, ఆయన సహచరులు కూడా సిద్ధపడ్డారు. నిజాం ఏర్పాటు చేసిన కాపలాదారులు జాగరూకులై ఆ ప్రయత్నాలను వమ్ము చేశారు.

పరాయి పాలకుల పెత్తనానికి వ్యతిరేకంగా మౌల్వీల చర్యలు, ఉద్బోధలు ఎంత వరకు వెళ్ళాయంటే మసీదుల్లో శుక్రవారం ఖుద్బా సందర్బంగా మౌల్వీలు ప్రజలను రెచ్చగొడుతున్నారన్న నెపం మీద శుక్రవారం ప్రార్థనలో ఖుత్బాను కూడా నిజాం నిషేదించాల్సి వచ్చింది. ఈ మేరకు మౌల్వీలకు, ధార్మిక పండితులకు, ధర్మప్రచారకులకు,

ఫకీర్లకు నిజాం పాలకులు ప్రత్యేకంగా హెచ్చరికలు కూడా జారీచేశారు. ఆ హెచ్చరికలను ఖాతరు చేయకుండా, నిజాం శిక్షలకు ఏమాత్రం భయపడకుండా ఆ స్వేచ్ఛాభిలాషులైన మౌల్వీలు, యోధులు మున్ముందుకు సాగారు.

ఆ కారణంగా బ్రిటీషు అధికారులు మౌల్వీలు, ఫకీర్ల మీద నిఘా పెట్టారు. బోయినపల్లిలో ఓ ఫకీరు బ్రిటీషు వారికి వ్యతిరేకంగా ప్రబోధం చేస్తుంటే అతనిని బంధించి జైల్లో వేశారు. అంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను, నవాబును రెచ్చగొడుతూ నగరంలోని గోడల మీద అంటించిన కరపత్రాలు చూసి ఆరాధనా మందిరాలలో ఎవ్వరూ కూడా ఆ విషయాలను ప్రస్తావించి ప్రజలు ఉసిగొల్పకుండా ఉండేందుకు


ప్రఖ్యాత చార్మినార్ కట్టడం

మౌల్వీలు, ఫకీర్ల పట్ల నిజాం చాలా కఠినంగా ప్రవర్తించాడు. బ్రిటీష్ వ్యతిరేకి అని చిన్నపాటి అనుమానం కలిగినా ప్రతి ఫకీరును, ప్రతి మౌల్వీని నిర్బంధించారు. అంగ్లేయుల సలహా మేరకు నిజాం నవాబు ఎంత కఠినంగా ప్రవర్తించినా ప్రజలలో వ్యతిరేక ప్రచారం నిరంతరం సాగింది. చివరకు ఈ ప్రచారం, ప్రయత్నాలు ప్రజానీకాన్ని పోరుబాట పట్టించగా, స్వదేశీ సైనికులలో తిరుగుబాటు జ్వాలను రగిలించింది.

## సైనికులలో తిరుగుబాటు జ్వాలలు

ఒక వైపున ప్రజలలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు గురించి

ఆలోచనలు సాగుతుండగా నిజాం సంస్థానానికి చెందిన సైనికులలో కూడా మరోవైపున తిరుగుబాటు జ్వాలలు రగిలాయి. ఆ సైన్యం మీద ఆధిపత్యం చలాయిస్తున్న ఆంగ్లేయ ఉన్నతాధికారుల మీద స్వదేశీ సైన్యాధికారులు, సైనికులు బాహాటంగా తిరగబడి కలకలం సృష్టించారు. కంపెనీ అధికారుల ఆజ్ఞలను ఉల్లంఘించారు. ఔరంగాబాదులో గల నిజాం సైన్యంలోని కాల్బలం నిజాం రాజ్యం సరిహద్దు దాటి వెళ్లేందుకు నిరాకరిస్తూ **నిజాంకే సర్‌హద్ బాహర్ నహీ జాయేంగే-దీన్ కే ఊపర్ కమర్ నహీ బాందేగే** (నిజాం సంస్థానం సరిహద్దులు దాటి వెళ్ళం-స్వమతస్థులకు వ్యతిరేకంగా పోరాటం చెయ్యం) అని ప్రకటించి సంచలనం సృష్టించింది.

(' We will not cross the frontiers of the Nizam's dominions and we will not fight against our own co-religionists ' - **Highlights of the Freedom Movement in Andhra Pradesh**, Dr. Sarojini Regani, 1972, Page.8).

ఆనాడు ఉత్తర భారతదేశంలో పలు పరాజయాలను ఎదుర్కొంటున్న ఆంగ్లేయులు ఆ ప్రాంతాలలోని స్వదేశీ పాలకుల మీద పోరాడటానికి తమను అక్కడకు తరలిస్తారని స్వదేశీ సైనికాధికారులు భావించారు. 1780 ప్రాంతంలో ఏవిధంగానైతే హైదర్ అలీ మీద యుద్ధం చేయడానికి సైనికుల తరలింపు కార్యక్రమాన్ని స్వదేశీ సైనికులు అడ్డగించారో అదేవిధంగా 1857 ప్రాంతంలో కూడా ఉత్తరాదికి వెళ్ళడానికి నిరాకరిస్తూ అధికారుల ఆజ్ఞలను స్వదేశీ సైనికులు నిరసించారు. ఆ నిరసన నుండి ఉద్భవించిన ధిక్కారానికి జమేదార్ అమీర్ ఖాన్, దఫేదార్ మీర్ ఫిదా అలీలు నాయకత్వం వహించారు. ఆ సంఘటనను పురస్కరించుకుని ఆజ్ఞల ఉల్లంఘనకు పాల్పడిన ఫిదా అలీపై సైనికవిచారణ జరిపి ఆయనను ఉరి తీశారు. అమీర్‌ఖాన్ మాత్రం పట్టుబడకుండా తప్పించుకున్నారు.

అధికారుల ఆజ్ఞలను తు.చ తప్పక పాటించే స్వదేశీ సైనికులు, సైన్యాధికారులు తిరుగుబాటును ప్రకటించడం, ఆంగ్లేయాధికారులతో సరాసరి తలపడటానికి సిద్ధపడడాన్ని ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు ఏమాత్రం సహించలేకపోయారు. తిరుగుబాటు ప్రభావం ఇతర ప్రాంతాలకు విస్తరించకుండా తిరుగుబాటుకు ఉద్యుక్తులైన వారి మీద కఠిన చర్యలు తీసుకున్నారు.

# భయానక శిక్షలకు భయపడని యోధులు

బ్రిటీషర్ల ఆజ్ఞలను ధిక్కరించిన స్వదేశీ సైనికులు, సైన్యాధికారులను ఉద్యోగాల నుండి తొలగించారు. పలువురికి కఠిన శిక్షలు విధించారు. ఉరిశిక్షలు, ఫిరంగులకు కట్టి పేల్చివేయటం సాధారణ విషయమైంది. ప్రభుత్వం ఎంతటి కిరాతకత్వానికి పాల్పడినా తిరగబడ్డ యోధులు మాత్రం శిక్షలకు ఏమాత్రం వెరవలేదు; భయకంపితులు కాలేదు. ఆ యోధులు మరణశిక్షలను కూడా ప్రశాంతంగా స్వీకరించి ఆంగ్లేయాధికారులను ఆశ్చర్యచకితుల్ని చేశారు. ఆ మారణకాండకు సంబంధించిన భయానక దృశ్యాలను బ్రిటీషు అధికారులు కూడా స్వయంగా చూడలేకపోయారు !

ఈ విషయాన్ని బ్రిటీష్ సైనికాధికారి Captain Abbot తన వారికి రాసిన లేఖలలో వివరంగా పేర్కొన్నాడు. ఎంతమంది యోధులను ఎలా ఉరి తీసిందీ, ఎలా ఫిరంగులకు కట్టి పేల్చి వేసిందీ, ఎంతమందికి ఏ విధంగా శిక్షలు వేసిందీ ఆయన తెలిపాడు. ఆ సమయంలో తిరుగుబాటు యోధులలో కన్పించిన నిర్భయత, ప్రశాంతతలను కూడా ఆ ఆంగ్లేయుడు తన ఉత్తరాలలో నమోదు చేశాడు.

ఆనాటి శిక్షల అమలు, ఆయా సంఘటనల విశేషాలను Captain Abbot ఈ విధంగా వివరించాడు:

**మేం మొదట పట్టుకున్న 94 మంది ఖైదీలలో ఒకరిని ఉరితీశాం. నల్గురిని కాల్చి చంపాం. ఒకడ్ని ఫిరంగులతో పేల్చివేశాం. ఆ దృశ్యం ఎంతో భయంకరంగా ఉంది. వాడి తల దాదాపు 20 గజాల పైకి ఎగిరింది. వాడి రెండు చేతులు రెండు వైపులకు దాదాపు ఎనిమిది గజాల దూరంలో పడ్డాయి. వాళ్ళు ఎంతో మామూలుగా తమకు విధించిన శిక్షలను గురించి వినటం చూసి ఆశ్చర్యపోయాను. ఫిరంగి ముందు నిలబడ్డ వ్యక్తి తనకు వ్యతిరేకంగా సాక్ష్యం చెప్పిన వారు భగవంతుని ఎదుట సమాధానం చెప్పవలసి వస్తుందని ప్రకటించాడు. తన్ను ఫిరంగికి కట్టవద్దని కోరాడు. తాను భయపడనని అన్నాడు. నన్ను నేను శుభ్రపర్చుకున్నాను. దాంతో నాపాపాలన్నీ కడిగేసుకున్నాను. ఎంత త్వరగా నేను స్వర్గానికి వెడితే అంత సుఖం అని ఉరితీయబడిన వ్యక్తి అన్నాడు...పట్టుబడ్డ ఖైదీలలో ఇద్దర్ని పేల్చివేశాం, మరో నలుగురిని కాల్చి చంపాం. నల్గురికి శిక్ష తగ్గించాం. మరో వంద మంది నిరాయుధుల్ని చేసి వెళ్ళగొట్టాం. ఓ**

**యాభై మందికి కొరడా దెబ్బల శిక్ష విధించాం...ఇంకా మేము చేయాల్సిన ఇటువంటి పని ఎంతో ఉంది. (నిజాం-బ్రిటీష్ సంబంధాలు**, సరోజిని రేగాని, మీడియా హౌస్ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2002, పేజి. 326)

ఈ నేపథ్యంలో 1857 జూన్ 12న నిజాం సరిహద్దులోని బుల్దానాలో ఉన్న హైదారాబాద్ కాల్బలం స్వదేశీ సైనికాధికారి జమేదార్ చిద్దాఖాన్ నాయకత్వంలో తిరగబడింది. తిరగబడిన సైనికులు స్థావరాలు వదలి వెళ్ళిపోయారు. బ్రిటీషర్లకు వ్యతిరేకంగా పోరాడటానికి నిజాం సహాయం కోరేందుకు తిరుగుబాటు వీరుడు చిద్దాఖాన్ నేతృత్వంలో పదిమంది వీరసైనికులు జూన్ 24న హైదరాబాద్ వచ్చారు. ఆంగ్లేయుల స్నేహితుడైన నిజాం తిరుగుబాటు యోధులకు సహాయం చేసి బ్రిటీషర్లతో శత్రుత్వం కొని తెచ్చుకోడానికి సిద్ధంగా లేడు. అందువలన చిద్దాఖాన్ నగర ప్రవేశం చేయగానే ఆయనను, ఆయన అనుచరులను అరెస్టు చేయించాడు. అరెస్టు చేయడమే కాదు ఆ యోధులను బ్రిటీష్ రెసిడెంటుకు అప్పగించాడు. ఈ సంఘటన నగరంలో పెద్ద సంచలనాన్ని సృష్టించింది. ఈ చర్యతో ప్రజలలో ఆగ్రహావేశాలు పెల్లుబికాయి.

ఈ ఆగ్రహావేశాలు ఖచ్చితంగా తిరుగుబాటుదిశగా పయనించి రూపుదిద్దుకోసాగాయి. నగరంలో ప్రతి మసీదు మీద ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోస్టర్లు వెలిశాయి. ఇది ఇలా ఉండగా ఢిల్లీలో స్వదేశీ యోధులు పూర్తిస్థాయి విజయం సాధించి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల పెత్తనానికి చరమగీతం పాడటం జరిగిందన్న వర్తమానం స్థానికులలో, స్వదేశీ సైనికులలో, పోరాట యోధులలో ఉత్సాహాన్ని నింపింది. ఆ ఉత్సాహంతో అటు సైనికులు ఇటు ప్రజలు బహిరంగంగా తిరుగుబాటుకు అమితోత్సాహాన్ని ప్రదర్శించ సాగారు.

ఈ విషయాన్ని పసిగట్టిన ఇంగ్లీష్‌మన్ అను ఆంగ్ల పత్రిక 1857 జూన్ 27 నాటి సంచికలో ఆ సమాచారాన్ని ప్రకటించింది. ఆ సంచికలో **హైదరాబాదులో అల్లరు చెలరేగే సూచనలున్నాయి. సైనికులలో అశాంతి ప్రబలి ఉంది. ఇస్లాం మత ధర్మ పరిరక్షణ కోసం మతధ్వజం ఎత్తాలని ఉన్నత స్థాయికి చెందిన ఫకీర్లు ముఖ్యంగా ఖామూష్ షాహ్ అదేపనిగా సైనికుల్లో ప్రచారం చేస్తున్నారు. ఇక మౌల్వీ అక్బర్ అనే ప్రచారకుడు మసీదుల్లో ఎడతెరపి లేకుండా ప్రచారం చేసినాడు** అని రాసింది.

అంతర్గతంగా వ్యాపిస్తున్న తిరుగుబాటు జ్వాలలు ఏ స్థాయిలో ఉన్నాయంటే బ్రిటీష్ రెసిడెంటు కల్నల్ డేవిడ్ సన్ తన దళాలను తాను నమ్మలేకపోవటమే కాకుండా తన అంగరక్షకులను కూడా నమ్మలేని పరిస్థితులు నిజాం సంస్థానంలో నెలకొన్నాయి. నిజాం సంస్థానం పరగణాలో తిరుగుబాటు ప్రయత్నాలు ముమ్మరంగా జరుగుతున్న సంగతి పసిగట్టిన ఓ ఆంగ్లేయాధికారి పరిస్థితి తీవ్రతను వివరిస్తూ **నాకు వచ్చిన సమాచారం ప్రకారంగా ఎటువంటి పనికైనా సిద్ధపడే 20 వేల మంది ముస్లింలు ఆయుధాలు సిద్ధం చేసుకుంటున్నారని తెలిసింది. వీరంతా రహస్యంగా ఈ పని చేస్తున్నారని తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నారని తెలిసింది. ప్రస్తుతానికి ఏ విధమైన తిరుగుబాటు చిహ్నాలు బహిరంగంగా లేకున్నా భవిష్యత్తులో తిరుగుబాటు జరగదని ఊహించలేము** అని ఉన్నతాధికారులకు వర్తమానం పంపాడు. (**నిజాం-బ్రిటీష్ సంబంధాలు**, సరోజిని రేగాని, పేజి.327)

## చారిత్రక మక్కామసీదు సమావేశం

ఆ వాతావరణానికి తగ్గట్టుగానే చిద్దాఖాన్ వ్యవహారం మీద 1857 జూలై 17న నగరంలోని చారిత్రక మక్కా మసీదు వద్ద ప్రజలు, ప్రముఖులు సమావేశమయ్యారు. నిజాం వద్దకు నలుగురు మౌల్వీలను పంపి, రెసిడెన్సీలో బందీగా ఉన్న చిద్దాఖాన్, ఆయన అనుచరులను విడుదల చేయాల్సిందిగా నిజాంకు విజ్ఞప్తి చేయాలని ఆ సమావేశంలో నిర్ణయించారు. ఆ నిర్ణయం మేరకు తమ విజ్ఞప్తిని నిజాం మన్నించకుంటే చివరి అస్త్రంగా బ్రిటీష్ రెసిడెంటు నివాసముంటున్న రెసిడెన్సీ మీద దాడి చేయాలని ఆ సమావేశంలో తీర్మానించారు.

మక్కామసీదు తీర్మానం మేరకు ఓ ప్రతినిధివర్గాన్ని ప్రజలు నిజాం వద్దకు పంపారు. ఆ ప్రతినిధివర్గం చిద్దాఖాన్, అయన అనుచరులను విడుదల చేయాల్సిందిగా నిజాంకు విజ్ఞప్తి చేసింది. ప్రజలు ఊహించిన విధంగానే మౌల్వీల విజ్ఞప్తిని నిజాం మన్నించలేదు. చిద్దాఖాన్ ఆయన అనుచరులను విడుదల చేయించడానికి నిజాం అంగీకరించలేదు. నిజాం తీసుకున్న ప్రతికూల నిర్ణయంతో మరింతగా ఆగ్రహించిన ప్రజలు, యోధులు మక్కా మసీదు తీర్మానం మేరకు బ్రిటీషు రెసిడెన్సీ మీద దాడికి సిద్ధమయ్యారు.

ఈ సాహసోపేత నిర్ణయం గురించి నిజాంకు తెలిసింది. ఆయన ఆఘమేఘాల మీద విషయాన్ని బ్రిటీషు రెసిడెంటుకు తెలుపుతూ తగిన జాగ్రత్త చర్యలు తీసుకోమన్నాడు. స్వయంగా నిజాం కూడా రంగంలోకి దిగి అవాంఛనీయ సంఘటల నివారణకు కట్టు దిట్టమైన చర్యలు చేపట్టాడు. మక్కా మసీదు వద్ద గుమికూడిన ప్రజలను చెదరగొట్టేందుకు అరబ్ రక్షక దళాలను పంపించాడు. రెసిడెన్సీ రక్షణకు ప్రత్యేక దళాలను పంపుతున్నానని రెసిడెంటుకు కబురు చేస్తూ, రక్షణ దళాలు రెసిడెన్సీ వద్దకు చేరుకునేంతవరకు తగు జాగ్రత్తలు తీసుకోవాల్సిందిగా రెసిడెంటును కోరాడు.

## బ్రిటీష్ రెసిడెన్సీపై సాహసోపేత దాడి

1857 జూలై 17 సాయంత్రానికల్లా రెడిడెన్సీ మీద దాడికి అన్ని విధాలుగా తిరుగుబాటు యోధులు సన్నద్ధమయ్యారు. ఈ దాడికి ప్రముఖ రోహిల్లా నాయకుడు తుర్రేబాజ్ ఖాన్, మౌల్వీ అల్లావుద్దీన్‌లు సంయుక్తంగా నాయకత్వం వహించారు. ఈ ఇరువురి నేతృత్వంలో 500 మంది రొహిల్లా వీరులు, పెద్ద సంఖ్యలో ప్రజలు రెసిడెన్సీ మీద దాడికి సిద్ధమయ్యారు. (**The Freedom Struggle In Hyderabad**, Volume II, P.51)

మక్కా మసీదు నుండి బయలు దేరిన యోధుల దళానికి మౌల్వీ ఇబ్రాహీం తిరుగుబాటు పతాకంతో ముందు నడిచి ప్రజలలో ప్రేరణ కల్గించారు. ఈ విధంగా దాడికి బయలుదేరిన రోహిల్లా యోధులకు, దారిలో కుల, మతాలతో సంబంధం లేకుండా హిందూ–ముస్లిం ప్రజానీకం పెద్ద సంఖ్యలో తోడుగా వచ్చింది. ఆగ్రహంతో ముందుకు సాగుతున్న యోధులతోపాటుగా ప్రజా సమూహాలు ముందుకు సాగాయి. బ్రిటీష్ రెసిడెన్సీ వైపుకు దారితీసే అన్ని మార్గాలలో ప్రజలు గుంపులుగుంపులుగా రెసిడెన్సీ వైపుకు కదిలారు.

ప్రస్తుతం హైదరాబాదు నగరంలోని కోఠి సెంటరులో ఉన్న మహిళా కళాశాల ఆనాడు బ్రిటీష్ రెసిడెన్సీ. ఆ రెసిడెన్సీలో బ్రిటీష్ ఉన్నతాధికారి కార్యాలయం, నివాసం ఉండేది. ఆ రెసిడెన్సీలో పోరాట యోధుడు చిద్దాఖాన్ ఆయన అనుచరులను బంధించి ఉన్నందున, మక్కా మసీదు నుండి రెసిడెన్సీ మీద దాడికి బయలుదేరిన యోధులు, ప్రజలు సాయంత్రం ఐదున్నర గంటలకు ఆ ప్రాంతం చేరుకున్నారు.

ఆ ప్రాంతం పడమరవైపున ప్రస్తుత ఉస్మానియా వైద్య కళాశాల రోడ్డు, ఆబిడ్స్‌కు

వెళ్ళు రోడ్డు పూర్తిగా దాడికి సిద్ధమైన తిరుగుబాటు యోధులు, చేతికి అందిన ఆయుధాన్ని చేతబట్టి వీరావేశంలో ఊగిపోతున్న జనంతో నిండిపోయింది. ఎటు చూసినా ఆగ్రహావేశాపరులైన ప్రజలు కన్పిస్తున్నారు. ఆ సమయంలో రెసిడెన్సీ మీద దాడికి విచ్చేసిన ప్రజాసమూహం **మహా క్రౌర్యాన్ని ప్రదర్శించే మానవ ముఖాల మహాసముద్రంలా** ఉందని స్థానిక బ్రిటీష్ ంసిడెంట్ యఫ్.డేవిడ్‌సన్ భారత ప్రభుత్వం కార్యదర్శికి రాసిన లేఖలో పేర్కొన్నాడు.

(an ocian of human faces, exhibiting ferocity in its wrost forms' - **The Freedom Struggle In Hyderabad**, Volume II (1857--1885) Govt. of AP, 1956, Pp. 38-39)



బ్రిటీష్ రెసిడెన్సీ మీద దాడి చేసిన స్వదేశీ యోధులు తొలుత సమావేశమైన చారిత్రక మక్కా మసీదు

రోహిల్లా యోధుడు తుర్రేబాజ్ ఖాన్ తన సహచర యోధులతో కలసి రెసిడెన్సీ చేరుకోగానే దానికి ఎదురుగా ఉన్న స్థానిక వ్యాపార ప్రముఖులు, తిరుగుబాటు యోధుల మద్దతుదారులైన అబ్బాస్ సాహెబ్ (అబ్బన్ సాహెబ్), జైగోపాల్ దాస్ పిత్తి భవంతులను స్వాధీనంలోకి తీసుకున్నారు. ఆ భవంతుల పై అంతస్థుల మీద నుండి ప్రస్తుత సుల్తాన్ బజార్ వైపుగా రెసిడెన్సీ మీద దాడి జరిపారు. అబ్బాస్ సాహెబ్, జైగోపాల్ దాస్ పిత్తి ల భవంతుల మీద నుండి మోహరింపు జరిగినందున పుత్లీబౌలీ, దిల్‌షుక్ నగర్ తోటల వైపున ఉన్న రెసిడెన్సీ గేట్ల మీద దాడి చేసేందుకు తిరుగుబాటు యోధులకు బాగా అనువయ్యింది.

ఈ విధంగా అన్ని ఏర్పాట్లు చేసుకుని పూర్తి స్థాయిలో దాడిచేసే ముందుగా తిరుగుబాటు యోధుడు చిద్దాఖాన్ ఆయన అనుచరులను విడుదల చేసి తమకు అప్పగించమని పఠాన్ తుర్రేబాజ్ ఖాన్ రెసిడెంటుకు మరోసారి కబురు చేశారు. అంతా ఊహించినట్టే బ్రిటీష్ రెసిడెన్సీ నుండి ప్రతికూలత వ్యక్తమయ్యింది. చివరకు దాడి కన్నా మరోమార్గం లేకుండా పోయింది.

రెసిడెన్సీ మీద దాడికి సిద్ధమై వచ్చిన తిరుగుబాటు యోధుల అంచనాలకు భిన్నంగా రెసిడెన్సీ వద్ద పరిస్థితులు ఎదురయ్యాయి. రెసిడెన్సీలో ఉన్న స్వదేశీ సైనికులు తమ దాడికి మద్దతుగా తమతో వచ్చి చేరుతారని తిరుగుబాటు యోధులు భావించారు. స్వదేశీ సైనికులు తమతో చేరినట్టయితే రెసిడెన్సీని ఇట్టే స్వాధీనం చేసుకోగలమని అంచనా వేశారు. ఆ అంచనాలకు భిన్నంగా జరిగింది.

ఆ సందర్భంగా రెసిడెన్సీ రక్షణకు వచ్చిన ఒక ఆశ్వికదళ రిసాల్‌దారు ఇస్మాయిల్ ఖాన్‌కు రొహిల్లా యోధులకు మధ్య వాగ్వివాదం జరిగింది. ఆ రిసాల్‌దారు తిరుగుబాటు యోధుల ఊహలకు వ్యతిరేకంగా రెసిడెంటు పక్షంవహిస్తూ రొహిల్లా యోధులతో మాట్లాడాడు. అందుకు ఆగ్రహించిన తిరుగుబాటు యోధులు ఆ రిసాల్‌దారు మీద కాల్పులు జరిపారు. ఆ కాల్పుల నుండి తప్పించుకున్న ఇస్మాయిల్ ఖాన్ తన గుర్రం మీద రెసిడెన్సీలోకి పారిపోయాడు. ఆ చర్యతో ఇరుపక్షాల మధ్యన పోరు ఆరంభమైంది.

బ్రిటీష్ రెసిడెన్సీకి రక్షణ బాధ్యతలు స్వీకరించిన Mjor Briggs వ్యూహాత్మకంగా రోహిల్లా యోధులను చెదరగొట్టేందుకు ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. తిరుగుబాటు యోధులు ఆక్రమించుకుని ఉన్న భవంతులను, ఇతర గృహాలను తన బలగాలతో చుట్టు ముట్టాడు. ఆ గృహాలను, భవంతులను అరబ్బు దళాలతో కాపుగాయించాడు. దాడిని ఆరంభించిన రోహిల్లా యోధులు ఆ పక్కనే ఉన్న అజీం అలీ ఖాన్ భవంతి గోడను పగులగొట్టి రెసిడెన్సీ వైపుకు దూసుకువెళ్ళేందుకు ప్రయత్నించారు. ఆ ప్రమాదాన్ని పసిగట్టిన ఆంగ్లేయాధికారి తిరుగుబాటు యోధుల మీద కాల్పులు జరిపించాడు.

ఆ ప్రతికూల వాతావరణంలో కూడా తిరుగుబాటు యోధులు ఏమాత్రం వెనుకాడలేదు. అస్త్రశస్త్రాలను శత్రువు మీద సంధించారు. ఒకవైపున తిరుగుబాటు యోధులు శత్రువు మీద కాల్పులు జరుపుతుండగా మరోవైపున మరికొంత మంది పుత్లీబౌలి వైపున ఉన్న రెసిడెన్సీ గేట్ల మడతబందులను విరగ్గొట్టారు. ఆ వైపు నుండి

రెసిడెన్సీ లోనికి వెళ్ళేందుకు ఆ సాహసికులు ప్రయత్నించగా రెసిడెన్సీ బలగాలు విరామం ఎరుగక చేస్తున్న కాల్పుల వలన ఆ ప్రయత్నాలు ఫలించలేదు. బ్రిటీష్ రెసిడెన్సీ నుండి ఆంగ్లేయ అనుకూల సైన్యాలు ఫిరంగులు, తుపాకులతో కాల్పులు జరుపుతుండగా తుపాకులు, తల్వార్లు, రాళ్ళురప్పలు, కట్టెలతో తిరుగుబాటు యోధులు, ప్రజలు శత్రువును ఎదుర్కొన్నారు.

ఈ కాల్పులు తెల్లవారు ఝామున నాలుగు గంటల వరకు సాగినా రెసిడెన్సీలోకి వెళ్లగల అవకాశం ఏ మాత్రం లేకపోవటంతో తిరుగుబాటు యోధులు ఆ ప్రయత్నాలను విరమించుకున్నారు. ఆయుధ సామగ్రి, అంగబలం ఎక్కువగా గల Major Briggs బలగాలు సాగిస్తున్న విరామమెరుగని కాల్పుల వలన తిరుగుబాటు యోధులు ఆత్మరక్షణలో పడ్డారు. ఆ సంక్లిష్ట సమయంలో రెసిడెన్సీ బలగాలకు అండగా సికిందరాబాద్ సైనిక స్థావరం నుండి రెండు యూరోపియన్ దళాలు మూడు భారీ ఫిరంగులతో వచ్చి చేరాయి. అదనపు బలగాలు వచ్చి చేరడంతో రెసిడెన్సీ బలగాలు రెట్టించిన ఉత్సాహంతో తమ తుపాకులు, ఫిరంగులకు పనిపెట్టాయి.

ఆ కారణంగా వర్షంలా దూసుకువస్తున్న తుపాకి గుండ్ల నుండి తప్పించుకునేందుకు పోరాటయోధులు తాము ఆక్రమించుకున్న భవంతులను, గృహాలను ఖాళీ చేశారు. ఆ గృహాల వద్ద కాపలా కాస్తున్న అరబ్బు దళాల సహకారంతో తిరుగుబాటు యోధులు రణస్థలం నుండి క్రమంగా నిష్క్రమించటం ఆరంభించారు. ఈ విధంగా రెసిడెన్సీ మీద దాడిని విరమించుకుని తిరిగి వెళ్ళిపోతున్న యోధులు గాయపడిన తమ సహచరులను తీసుకుని పోయారు. ఈ పోరాటంలో మొత్తం మీద 32 మంది తిరుగుబాటు యోధులు ప్రాణాలు కొల్పోగా పలువురు గాయపడ్డారు. చివరకు జూలై 18 ఉదయానికల్లా తిరుగుబాటు యోధులు అ ప్రాంతం ఖాళీ చేసి శత్రువు చేతికి చిక్క కుండా తప్పించుకుని వెళ్ళిపోయారు. (**The Freedom Struggle In Hyderabad**, Volume II : P. 52)

## నగరం నడిబొడ్డున వేలాడిన తుర్రేబాజ్ ఖాన్

ఆ విధంగా తప్పించుకు పోయిన తిరుగుబాటు యోధుల నాయకులు మౌల్వీ అల్లాఉద్దీన్, పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌లను బంధించేందుకు కంపెనీ పాలకులు తమ సైన్యాలనూ, గూఢాచారి దళాలనూ రంగంలోకి దించారు. బలసంపన్నమైన నిజాం

సంస్థానంలోని బ్రిటీష్ రెసిడెన్సీ మీద జరిగిన అత్యంత సాహసోపేతమైన దాడికి ప్రధాన ప్రేరణ అయినటువంటి అల్లాఉద్దీన్‌ను, ఈ దాడికి సాయుధంగా నాయకత్వం వహించిన తుర్రేబాజ్ ఖాన్‌ను అరెస్టు చేయడం తమ ప్రధాన లక్ష్యంగా కంపెనీ గూఢాచారి వర్గాలు, సైనిక బలగాలు తీవ్రస్థాయిలో ప్రయత్నాలు ఆరంభించాయి.

ఆ ప్రయత్నాలలో భాగంగా తిరుగుబాటు యోధుల నాయకుడు తుర్రేబాజ్ ఖాన్‌ను మొగల్‌గూడా ప్రాంతంలో1857 జూలై 22న బంధించారు. ఆయన ఆస్తి పాస్తులను జప్తు చేశారు. అయన మీద రాజద్రోహం నేరారోపణ, విచారణ సాగించారు. ఆ విచారణలో దాడికి పూర్తి బాధ్యతను తుర్రేబాజ్ ఖాన్ స్వయంగా స్వీకరించారు. ఆనాడు ఆయనిచ్చిన వాగ్మూలం ఎంతో గొప్పగా, స్ఫూర్తిదాయకంగా ఉంది. **ఆంగ్లేయులను భారత దేశం నుండి వెళ్ళగొట్టే ఉద్దేశ్యంతో తాను ఈ దాడికి పూనుకున్నట్టు** ఆయన ప్రకటించారు. ఈ దాడిలో పాల్గొన్న తోటి రొహిల్లాలను, మౌల్వీ అల్లాఉద్దీన్‌లను, ఇతర నాయకులను రక్షించే నిమిత్తం పోరులో పాల్గొన్న రొహిల్లాలు, ప్రజలు కేవలం తనను అనుసరించారనీ, అల్లావుద్దీన్ ఎవరో తను ఏమాత్రం తెలియదని, ఆయనతో కలసి తాను రెసిడెన్సీ మీద దాడి జరుపలేదని తుర్రేబాజ్ ఖాన్ విచారణలో చెప్పారు.

ఈ విచారణ తరువాత ఆయనకు జీవిత ఖైదు విధిస్తూ అండమాన్ దీవులకు పంపాలన్న నిర్ణయం జరిగింది. ఆ నిర్ణయం అమలు జరిగేలోపుగా తుర్రేబాజ్ ఖాన్ 1859 జనవరి 18న తనకు కాపలాగా పెట్టిన ఇరువురు సెంట్రీలతో సహా చెరసాల నుండి తప్పించుకున్నారు. ఆయనను బంధించి తెచ్చిన వారికి ఐదు వేల రూపాయల బహుమతిని 1858 జనవరి 19న నిజాం ప్రభుత్వం ప్రకటించింది. ఆవిధంగా తప్పించుకున్న తుర్రేబాజ్ ఖాన్ ఆచూకిని కుర్‌బాన్ అలీ (Kurban Ali) అను విద్రోహి ఇచ్చిన సమాచారంతో ఆంగ్లేయ గూఢాచారులు కనుగొన్నారు.

ఆ సమాచారం అందగానే 1858 జనవరి 24న నిజాం బలగాలు మెదక్ సమీపాన గల తూప్రాన్ (Toopran) అను గ్రామంలో ఉన్న తుర్రేబాజ్ ఖాన్ రహస్య స్థావరం మీద దాడి చేశాయి. అరెస్టును నివారించేందుకు తుర్రేబాజ్ ఖాన్ శత్రువుతో సాయుధంగా తలపడ్డారు. బ్రిటీష్ సైనికులతో సాగిన పోరాటంలో తుర్రేబాజ్ ఖాన్ కాల్పులకు గురై కన్నుమూశారు. ఆయన భౌతికకాయాన్ని నగరంలోకి తీసుకొచ్చారు. తిరుగుబాటు వీరులను, ప్రజలను మరింత భయభ్రాంతుల్ని చేసేందుకు తుర్రేబాజ్

ఖాన్ భౌతికకాయాన్ని సంకెళ్లతో బంధించి నగరం నడిబొడ్డున ప్రస్తుతం సుల్తాన్ బజార్ పోలీసు స్టేషన్ ఉన్న ప్రాంతంలో బహిరంగంగా వ్రేలాడదీశారు. ( **Who's Who of Freedom Struggle in Andhra Pradesh**, Volume I, P. 535). ఈ విధంగా తుర్రేబాజ్ ఖాన్ వెంట ఉండి ఆయనతోపాటుగా ఆంగ్ల-నిజాం సైనికులతో పోరాటం చేసిన ఆయన అనుచరుడు జాన్ అహ్మద్ కూడా ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాటం చేస్తూ మరణించారు.

1957లో జరిగిన **1857 శతజయంతి ఉత్సవాల** సందర్భంగా హైదరాబాదు నగరంలోని కోఠి నుండి జాంబాగ్ వైపుగా వెళ్ళు రోడ్డుకు తుర్రేబాజ్ ఖాన్ పేరుపెట్టారు. ఆ రోడ్డు వెంట వెళ్ళేవారికి రోడ్డు పేరు లిఖించబడిన చిన్న బోర్డు కన్పిస్తుంది గాని ఆయనెవ్వరో తెలియని దుస్థితి. ఆ సందర్భంగా 1857 నాటి అమరవీరులను స్మారకార్థం ప్రస్తుత కోఠి సిటీ బస్టాండులో ఓ స్మారక స్థూపాన్ని కూడా ప్రభుత్వం నిర్మించింది. ఈ స్మారక స్థూపం ఎటువంటి ఆలనా పాలనా లేక, చిల్లర వ్యాపారుల తోపుడు బండ్ల చక్రబంధంలో ఎవ్వరూ ప్రవేశించ వీలులేకుండా, ఎవ్వరికీ కన్పించని వాతావరణంలో ఉండిపోయింది.

1857 జూలై 18న ఆంగ్లేయుల చేత చిక్కకుండా మౌల్వీ అల్లాఉద్దీన్ చాకచక్యంగా తప్పించుకున్నారు. నగరం నుండి వెళ్ళిపోయిన ఆయన బెంగళూరు చేరుకున్నారు. అక్కడ ఒకటిన్నర సంవత్సరం రహస్య జీవితం గడిపారు. ఆయనను సజీవంగా గానీ నిర్జీవంగా గానీ పట్టి ఇచ్చిన వారికి గానీ, ఆయన ఆచూకి తెలిపిన వారికి గానీ నాలుగు వేల రూపాయల బహుమతిని ప్రభుత్వం ప్రకటించింది. ఆ తరువాత కొంత కాలానికి మంగలపల్లి (Mangalapalli) వద్ద నిజాం-బ్రిటీషు సైన్యాలు అల్లాఉద్దీన్‌ను నిర్బంధించాయి. ఆయనను నగరానికి తీసుకొచ్చి రాజద్రోహం, రెసిడెన్సీ మీద దాడి లాంటి పలు నేరారోపణలు మోపి విచారణ తంతు జరిపారు. ఆ విచారణ పర్యవసానంగా మౌల్వీ అల్లాఉద్దీన్‌కు ఆజన్మాంతం ద్వీపాంతరవాస శిక్ష విధించారు. ఆ శిక్ష మేరకు 1859 జూన్ 28న ఆయనను అండమాన్ తరలించారు. చివరివరకు అండమాన్ దీవుల్లోని సెల్యూలర్ జైలులో గడిపిన మౌల్వీ అల్లాఉద్దీన్ 1884 లో కన్నుమూశారు.

బ్రిటీష్ రెసిడెన్సీ మీద దాడి చర్యకు ఆగ్రహోగ్రుడైన బ్రిటీష్ రెసిడెంట్ కల్నల్

దేవిడ్‌సన్ పోరాటంలో పాల్గొన్న ఇతర యోధులను, ప్రజలను వెంటాటి, వేటాడి బంధించి చిత్రహింసలు పెట్టించాడు. రెసిడెన్సీ మీద దాడి సమయంలో తిరుగుబాటు యోధులకు ఉపయోగపడిన భవంతులు, వారు తప్పించుకోడానికి పనికొచ్చిన గృహాలను నేలమట్టం చేయించాడు. ఆ భవంతులు, గృహాల యజమానుల ఆస్తులును ప్రభుత్వం జప్తు చేసింది. ఆ కారణంగా సంపన్నులైన అబ్బాస్ సాహెబ్ (అబ్బన్ సాహెబ్), జైగోపాల్ దాస్ పిత్తిలు బజారున పడ్డారు. ఆనాడు తిరుగుబాటులో పాల్గొన్నారని అనుమానం వచ్చిన ప్రతిఒక్కరిని ఆంగ్లేయులు అరెస్టు చేసి జైలులో వేయించారు.

## రాయలసీమలో రగిలిన పోరాటం

ఈ పోరాట ప్రకంపనలు హైదరాబాదు వరకు పరిమితం కాలేదు. తిన్నగా రాయలసీమ ప్రాంతానికి కూడా విస్తరించాయి. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ఆరంభం కాగానే కడపజిల్లా ఎల్లంపేట నివాసి షేక్ పీర్ సాహెబ్ తిరుగుబాటుకు ప్రయత్నాలను ఆరంభించారు. ప్రజలలో తిరుగుబాటుకు తగిన భౌతిక-మానసిక వాతావరణం ఏర్పాటుకు సిద్ధమయ్యారు.

1857 ఆగస్టు 28న కడప కంటోన్మెంటులోని భారతీయ సైనిక అధికారులను, సైనికులను తిరగబడమని ఆయన నేరుగా ప్రోత్సహించారు. పుట్టుకతో అంధుడైన పీర్ సాహెబ్ పోరుబాటను ఎంచుకోవడమే కాకుండా ముహర్రం పండగ సందర్భంగా తెల్లవారి పాలన తప్పక అంతరిస్తుందని ఆత్మవిశ్వాసంతో ప్రకటించారు. ఈ నిర్ణయానికి అనుగుణంగా స్వదేశీ సైనికులను ఆకట్టుకుని తిరుగుబాటుకు షేక్ పీర్ సాహెబ్ ముమ్మరంగా సన్నాహాలు ఆరంభించారు. ఆయన చర్యలను పసికట్టిన బ్రిటీష్ సైనికాధికారులు పీర్ సాహెబ్ పథకం పూర్తిగా అమలులోకి రాకముందే ఆయనను అరెస్టుచేసి, విచారణ జరిపి 10 సంవత్సరాల జైలు శిక్ష విధించారు. తిరునల్వేలి ఖైదులో ఆయన జీవితం ముగిసింది.

ఈ ప్రయత్నాలలో భాగంగా మహమ్మదీయ న్యాయశాస్త్ర అధికారిగా బాధ్యతలు నిర్వహిస్తున్న మౌల్వీ సయ్యద్ అజీజ్ హుస్సేన్ ఇంటింటికి తిరిగి తిరుగుబాటుదారుల కోసం ఆహారపదార్థాలు, డబ్బు సేకరించారు. తుపాకులకు పూసే గ్రీసులో పంది, ఆవు కొవ్వు ఉంటుందన్న విషయం ప్రచారం చేసి బ్రిటీషర్లకు వ్యతిరేకంగా సైనికులను

రెచ్చగొట్టారు. ఫలితంగా కంపెనీ సైన్యాధికారులు ఆయనను కూడా అరెస్టు చేసి, ఆయన కార్యకలాపాలను రాజద్రోహ చర్యలుగా ప్రకటించి, పది సంవత్సరాల జైలు శిక్ష విధించారు. ఆ తరువాత మౌల్వీ సయ్యద్ అజీజ్ హుస్సేన్‌ను కూడా తిరునల్వేలి జైలులో నిర్బంధించారు.

## గుంటూరు గోదావరి సీమలలో తిరుగుబాటు

నిజాం సంస్థానంలో వ్యక్తమైన తిరుగుబాటు రాయలసీమను మాత్రమే కాకుండా గుంటూరు, గోదావరి సీమలను కూడా ప్రభావితం చేసింది. 1857 జూలై మాసంలో

1857లో మౌల్వీ అల్లావుద్దీన్, పఠాన్ తుర్రేబాజ్ ఖాన్‌ల నాయకత్వంలో దాడికి గురైన 1805 నాటి బ్రిటీష్ రెసిడెన్సీ చిత్రం



మచిలీపట్నంలోని ఈస్ట్ ఇండియా కంపెనీ సైనిక స్థావరంలోని సిపాయీలు పెరేడ్ జరుపు మైదానం ఎదురుగా ఎవరో గుర్తు తెలియని వ్యక్తులు ఆకుపచ్చని పతాకాన్ని ఎగురవేశారు. **ఆంగ్లేయులను నరికి వేయండి** అంటూ హిందూస్థానిలో నినాదాలు రాసిన ప్లకార్డు కూడా ఆ జెండా కర్రకు కట్టి ఉంది. ఈ దృశ్యం ఆంగ్లేయాధికారులలో కలవరానికి కారణమైంది. ఆఘమేఘాల మీద కదలిన ఆంగ్లేయాధికారులు నిందితుల కోసం వేట ప్రారంభించారు. సైనిక మైదానంలో తిరుగుబాటు గుర్తులు ప్రతిష్ఠించిన నిందితులను పట్టుకున్న వారికి రూ.500 లు బహుమానాన్ని ప్రకటించినా, అధికారులు ఎంత ప్రయత్నించినా ఆ దృశ్యాన్ని రూపొందించిన సాహసుల ఆచూకిని ఏ మాత్రం కనిపెట్ట

లేకపోయారు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volume I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, Page. 147)

1857 నవంబరు 7న కృష్ణాజిల్లా జగ్గయ్యపేటలోని ప్రభుత్వ కచేరి మీద దాడి జరిగింది. ఆయుధాలు చేపట్టిన నాలుగు వందల మంది రోహిల్లాలు కచేరి ఆవరణలోకి దూసుకొచ్చారు. ఆ సమయంలో కంపెనీ సైనికుల ప్రతిఘటన అంతగా లేకపోవటంతో కోశాగారంలోని నగదును, ఆయుధాగారంలోని ఆయుధాలను స్వంతం చేసుకున్నారు. ఈ సాహకృత్యంలో హిందూ-ముస్లిం యోధులు ఉమ్మడిగా పాల్గొన్నారు. ఈ ఆకస్మిక దాడికి కంపెనీ అధికారులు బెంబేలెత్తిపోయారు

1857 ఆగస్టు 21న ప్రథమస్వాతంత్ర్య సమరయోధుడు రహింబేగ్ ను ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. మొహర్రం పండుగ సందర్భంగా రహింబేగ్ తిరుగు బాటుకు సిద్ధమయ్యారు. ఆ రహస్యం బయటపడటంతో బేగ్‌ను ఆయన సహచరులు ఖాజీ మున్‌దార్‌దార్ అలీ, హుసైన్ బేగ్, షబీబ్ బేగ్, మీరా హుస్సేన్, సిలార్ ఖాన్, మీర్ లుబ్బా ఖాన్, మీర్ వజీర్ అలీ, గాలిబ్ బేగ్, ముస్తాబ్ సాహెబ్, ఖాద్ ముహమ్మద్ అలీ ఖాన్ అలియాస్ దాదా సాహెబ్ తదితరులను అరెస్టు చేశారు.

ఈ తిరుగుబాటును ప్రస్తావిస్తూ ఆగస్టు 22న రాజమండ్రిలోని ఆంగ్లేయాధికారి మద్రాసులోని ఆంగ్లేయ ప్రభుత్వ ప్రధాన కార్యదర్శికి రాసిన లేఖలో **భారీ కుట్రను మొగ్గలోనే తుంచగలిగామని** చెప్పుకున్నాడు. కాగా **ఆ తిరుగుబాటు కేవలం రాజమండ్రి వరకు మాత్రమే పరిమితం కాలేదని, మచిలీపట్నం, గుంటూరు జిల్లాలను కూడా కలుపుకుని ప్రజలను రెచ్చగొట్టి ఒకేసారి తెల్లవారి మీద తిరుగబడేందుకు పెద్ద వ్యూహం పన్నారని...ముసల్మాన్లు ఇందులో ప్రధాన పాత్ర వహించారని,** ఆ లేఖలో వివరించాడు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volume- I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, P. 156-157)

ఈ వార్తలతో గుండెలదిరిన ఆంగ్లేయాధికారులు ముంచుకొచ్చిన ముప్పు కొద్దిలో తప్పిపోయిందని భావిస్తూ అప్రమత్తులై ఉండాల్సిందిగా ఇతర ప్రాంతాల అధికారులకు వర్తమానం పంపారు. అనుమానితుల పట్ల కర్కశంగా వ్యవహరిస్తూ దాడులు చేసి అరెస్టులను ముమ్మరం చేశారు. ఈ అరెస్టులలో 14 సంవత్సరాల సయ్యద్ లాల్ అను యోధుడు ఉండటం విశేషం. ఈ యోధుడు 7 సంవత్సరాల కారాగార శిక్షకు గురయ్యారు.

ఈ విధంగా గుంటూరు, కృష్ణా గోదావరి మండలాలలో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం ప్రభావం తీవ్రంగా కన్పించింది. (1857, యం.వి.ఆర్ శాస్త్రి, ఆంధ్రభూమి దినపత్రిక, 2007 జనవరి 14)

## ఉత్తర భారతానికి వెళ్ళిన యువకులు

స్వస్థానంలో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొనడమే కాకుండా, ఉత్తర భారతంలో స్వదేశీ యోధులు సాధిస్తున్న విజయాల గురించి విన్న రాయలసీమ యువకులు ప్రజ్వరిల్లుతున్న ఉత్తర భారతానికి కూడా వెళ్ళారు. పరాయి పాలకుల పెత్తనాన్ని సహించని పలువురు ముస్లింలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న యోధులతో కలసి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో పాల్గొనేందుకు రాయలసీమ ప్రాంతం నుండి ఉత్తర భారతానికి వలస వెళ్లారని అప్పటి కడప మెజిస్ట్రేట్ 1857 జూన్ 20న మద్రాస్ గవర్నర్‌కు రాసిన లేఖలో పేర్కొన్నారు. (**The Freedom Struggle in Andhra Pradesh (Andhra)**, Volume I (1800-1905 AD), Govt. of AP, Hyderabad, 1997, P. 147)

## ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం తరువాత

1857 సెప్టంబరు మాసం చివరికల్లా ఢిల్లీ కేంద్రంగా ఆరంభమైన ప్రథమ స్వాతంత్ర్య సమరం విఫలమైనప్పటికీ, ఉత్తర భారతదేశంలో బేగం హజరత్ మహల్, మౌల్వీ అహ్మదుల్లా షా ఫైజాబాది, షెహజాదా ఫిరోజ్ షా, నానా సాహెబ్, ఝాన్సీరాణి లక్ష్మీబాయి, కన్వర్ సింగ్ లాంటి నేతల నాయకత్వంలో లక్నో, కాన్పూరు, ఝాన్సీ తదితర ప్రాంతాలలో ఎగురుతున్న తిరుగుబాటు బావుటాలను ప్రేరణగా తీసుకుని దేశంలోని పలు ప్రాంతాలలో తిరుగుబాటు ఛాయలు కొనసాగుతూనే వచ్చాయి.

ఆ ఛాయలు నిజాం గడ్డ మీద కూడా ప్రబలంగా కన్పించాయి. తిరుగుబాటు విఫలమైనా, స్వదేశీ యోధుల మీద ఆంగ్లేయులది పైచేయిగా కన్పించినా స్వేచ్ఛా-స్వాతంత్ర్యకాంక్షాపరులైన ప్రజలు మాత్రం చాలా కాలం పోరుబాట వీడలేదు. స్వదేశీ ప్రభువులు కలసి రాకపోయినా ఆంగ్లేయులను ప్రధాన శత్రువుగా పరిగణించిన పోరాటయోధులు తమ ఆయుధాలను నేరుగా బ్రిటీషర్ల మీద ప్రయోగించారు. ఆంగ్లేయుల

అడుగులకు మడుగులొత్తుతూ ప్రజల అభిమతానికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్న స్వదేశీ సంస్థానాధీశుల మీద కూడా ఆగ్రహం వ్యక్తంచేశారు.

## అభినందన కల్గించిన ఆగ్రహం

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఆంగ్లేయుల పక్షంగా వ్యవహరించి తిరుగుబాటు జ్వాలల నుండి ఈస్ట్ఇండియా కంపెనీ అధికారులను రక్షించి బ్రిటీషర్ల పాలనకు ప్రాణం పోసిన స్వదేశీ పాలకులను ఈస్ట్ ఇండియా కంపెనీ అవార్డులు-రివార్డులతో ముంచెత్తింది. ఆ క్రమంలో నిజాం నవాబుకు బ్రిటీషర్లు అందచేసిన బిరుదులు, బహుమానాలు కూడా స్వేచ్ఛను కోరుకుంటున్న ప్రజలలో ఆగ్రహానికి కారణమయ్యాయి.

1859లో బ్రిటీషు రెసిడెంటు కలకత్తాకు వెళ్ళి నిజాం కోసం ప్రశంసల పత్రం (ఖతీరా) తెచ్చాడు. ఈ వార్త తెలిసిన ప్రజలు మండిపడ్డారు. బ్రిటీషు రెసిడెంటు తెచ్చిన పత్రం **అభినందన పత్రం కాదని అది అవమానకర పత్రమని** ప్రజలు ప్రధానంగా పోరాట యోధులైన స్వదేశీ సిపాయీలు భావించారు. ఆ యోధులు ఆంగ్లేయుల పట్ల నిజాం చూపుతున్న విధేయతను, వారి అభినందనలను ఆనందంగానూ, మరెంతో గౌరవంగా భావించి స్వీకరించడాన్ని ఏమాత్రం జీర్ణించుకోలేకపోయారు.

1859 మార్చి 15న నిజాం దర్బారులో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన నిజాం సంస్థానాధీశుని కోసం తెచ్చిన ప్రశంసాపత్రాన్ని బ్రిటీష్ రెసిడెంటు సంస్థానాధీశునికి అందించాడు. ఆ అభినందన పత్రం విషయం తెలుసుకున్న రోహిల్లా యోధుడు జంహంగీర్ ఖాన్ కోపంతో రగిలిపోయారు. ఏదైనా చేస్తా లేకుంటే చస్తా అని నిర్ణయించుకున్నారు. మనసులో రూపొందిన పథకాన్ని అమలుపర్చేందుకు నిజాం దేవిడి ముందు కాపుకాశారు.

ఆ సమయంలో దర్బారులో ప్రశంసాపత్ర ప్రదానోత్సవ కార్యక్రమం ముగిసింది. ఆ ఆనందంలో నిజాం నవాబుతో పాటుగా దర్బారు నుండి దర్పంగా బయటకు వస్తున్న ఆంగ్లేయాధికారి డేవిడ్‌సన్ ను గమనించిన జహంగీర్ ఖాన్ కార్బన్‌తో అతని మిద అకస్మాత్తుగా దాడి చేశారు. ఆలోగా అప్రమత్తుడైన డేవిడ్‌సన్ ఆ తాకిడి నుండి త్రుటిలో తప్పుకున్నాడు. దాడిలో గురి తప్పినా పట్టువదలని జంహంగీర్ ఖాన్ అతడ్ని ఎలాగైనా సంహరించాలన్న లక్ష్యంతో మరుక్షణం కత్తి దూశారు. ఆలోగా నిజాం అనుచరులు,

సైనికులు అప్రమత్తులై జహంగీర్ ఖాన్ మీద తుపాకి గుళ్ళ వర్షం కురిపించటంతో ఆ యోధుడు అక్కడిక్కడే కుప్ప కూలిపోయారు.

ఈ అనూహ్య సంఘటనతో బిత్తరపోయి భయంతో వణికిపోతూ డేవిడ్‌సన్ పక్కనే ఉన్న గదిలోకి పరుగులు తీసి దాక్కున్నాడు. ప్రమాదం పూర్తిగా తప్పిందని రూఢిగా తెలుసుకున్నాక గాని అతను బయటకు రాటానికి సాహసించలేదు. ఈ సాహస చర్యకు పాల్పడిన జహంగీర్ ఖాన్ ఒకనాటి నిజాం దర్బారులో ప్రముఖుడిగా ఖ్యాతిగాంచి, ఆంగ్లేయుల పెత్తనాన్ని వ్యతిరేకించి నిజాం ఆగ్రహానికి గురైన ఉమ్రా మనవడు కావటం విశేషం.

ఆ కాల్పులలో తీవ్రంగా గాయపడిన జహాంగీర్‌ను ఆసుపత్రికి తరలించి చికిత్స చేయించారు. ఈ సంఘటన నిజాం ప్రభుత్వాన్ని కుదిపేయడంతో, దీని వెనుక పెద్ద కుట్ర ఉందని భావించారు. ఆ కుట్ర వెనుక నున్న వ్యక్తులు–శక్తులను బహిర్గతం చేసేందుకు జహాంగీర్ ఖాన్‌ను ఎంతగా వేధించినా, ఆ సంఘటనకు తానొక్కడే



ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ శతాబ్ది ఉత్సవాల సందర్భంగా 1957లో హైదరాబాదులోని కోఠి సెంటరులో నిర్మాణమైన స్మారక స్థూపం.

కారణమని, మరెవ్వరి ప్రమేయం దీనిలో లేదని ఆయన చాలా స్పష్టంగా ప్రకటించాడు. చివరకు బ్రిటీషు సైనికాధికారుల చేతుల్లో పలు రకాలుగా చిత్రహింసలకు గురైన జహాంగీర్ ఖాన్ 1859 జూన్ మాసంలో చివరిశ్వాస వదిలారు.

ఈ విధంగా హైదరాబాదు రెసిడెన్సీ మీద జరిగిన దాడి విఫలమైన తరువాత కూడా నిజాం సంస్థానం లోని పలు ప్రాంతాలలో తిరుగుబాటు కార్యకలాపాలు కొనసాగాయి. ఈ మేరకు మౌల్వీ సయ్యద్ అహ్మద్ తిరుగుబాటుకు ప్రజలను ప్రేరేపిస్తూ ప్రచార కార్యక్రమాలను చాలా రహస్యంగా నిర్వహించారు. గూఢాచారుల ద్వారా ఆ విషయం తెలుసుకున్న బ్రిటీష్ అధికారులు మౌల్వీని నిర్బంధించేందుకు చేసిన ప్రయత్నంలో సైనికులు ఆయన మీద సాగించిన కాల్పులలో మౌల్వీ అహ్మద్ 1859లో తుపాకి గుండ్లకు బలయ్యారు.తెలంగాణ ప్రాంతంలోని నారాయణ్‌ఖేడ్‌కు చెందిన కుర్దుమియా సాహెబ్, నిర్మల్‌కు చెందిన తిరుగుబాటు నేత రాంజీగౌడ్ పక్షాన బ్రిటీషు వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. రాంజీ మనుషులతో కలసి నిర్మల్ వద్ద ఈస్ట్ ఇండియా కంపెనీ బలగాలతో పోరాడుతూ కుర్దుమియా 1860 ఏప్రిల్ 9న అమరులయ్యారు.

## ఆంగ్లేయుల పట్ల అంతులేని వ్యతిరేకత

ఈస్ట్ ఇండియా కంపెనీ నిజాంకు అందిస్తున్న అభినందనల-ప్రశంసాపత్రాల పరంపరలో భాగంగా 1861లో స్టార్ ఆఫ్ ఇండియా అను మరొక బిరుదునిచ్చింది. బ్రిటీషు రాణి పక్షాన ఈ బిరుదును ప్రత్యేకంగా ఏర్పాటుచేసిన కార్యక్రమంలో నిజాంకు బ్రిటీషు రెసిడెంటు డేవిడ్‌సన్ అందించాడు. ఆ సమయంలో కూడా ప్రజలు తమ అయిష్టతను చాలా స్పష్టంగా వెల్లడించారు. ఈ ఆగ్రహం ఎంతదూరం వెళ్ళిందంటే ఆగ్రహాన్ని- అయిష్టతను కలగలిపి రాసిన ప్రకటనలు నగరంలోని బహిరంగ స్థలాలలో వెలిశాయి. పర్షియన్ భాషలో రాసిన ఈ ప్రకటనలు సాలార్ జంగ్, ఆయన ప్రధాన మంత్రి షంషల్ ఉమ్రా నమాజ్ కోసం నిత్యం వెళ్ళేదారిలో మాత్రమే కాకుండా వారిరువురు వెళ్ళే మసీదులో కూడా వేలాడదీశారు. ఆ ప్రకటనల సారాంశం ఈ విధంగా ఉంది.

**బ్రిటీషు ప్రభుత్వం ఇచ్చిన బిరుదును స్వీకరించవలసిందిగా దివాన్ సలహా ఇస్తాడు. కొన్నాళ్ళ తరువాత అరబ్బులను, పఠానులను, రొహిల్లాలను వెళ్ళగొట్టమని కూడా సలహా ఇస్తాడు. అ తర్వాత ముర్షద్ జాదా (రాజకుమారుడు) ఇంటి చుట్టూ**

కాపలా పెట్టమంటాడు. ఖాజీలను తొలగించి జడ్జీలను నియమించమంటాడు. వినకపోతే గవర్నరు జనరల్ నిజాంను పిలిపించి చెబుతాడు. అప్పటికీ వినకపోతే ఈ నిజాంను గద్దె దింపి, అతని కుటుంబంలోని మరొక వ్యక్తిని గద్దెమీద కూర్చోబెడతాడు. కాబట్టి జాగ్రత్త... అమీర్ షంషుల్ ఉమ్రా కూడా ఏమీ మాట్లాడటం లేదు. తనకు ముప్పు వాటిల్లనంత వరకు అతను పట్టించుకోడు. వీరు భోగభాగ్యాలకు వశులైనారు. సర్ఫెఖాస్ పైన, జేబేఖాస్ పైన కూడా సాలార్ జంగ్ ఆధిపత్యం కావాలంటాడు. అన్నంలో విషం కలిపి పెట్టి నిజాంను చంపడానికి కూడా వెనుదీయడు. దేవిడిలోని దాసదాసీ జనం కూడా దివానుకు లోబడి వుంటారు.

ఈ పాపపు బుద్ధిని అల్లా పోగొట్టుగాక ! ఇస్లాం మతం మీద నిజాములకు విశ్వాసం కలుగుగాక...ధాన్యం ధరలు తగ్గించమని నిజాం ఆజ్ఞాపించినప్పటికి దివాన్ పట్టించుకోలేదు. ప్రజలు బాధలు పడుతూ ఎన్నో విధాలా నలిగి పోతున్నారు. ప్రజలు చెలరేగే పరిస్థితులు అనతి కాలంలోనే ఏర్పడుతుంది. కాబట్టి నిజాం మా వినతిని పాటించి బిరుదును త్యజించుగాక. (హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, వెల్దుర్తి మాణిక్యరావు, స్వాతంత్ర్యోద్యమం చరిత్ర పరిశోధనా సంస్థ, హైదరాబాద్, 1984, పేజి. 54-55)

ఈ ప్రకటన వల్ల బ్రిటీష్ వారంటే ప్రజలలో ఎంతటి నిరసన భావన ఉందో, బ్రిటీషు వారికి సహకరించే వారు ఎంతటివారైనా విమర్శించడానికి ఎంతటి సాహసానికి తెగిస్తున్నారో అవగతమౌతుంది. ఈ రకమైన ప్రచారం, ప్రకటనలు ఆనాడు ప్రజలలో ఆంగ్లేయుల పట్ల ఉన్న చులకన భావం, ఆంగ్లేయుల వెంట సాగుతున్న సంస్థానాధీశుల పట్ల ఆగ్రహం స్థాయిని వెల్లడిస్తుంది. స్వదేశీయుల మీద ఆగ్రహం కలిగినా స్వదేశీ ప్రభువులను మాత్రం ఆంగ్లేయుల పెత్తనం నుండి విముక్తం కావాల్సిందిగా పదేపదే కోరుతూ సలహాలు ఇవ్వటం ద్వారా మాత్రమే తమ ఆకాంక్షలను వ్యక్తం చేయసాగారు.

## ఆంగ్లేయుల నెయ్యం వీడమని నిజాంకు హితవు

ఆంగ్లేయుల పట్ల అనుకూలత వ్యక్తం చేస్తున్న నిజాం నవాబును ఏవిధంగానైనా దారి మళ్ళించాలని, బ్రిటీషర్ల పెత్తనం నుండి మాతృభూమికి విముక్తి కలిగించాలని పట్టుదలతో ఉన్న ప్రజలు నిజాం నవాబుకు నచ్చచెప్పాలనుకున్నారు. అయితే పిల్లి మెడలో గంటకట్టే వారెవరన్నది సమస్యగా మారింది. ఆంగ్లేయులను మంచి మిత్రులుగా పరిగణిస్తూ అధికమౌతున్న వారి పెత్తనాన్ని కూడా చూసీ చూడకుండా భరిస్తున్న నిజాంకు

ఎవరు నచ్చ చెప్పగలరు? అంతటి దుస్సాహసం చేయటమంటే ప్రాణాల మీదకు కొని తెచ్చుకోవటమే కనుక ఏంచేయాలన్న ఆలోచనలు సాగాయి.

ఆ సమయంలో బాజీ ఖాన్, మౌల్వీ ఇబ్రాహీంలు, అజం సింగ్, మిర్జా సింగ్ అను నలుగురు సాహసికులు ముందుకు వచ్చారు. ఈ నలుగురు యోధులు తమ ప్రాణాలను కూడా లెక్కచేయక నైజాం సంస్థానాధీశుని వద్దకు వెళ్ళి ఆయన మనస్సు మార్చేందుకు నిర్ణయించుకున్నారు. చివరకు పులిబోనులో ప్రవేశించ సాహసించారు. నిజాం సంస్థానాధీశునికి నచ్చచెప్పేందుకు శతవిధాల ప్రయత్నం చేశారు. ఆ విఫల ప్రయత్నంలో ఆ నలుగురు నిజాంకు ఈ క్రింది విధంగా నచ్చజెప్పారు.

**వందలాది మైళ్ళ దూరం నుండి సముద్రం మీద వచ్చిన బ్రిటీషు వారి సంఖ్య ఎంత? మీరు వారికెందుకు దాసోహమనాలి? ఎదురు తిరగండి. దేశ ప్రజలందరు మీకు అండగా వుంటారు. పరాయి పెత్తనం వద్దు. స్వతంత్రంగా వ్యవహరించండి! లక్షమంది భారతీయులు ఒక్కొక్క ఇంగ్లీషు వాడ్ని తన్నితే చాలు. అసువులు బాసిపోతారు. వారు చచ్చిన జాడ తెలుపడానికి కూడా ఎవ్వరూ ఉండరు. ధైర్యం చేయండి. దేశమాత పిలుపు వినండి. ఆమెను పరాధీనం చేయకండి!** (హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర, పేజి. 49)

ఈ విధంగా నిజాం సంస్థానంలో మాత్రమే కాకుండా ఆంధ్ర – రాయలసీమ ప్రాంతంలో కూడా ఆంగ్లేయాధికారుల పెత్తనం మీద ప్రజల నుండి రుసరుసలు విన్పించాయి. ఆంగ్లేయులు అణిచివేతకు పాల్పడుతున్నా ఏమాత్రం భయపడకుండా స్వేచ్ఛను ఆకాంక్షిస్తున్న తెలుగు గడ్డ బిడ్డలు పరాయి పాలకుల పట్ల వ్యతిరేకతను వ్యక్తంచేస్తూ , ప్రథమ స్వాతంత్ర్య సమరానికి పూర్వం, సంగ్రామ సమయంలో, సంగ్రామం తరువాత కూడా తమదైన పాత్రను పోషించి చరితార్థులయ్యారు.

★ ★ ★

## అధ్యాయం - 6



# హిందూ-ముస్లింల ఐక్యత

**1857** ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం పరాయి పాలకులకు వ్యతిరేకంగా ఆయుధం చేపట్టిన హిందూ-ముస్లిం యోధుల ఐక్యతకు ప్రబల ప్రతీకగా నిలుస్తుంది. ప్రాదేశికంగా చూస్తే ఢిల్లీ నగరాన్ని ప్రధాన కేంద్రంగా, పాలకుని పరంగా చూస్తే మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్‌ను చక్రవర్తిగా స్వీకరించి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల మీద తిరగబడిన ప్రజలు, సిపాయీలు, తిరుగుబాటు యోధులు, స్వదేశీపాలకులు మతాలకు, కులాలకు, ప్రాంతాలకు అతీతంగా ఐక్యతను ప్రదర్శించారు. ఈ ఐక్యతకు తమ మీద పెత్తనం చేస్తున్న పరాయి పాలకులను తమ గడ్డ మీద నుండి తరిమి వేయాలన్న ప్రగాఢ ఆకాంక్ష ప్రధాన కారణం కాగా, ఆంగ్లేయుల ఆధిపత్యం-అంతులేని దాష్టీకం, కంపెనీ పాలకుల అరాచకం, నిరంతర దోపిడి మత-ఆచార-సాంప్రదాయాలలో వలసపాలకుల జోక్యం, ప్రజలలోని స్వదేశీయాభిమానం ఇతర కారణాలయ్యాయి.

ప్రభుభక్తి పరాయణత అనేది మతాలకు-కులాలకు అతీతంగా ఇక్కడి ప్రజానీకంలో ఏర్పడిన బలమైన సహజసిద్ధ మానసిక అవస్థ. స్వదేశీ పాలకుల మధ్యన ఎన్ని యుద్ధాలు జరిగినా, ఒకరి మీద మరొకరు మరెన్ని పోరాటాలు చేసినా, ఎవరి

స్వదేశం వారికి పరమ పవిత్రమైనదిగా భావించి తమ గడ్డ కోసం, తమ ఏలిక కోసం, మతాలతో సంబంధం లేకుండా ప్రాణత్యాగాలకు ఆయా ప్రాంతాల ప్రజలు సిద్ధపడ్డ గొప్ప వారసత్వ చరిత్రగలది ఇండియా.

ప్రజలలో ఉన్న ఈ మానసిక స్థితిని గమనించిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు 1757 ప్లాసీ యుద్ధం, ఆ తరువాత 1764 నాటి బక్సర్ యుద్ధం తరువాత క్రమంగా స్వదేశీ పాలకుల మీద సంపూర్ణ ఆధిపత్యం సాధించుకున్నా కూడా ఆయా ప్రాంతాలలో పదవీచ్యుతులైన పాలకుల వంశీయులను అధికార పీఠాల మీద కూర్చొబెట్టి, వారి పేరుతో మాత్రమే తమ ఇష్టానుసారంగా పాలన చేశారు.

1765లో బెంగాల్ దివానిని స్వాధీనం చేసుకున్న షా ఆలం దగ్గర నుండి చివరి మొగల్ పాదుషా బహద్దూర్ షా జఫర్ వరకు వారి మీద మతాలకు అతీతంగా ప్రజలలో స్థిరపడి ఉన్న అభిమానం-గౌరవం మూలంగా ఆ పాలకులను పూర్తిగా సింహాసన భ్రష్టుల్ని చేయడానికి ఆంగ్లేయులు సాహసించలేదు. ప్రజల మనోభావాలకు విఘాతం కలిగితే తగుమూల్యం చెల్లించాల్సి వస్తుందన్న భయంతో తొలిదశలో ఆంగ్లేయ పాలకులు పాలనాపరమైన అన్ని వ్యవహారాలను స్వదేశీ పాలకుల పేరుతో సాగించారు.

ఆంగ్లేయుల ఈ చర్యలకు కారణం మతాలతో సంబంధం లేకుండా పాలకుల పట్ల ప్రజలు చూపెట్టిన గౌరవాభిమానాలు మాత్రమే. అటువంటి బలమైన మానసిక పునాది కలిగిన గడ్డ అయినటువంటి భారత దేశంలో పరాయి పాలకులకు వ్యతిరేకంగా ప్రజలలో సాంప్రదాయకంగా ఐక్యత వ్యక్తమైంది. ఈ స్థితికి స్వరాజ్యం-స్వమతం అను ప్రాతిపదిక కూడా చాలా బలంగా తోడయ్యింది.

## ముస్లిం సైనికులకు హిందూ దళపతి

ఆనాడు ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యంలో పనిచేస్తున్న భారతీయ సైనికులలో తామంతా స్వదేశీయులమన్న అభిప్రాయం బలంగా ఉండేది. బెంగాల్ కేంద్రంగా కంపెనీ సేవలోఉన్న స్వదేశీ సైనికులలో మతపరమైన తేడాలు ఏమాత్రం కన్పించేవి కావు. ఆ దళాలలో మతాలకు అతీతంగా హిందూ-ముస్లిం సైన్యాలు కలిసి మెలసి ఉండేవి. సామర్థ్యం ప్రధానమని భావించిన సైనికులు ముస్లిం సైనికులు అత్యధికంగా గల సైనికుల దళంలోని సభ్యులు తమ దళనాయకుడిగా హిందూ సైనికాధికారిని కోరిన సంఘటనలు ఉన్నాయి. హిందువులు అత్యధికంగా గల సైనికదళాలలో ఆ దళాలకు

నాయకుడిగా ముస్లిం దళపతులను కోరిన ఉదాహరణలు ఎన్నో ఉన్నాయని చరిత్ర సాక్ష్యం పలుకుతుంది. ఈ విధంగా హిందూ-ముస్లిం అను తేడా లేకుండా అన్ని దళాలలో హిందూ-ముస్లింలు కలసిపోయి ఉండటం సర్వసాధారణ విషయం.

ఈ వాతావరణం బ్రిటీష్ సైన్యంలోని స్వదేశీ సిపాయీల దళాలలో మాత్రమే కాదు అంతకు పూర్వం కూడా ఇండియాలోని పలు ప్రాంతాలను పాలించిన హిందూ -ముస్లిం పాలకుల సైన్యాలలో కూడా ఆయా పాలకుల మతాలతో ఏ మాత్రం సంబంధం లేకుండా హిందూ-ముస్లిం సైనికులు అటు ఇటు ఉండేవారు. యుద్ధ సమయంలో పాలకుని పక్షంగా శత్రు సంహారం గావించేప్పుడు శత్రుసైనికుడు స్వమతస్తుడా? పరమతస్థుడా? అనేకంటే శత్రువును శత్రువుగా చూడటం జరిగింది. ఆ కారణంగా పలు రాజ్యాలతో విలసిల్లిన ఈ భూభాగంలోని హిందూ రాజులు హిందూ రాజులతో పోరాడినా, ముస్లిం రాజులతో పోరాడినా, ముస్లిం ప్రభువులు ముస్లిం పాలకులతో పోరాడినా హిందూ రాజులతో పోరాడినా ప్రజలు, సైనికులు మాత్రం తామే మతానికి చెందిన వారం అని కాకుండా తాము ఏ రాజ్యం-ఏరాజు ఉప్పు తింటున్నామన్న ఆలోచనలతో యుద్ధభూమిలో తమ ప్రభువు కోసం ప్రాణాలు ధారపోశారు. మతాలకు అతీతంగా **ప్రభుపక్షం** అను ఘన వారసత్వం గలవారు కనుక హిందూ-ముస్లిం తేడా లేకుండా అత్యంత క్లిష్ట సమయాలలో ప్రజలు ఐక్యంగా మసలుకుంటూ ఐక్యతకు ప్రతీకలుగా నిలిచారు.

ఈ ఐక్యభావన తరతరాలుగా ప్రజలలో జీర్ణమైయున్న కారణంగా ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం రగులుకునేందుకు గల కారణాలలో ప్రధానమైనదిగా చెబుతున్న తుపాకి తూటాలకు ఆవుకొవ్వు-పందికొవ్వు వాడటం లాంటి సమస్య విషయంలో ముస్లిం సైనికులు హిందూ సైనికులకు తోడుగా నిలువగా, హిందూ సైనికులు ముస్లిం సైనికులకు అండదండలు అందిస్తూ ఏకోన్ముఖంగా సాగారు.

బెంగాల్‌లోని స్వదేశీ సైన్యంలో ఉన్న ముస్లిం సైనికులను తుపాకి తూటాలను వాడమని ఆంగ్ల సైనికాధికారులు ఆదేశించగా అందుకు ముస్లిం సైనికులు నిరాకరించారు. అంతటితో ఆగకుండా తమ సోదర హిందూ సైనికులు తూటాలను వాడేందుకు అంగీకరిస్తే మాత్రమే తామూ ఆ తూటాలను, తుపాకులను వాడగలమని అంతవరకు తూటాలు వాడే ప్రసక్తి లేదని తెగేసి చెప్పిన సంఘటనలు ఉన్నాయి. ఈ సంఘటనలు మత ప్రమేయం లేకుండా విభిన్న మతస్థుల మధ్య నెలకొనిఉన్న పటిష్టమైన ఐక్యతను ధృవపరుస్తాయి.

# ఐక్యతను పరిపుష్టం చేసిన పత్రికలు

ఈ పునాదుల మీద హిందూ- ముస్లింల ఐక్యత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం సమయంలో మరింతగా పటిష్టంగా పరిఢవిల్లింది. ఆనాటి పత్రికలు కూడా హిందూ-ముస్లింల మధ్య ఐక్యతావశ్యకతను బాగా ప్రచారం చేశాయి. ప్రజలు హిందూ -ముస్లిం తేడాలు లేకుండా కలసికట్టుగా విజృంభించినట్టయితే విజయం తథ్యమని ప్రకటిస్తూ ఢిల్లీ నుండి ప్రచురితమవుతున్న ఉర్దూ పత్రిక ఢిల్లీ అక్బార్ వ్యాసాలు ప్రచురించింది.

ఆ పత్రిక సంపాదకులు మౌల్వీ ముహమ్మద్ ఖాఖర్ రాసిన వ్యాసాలు, ప్రచురించిన కథనాలు ప్రజలలో ధైర్యాన్ని నూరిపోసేవి. ప్రజలలో సాహస ప్రవృత్తిని మేల్కొల్పేందుకు ఆయన పురాణాలనూ, చరిత్రనూ ఉటంకిస్తూ, ఆయా పురాణ పురుషులు, చారిత్రక వ్యక్తుల ధైర్యసాహసాలను ఉదహరిస్తూ వ్యాసాలు రాసిన వైనాన్ని నాల్గవ అధ్యాయంలో వివరించడం జరిగింది.

మౌలానా బాఖర్ కుమారుడు మౌలానా ముహ్మద్ హుసైన్ ఆజాద్ కూడా ఢిల్లీ ఉర్దూ అఖ్బార్‌లో రచనలు సాగించారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం గురించి **తారిఖే ఇంక్విలాబ్ ఇబరత్ ఆఫ్జా** శీర్షికతో ఆయన రాసిన కవిత ఆనాడు చాలా ప్రసిద్ధి చెందింది. ఈ మేరకు తండ్రీ-కుమారులు కలసి ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో కలం చేతబట్టి వలస పాలకుల మీద అక్షరాగ్నులు కురిపించారు. ఈ సందర్భంగా ఆయన **'రిసాల -యే-జిహాద్'** (Risala-i-Jihad) శీర్షికతో రాసిన కరపత్రంలో బ్రిటీషు వారిని ఈ దేశం నుండి తరిమి కొట్టాలన్న మహత్తర లక్ష్యాన్ని సాధించాలంటే దేశంలోని హిందువులు-ముస్లింలు ఐక్యంగా శత్రువు మీద యుద్ధం సాగించాలని పిలుపునిచ్చారు.

ప్రథమ స్వాతంత్రసంగ్రామానికి ఆయువుపట్టుగా నిలచిన ఢిల్లీని తమ పట్టునుండి జారిపోనివ్వరాదని తిరుగుబాటు యోధులు, ఏ విధంగానైనా ఢిల్లీని పునరాక్రమించుకోవాలని ఆంగ్లేయాధికారులు ఎత్తులు, ఆ ఎత్తులకు పై ఎత్తులు వేస్తూ పోరాటాలు సాగిస్తున్నారు. ఈ పోరాటంలో మతాలకు అతీతంగా హిందూ-ముస్లింలు భుజం భుజం కలిపి ఉమ్మడి లక్ష్యంకోసం ప్రాణాలర్పించడానికి సిద్ధపడుతున్న వైనం ఆంగ్ల అధికారులకు అర్థమైంది.

1857 మే 11న మీరట్ నుండి హిందూ-ముస్లిం సైనికులు కలసికట్టుగా బయలు దేరడం, ఢిల్లీ చేరుకుని మొగల్ పాదుషా బహదూర్ షా జఫర్‌ను చక్రవర్తిగా స్వీకరించడం, ఆ క్రమంలో దేశంలో ఇతర ప్రాంతాలలో తిరుగుబాటు పతాకాన్ని

ఎగురవేసిన స్వదేశీ పాలకులంతా హిందూ-ముస్లిం అను తేడా లేకుండా బహదూర్ షా జఫర్‌ను తమ చక్రవర్తిగా అంగీకరించి ఆయన ప్రతినిధులులుగా మాత్రమే తమ ప్రాంతాలను పాలిస్తూ స్థానికంగా ఆంగ్లేయులతో తలపడటం జరిగింది.

## గోవుల ఖుర్బాని మీద నిషేధం

ఆంగ్లేయులు ఈ ఐక్యతను విచ్ఛిన్నం చేయాలనుకున్నారు; హిందూ-ముస్లింల మధ్య చీలిక తేవడానికి అన్ని రకాల పన్నాగాలు పన్నారు. ఆ సందర్భంగా ముస్లింలు సాగించే ఖుర్బాని వారికి మంచి ఆయుధంగా దొరికింది. ఈ అంశాన్ని ఉపయోగించుకుని హిందూ ముస్లింల మధ్య నెలకొని ఉన్న ఐక్యతకు సులభంగా గండికొట్టవచ్చునని ఆంగ్లేయులు భావించారు.

ఆ అవకాశం కోసం ఎదురు చూస్తుండగా ఆంగ్లేయ గూఢచారుల ద్వారా బక్రీద్ పండుగనాడు ఢిల్లీలో ఖుర్బాని విషయంలో హిందూ-ముస్లింల మధ్య తప్పకుండా కొట్లాట జరుగుతుందని కంపెనీ అధికారులకు సమాచారం అందింది. ఆ విషయం తెలియగానే ఆంగ్లేయాధికారులు సంబరపడిపోయారు. ఆ కొట్లాట తప్పకుండా జరగాలని ఎదురు చూశారు. ఆ లక్ష్యసాధనకు ఎత్తులు వేశారు. హిందూ-ముస్లింల మధ్య కొట్లాటకు అవసరమైన రంగాన్ని సిద్ధం చేయాల్సిందిగా గూఢచారులను పురమాయించారు. ఈ అవకాశాన్ని వినియోగించుకుని ఐక్యంగా విక్రమిస్తున్న హిందూ-ముస్లింల మధ్యన మత విభేదాలను తెచ్చి వారిని విడదీసి తమ పబ్బంగడుపుకోవాలని పథకం రూపొందించారు.

ఆంగ్లేయులు ఎదురు చూస్తున్నట్టుగా ఖుర్బాని ఇచ్చే సంప్రదాయంగల బక్రీదు పండుగ వచ్చింది. ఈ పండుగ సందర్భంగా ముస్లింలు హిందువులు గోమాతగా కొలిచే గోవులను తప్పకుండా ఖుర్బాని ఇస్తారు కనుక ఈ అవకాశాన్ని వినియోగించుకుని హిందువులను ముస్లింలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టి కలహాలు సృష్టించాలనుకున్నారు.

ఈ విషయాన్ని పసిగట్టిన పాదుషా బహుదూర్ షా జఫర్ తగిన చర్యలు తీసుకున్నారు. గోవధను నిషేధిస్తూ ఆజ్ఞలు జారీచేశారు. ఆ సందర్భంగా ఆంగ్లేయుల తొత్తుగా వ్యవహరిస్తున్న చక్రవర్తి సన్నిహితుడు, చక్రవర్తి వ్యక్తిగత వైద్యుడైన అహసానుల్లా ఖాన్ దురుద్దేశ్యపూర్వకంగా గోవుల ఖుర్బాని మీద నిషేధం సరికాదన్నాడు. ధార్మిక పండితులు ఇందుకు అంగీకరించరని చెప్పాడు. ఈ విషయం మీద మౌల్వీలను, ముల్లాలను సంప్రదించడం మంచిదని చక్రవర్తికి సలహా ఇచ్చేందుకు శతవిధాలా

ప్రయత్నించాడు. ఆయన సలహాను కొట్టిపారేసిన చక్రవర్తి అతని మీద ఆగ్రహం వెలిబుచ్చారు. చివరకు '..**పండగ సందర్భంగా నగరంలో గోవులను ఖుర్బాని ఇవ్వరాదు. మహమ్మదీయుడెవరైనా అటువంటి సాహసానికి పూనుకుని గోవధచేసినా, గోవధ చేయడానికి సహకరించినా, అటువంటి వారిని ఫిరంగి గొట్టానికి కట్టి పేల్చివేయటం జరుగుతుంది**' అని తీవ్రంగా హెచ్చరిస్తూ ఆజ్ఞలు జారీచేశారు.

చక్రవర్తి అభీష్టం మేరకు ఆయన ఆదేశాల అమలు కోసం, ఆ ఆదేశాల ఉల్లంఘన ఏమాత్రం జరగకుండా చూసేందుకు తగిన ఏర్పాట్లు చేయడానికి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సర్వసైనాని భక్త్‌ఖాన్ 1857 జూలై 30న సర్వసైన్యానికి, అధికారులకు హుకుంనామా జారీ చేశారు. ఆంగ్లంలో ఆ హుకుంనామా ఈ క్రింది విధంగా ఉంది.

Seal
Court of Valiant
Commander-in-Chief

**Order**

To all officers of Platoon and Regiments of the gate of the city whereas it is not acceptable to His Majesty that there should be any incident of cow slaughter in the City, therefore in order to make arrangements for implementation thereof orders are issued to all the above that with effect from today to the 10th Zilhij 21R.Y the Sunday, Iduz Zuha, no butcher should be allowed to bring in a cow or bull into city with the intent to commit such an act. Otherwise take care that no one should commit such an act. Treat it as imperative. Dated 8 Ziljij, 21(R.Y)

# ఫలించని ఆంగ్లేయుల ఎత్తులు

ప్రజల మత మనోభావాలను గౌరవించాలని, ఎటువంటి పరిస్థితుల్లోనూ మత మనోభావాలకు విఘాతం కల్గించే పనులకు పాల్పడవద్దని ప్రజలను చక్రవర్తి స్వయంగా కోరారు. బహదూర్ షా జఫర్ స్వయంగా ఈద్గా దగ్గర గోవును కాకుండా గొర్రెను ఖుర్బాని ఇచ్చి అందరికి మార్గదర్శకయ్యారు. చక్రవర్తి ప్రవర్తనతో ప్రభావితులైన ముస్లింలు గొర్రెలను ఖుర్బాని ఇచ్చి పండుగ జరుపుకున్నారు. గోవులను ఖుర్బాని ఇవ్వడాన్ని స్వచ్ఛందంగా నిషేధించారు.

ఈ విధంగా ఢిల్లీ నగరంలో గోవుల వధ జరగకుండా బహదూర్ షా జఫర్ స్వయంగా చర్యలు తీసుకున్నారు. ఆ కారణంగా అప్పటి నుండి ఢిల్లీ నగరాన్ని తిరిగి ఆంగ్లేయులు ఆక్రమించుకునేంత వరకు గోవధ జరగలేదు. గోమాంస విక్రేతల నుండి ఎటువంటి వత్తిడి వచ్చినా జఫర్ లొంగకుండా, ఎక్కడైనా గోవధ జరిగిందంటే ఆ ప్రాంతంలోని అధికారిని జవాబుదారునిగా చేసి ఉరిశిక్ష కూడా విధిస్తామని ప్రకటించారు. ఈ చర్యల మూలంగా ముస్లింల పట్ల హిందూ ప్రజానీకంలో సద్భావన మరింతగా ఏర్పడి అది హిందూ-ముస్లింల ఉమ్మడి పోరాటాలకు ఇతోధిక బలానిచ్చింది.

ఈ చర్యల వలన ఆంగ్లేయులు ఆశించినట్టుగా హిందువులు- ముస్లింల మధ్యన విద్వేషాలు ప్రజ్వరిల్ల లేదు. ఈ విషయాన్ని, ఆంగ్ల అధికారి కీనిత్ యంగ్ (Keith Young) ప్రస్తావిస్తూ పండుగ సందర్భంగా నగరంలో ఏర్పడుతుందన్న పరిస్థితి ఏర్పడలేదు. **'ఈ సందర్భంలో ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులను హిందువులకు వ్యతిరేకంగా ముస్లింలను రెచ్చగొట్టలేకపోయాం. ఆవులను కాదు మేకలను కూడా కూడా చంపరాదని రాజు గట్టిగా ఆజ్ఞాపించాడు. మా ఆశలు అడియాశలయ్యాయి.'** అని వాపోయాడు.

(**Delhi 1857**, Sir Henry W.Norman and Mrs. Keith Young, Low Price Publications, Delhi, First Pbublished in 1902, Reprint : 2001)

ఈ వ్యాఖ్యానం ఆంగ్లేయాధికారులు గోవుల ఖుర్బాని అంశాన్ని హిందూ-ముస్లింల మధ్య అనైక్యత సృష్టించడానికి ఎంతగా ఉపయోగించుకోవాలనుకున్నారో స్పష్టం చేస్తుంది. ఈ ఎత్తులను బహదూర్ షా జఫర్, ప్రజలు తమ స్నేహపూర్వక చర్యలతో తిప్పిగొట్టారు. జఫర్ అభీష్టానికి అనుగుణంగా హిందూ-ముస్లిం మధ్యన ఉన్న స్నేహ సంబంధాలను కాపాడుకునేందుకు ప్రజలు కూడా ఆయనతో సహకరించి ఆ సంబంధాలు మరింత పటిష్టమయ్యేందుకు కృషి సల్పారు.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఐక్యంగా పోరాడుతున్న హిందూ-ముస్లింల మధ్య ఏర్పడిన ఐక్యతా బంధానికి ఏమాత్రం విఘాతం కలుగకుండా బహదూషా జఫర్ పలు ఇతర జాగ్రత్త చర్యలు కూడా తీసుకున్నారు. తిరుగుబాటు జరిగిన ప్రతి ప్రాంతంలోనూ తన ఆజ్ఞలు ఖచ్చితంగా అమలు జరిగేలా ఉత్తర్వులు జారీ చేశారు. ఆజ్ఞలకు ఏమాత్రం విఘాతం కలిగినా స్థానిక అధికారి మీద కఠినంగా చర్యలు తీసుకోవటం జరుగుతుందని అధికారులను హెచ్చరించారు.

# 'బిస్మిల్లా' తో అధికారిక రికార్డుల ఆరంభం

బహదూర్ షా ప్రభుత్వం జారీచేసిన గోవధ నిషేధ ఆజ్ఞలకు స్వదేశీ హిందూ పాలకులు సముచిత రీతిలో ప్రతిస్పందించారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా హిందూ-ముస్లింల ఐక్యత మరింత బలపడేందుకు తగిన చర్యలను స్వయంగా తీసుకున్నారు. స్వదేశీ హిందూ పాలకులు తమ ప్రాంతాలలో మొగల్ ప్రభుత్వ చిహ్నాలను, మొగల్ ప్రభుత్వ పాలనా పరమైన విధానాలను యధాతథంగా, ఖచ్చితంగా అమలు చేశారు. ఈ మేరకు వ్యక్తమైన సానుకూల ప్రతిస్పందనలో భాగంగా కాన్పూరు అధినేత నానా సాహెబ్ మొగల్ ప్రభుత్వ చిహ్నాలను అమలులో పెట్టారు. చంద్రమానాన్ని అనుసరించటమే కాకుండా, శుక్రవారం శెలవును కూడా ప్రకటించారు. మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రతినిధిగా కాన్పూరు రాజ్యాధినేతగా తన అధికారిక లేఖలలో, ప్రభుత్వ రికార్డులలో **బిస్మిల్లా** అని రాయడాన్ని కొనసాగించారు. ఈ విధంగా తిరుగుబాటు యోధులు విభిన్న మతాలకు చెందిన వారైనప్పటికి పరస్పరం తమ తమ మతమనోభావాలను గౌరవించుకుంటూ ఉమ్మడి శత్రువు మీద యుద్ధం ప్రకటించడంతో హిందూ-ముస్లిం జన సముదాయాలు కూడా ఆ మార్గాన కలిసి నడిచారు.

(' the rebel government at Delhi banned the slaughter of cows as a gesture of goodwill to the Hindus; while the Hindu rebel leaders (for instance, Nana Sahib) returned the compliment by maintaining all the state symbols of the Moghul government- for instance, the use of lunar calendar, the inscription of ' Bismillah' in the official communications and reports and even the observance of Friday as holiday. ' - K.M. Ashraf, **Muslim Revivalists and the Revolt of 1857**, PC Joshi Ed. **Rebellion 1857 - A Symposium**, PPH, 1957, P.4)

1857నాటి తిరుగుబాటు సమయంలో తగిన ప్రయోజనాలను ఆశించి మాత్రమే కాకుండా, ఈ రెండు జనసముదాయాల మధ్య సామరస్యాన్ని ఆకాంక్షిస్తూ ఢిల్లీ నగరంలోని హిందు-ముస్లింలంతా కలసి ప్రతి ఏడాది నిర్వహించుకొనే **'ఫూల్ వాలోంకి సైర్'** (Phoolwalon-ki-sair) సంతను బహదూర్ షా జఫర్ ఏర్పాటు చేశారు. హిందూ-ముస్లిం ప్రజానీకం అత్యధికంగా పాల్గొనే ఈ సంతను బహుదూర్ షా జఫర్ స్వయంగా

ప్రారంభించారు. ఆ విధంగా ఆనాడు ఆయన ఆరంభించిన **'ఫూల్ వాలోంకి సైర్'** పండగ నగరంలోని హిందూ-ముస్లింల ఐక్యతకు ప్రతీకగా ఆంగ్లేయుల పాలనా కాలంలో కూడా సాగి ఆనాటి ఐక్యతకు ఆనవాలుగా నిలచింది.

ఢిల్లీ నగరంలో వ్యక్తమైన హిందూ-ముస్లింల ఐక్యత ఆంగ్లేయులను తీవ్రంగా కలవరపర్చింది. ఢిల్లీ నగరం కేంద్రంగా సాగిన స్వాతంత్ర్యసంగ్రామం ఆంగ్లేయులను భీతావహులను చేసింది. భారత దేశంలోని ప్రజలు మతాలకు అతీతంగా ఐక్యంగా ఉన్నంత కాలం విజయం సంగతి తరువాత, ప్రపంచంలోని మరేశక్తి కూడా తమను స్వదేశీయుల బారి నుండి ఇక రక్షించలేదన్నంతగా ఆంగ్లేయులు భయపడి పోయారు.



కలసి పోరాడటం కాదు మరణాన్ని కూడా కలసి పంచుకుంటున్న హిందూ-ముస్లిం యోధులు

ఆ విషయాన్ని స్వయంగా ఆంగ్లేయ సైనికాధికారులు తమ డైరీలలో రాసుకున్నారు.

('...no power on earth could have saved us from total annihilation...' - **A Narrative of the Siege of Delhi** ,1857, Charles John Griffiths, London, 1910, P. 35)

## గ్రామాల్లో వెల్లివిరిసిన ఐక్యత

1857 నాటి రోజుల్లో ఢిల్లీ నగరంలో మాత్రమే కాదు ప్రతి స్వదేశీ సంస్థానంలో

హిందూ-ముస్లిం ఐక్యత చాలా స్పష్టంగా కన్పించింది. గ్రామీణ ప్రాంతాల ప్రజలలో కన్పించే సహజసిద్ధమైన ఈ ఐక్యత ఆంగ్లేయుల మీద సాగుతున్న పోరాటం సమయంలో మరింత బలంగా దర్శనీయమైంది.

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామాన శ్రీకారం చుడుతూ మీరట్ నుండి బయలు దేరిన తిరుగుబాటు యోధులు ఢిల్లీ బాట పట్టి చక్రవర్తి బహదూర్ షా జఫర్ వద్దకు వెళ్ళారన్న వార్త తెలిసాక ఆంగ్లేయాధికారులు హుటాహుటిన తమ బలగాలతో వారిని వెంబడించారు. ఆ విధంగా వెంబడించిన ఆంగ్ల సైనికులను దారిలో గల సోనహార్ గ్రామానికి చెందిన హిందూ-ముస్లిం ప్రజానీకం అడ్డగించారు. ఈ గ్రామంలోని స్వేచ్ఛ-స్వాతంత్ర్యాలను కోరుకుంటున్న యోధులు ఇస్మాయిల్, రాంభాయి, జాసూదిలు ఐక్యంగా ఆంగ్లేయులను అడ్డుకున్నారు. ఈ యోధుల సాహసోపేత నాయకత్వంలో హరిచరన్‌పూర్ అను గ్రామం వద్ద గ్రామప్రజలు ఆంగ్ల సైన్యాలను ఎదుర్కొన్నారు.

ఈ యోధులు గ్రామాలలోని జాట్‌లను, ముస్లింలను ఏకం చేశారు. ఆ తరువాత పరిసర గ్రామాలలోని ప్రజలను కులమతాలకు అతీతంగా ఏకం చేసి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడేందుకు ప్రేరేపించారు. ఆ సందర్భంగా **ఆంగ్లేయులు అపరిచితులు, శత్రువులు. హిందూ-ముస్లింలు ధార్మికంగా వేర్వేరు జన సమూహాలైనప్పటికీ ఒక జాతివారు ఒకరికి మరోకరు తోడు,** అను ఐక్యతా భావనతోనే ఏకమై ఒక్కటిగా మసలుకున్నారని, ఆ ఐక్యభావనతో ఆంగ్లేయులను ఎదుర్కొన్నారని,

ఆనాటి పరిస్థితులను స్వయంగా చూసిన ప్రముఖ ఉర్దూ-పర్షియన్ కవి Francis Godlieu Qunin తన రచనలలో ఆ విషయాలను చాలా వివరంగా పేర్కొన్నాడని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారిగా బాధ్యతలు నిర్వహించిన మహాది హసన్ **బహదూర్ షా -2** అను తాను రచించిన గ్రంథంలో ఆనాటి ఉదంతాలను ఉటంకించారు.

(**Bahdur Shah II**, Mahadi Hasain, MN Publishers and Distributors, New Delhi, 1987, Page. Xli)

## ఐక్యతకు అత్యంత ప్రాధాన్యత

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో హిందూ-ముస్లింల ఐక్యతను మరింతగా పండించేందుకు కృషిచేసిన వారిలో కాన్పూరు రాజ్యాధినేత నానా సాహెబ్, ఆయన

ప్రధాన సహచరులు అజీముల్లా ఖాన్‌ల కృషి చెప్పుకోదగ్గది. కాన్పూరులో 1857 జూన్ 7న నానా సాహెబ్ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సమరశంఖారావాన్ని పూరించారు. ఆయన తన రాజ్యంలోని హిందూ-ముస్లింలకు ఎటువంటి తేడా లేకుండా, ధర్మాన్ని-దేశాన్ని రక్షించేందుకు ఆయుధాలు చేపట్టాల్సిందిగా పిలుపునిచ్చారు. ఆనాడు నానా సాహెబ్ పక్షాన బేగం అజీజున్ అను యోధురాలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాగిన పోరాటాలలో పాల్గొన్నారు. ఆమె పోరాటాలలో పాల్గొనటమే కాకుండా హిందూ -ముస్లింల ఐక్యతకు ప్రతీకగా నిలచారు. ఆమె మతాలకు అతీతంగా ప్రజలలో వ్యక్తమౌతున్న ఐక్యతను మరింత పరిపుష్టం చేసేందుకు కృషి సల్పారు. ఆమె స్వయంగా ప్రజలలో తిరుగుతూ మతాలకు అతీతంగా స్వదేశాన్ని పరదేశీయుల పెత్తనం నుండి పరిరక్షించుకోడానికి ప్రజలు ప్రధానంగా యువకులు తరలిరావాల్సిందిగా పిలుపునిచ్చారు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాడుతున్న యోధులకు ఆహారపానీయాలు, ఆయుధాలు, మందులు అందించడానికి ముందుకు రావాల్సింగా ప్రజలకు విజ్ఞప్తి చేయడమే కాదు తాను స్వయంగా వీధి వీధి తిరిగి వాటిని సేకరించి అందరికి ఆదర్శంగా నిలిచారు. బొందిలో ప్రాణమున్నంత వరకు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా నిలచిన ఆమెను ఆంగ్లేయాధికారి కాల్చివేతకు ఆదేశాలు ఇచ్చిన సమయంలో కూడా ' నానా సాహెబ్ **జిందాబాద్** ' అంటూ నినదిస్తూ అమె ప్రాణాలు వదిలారు.

ప్రజలలో దేశభక్తి భావనలను పెంపొందించేందుకు, ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ప్రజలను కూడగట్టేందుకు అజీముల్లా ఖాన్ స్వయంగా **' పయామే ఆజాది '** అను పత్రికను హిందీ, ఉర్దూ భాషల్లో వెలువరించారు. ఆ పత్రికలో **'..భారతీయ హిందువులారా, ముస్లింలారా లేవండి. సోదరులారా లేవండి. దైవం మనిషికి ఎన్నో వనరులను ఇచ్చాడు. అందులో విలువైనది స్వాతంత్ర్యం..'** అంటూ మొగల్ చక్రవర్తి బహదూర్ షా జఫర్ ప్రజలకు ఇచ్చిన పిలుపును ప్రముఖంగా ప్రచురించి హిందూ ముస్లింలు కలసి పోరాడినప్పుడు మాత్రమే స్వాతంత్ర్యం సిద్ధించగలదన్న భావనకు బలమిచ్చారు.

మాతృ దేశాన్ని కీర్తిస్తూ, బానిస బంధనాల నుండి విముక్తి కోసం పోరుబాట నడవమంటూ ప్రబోధ గీతమొకటి **'పయామే ఆజాది'** లో ప్రచురితమైంది. ఈ గీతం హిందూ-ముస్లిం- సిక్కులు అంతా ప్రియమైన సోదరులుగా వర్ణించింది. మౌల్వీ లియాఖత్

అలీ రాసిన ఆ గీతంలో హిందూ-ముస్లింల ఐక్యతకు సంబంధించిన ప్రస్తావన ఇలా సాగింది :

'.........................

తోడో గులామీకే జంజీరేఁ, బర్‌సావో అంగారా !

హిందూ, ముసల్మాన్, సిఖ్ హమారా

భాయీ భాయీ ప్యారా

యే హై ఆజాదికా ఝండా,

ఇసే సలామ్ హమారా ! '.

(బానిస సంకెలు తెంపండి

నిప్పులవానై కురండి

హిందూ ముస్లిం సిక్కులందరం

ప్రియాతి ప్రియమౌ సోదరులం

ఇదిగిదిగో మన స్వతంత్ర జెండా

చేస్తాం సలాము గుండెల నిండా !

**తెలుగు అనువాదం : దివికుమార్)**

ఈ ప్రయత్నాలలో భాగంగా బ్రిటీషర్ల అధికారాన్ని అంతం చేయాలంటే హిందూ-ముస్లింల ఐక్యత అత్యవసరమని అజీముల్లా వివరించారు. మతం విధించే పరిమితులకు, ఆచార సంప్రదాయాల ఆంక్షలకు అతీతంగా హిందూ-ముస్లిం ఐక్యత సాధించేందుకు అవిశ్రాంతంగా ఆయన శ్రమించారు. ఉమ్మడి శత్రువు మీద ఐక్యపోరాటాల అవసరాన్ని గుర్తించిన అజీముల్లా మతాలకు సంబంధించిన ఆచార సాంప్రదాయాల ఆటంకాలను ప్రజల మధ్యకు రానియ్యరాదని భావించారు.

ప్రముఖ పాత్రికేయుడు William Howard Russel ను కలసిన అజీముల్లా మాట్లాడుతూ I am not such a fool as to believe in these foolish things. I am of no religion.. ' అని మతం పట్ల, మతాచారాల పట్ల తనకున్న అభిప్రాయాన్ని చాలా స్పష్టంగా ప్రకటించారు. (**Eighteen Fifty Seven**,Surenda Nath Sen,Govt. of India Publications, 1957, P. 126).

1857నాటి పోరాటంలో అద్భుతమైన పాత్ర వహించిన కాన్పూరు అధినేత

నానా సాహెబ్ ఇండియాలోని హిందూ-ముస్లింల రాజ్యాలను పున:స్థాపించేందుకు, మన దేశాన్ని ఆంగ్లేయుల నుండి రక్షించుకునేందుకు భగవంతునిచే ఆజ్ఞాపించబడ్డాను అని ప్రకటించారు.

ప్రజలలో మతాలకు అతీతంగా ఐక్యతను కోరుకున్న ఈ యోధుల ప్రయత్నాలు, ఆ ప్రయత్నాల ప్రభావం, నాయకుల దూరదృష్టి కారణంగా నానా సాహెబ్ హిందూ-ముస్లింల ఐక్యతను మరింతగా పటిష్టం చేసేందుకు ప్రయత్నించారు. ఆయన తన గురువుకు రాసిన ఓ లేఖలో **కాబుల్‌లోని పఠానులు, మలేక్‌లు మన బంధువులు, మిత్రులు.ముస్లింల పట్ల సమదృష్టితో వ్యవహరించాలి...వాళ్ళు మన సోదరులే. మనమందరం ఐకమత్యంతో ఉన్నప్పుడే మన లక్ష్యం సిద్ధిస్తుంది** అని స్పష్టం చేశారు. (**జ్ఞాపకం చేసుకోండి ఎప్పుడైనా...అమర వీరుల ఉత్తరాలు**, అనువాదం : జె.లక్ష్మిరెడ్డి, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ, 1998, పేజి.10)

## ప్రముఖుల ఐక్య పోరాటాలు

ఉమ్మడి శత్రువు మీద స్వదేశీ పాలకులు సమరశంఖారావం పూరించి పోరాడుతుండగా, ఇండియాలోని పలు ప్రాంతాలకు చెందిన ప్రముఖులు కూడా ఐక్యంగా మాతృభూమి విముక్తి కోసం కంపెనీ సైన్యాలను ఎదుర్కొన్నారు. ఈ పోరాటంలో ఆయా ప్రాంతాలకు చెందిన హిందూ-ముస్లిం ప్రముఖులు ఏకమై ఆంగ్లేయులకు వ్యతిరేకంగా తమ సర్వసంపదలను, చివరికి తమ ప్రాణాలను కూడా, పణంగా పెట్టి పోరుబాటన ముందుకు సాగారు.

ప్రస్తుత హర్యానా రాష్ట్రంలోని హంసి పట్టణానికి చెందిన హకీంచంద్ జైన్ విద్యాధికులు. బహుభాషా పండితులు, న్యాయశాస్త్ర కోవిదులు మాత్రమే కాకుండా ఆ ప్రాంతంలో పేరెన్నికగన్న ప్రముఖుడు. మీరట్ నుండి ఢిల్లీ చేరిన స్వాతంత్ర్య సమరయోధులు ఢిల్లీని ఆంగ్లేయుల నుండి చేజిక్కించుకున్నారన్న వార్త వినగానే బహదూర్ షా జఫర్ దర్బారుకు ఆయన తరలి వెళ్ళారు. అక్కడ తాంతియా తోపే తదితర యోధులతో మంతనాలు జరిపి తక్షణమే తిరిగి హంసి చేరుకున్నారు.

హంసి పట్టణంలోని మరో ప్రముఖులు, ఆయన సహచరులు మునీర్ బేగ్‌ను వెంటనే కలుకున్నారు. ఆ ఇరువురు ప్రముఖులు ఢిల్లీ పరిణామాల గురించి చర్చలు

జరిపి ఆంగ్లేయుల మీద యుద్ధానికి తమ ప్రాంతపు ప్రజలను సన్నద్ధులను చేయాలని నిర్ణయించారు. ఈ నిర్ణయం మేరకు ఆంగ్లేయుల నుండి హర్యానా ప్రాంతాన్ని విముక్తం చేయడానికి పథకాన్ని రూపొందించారు. ఆ దిశగా హుకుం చంద్, మునీర్ బేగ్‌లు ఏకమై ముందుకు సాగారు.

ఈ ప్రమాదకర ప్రయాణంలో ఢిల్లీ నుండి తగిన సహాయం అందుతుందని ఆ నేతలు ఆశించారు. ఆ యోధులకు కీలక సమయంలో ఆశించిన విధంగా ఢిల్లీ నుండి ఎటువంటి సహాయం అందకుండా పోయింది. ఆ కారణంగా ఆంగ్ల సైన్యాలతో సాగిన పోరాటంలో ఆ స్వదేశీ యోధులు పరాజయం పాలయ్యారు. ఈ లోగా ఢిల్లీ మళ్ళీ ఆంగ్లేయుల వశమైంది. ఆ క్షణం నుండి మునీర్ బేగ్, హుకుం చంద్‌ల కోసం ఆంగ్లేయ సైనికాధికారుల వేట ఆరంభమైంది.

చివరకు ఆ యోధులిద్దరూ అరెస్టయ్యారు. విచారణ అనంతరం ఇరువురికి ఉరిశిక్ష ప్రకటించారు. ఆ ప్రకటన మేరకు 1858 జనవరి 19న వారిరువురికి ఒకేసారి ఉరిశిక్ష అమలు చేశారు. ఐక్యంగా పోరుబాట నడిచి, హిందూ-ముస్లిం యోధుల మధ్య పటిష్టమైన బంధానికి ప్రతీకలుగా నిలచి ఆంగ్లేయులలో భయోత్పాతాన్ని కలిగించిన ఈ యోధుల పట్ల ఆంగ్లేయులు చాలా క్రూరంగా వ్యవహరించారు. ఈ యోధుల మత విశ్వాసాలకు భిన్నంగా హుకుంచంద్ మృతదేహాన్ని ఖననం చేయగా, మునీర్ బేగ్ భౌతికకాయాన్ని దహనం చేసిన ఆంగ్లేయులు తమ కసిని తీర్చుకున్నారు.

ప్రజల మత విశ్వాసాలకు విఘాతం కల్గించటమే కాకుండా పదమూడు సంవత్స రాల వయస్సు నిండని హుకుంచంద్ మేనల్లుడు ఫకీర్ చంద్ జైన్‌ను కూడా ఉరికంబానికి వేలాడదీసి ఆంగ్ల సైనికులు తమ క్రౌర్యాన్ని అత్యంత రాక్షసంగా చాటుకున్నారు.

(**Bharath ke Pradhama Swathantrya Sangram me Aaam logom ki Hissedaari**, Prof.Shamshul Islam, Nehru Yuva Kendra Sangh -atana, New Delhi, 2007)

ఈ విధంగా ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని ఫైజాబాద్‌కు చెందిన శంభుప్రసాద్ శుక్లా, అచ్చా ఖాన్‌లు, రాజస్థాన్ రాష్ట్రానికి చెందిన కోట్ సంస్థానం ప్రముఖులు మహారావు, మోహర్ ఖాన్‌లు, మధ్యప్రదేశ్ రాష్ట్రం భోపాల్ సంస్థానం పరగణాలోని రిసాల్‌దార్ వలీ షా, కోటా హవల్దార్ మహావీర్‌లు తమ తమ ప్రాంతాలలో తమ

బలగాలు, అనుచరులతో కలసి ఏకమనస్కులై ఆంగ్లేయుల మీద తిరగబడ్డారు. తిరగబడిన హిందూ – ముస్లిం యోధులంతా తమ ప్రాంతాలలోని సంస్థానాధీశులు తమతో కలసి రాకపోయినప్పటికి తమ బలగాలు అరకొరగా ఉన్నప్పటికి ఎంతో సాహసంతో ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ముందుకురికారు.

మాతృభూమి విముక్తిని కాంక్షించిన ఈ యోధులకు ఆంగ్లేయుల అపార సైన్యం గాని, వారి అడుగులకుమడుగులొత్తుతున్న సంస్థానాధీశుల మహా సైన్యంగాని తొలిదశలో అడ్డుకోలేకపోయింది. ఆ సమయంలో సంస్థానాధీశులను తమతో కలసి రమ్మని ఎంతగా కోరినా ప్రయోజనం లేకపోవటంతో ఉత్సాహంతో ముందుకురికిన ఆ యోధుల సాహసం నీరుకారిపోయింది. సంస్థానాధీశుల తోడ్పాటు ఏమాత్రం లభించనందున చివరకు స్వదేశీ యోధుల పరాక్రమం మీద పరాయిపాలకుల బలగాలది పైచేయి అయ్యింది.

ఆ కారణంగా ఆ తరువాత అరెస్టయిన ఆ సాహసికులను జతలు జతలుగా కాల్చివేయడం, ఉమ్మడిగా ఉరితీయడం జరిగింది. ఈ యోధులు తమ కంఠంలో ప్రాణం పోయేంతవరకు ఉమ్మడి లక్ష్యాన్ని సాధించేందుకు ఐక్యంగా ఆంగ్లేయులను వ్యతిరేకిస్తూ హిందూ–ముస్లింల మధ్య వ్యక్తమైన ఐక్యతకు ప్రబల సాక్ష్యంగా నిలిచి భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో తమకంటూ ఒక ప్రత్యేక స్థానం సంపాదించుకున్నారు.

## ఐక్యతను విచ్ఛిన్నం చేసేందుకు కుట్రలు

ఈ విధంగా ఇటు సామాన్య ప్రజలలోనూ అటు ప్రముఖులలోను బలమైన ఐక్యత వ్యక్తంకావడంతో ఈస్ట్ ఇండియా కంపెనీ వ్యూహకర్తలు ఖంగుతిన్నారు. ఐక్యతా వాతావరణం మరింతగా రోహిల్‌ఖండ్ రాజధాని బరేలిలో ప్రస్ఫుటించింది. రోహిల్ ఖండ్ పాలకులు ఖాన్ బహదూర్ ఖాన్ ఆంగ్లేయ ప్రభుత్వ పెత్తనం మీద 1857 మే 31న తిరుగబాటు బావుటాను ఎగురవేశారు. ఈ తిరుగుబాటులో రొహిల్‌ఖండ్‌లోని ప్రజానీకమంతా మతాలకు అతీతంగా ఏకమై ఖాన్ నాయకత్వంలో స్వతంత్ర పాలనకు ప్రాణప్రతిష్ట చేసి తెల్లదొరలను మట్టి కరిపించారు.

ఈ సందర్భంగా రోహిల్ ఖండ్ ప్రజలను ఉద్దేశించి ఖాన్ బహదూర్ ఖాన్ చేసిన ప్రసంగం ప్రజలను ఆకట్టుకుంది. ప్రజలనుద్దేశిస్తూ ఆయన మాట్లాడుతూ **భారతదేశ ప్రజల్లారా !** (' The people of India ') అని సంబోధించి చరిత్ర సృష్టించారు.

రోహిల్‌ఖండ్ రాజ్యాధినేత తన ప్రాంతపు ప్రజలను సంబోధిస్తూ **భారత దేశ ప్రజల్లారా** అని సంబోధించటం విశేషాంశం. మొగలు చక్రవర్తి ప్రతినిధిగా రోహిల్ ఖండ్‌ను పాలిస్తున్న ఆయన చక్రవర్తి జఫర్ పాలనలో ఉన్న ప్రజలందర్ని ఉద్దేశించి ఈ విధంగా పిలుపు నివ్వడం భారతదేశ స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో ప్రాధాన్యతను సంతరించుకుంది. రాజరిక వ్యవవస్థకు ప్రతినిధి అయిన ఖాన్ బహదూర్ ఖాన్ ఈ విధంగా విశాల దృక్పథంతో యావత్తు ప్రజానీకాన్ని సంబోధించటం విశేషం.

ఇండియాలోని ప్రధాన సాంఘీక సముదాయాలైన హిందూ-ముస్లిం ప్రజానీకాన్ని ఉద్దేశించి ఖాన్ బహద్దూర్ ఖాన్ మాట్లాడుతూ, **మన పవిత్ర స్వాతంత్ర్య దినోత్సవం ఉదయించింది. ఇంగ్లీషు వారు మోసాలకు పాల్పడవచ్చు. ముస్లింలకు వ్యతిరేకంగా హిందువులనూ, హిందువులకు వ్యతిరేకంగా ముస్లింలనూ రెచ్చగొడతారు. ముస్లింలారా ! మీరు పవిత్ర ఖురానును గౌరవిస్తున్నట్టయితే, హిందువుల్లారా ! మీరు గోమాతను ఆరాధిస్తున్నట్టయితే, మీలోని స్వల్ప విభేదాలను మరచి ధర్మయుద్ధంలో చేతులు కలపండి. ఒకే పతాకం కింద పోరాడండి. మన హిందూస్థాన్ మీద ఆంగ్లేయుల పెత్తనం సృష్టించిన మరకలను మీ రక్తంతో శుభ్రం చేయండి'** అని ఉద్భోధించారు. ఆంగ్లేయుల కుశ్చితాలను, కుయుక్తులను అర్థం చేసుకున్న ఆయన ఈ ప్రసంగంలో హిందూ-ముస్లిం ప్రజానీకం మధ్య ఏర్పడిన ఐక్యతా బంధాన్ని ఏవిధంగానైనా చెడగొట్టడానికి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకుల ప్రయత్నించగలరని అందువలన ప్రజలను జాగురూకులై ఉండమని ముందుగానే హెచ్చరించారు.

('...The auspicious day of our freedom has dawned. The English will again resort to deceit. They will try their hardest to incite the Hindus against the Mussalmans and vice-versa...Mussalmans, if you revere the holy Quran, and Hindus, if you venerate the cow-mother, sink your petty differences and join hands in this holy war. Fight under one flag and with the free flow of your blood, wash away the stigma of the English domination over Hindustan...'- Quoted from ' **How India lost her Freedom**' (Popular Prakashan) authored by Pundit Sunder lal, quoted in the essay titled ' **The Mutiny of 1857: Heroism Amidst Contradictions**', written by Cheryl Kanekar, Published in the magazine ' **The Voice of People Awakening**' Feb. 1998 issue, P. 7)

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామాన్ని ప్రారంభించింది, తిరుగుబాటుకు చోదకశక్తిగా నిలిచింది ప్రధానంగా ముస్లింలన్న దృఢ అభిప్రాయంతోనున్న ఆంగ్లేయ పాలకవర్గాలు, ప్రజానీకంలో మత విభేదాలను సృష్టించి, ప్రజల మధ్యనున్న స్నేహ సంబంధాలను విచ్ఛినం చేసి, తమ మనుగడకు ఎటువంటి ముప్పు లేకుండా చూసుకోవాలనుకున్నాయి. స్వదేశీ పాలకుల తిరుగుబాటును దారుణంగా అణిచి వేసేందుకు కుయుక్తులు -కుట్రలకు పాల్పడ్డాయి.

## కుయుక్తులను చిత్తు చేసిన ఐక్యత



గ్రామం లోగిలిలో పహారా కాస్తున్న సిపాయిలు

ఆ ఎత్తులలో భాగంగా భారత దేశంలోని ప్రధాన జనసముదాయమైన హిందువులను మభ్యపెట్టి, ముస్లింలకు వ్యతిరేకంగా రెచ్చగొట్టాలని ఆంగ్లేయులు పథక రచన చేశారు. మతం ఆసరాతో విద్వేషం రెచ్చగొట్టి తద్వారా ప్రజలలో అనైక్యత సృష్టించాలని ప్రయత్నాలు చేశారు. ఆ ప్రయత్నాలలో భాగంగా ముస్లిం ప్రభువుల గతాన్ని తిరగదోడి వారికి వ్యతిరేకంగా అవాస్తవాలు సృష్టించి ప్రచారంలో పెట్టారు. ఆ సమయంతో ఉమ్మడి శత్రువును స్వంత గడ్డ మీద నుండి తరిమి వేయాలన్న ఏకైక లక్ష్యం తప్ప మరో అంతర్గత వైషమ్యాల ఆలోచన లేని ప్రజానీకం ఆంగ్లేయుల దుష్ప్రచారాన్ని మరింత ఐక్యతతో తిప్పిగొట్టాయి.

ముస్లిం వ్యతిరేక దుష్ప్రచారంతో పబ్బం గడవదన్న వాస్తవాన్ని తెలుసుకున్న ఆంగ్లేయులు ప్రజల దేశభక్తిని డబ్బుతో కొనేందుకు సిద్ధపడ్డారు. ఆ డబ్బు సంచుల ద్వారా రోహిల్‌ఖండ్‌లోని హిందూ సోదరుల దేశభక్తిని, ఆత్మగౌరవాన్ని కొనదలిచారు. ఆ పనికోసం తమ ఖజాన నుండి భారీగా డబ్బు సంచులను రోహిల్‌ఖండ్‌కు దిగుమతి చేసుకున్నారు. రోహిల్ ఖండ్‌లోని కొందరు విద్రోహులను చేరదీశారు. తమ పన్నాగాన్ని వివరించారు. డబ్బును ఎరగా చూపారు.

ఈ ప్రయత్నాలకు ఆంగ్లేయాధికారి జేమ్స్ ఔట్రాం (James Outram) సారధ్యం వహించి, తన ప్రయత్నాలను ముమ్మరం చేశాడు. ఆంగ్లేయుల ఖజనా నుండి దిగుమతైన అపార ధనరాశులను, ఆర్థిక సౌకర్యాలను ఆశ చూపించి ఆకట్టుకుని, ప్రజలను మతం పేరిట చీల్చాలని, ముస్లింల పట్ల హిందూ జనసముదాయాలలో అయిష్టతను పెంపొందించి అనైక్యత సృష్టించేందుకు జేమ్స్ ఔట్రాం పకడ్బందీగా పథక రచన చేశాడు.

బలమైన స్వాతంత్ర్య కాంక్షతో పోరుబాటను ఎంచుకున్న ప్రజలు, ప్రధానంగా హిందూ సోదరులు, జేమ్స్ ఔట్రాం దుష్ట ప్రయత్నాలను గ్రహించారు. ఆ పాపిష్టి సొమ్ము మా స్నేహం, ఐక్యతల ముందు, మా లక్ష్యం ముందు దిగదుడుపు అన్నారు. అయాచితంగా తమ ఇంటి గడపల వద్దకు తరలి వస్తున్న డబ్బు సంచులను పూర్తిగా తిరస్కరించారు. ఈ డబ్బుకు కక్కుర్తిపడి తమ మధ్యనున్న ఐక్యతను బలిచేసేది లేదన్నారు. తమ సంకల్పం నుండి ఎటువంటి పరిస్థితులలో తొలిగేది లేదని స్పష్టంగా ప్రకటించారు. ఆంగ్లేయుల, ఆంగ్లేయులకు తొత్తులుగా వ్యవహరిస్తున్న విద్రోహుల ఎత్తులను పూర్తిగా తిప్పిగొట్టారు. ఫలితంగా ఆంగ్లేయాధికారుల ప్రయత్నాలన్నీ హిందూ-ముస్లిం జనసముదాయాలు ఐక్యంగా వ్యక్తం చేసిన దృఢాభిప్రాయం ముందు ఘోరంగా విఫలమయ్యాయి.

ఈ తిరస్కరణ వలన ఈస్ట్ ఇండియా కంపెనీ ఖజానా నుండి దిగుమతి చేసిన సొమ్ము ఏమాత్రం ఉపయోగపడలేదు. దిగుమతి చేసుకున్న డబ్బుసంచులన్నీ అలాగే మిగిలిపోయాయి. గత్యంతరం లేని పరిస్థితులలో ఆ సంచులన్నిటిని తిరిగి ఖజానాకు పంపించాల్సిన పరిస్థితి వచ్చింది.

ఈ విషయాన్ని T. R Metcalf తన **The Aftermath of Revolt** (page 299) గ్రంథంలో ' Sir James Outram (1803-63) failed to raise Hindus in Rohilkhand against the regime of Khan Bahadur Khan and had to return

money granted for the purpose unspent to the treasury ' అని పేర్కొన్నాడు.

ఈ విధంగా రోహిల్‌ఖండ్‌లోని హిందూ-ముస్లింలు ప్రధానంగా హిందూ సోదరులు, మా మతాలు వేరైనా మా మాతృభూమి ఒక్కటే, మా మార్గం ఒక్కటే, మా లక్ష్యం ఒక్కటేనంటూ మతం పేరిట మనుషుల్ని చీల్చి పబ్బం గడుపుకోవాలనుకున్న బ్రిటీష్ పాలకుల ఎత్తులను బలంగా త్రిప్పికొట్టి హిందూ-ముస్లింల ఐక్యతకు ఆదర్శప్రాయమై నిలిచారు.

## ఉమ్మడిగా పోరాడిన మౌల్వీ-మహంత్

ప్రజలు మాత్రమే ఐక్యంగా ఉమ్మడి శత్రువును పరిమార్చడానికి చేతులు కలపటం కాకుండా హిందూ-ముస్లిం ధార్మికవేత్తలు కూడా ఒకరికి తోడు మరొకరుగా ఈ పోరాటంలో భుజం భుజం కలిపి ముందుకు సాగారు.

ఈనాడు హిందూ-ముస్లింల మధ్య అగాధాన్ని సృష్టించడానికి ప్రధాన ఆయుధంగా ఉపయోగపడిన అయోధ్య ఆనాడు హిందూ-ముస్లింల మధ్య ఐక్యతకు ప్రతీకగా నిలిచింది. ఈ గడ్డ మీద ముస్లిం మౌల్వీ, హిందూ మహంతులు చేతులు కలిపి ఉమ్మడి శత్రువు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాటం చేసి ఉరికంబాల మీద వ్రేలాడిన మహత్తర చారిత్రక సంఘటనలు జరిగాయి. అయోధ్యలోని ప్రసిద్ధి చెందిన హనుమాన్‌గడి పూజారి బాబా రామచరణ దాస్ ఆంగ్లేయులకు వ్యతిరేకంగా సాయుధ పోరాటానికి సన్నద్ధమౌతున్నారు. ఆ విషయం తెలుసుకున్న అయోధ్యకు చెందిన ప్రముఖ ధార్మిక పండితుడు మౌల్వీ అమీర్ అలీ తక్షణమే బాబా రామచరణ్ దాస్‌తో చేతులు కలిపారు. మౌల్వీ తన అనుచరులతో బాబా రామచరణ్ దాస్ యోధులతో ఏకమై ఉమ్మడి సైన్యాలతో ఆంగ్ల సైన్యాల మీద యుద్ధం ప్రకటించారు.

ఈ పోరాటంలో పరాజితులైన మౌల్వీ అమీర్ అలీ, బాబా రామచరణ్ దాస్ ఇద్దరినీ ఆంగ్లేయాధికారులు అరెస్టు చేశారు. ఈ యోధులిద్దరి మీద రాజద్రోహం నేరారోపణ చేసి విచారణ జరిపారు. ఆ విచారణ ఫలితంగా బాబాకు, మౌల్వీకి ఆంగ్ల సైనికాధికారులు ఉరిశిక్ష విధించారు. ఈ విధంగా ప్రకటించిన ఉరిశిక్షను వెంటనే అమలు చేయ సంకల్పించిన అధికారులు తక్షణమే ఉరి ఏర్పాట్లకు ఆదేశించారు.

ఆ ప్రాంతంలో ఉరిశిక్ష అమలుకు ప్రత్యేకంగా ఉరివేదిక లేకపోవడం వలన అయోధ్యలోని **కుబేర్ టీలా** అనుచోట ఓ చింతచెట్టును ఉరికంబంగా ఉపయోగించి ఆ యోధులిద్దరిని ఒకేసారి ఆ చెట్టుకు వేలాడదీశారు. ఈ విధంగా ఆలయ పూజారి బాబా రామచరణ్ దాస్, మౌల్వీ అమీర్ అలీ మాతృభూమి విముక్తి కోసం పోరుబాటన సాగి ఒకే చింత చెట్టుకు జంటగా వేలాడారు. ఆ విధంగా పోరాటంలో మాత్రమే కాకుండా అమరత్వంలో కూడా ఐక్యతను ప్రదర్శించిన ఆ యోధులు చిరస్మరణీయు లయ్యారు.

(**Bharath Ke Pradhama Swathantrya Sangram Me Aaam logom Ki Hissedaari (Hindi)**, Prof. Shamshul Islam, Nehru Yuva Kendra Sanghatana, New Delhi, 2007 )

## హిందూ-ముస్లింల సమైక్య పాలన

ఈ వాతావరణం ఇలాగే కాకున్నా, మరోరూపంలో అవధ్ (అయోధ్య) రాజ్యం రాజధాని నగరం లక్నోలో కన్పించింది. అవధ్‌ను ఆక్రమించుకున్న ఆంగ్లేయులను హిందూ -ముస్లిం యోధుల, స్వదేశీ పాలకుల, ప్రజల అండదండలతో తిరిగి స్వాధీనం చేసుకున్న బేగం హజరత్ మహల్ హిందూ-ముస్లింల మధ్య ఐక్యతాసాధనకు విశేషం కృషి సాగించారు. ఆమె అధికారపగ్గాలను చేపట్టగానే అన్ని సాంఘిక జనసముదాయాలకు పాలనాధికారంలో భాగం కలించే విధంగా, సమిష్టి నిర్ణయాలకు అనుకూలంగా పాలనా వ్యవస్థను రూపొందించారు. బహిర్గత శత్రువును ఎదుర్కోడానికి ప్రాణాలు పణంగా పెట్టే సైనికులకు అధిక ప్రాధాన్యత కల్పించారు. స్వదేశీ పాలకులు, నమ్మకస్థులైన సైనిక అధికారులకు, తిరుగుబాటు వీరులకు, ప్రముఖులకు వారి వారి ప్రతిభా సామర్థ్యాల ఆధారంగా పలు పాలనా విభాగాల బాధ్యతలను అప్పగించారు.

ఈ సందర్భంగా మతం, కులం, ప్రాంతాల ప్రసక్తి లేకుండా, పౌర-సైనికాధికార ప్రముఖులైన మమ్మూఖాన్, మహారాజ బాలకృష్ణ, బాబూ పూర్ణచంద్, మున్షీ గులాం హజరత్, మహమ్మద్ ఇబ్రహీం ఖాన్, రాజా లాలా సింహ్, రాణా జిజియా లాల్, రాజా మాన్‌సింగ్, రాజా దేశిబక్ష్ సింగ్, రాజా బేణిప్రసాద్ లాంటి వారితో ఉన్నత స్థాయి కమిటీని ఏర్పాటు చేశారు. ఈ కమిటీ ప్రతి రోజు సమావేశమయ్యేది. ప్రతి అంశాన్నీ

కమిటీ సభ్యుల ఎదుట పెట్టి, చర్చించి ప్రజాస్వామ్యబద్ధంగా నిర్ణయాలు తీసుకుని వాటి అమలును బేగం స్వయంగా పర్యవేక్షించారు.

రాజరికపు రోజుల్లో ఆ విధంగా వ్యవహరించటం బేగం హజరత్ మహల్ బుద్ధికుశలతకు నిదర్శనం. అవధ్ నవాబు బిర్జిస్ ఖధిర్ పేరిట ప్రకటనలు వెలువడ్డాయి. ఆంగ్లేయుల పాలన అంతమైందని ఆ ప్రకటనలు స్పష్టం చేశాయి. ఆమె పాలనను అంతం చేయాలని ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు ఎంతగా ప్రయత్నించినా సుమారు 10 మాసాలపాటు వీలు కుదరలేదు. ఆమె పాలనకు హిందూ-ముస్లిం ప్రజానీకం తోడ్పాటు లభించింది.

1857 నవంబరు 1న బ్రిటీష్ మహారాణి స్వదేశీపాలకులు, తిరుగుబాటు యోధులు, ప్రజల నుద్దేశించి ఓ ప్రకటన విడుదల చేసింది. ఆ ప్రకటనకు ప్రతిగా తన కుమారుడు బిర్జిస్ ఖదిర్ పేరిట బేగం హజరత్ మహల్ మరోక ప్రకటన విడుదల చేశారు. ఆ ప్రకటనలో హిందూ-ముస్లిం ప్రజానీం మనోభావాలకు సమాన ప్రాధాన్యత నిస్తూ పలు విషయాలను ఆమె ప్రస్తావించారు.

ఆ ప్రకటనలో, ' **హిందూ-ముస్లింను హెచ్చరిస్తున్నాం. ఆత్మగౌరవంతో, ధర్మబద్ధంగా ప్రశాంత జీవితం సాగించాలంటే స్వదేశీపాలన కోసం శత్రువులకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టండి. స్వదేశీ సైన్యంలో భర్తీకండి..మాతృదేశం కోసం సాగుతున్న పోరాటంలో భాగస్వాములు కండి. శత్రువుకు సహకరించకండి. ఆశ్రయం ఇవ్వకండి..**', అని బేగం హజరత్ మహల్ ప్రజలకు పిలుపునిచ్చారు. (**భారత స్వాతంత్ర్యోద్యమం : ముస్లిం మహిళలు**, సయ్యద్ నశీర్ అహమ్మద్)

బేగం హజరత్ మహల్ ఎంతో దూరదృష్టితో పరాయి పాలకులను ఎదుర్కొనేం దుకు హిందూ-ముస్లింల ఐక్యతావశ్యకతను అంచనా వేసి తగిన సానుకూల చర్యలు తీసుకున్నందున **హిందూ ముస్లిం మతములకు స్వాతంత్ర్య సముపార్జనకు సంబంధించిన ఈ సమరంలో తమ సర్వస్వము త్యాగము చేద్దామని మాన్‌సింగ్ వంటి హైందవ ప్రముఖులు, మౌల్వీ అహ్మద్‌షా వంటి ముస్లిం ప్రముఖులు నిశ్చయించుకున్నారు. వేలాది పండితులు, మౌల్వీలు రహస్యముగాను, బాహాటముగాను పవిత్ర యుద్ధ ప్రచారము చేసుకుంటూ ఔథ్** (అవధ్) **అంతటా పర్యటించనారంభించారు. సైనికులు ప్రమాణాలు చేశారు. పోలీసులు ప్రమాణాలు చేశారు. ప్రతి ఒక్కరూ ఆంగ్లేయుల పాలనను అంతమొం**

దించే ఈ వ్యూహములో చేరారు. ప్రజాందోళనాగ్ని నలుదిశల వ్యాపించింది. (**1857** స్వరాజ్య సంగ్రామం, వి.డి. సావర్కార్, నవయుగభారతి ప్రచురణలు, హైదరాబాద్, 2001, పేజి. 103)

## సమున్నత స్థాయిలో సహజీవన కళ

ఈ విధంగా అటు ప్రజలలో ఇటు స్వదేశీ పాలకులలో వ్యక్తమైన ఐక్యత ఎంత దూరం సాగిందంటే, ఏ మతానికి చెందిన వారైనా తిరుగుబాటు యోధులై ఉంటే చాలు వారిని కాపాడుకునేందుకు మతాలకు అతీతంగా, స్త్రీ-పురుష బేధం లేకుండా సామాన్య ప్రజలు ఆత్మార్పణలకు వెరవకుండా ముందుకు వచ్చిన సంఘటనలు ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ చరిత్రలో చోటు చేసుకున్నాయి.

ఈ ఐక్యత కేవలం ఆంగ్లేయులతో పోరాడుతున్న తిరుగుబాటు యోధులలో, స్వదేశీయుల పాలనను ఆకాంక్షిస్తున్న స్వదేశీ పాలకులలో, స్వతంత్ర దేశంలో లభించే ప్రయోజనాల కోసం పోరాటాన్ని సమర్థిస్తున్న ఇతర వర్గాలలో మాత్రమే కాకుండా దేశంలోని సామాన్య ప్రజలలో కూడా బలంగా వ్యక్తమైంది. మతాలకు అతీతంగా ఇరుగు పొరుగు సంబంధాలను పటిష్టం చేసుకోవడం, ఒకరికి మరొకరుగా ప్రజల సహకరించు కుంటూ సహజీవనం సాగించటం సహజంగా సాగింది. ఆ కారణంగా చరిత్రకారుడు C.F. Andrews ఇండియాలో విభిన్న మతస్థులైన ఇరుగుపొరుగు వారితో ప్రశాంతమైన జీవితాలు గడపటమనే కళ సమున్నత స్థాయికి చేరుకుంది అని వ్యాఖ్యానించాడు.

( The art of living peaceably with neighbours of a diffrent religion had reached a very high level - **Bahadur Sha II**, Mahdi Husain, P. 41)

ఇండియాలోని హిందూ-ముస్లింలు తమ పండుగుపబ్బాలలో కూడా కలసిమెలసి వ్యవహరించేవారని, ఒకరి పండుగలలో మరోకరు భాగస్వాములయ్యేవారని, ఈ విధంగా హిందువులు తమ పండగలకు ముస్లింలను, ముస్లింలు తమ పండుగలకు హిందువులను ఆహ్వానించటం, ఆ ఆహ్వానాలను గౌరవిస్తూ ఒకరి పండుగలలో మరోకరు సంతోషంగా పాల్గొని అంతా కలసి ఆనందించటం ఇక్కడ సర్వసాధారణ విషయమని కూడా C.F Andrews వివరిస్తూ, ఈ లౌకిక విధానం ఇండియాలో ఒక సాంప్రదాయంగా మారిందని వ్యాఖ్యానించాడు.

(It is quite common in those days for the two communities to join together in diffrent religious festivals.Hindus would go to a Muslim Festival and Musalmans would go to a Hindu festival, This had become a natural local custom...The Musalmans had great resect for certain Hindu ascetics....Mussalman on their side spoke of the Hindu religious festivals with freate courtesy and respect and were very particular to avoid any offence against Hindu customs.- **Bahadur Sha II**,Mahdi Husain, P.40)

ఈ విధంగా సహజీవనం సాగిస్తున్న హిందూ-ముస్లిం జనశ్రేణుల గురించి కారల్ మార్క్స్ కూడా చాలా ఉన్నతంగా వ్యాఖ్యానించాడు. 1857నాటి తిరుగుబాటుకు అంతకు ముందు జరిగిన తిరుగుబాట్లకు మౌలికంగా ఉన్న తేడాలను కారల్ మార్క్స్ వివరిస్తూ హిందూ-ముస్లిం ఐక్యతను ఈ క్రింది విధంగా ప్రస్తావించాడు :

**'..భారత సైన్యంలో తిరుగుబాట్లు జరిగాయి; కాని ఇప్పుడు జరుగుతున్న తిరుగుబాటుకి స్వభావసిద్ధమైనట్టీ, వినాశకర మైనట్టీ లక్షణాలున్నాయి.తమ యూరోపియన్ ఆఫీసర్లను సిపాయి రెజిమెంట్లు చంపివేయడం ప్రపథమంగా ఇప్పుడే జరిగింది; హిందువులూ మహ్మదీయులూ పరస్పర వైషమ్యాలను విసర్జించి, తమ ఉమ్మడి ప్రభువు పై తిరగబడడమూ హిందువులతో ఆరంభమైన అల్లర్లు, ఢిల్లీ సింహాసనం పై మహమ్మదీయ చక్రవర్తిని వాస్తవంగా అధిష్టింపజేయడంతో తుట్టతుదకు అంత మొందడమూ ; తిరుబాటు ఏ కొద్ది ప్రాంతాలకో పరిమితమై ఉండకపోవడమూ ఇప్పుడే ప్రథమము...',** (**ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం 1857-1859**, మార్క్స్-ఎంగెల్స్, ప్రగతి ప్రచురణాలయం, మాస్కో, 1983, పేజి. 43).

మాతృభూమి విముక్తి తప్ప మరిదేనికీ, చివరకు మత మనోభావాలకు కూడా, ప్రాధాన్యత ఇవ్వకుండా ఆనాడు విభిన్న మతస్థుల మధ్య సంయమనానికి, సర్దుబాటుకు ఉదాహరణలుగా చెప్పుకోదగిన సంఘటనలు చాలా జరిగాయి. ఈ సంఘటనలలో అటు ప్రజలు కానీ, ఇటు సిపాయీలు కానీ చివరకు ప్రముఖులు గానీ తమ మతమనోభావాల కంటే శత్రువుకు వ్యతిరేకంగా చేపట్టాల్సిన చర్యలకు అధిక ప్రాధాన్యత నిచ్చారు. ఆ విధంగా జరిగిన ఒక సంఘటనలో మొగల్ చక్రవర్తి స్వయంగా పాల్గొన్నారు.

ఆంగ్ల సైన్యాలు ఢిల్లీని చుట్టుముట్టి తీవ్రంగా పోరాటం సాగిస్తున్నాయి.

ఆంగ్లేయుల దాడిని తిప్పికొడుతున్న స్వదేశీ సిపాయి యోధులు తమ వద్దనున్న ఫిరంగులను సరిచేసుకుంటూ, మరిన్ని ఆయుధాలు సమకూర్చుకుంటున్న సందర్భంగా మొగల్ ప్రభువు షాజహాన్ కాలం నాటి ఫిరంగి నొకదానిని కనుగొన్నారు. ఆ ఫిరంగికి తగిన మరమ్మత్తులు చేసి శత్రువు మీద ప్రయోగించడానికి తయారు చేసుకున్నారు. ఆ ఫిరగింని ఉపయోగించే ముందు ఆ ఫిరంగి, దానితోపాటు ఫిరంగి దళం బాధ్యతలను చూస్తున్న హిందూ సిపాయిలు హిందూ మతాచారాల ప్రకారంగా పూజలు నిర్వహించదలిచారు. ఆ సమయంలో హిందూ-ముస్లిం సిపాయిలు ఎవ్వరూ కూడా ఆ పూజా కార్యక్రమాలను కాదనలేదు.

ఆ సందర్భంగా పూజారులు మంత్రాలు చదివి హారతిచ్చి ఇతర పూజా కార్యక్రమాలను పూర్తిగా నిర్వహించి ఆశీర్వాదం పలికిన తరువాత ఆ ఫిరంగిని శతృవు మీద ప్రయోగించడానికి సిద్ధం చేశారు. ఈ కార్యక్రమంలో హిందూ-ముస్లిం సైనికులు మాత్రమే కాకుండా చక్రవర్తి బహదూర్ షా జఫర్ ఇతర నవాబులు, స్వదేశీ ప్రముఖులు కూడా పాల్గొన్నారు. మతం పేరుతో హిందూ-ముస్లింల ఐక్యతను విఛ్చిన్నం చేసి తిరుగుబాటును పూర్తిగా అణచివేయాలనుకుంటున్న ఆంగ్లేయులకు ఈ ప్రవర్తన మింగుడు పడలేదు. ప్రజలూ-ప్రభువులూ కూడా తమ మత ఆచార సంప్రదాయాలను పక్కన పెట్టి మత మనోభావాలకు అతీతంగా ఏకమై ఒకేమాట- ఒకేబాటగా వ్యవహరించడంతో ఆంగ్లేయ సైనికాధికారులకు దిమ్మతిరిగిపోయింది.

## నిప్పూ - నీరు సహజీవనం ! ఆం !!

ఈ విధంగా వ్యక్తమైన హిందూ-ముస్లింల ఐక్యత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో స్వయంగా పాల్గొన్న ఆంగ్ల అధికారులను, ప్రపంచంలోని ఇతర ప్రాంతాల లోని మేథావులను కూడా ఆశ్చర్యానికి లోనుచేసింది. ఉమ్మడి సమస్యల మీద కూడా హిందూ-ముస్లింలు ఏకమయ్యే ప్రసక్తే లేదని భావిస్తూ వచ్చిన ఆంగ్లేయులకు 1857 పోరాటంలో వ్యక్తమైన ఐక్యత తీవ్ర విభ్రాంతికి గురిచేసింది.

ఆంగ్లేయులు అసాధ్యమని భావించిన దాన్ని భారతీయులు సాధ్యమని బలంగా రుజువుచేశారు. హిందూ-ముస్లింలను **'నిప్పూ-నీరు'** గా భావించి ఈ రెండు సముదాయాల మధ్య సయోధ్య ఖచ్చితంగా అసాధ్యమని నిశ్చింతగా ఉన్న కంపెనీ

పాలకులకు ఉమ్మడి సమస్యల పరిష్కారం కోసం, ఉమ్మడి శత్రువు మీద పోరాటానికి మేమంతా ఎప్పుడూ ఒక్కటేనని ఆచరణాత్మకంగా రుజువు చేసిన ప్రజలు ఆంగ్లేయులకు చక్కని గుణపాఠం చెప్పారు.

1857 పోరాటంలో పాల్గొన్న Holloway తాను రాసిన **Essays on Indian Mutiny** గ్రంథంలో ఈ విషయాలను ప్రస్తావిస్తూ ఏదోఒక సమస్య మీద **హిందూ ముస్లింల ఐక్యమౌతారన్న విషయాన్ని బ్రిటీషర్లు ఊహించలేకపోయారు. నిప్పు-నీరు లాంటి హిందూ-ముస్లింలు ఉమ్మడి సమస్యల మీద ఒక్కటికారని ఆంగ్లేయులలో ఉన్న భావనలు సరికాదని తేలింది. మన ఆధిపత్యాన్ని కూలద్రోయదానికి హిందూ-ముస్లిం మతస్థులు ఏకం కావడానికి ధార్మికవ్యవస్థల ప్రతినిధులు కూడా సంపూర్ణంగా అంగీకరిస్తూ అనుమతించారు** అని పేర్కొన్నాడు.

(' The British never conceived that the Hindus and Musalmans could unite over any question...It was deemed quite as impossible occurrence for the 'Hindus and Musalmans to agree upon a question of public interest as it was for fire and water to agree when brought into contact with each other. This assumption has proved a fallacy.For both these epresentatives of the religious bodiesperfectly agreed whilst prosecuting the scheme for overthrowing our dominion in the East...' quoted in **Bahadur Shah II**, Written by Mahdi Husain, P.15)

ఈ అనుభవాల నేపథ్యంలో భారత దేశంలోని విభిన్న జనసముదాయాలను ప్రధానంగా హిందూ-ముస్లింలను ఎన్నడూ ఐక్యం కానివ్వరాదని ఆంగ్లేయులు దృఢ నిర్ణయం తీసుకున్నారు. ఆంగ్లేయ సైనిక స్థావరానికి చెందిన సైనికాధికారి John Coke 1857 తరువాత భవిష్యత్తులో భారతదేశంలో బ్రిటీష్ ప్రభుత్వ పాలనావిధానం ఎలా ఉండాలో సూచిస్తూ **విభజించి- పాలించు విధానానికి అనుకూలంగా మతాలు, జాతుల మధ్యనున్న విభజన యథాతథంగా కొనసాగేలా, వీరెప్పుడూ ఐక్యం కాకుండా ఉండేలా మన ప్రయత్నాలు చాలా గట్టిగా ఉండాలి** అని మార్గనిర్దేశనం చేశాడు.

'...Our endeavors should be to uphold in full force the (for us fortunate) separation which exists between the difference religions and races, not to endeavor to amalgamate them. *Divide et imperia* should be the principle of Indian Government..' (Ibid P.15)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నాటి ఈ వాతావరణం ఆంగ్లేయాధికారులలో

భయోత్పాతాన్ని కలుగచేసింది. స్వాతంత్ర్యసమరాన్ని అణిచి వేయగలిగినా, ప్రజలలో రగిలిన బలమైన తిరుబాటు భావనలు వారికి నిద్రపట్టన్విలేదు. ఒక పథకం ప్రకారంగా, సమర్థవంతమైన నాయకత్వంతో ప్రజలు ఐక్యంగా తిరుగుబాటు చేస్తే తమ పాలనకు తప్పకుండా చరమ గీతం పాడాల్సి వస్తుందని వలస పాలకులు గ్రహించారు. ఈ దేశంలోని ప్రజల మధ్య మతాలకు అతీతంగా వ్యక్తమౌతున్న ఐక్యత, ఉమ్మడి శత్రువు మీద వ్యతిరేకత ఎంతటి భయానక పరిణామాలనైనా తెచ్చిపెట్టగలదని అనుభవ పూర్వకంగా తెలుసుకున్న ఆంగ్ల పాలకులకు భవిష్యత్తు గురించి బెంగ పట్టుకుంది.

ఆ కారణంగా ప్రజల మధ్య పటిష్టంగా ఉన్న ఈ ఐక్యతను విచ్ఛిన్న చేయకుంటే తమ పరిపాలనకు విఘాతం కలుగక తప్పదని ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారులు, పాలకులు ఓ నిర్ణయానికి వచ్చారు.

ఈ విషయాన్ని ఆంగ్లేయాధికారి Charles John Griffiths వ్యక్తం చేస్తూ '.. When Hindoo and Mohammedan, restraining the bitter animosity of their rival creeds, united together in the attemmpt to drive out of their common country that race which for one hundred years Ruled.. '. అని ఆనాటి పరిస్థితిని బహిర్గతం చేశాడు.

ఈ వ్యాఖ్యలు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ సమయంలో ఇండియా లోని విభిన్న సాంఘిక జనసముదాయాలు, ప్రధానంగా హిందూ-ముస్లింల మధ్య వ్యక్తమైన బలమైన ఐక్యతకు సాక్ష్యం పలుకుతున్నాయి.

★ ★ ★

## అధ్యాయం -7



# ఆంగ్లేయుల రాక్షసత్వం

**1857** సెప్టంబరు 14న ఢిల్లీ నగరం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల చేతుల్లోంచి జారిపోయింది. ఆ తరువాత ఆంగ్లేయులు పూర్తిగా ఢిల్లీని ఆక్రమించుకున్నాక నగరంలో ఆంగ్ల సైనికులకు ఎదురు లేకుండా పోయింది. చక్రవర్తి బహదూర్ షా జఫర్‌ను నిర్బంధించి, రాజకుటుంబీకులను 30 మందిని అంత:పురం నుండి ఢిల్లీ గేటు వద్దకు లాక్కొచ్చి అందరి తలలను నిర్దాక్షిణ్యంగా నరికివేసి మొగల్ వారసుల ఖండిత శిరస్సులను బహదూర్ షా జఫర్‌కు బహుమతిగా పంపడంతో స్వదేశీయుల మీద ఆంగ్లేయ సైనికుల, సైన్యాధికారుల అంతులేని హత్యాకాండ ఆరంభమైంది.

చక్రవర్తికి ఇచ్చిన మాట తప్పిన ఆంగ్లేయ సైనికాధికారులు షాజహాన్ సమాధుల వద్ద ఆశ్రయం పొందిన మొగల్ రాకుమారులను కుట్రపూరితంగా స్వజనుల చేత మభ్యపెట్టించి బయటకు రప్పించి, రహదారిలో బహిరంగంగా కాల్చి చంపటంతో నగరవాసులు భీతాహులయ్యారు.

ఈ అవకాశాన్ని ఉపయోగించుకున్న ఆంగ్ల సైనికులు కాశ్మీరి గేటు గుండా నగరంలోకి జొరబడ్డారు. నగరవాసుల నుండి ఎటువంటి ప్రతిఘటన లేకపోవడం,

ఎదిరించే యోధులు ఎక్కడా కన్పించక పోవటంతో సైనికులకు ఎక్కడలేని ఉత్సాహం తన్నుకు వచ్చింది. ఆంగ్ల సైన్యాలు, సైనికాధికారులు, ఆ అధికారుల తొత్తులు నగర ప్రజల పట్ల విశృంఖలంగా ప్రవర్తిస్తూ, నగరాన్ని విధ్వంసం చేయడానికి పూనుకుని యధేచ్ఛగా తమ విధ్వంసకర కిరాతక చర్యలకు శ్రీకారం చుట్టారు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామాన్ని ప్రారంభించిన వారు, పాల్గొన్న వారు, ప్రోత్సహించిన వారు ప్రధానంగా **ముస్లింలేనన్న** స్థిర అభిప్రాయానికొచ్చిన బ్రిటీష్ పాలకులు ముస్లింల మీద దారుణంగా విరుచుకుపడ్డారు. ఎటువంటి విచారణ లేకుండా వివిధ ప్రాంతాలలో ముస్లింలను యధేచ్ఛగా ఉరితీశారు. తుపాకులతో కాల్చివేశారు. ఫిరంగులకు కట్టి పేల్చివేశారు. అందుబాటులో ఉన్న చెట్టునల్లా ఉరికంబాలుగా మార్చి వేలాది సమర యోధులను ఉరితీశారు. **చెట్టుకొమ్మలు కూడా కన్పించనంతగా మృత కళేబరాలు వారాల తరబడి ఆ చెట్లకు వేలాడాయని** ఆంగ్లేయ చరిత్రకారులు తమ గ్రంథాలలో వివరించారు.

ప్రపంచాన్ని పాలించగల సత్తా తమకు మాత్రమే ఉందని విర్రవీగిన ఆంగ్లేయులను సవాల్ చేసి తిరగబడిన వీరుల మీద కసితీర్చుకునేందుకు ఈస్ట్ ఇండియా కంపెనీ తన ఆంగ్లేయ అధికారులకు, సైనికులకు పూర్తిగా స్వేచ్ఛనిచ్చి తిరుగుబాటు యోధుల, ప్రధానంగా ముస్లింల ఊచకోతకు పురికొల్పింది. ఈ ఊచకోత, విధ్వంసం, దోపిడి ఏ స్థాయిలో సాగిందంటే ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో స్వయంగా పాల్గొన్న ఈస్ట్ ఇండియా కంపెనీలోని కొందరు సైనికాధికారులు కూడా ఈ **దుర్మార్గపు** చర్యలను ఖండిస్తూ సంబంధిత అధికారులకు, ఉన్నతాధికారులకు లేఖలు రాయాల్సిన పరిస్థితి వచ్చింది.

ఆంగ్లేయాధికారి జాన్ లారెన్స్, మరొక సైనికాధికారి జనరల్ పెన్నీకి విచక్షణారహితంగా సాగిన మారణ కాండ మీద తన అసంతృప్తి వ్యక్తం చేస్తూ రాసిన లేఖలో ' I believe we shall lastingly, and indeed, Justly be abused for the way in which we have despoiled all classes without distinction...I have heard, though it seems incredible, that officers have gone about and murdered natives in cold blood ' - **The Great Mutiny**, Christopher Hibbert, Penguin Books, India, 1980, P. 317) అని పేర్కొన్నాడు.

ఆ కారణంగా నిహతులైన తిరుగుబాటు యోధుల, ప్రజల వివరాలు పూర్తిగా తెలియరాని పరిస్థితి ఏర్పడింది. ఢిల్లీనగరం, పరిసర ప్రాంతాలలో ఆంగ్లేయుల తుపాకీ గుండ్లకు, ఉరిశిక్షలకు 27 వేల మంది బలయ్యారని చరిత్ర చెబుతుంది. అంతే కాకుండా ఆంగ్ల సైన్యాలు సాగించిన సామూహిక హత్యాకాండకు అంతం లేదు. బ్రిటీషర్ల చేత అనుమానించబడి, పర్యవసానంగా నిర్బంధించబడి, ఆ తరువాత అదృశ్యమైపోయిన వారి సంఖ్య మరో 30 వేల వరకు ఉంటుందని S.Abul Hasan Ali Nadvi తన **Muslims in India** గ్రంథంలో (పేజి. 108) లో వెల్లడించారు.

భారతదేశ వ్యాప్తంగా తిరుగుబాటులో పాల్గొని శత్రువుతో పోరాడుతూ గాని,



తిరుగుబాటు యోధులను మూకుమ్మడిగా ఉరికంబాలకు బలిచేస్తున్న ఆంగ్లేయాధికారులు

తిరుగుబాటుకు మద్దతు పలికినందుకు గానీ, ఆంగ్లసైనికుల క్రౌర్యానికి బలై మృత్యువాత పడిన ప్రజలు-ప్రముఖులు మొత్తం మీద రెండు లక్షలకు పైగా ఉండొచ్చని ఒక అంచనా! ఈ రెండు లక్షల మందిలో యాభై వేలకు పైగా ఇస్లామియా పండితులుగా ప్రఖ్యాతి గాంచిన మౌల్వీలు ఉన్నారని మరొక కథనం ద్వారా తెలుస్తుంది.

('Untold History of Freedom Struggle', M. Burhanduddin Qasmi, **The Milli Gazette**, 16-31 May 2007, P. 4)

అటు తిరుగుబాటు యోధులను , ఇటు ప్రముఖులు-ప్రజలను చిత్రహింసలు

పెడుతూ హత్యాకాండ సాగించిన ఆంగ్ల సైనికులు తిరుగుబాటు యోధుల, తిరుగుబాటుకు మద్దతు పలికిన ప్రజల-ప్రముఖుల భవనాలను, గృహాలను పూర్తిగా దోచుకున్నారు. ధ్వంసం చేశారు; తగుల బెట్టారు; సర్వం నాశనం చేశారు. ఈ క్రమంలో గ్రామాలు, పట్టణాలు, నగరాలు ఆంగ్ల సైనికుల విధ్వంసకాండకు ధ్వంసమయ్యాయి.

## అంతులేని విధ్వంస కాండ

స్వాతంత్ర్యసమరయోధులు ఢిల్లీని ప్రధాన కేంద్రంగా, బహదూర్ షా జఫర్‌ను చక్రవర్తిగా ప్రకటించుకుని, ఆంగ్లేయాధికారులను ఢిల్లీ నుండి తరిమిగొట్టి ఈస్ట్ ఇండియా కంపెనీ పాలనకు గండిగొట్టారన్న విషయమై పంజాబ్, కలకత్తా ప్రాంతాలలోని ఆంగ్లేయ సైనిక స్థావరాలకు వార్తలు అందాయి. ఈ వార్తలను అందుకున్న అధికారులు అగ్గిమీద గుగ్గిలం అయ్యారు. ఆఘమేఘాల మీద ఢిల్లీ వైపుకు తమ బలగాలను తరలించారు. ప్రతీకారచర్యతో మండి పడుతూ ఢిల్లీ గమ్యంగా బయలు దేరిన ఆంగ్ల బలగాలు దారిలో కన్పించిన ప్రతి గ్రామం మీద విరుచుకు పడ్డాయి. గ్రామాలలో కన్పించిన ప్రతి వ్యక్తి ప్రాణాలు తోడేయడం మాత్రమే కాకుండా ప్రజల ఆస్తి పాస్తులను దోచుకోవడం, ఎత్తుకెళ్ళ వీలుగాని సంపదను అగ్నికి ఆహుతి చేయడంతో సరిపెట్టుకోక చివరకు గ్రామాలకు గ్రామాలను పూర్తిగా తగులబెట్టి, ఆ జనవాసాలను స్మశానవాటికలు చేసి పైశాచికంగా ఆనందించారు.

కలకత్తా నుండి ఢిల్లీకి బలగాలతో సహా బయలు దేరిన ఆంగ్లేయ సైనికాధికారి జనరల్ నీల్ మార్గమధ్యంలో అత్యంత రాక్షసంగా వ్యవహరించాడు. అలవికానంత కసితో బయలు చేరిన నీల్ సాగించిన దుష్ట చర్యలను ఆంగ్ల చరిత్రకారుడు Sir Jhon Kaye పలు రికార్డులు, నివేదికల ద్వారా తెలుసుకున్నాక **దారిలో శత్రువు ఆక్రమించిన రోడ్డుకు దగ్గర్లోని ప్రాంతాలన్నిటి మీదా దాడిచేసి ధ్వంసం చెయ్యమని మేజర్ రెనాడ్‌కు నీల్ లిఖితపూర్వక ఆదేశాలిచ్చాడు. తిరుగుబాటుదార్లతో సంబంధమున్న అపరాధ గ్రామాలు కొన్నిటిని నాశనం చేయడానికి గుర్తు పెట్టారు. వాటిలో నివసించే ప్రజలందర్ని ఊచకోత కోయాలి. తమ కదలికల గురించి సంతృప్తికరమైన సమాధానం ఇవ్వలేని రెజిమెంట్ల సిపాయిలందరినీ ఉరితీయాలి. తిరగబడ్డ ఫతేపూర్ పట్నం పై దాడి చేసి, అక్కడి పఠాన్ జాతి ప్రజల నివాస ప్రాంతాలను నేలమట్టం చేసి అక్కడ ఉండే వారందరినీ నిర్మూలించాలి,** అని ఆదేశించాడు.

ఈ మేరకు రెనాడ్ తనకు అప్పగించిన బాధ్యతకు గర్వపడి, పై అధికారి ఆజ్ఞను తు.చ.తప్పక నిర్వర్తించాడు. వాళ్ళు మూడు రోజులు కవాతు చేస్తూ వెళ్ళారు. ఇంగ్లీషు వాళ్ళ ప్రతీకార శక్తికి చిహ్నంగా ధ్వంసమైన గ్రామాలను, చెట్ల కొమ్మలకు వేలాడే శవాలను ప్రతిచోటా వదలి వెళ్ళాడు అని ఆ ఆంగ్లేయుడి చర్యలకు అద్దం పట్టాడు. (**1857 మనం మరిచిన మహాయుద్ధం** : యం.వి.ఆర్ శాస్త్రి, పేజి.128.)

జనరల్ నీల్ సాగించిన ఈ మారణకాండలో సుమారు 10వేల మంది బలై ఉంటారని చరిత్రకారుల భోగట్టా. అత్యంత క్రూరంగా వ్యవహరించిన నీల్ చర్యలు చివరకు ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల అభిశంసనకు కూడా గురయ్యాయి. గ్రామాలకు గ్రామాలను అంతం చేస్తూ సాగిన నీల్ దుష్కృత్యాలగురించి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వార్తలను లండన్ టైమ్స్ పత్రికకు రిపోర్టు చేయడానికి ఇండియా వచ్చిన ఆంగ్లేయ పాత్రికేయుడు విలియం రస్సెల్ తన పత్రికకు పంపిన ఒక రిపోర్టులో **అయన మధ్యలో ఎంతో మందిని ఉరితీశాడు. కాల్చివేశాడు. చివరకు మరో ఆంగ్లేయాధికారి నీల్‌తో మాట్లాడుతూ నీవు ఇలాగే కాల్చివేతలు, ఉరితీతలు సాగించినట్టయితే ముమ్మందు ఆంగ్ల సైన్యంలో చేర్చుకో తగిన మగాడు మనకు ఇక్కడ దొరకడు అని అనాల్సి వచ్చింది** అని రాశాడు.

(' Jayanthi se jude kuch sawal (Hindi)', Prof. Shamshul Islam, Janasatta Daily, New Delhi, 12 May 2007, P. 4)

ఈ దుష్కృత్యంలో సుమారు రెండు వందల గ్రామాలను తగులబెట్టి వేలాదిగా ఆడ-మగ తేడా లేకుండా గ్రామస్తులను ఆ మంటల్లో తోసి తగులబెట్టిన దుస్సంఘటనలను ప్రశ్నించిన గవర్నల్ జనరల్ కానింగ్ ఆ విధ్వంసనానికి కారకుడైన జనరల్ నీల్‌ను తీవ్రంగా మందలించాడు. ఆతని అధికార హోదాను కూడా తగ్గించాడు. చివరకు అతని చర్యలను స్వయంగా, బహిరంగంగా ఖండించాల్సిందిగా కూడా నీల్‌ను కానింగ్ కోరాడు. ఆ విధంగా తన చర్యలను స్వయంగా ఖండించేందుకు ఏమాత్రం అంగీకరించకపోగా **ఆ పని నేను చేయను, ఎన్ని తిట్టినా పడతాను. కాని ప్రపంచం ముందు నా దేశాన్ని భయంకరంగా చిత్రించి అవమానపరిచే పని మాత్రం చేయను** అని ఆంగ్లేయాధికారి జనరల్ నీల్ సమాధానమిచ్చాడు.

ఈ సమాధానం ద్వారా తాను నిర్వహించిన దుష్కృత్యాలు ఎంతో భయంకర

మైనవని జనరల్ నీల్ పరోక్షంగా అంగీకరిస్తూ, తన చర్యలను తానే స్వయంగా ఖండిస్తే ప్రపంచ దేశాలలో గ్రేట్ బ్రిటన్ ప్రతిష్ట దిగజారిపోతుందని భయపడిన ఆ ఆంగ్లేయుడు తన బహిరంగ ఖండనకు అంగీకరించలేదు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం ఆరంభ దశలో జనరల్ నీల్, ఢిల్లీ పతనం సమయంలో కెప్టన్ హడ్సన్, ఇతర అధికారులు సాగించిన విధ్వంసం నేపథ్యంలో **మనం నాదిర్షాను మించి పోయాం** అని బెంగాలు గవర్నర్ లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ లాంటి ఆంగ్లేయాధికారులు తమ లేఖలలో స్వయంగా చెప్పుకున్నారు. శతృవు-మిత్రుడు అని తేడా లేకుండా ఎదురు పడిన ప్రతి వ్యక్తినీ అంతం చేయటం, అందినంత దోచుకుపోవటం, తరలించడానికి వీలుకాని ప్రతిదాన్ని తగుల పెట్టడం మాత్రమే తమ సైనికులు పనిగా పెట్టుకున్నారని బెంగాలు గవర్నర్ లార్డ్ ఎల్ఫిన్‌స్టన్ పంజాబు కమీషనర్ సర్ లారెన్స్‌కు రాసిన ఉత్తరంలో పేర్కొన్నాడు.

(After the siege was over, the outrages committed by our army are simply heartening. A wholesale vengeance is being taken without distinction of friend or foe. As regards the looting, we have indeed surpassed Nadir Shah. - **Muslims and India's Freedom Movement**, Dr. Sahan Muhammed, IOS, New Delhi, 2002, P.23)

ఢిల్లీ నగరాన్ని పూర్తిగా దోచుకునేందుకు ప్రతి మంచి భవనాన్నీ కూల గొట్టారు. సంపన్నుల గృహాలలో దాచిన సంపదను ఎత్తుకెళ్ళేందుకు ప్రతి భవంతి గోడలను వెతికి వెతికి మరీ విధ్వంసం చేశారు. ప్రతి ఇంటిని పూర్తిగా తవ్విపోసారు. గృహాలను మాత్రమే కాకుండా మసీదులు,మందిరాలను కూడా విడిచి పెట్టలేదు. ఆనాటి సంఘటనలలో పాల్గొన్న ఆంగ్ల సైనికులు తమ కుటుంబీకులకు తిరుగుబాటు యోధులతో సాగిన పోరాటం గురించి, ఆ తరువాతి పరిణామాల గురించి తెలుపుతూ రాసిన వివరాలను **Indian Mutiny** గ్రంథంలో Charles Ball ఈ విధంగా పేర్కొన్నాడు.

**అసమ్మతి పాకిన గ్రామాలను తగులబెట్టి నాశనం చేసేందుకు ప్రతిరోజు దండయాత్రలు చేసేవాళ్ళం...పల్లెపల్లెకు తిరిగి అన్ని వైపుల నుంచి నిప్పంటించి గ్రామ వాసులను తగల బెట్టటం చాలా మంది ఇంగ్లీషువారికి మహా వినోదంగా తోచింది. అయా భీభత్స దృశ్యాలను చమత్కారంగా వర్ణిస్తూ ఇంగ్లాండుకు ఉత్తరాలు రాశారు...**

మంటలు ఎంత వేగంగా, ఎంత లాఘవంగా అంటిచేవారంటే గ్రామంలోని ఏ ఒక్కరూ తప్పించుకొగలిగేవారు కాదు. పేద రైతులు, బ్రాహ్మణ పండితులు, హాని చేయని ముసల్మాన్లు, బడి పిల్లలు, చంకలో పసిపిల్లలున్న తల్లులు, యువతులు, వృద్ధులు, అంధులు, అవిటివారు అందరూ మంటల్లో మాడిపోయారు...వాళ్ళంతా ఉన్న పెద్ద గ్రామానికి మేము నిప్పు అంటించి, చుట్టుముట్టాం. మంటల్లోంచి బయటికి రాబోయిన వారినల్లా కాల్చేశాం. (**1857** మనం మరిచిన మహాయుద్ధం : యం.వి.ఆర్ శాస్త్రి, పేజి.131)

ఆంగ్ల సైనికులు మాత్రమే కాకుండా ఆంగ్లేయాధికారులు కూడా అపార



ప్రజలు, స్వదేశీ యోధులపై క్రూరంగా విరుచుకుపడుతున్న ఆంగ్ల సైన్యం

సంపదను చేజిక్కించుకోవటం కోసం మందీ మార్బలంతో, విధ్వంసానికి అవసరమైన ప్రత్యేక పరికరాలతో, ఆయుధాలతో నగరం మీద దాడులు చేశారు. ఆంగ్ల సైనికులు, ఆంగ్లేయ సైనికాధికారులకు తోడు ఆంగ్ల సైన్యంలో గల సిక్కు, గూర్ఖా సైనిక దళాలకు చెందిన సైనికులు కూడా ఆ వినాశకర సంఘటనలలో పాల్గొన్నారు. గతంలో ఎప్పుడో మొగలుల ప్రత్యక్షపాలనలో ఉన్న ఢిల్లీ నగరం నాశన మౌతుందని శిక్కు మతనాయకులు చేసిన శాపనార్థాలను శిక్కు సైనికులు మళ్ళీ మళ్ళీ గుర్తుకు తెచ్చుకుంటూ ముస్లింను తాము బలితీసుకుంటున్న ధోరణులు తమ మత నాయకుల శాపాల మేరకు జరుగుతున్న

చర్యలుగా భావించటం వలన శిక్కు సైనికులు ఆంగ్ల సేనలకు అన్ని విధాలా తోడుగా నిలిచి దోపిడీ, విధ్వంసంలో యథేచ్ఛగా పాల్గొన్నారు.

## రక్త సముద్రంలో ఢిల్లీ నగరం

ఆధిపత్యాన్ని ప్రశ్నించిన తిరుగుబాటు యోధులంటే ఆగ్రహంతో రగలిపోతున్న ఆంగ్లేయాధికారులు సైనిక నియమనిబంధనలను పక్కన పెట్టి నగరంలోని ప్రజల పట్ల రాక్షసంగా వ్యవహరించడంతో అదే మార్గంలో అడ్డూ ఆపూ లేకుండా పోయిన ఆంగ్ల సైనికులు, మరింతగా రెచ్చిపోయి హింసాయుత సంఘటనలకు పాల్పడ్డారు. ఢిల్లీ నగరంలోకి ఆంగ్ల సైనికులు ప్రవేశించగానే, కన్పించిన ప్రతివార్నీ ఎటువంటి విచారణకూ తావు లేకుండా కత్తులకు ఎరవేయడం, తుపాకులతో కాల్చిచంపడం, బాయనెట్‌లతో పొడిచి చిత్రహింసలు పెట్టి హత్యలు చేయడం యథేచ్ఛగా సాగింది. స్త్రీలు-పురుషులు, పిల్లలు-వృద్ధులు, సాయుధులు-నిరాయుధులన్న కనీస విచకణ్ణ కూడా లేకుండా ఆంగ్ల సైన్యాలు నగరవాసుల రక్తం పారించడంతో ఢిల్లీ నగరమంతా **రక్త సముద్రం** గా కన్పించిందని మహాకవి మీర్జా గాలిబ్ హృదయవిదారకంగా రోదించాడు.

ఆంగ్ల సైనికులు నగరంలో ప్రవేశిస్తూనే సాగించిన హత్యాకాండ గురించి **The Bombay Telegraph** పత్రిక All the city people found within the wall when our troops entered were bayoneted on the spot; and the number was considerable, as you may suppose when I tell you in some houses forty or fifty persons were hiding అని ప్రచురించింది. (**An Advanced History of India**, RC Mujumdar, Macmillan, Inida, 1996, P.771)

ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారిగా ఢిల్లీలో పదవీ బాధ్యతలు నిర్వహిస్తూ 1857 నాటి తిరుగుబాటును స్వయంగా చూసిన స్వదేశీయుడైన మొయినుద్దీన్ హసన్ (Moinuddin Hasan) తన ఉన్నతాధికారి థియోఫిలస్ మెట్‌కాఫ్ అభీష్టానుసారం 1887లో ఉర్దూలో రాసిన **'గదర్ 1857'** (Gadar 1857) గ్రంథంలో ఇచ్చిన వివరాల ప్రకారంగా, ఢిల్లీ నగరంలో కన్పించిన ఒడ్డూపొడుగూ ఉండి తెల్ల దుస్తులు ధరించిన ప్రతి వ్యక్తినీ ఆంగ్ల సైన్యాలు తిరుగుబాటుదారుడిగా పరిగణించాయి. రాజ కుటుంబీకుడ్నీ గానీ, రాజ కుటుంబంతో సంబంధం ఉన్న వ్యక్తిగానీ తమ శత్రువుగా ముద్రవేశాయి. ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగి కాకపోయినా, ఈస్ట్ ఇండియా కంపెనీ ఉద్యోగి

అయివుండి తిరుగుబాటు సమయంలో కన్పించకుండా పోయినా అటువంటి వ్యక్తులందర్నీ కూడా తిరుగుబాటులో పాల్గొన్న వ్యక్తులుగా పరిగణించి తిరుగుబాటు యోధులతో సమానంగా శిక్షలు విధించారు. ఆంగ్లేయుల పట్ల గతంలో ఏమాత్రం కఠినంగా వ్యవహరించిన వ్యక్తిగాని, బ్రిటీష్ ప్రభుత్వాన్ని కించిత్తు విమర్శించిన వ్యక్తిగాని ఎక్కడ కన్పించినా ఆ వ్యక్తులను నరకయాతన పెట్టి అంతమొందించ సాగారు. ఆంగ్లేయులకు ఎదుటపడిన వ్యక్తుల విషయంలో దోషి నిర్దోషి అను వివక్ష లేదు. తెల్లవాడు కాక మిగిలిన వారు–నల్లగా కన్పించినా, స్థానికుడన్పించినా అతడ్ని దోషిగా పరిగణించడం, ఆ మరుక్షణమే తుపాకీగాని, కత్తికి గానీ బలిపెట్టడం యధేచ్ఛగా సాగింది.

నగర ప్రముఖులు, సంపన్నులు, తిరుగుబాటుతో ఏమాత్రం సంబంధంలేని కులీన పండిత కుటుంబాలు ఏవీ కూడా ఆంగ్ల సైనికుల దాష్టీకాల నుండి తప్పించు కోలేకపోయాయి. ప్రతి ఇంటినీ ఆంగ్ల సైనికులు చుట్టుముట్టారు. ప్రతి ఇంటిని దోచుకున్నారు. ప్రతిఘటించినా, ప్రతిఘటించకపోయినా గృహస్తులను చంపి వేశారు. ఈ హత్యాకాండ, అత్యాచారాల నుండి తప్పించుకునేందుకు సంపన్న–కులీన వర్గాలకు చెందిన మహిళలు తమ గృహాలలోని ప్రత్యేక గదులలో, రహస్య ప్రదేశాలలో పెద్ద సంఖ్యలో దాక్కొన్నారు.

ఆ విధంగా దాక్కొన్న వారెవ్వరినీ వదలి పెట్టకుండా వెతికి వెతికి మరీ వేటాడటంతో ఆంగ్ల సైనికుల బారిన పడకుండేందుకు మరోమార్గం లేక పిల్లాపాపలతో సహా మహిళలు బావులలో దూకి, నదులలోకి గెంతి ఆత్మహత్యలు చేసుకున్నారు. మగవారు చావుకు సిద్ధపడి బయటకు వచ్చి కాల్పులు జరుపుతూగాని, చస్తూ చస్తూ తమ ఆయుధాలతో శత్రువును బలితీసుకుంటూ మృత్యు మాలలను స్వయంగా ధరించారు. మూడు వారాల పాటు ఢిల్లీ నరంలో ఆంగ్ల సైనికుల ఇష్టారాజ్యం సాగింది. ఆంగ్ల సైనికుల, ఆంగ్లేయాధికారుల అకృత్యాలను భయానక దారుణ మారణకాండకు గురైన కుటుంబాలు, ఆ కుటుంబాలలోని వ్యక్తులు, ఆ వ్యక్తుల స్థాయి, అమాయకత్వం, ఆ వ్యక్తుల–కుటుంబాల పాపపుణ్యాలతో సహా పూసగుచ్చినట్టుగా మొయినుద్దీన్ హసన్ తన '**గదర్ 1857**' గ్రంథంలో సవివరంగా పేర్కొన్నాడు.

ఆంగ్ల సైనికుల అత్యాచారాల నుండి తప్పించుకునే అవకాశం కోసం ఎదురు చూస్తున్న మహిళలు పెద్ద సంఖ్యలో తమ గృహాల మాగళిలో, చిన్న చిన్న గదులలో

కూడా కిక్కిరిసిపోయి దాక్కొన్నారు. భయంతో ప్రాణాలు అరచేత పట్టుకుని ఎంతగా దాగినా ఎవ్వర్నీ వదలకుండా అందర్నీ తమ గృహాల నుండి బయటకు లాక్కొచ్చి బాయెనెట్ లతో పొడిచి పొడిచి హింసించి ప్రాణాలు తీసి ఆంగ్ల సైనికులు ఆనందిస్తూ ఢిల్లీ నగరాన్ని రక్తసముద్రం చేశారు. ఈ విధంగా దాక్కొన్నవారు ప్రతి గృహంలో నలభై నుండి యాభై వరకు ఉంటూ వచ్చారనీ అటువంటి వారందరూ ఆ తరువాత ఆంగ్ల సైనికుల చేతుల్లో శవాలుగా మారారనీ ఆంగ్ల అధికారులు స్వయంగా చెప్పుకున్నారు. (**The Great Mutiny** : Christopher Hibbert)

ఆనాటి సంఘటనలను ఆంగ్లేయల దుష్కృత్యాలను హృదయ విదారకంగా వివరిస్తూ మహాకవి గాలిబ్ రోదించాడు. ఆనాటి ఢిల్లీ నగర దృశ్యాన్ని వివరిస్తూ **ఆంగ్ల సైన్యం నగరంలోకి ప్రవేశిస్తూనే ఎదురుబడిన వాళ్ళందర్ని కాల్చి చంపారు. ఆస్తులను దోచుకున్నారు. నా ఎదుట రక్తసముద్రం ఉంది. నేను ఇంకా ఏమి చూడాల్సి ఉందో భగవంతునికి మాత్రమే ఎరుక. నా సన్నిహితులు, స్నేహితులు వేల మంది మరణించారు. మనస్సులో సుళ్ళు తిరుగుతున్న బాధను పంచుకో వాలన్నా ఎవ్వరూ లేరు. చివరకు నేను మృతిచెందినా నా కోసం ఒక్క కన్నీటి బొట్టు రాల్చేందుకు కూడా ఎవ్వరూ లేరు. ఎందర్ని చంపారో, ఎంత మందిని ఉరితీశారో భగవంతుడికి మాత్రమే ఎరుక** అని గుండెల్ని తన్నుకొస్తున్న బాధను మిర్జా అసదుల్లా గాలిబ్ వెల్లగక్కారు.

ఆంగ్లేయుల దౌష్ట్యాన్ని కళ్ళారా చూసిన కవి గాలిబ్ ఆ క్షోభ నుండి సంవత్సరాల తరబడి బయటపడలేకపోయారు. ఢిల్లీ వైభవ ప్రాభవాల గురించి ఎవరు ఆయన వద్ద ప్రస్తావించినా, 1857కు పూర్వం నాటి ఢిల్లీని వర్ణిస్తూ, 1857లో ఆంగ్ల సైనికులు నగర వాసుల మీద సాగించిన క్రూరమైన హత్యాకాండను, ఆనాడు ఢిల్లీలో యధేచ్ఛగా సాగిన విధ్వంసకాండను హృదయ విదారకంగా వివరిస్తూ లేఖలు రాయసాగారు. అలనాటి ప్రముఖులు, ప్రజలు ఎదుర్కొన్న భయంకర పరిస్థితుల గురించి, ఆంగ్లేయులు సాగించిన మహాపాతకం గురించి, ఆ ఘోరకలి నుండి బ్రతికి బట్టకట్టిన ప్రముఖుల–పండితులను పేరు పేరున పేర్కొంటూ, సంవత్సరాల పర్యంతం వారి పరిస్థితులు ఎంత దుర్భరంగా ఉన్నాయో ఆ వివరాలను, ఆయనను వదలక వెంటాడుతున్న 1857 నాటి భయానక సంఘటనల గురించి పూసగుచ్చినట్టుగా వివరిస్తూ 1860 ఫిబ్రవరి 16న తన కుమారునికి రాసిన లేఖలలో మహాకవి రక్తాశ్రువులను గుమ్మరించారు. ('Pradham

a Swadheenatha Samgram ' , Andnd Prakash, **Aajkal**, Monthly (Hindi), Lucknow, May 2007, P.p 61-63)

ఢిల్లీ పునరాక్రమణ తరువాత ఏవరూ ఏమిటన్న వివక్ష లేకుండా కన్పించిన వారినందర్నీ కాల్చి చంపిన ఆంగ్ల సైన్యాలు మియా ముహమ్మద్ అమీర్ పంజకుష్, మౌల్వీ ఇమాం బక్ష్ లాంటి ప్రముఖ విద్వాంసులను నిర్దాక్షిణ్యంగా చంపారు. పండితులు, కవులు– రచయితలు, విద్వాంసులు, కులీన వర్గాలకు నివాస ప్రాంతమైన కచ్చా చలాన్‌లో ఆంగ్ల సైన్యాలు రక్తం పారించాయి. నగరంలోని సంపన్నుల నివాస ప్రాంతమైన కచ్చా చలాన్ మీద కన్నుపడిన ఆంగ్ల సైనికులు, అధికారులు, అధికారులచే ప్రత్యేకంగా



చంపుతామని బెదిరిస్తూ ప్రజలనుదోచుకుంటున్న ఆంగ్లేయుల తొత్తులు

నియమించబడిన ఏజెంట్లు గృహస్తుల పట్ల అత్యంత దారుణంగా వ్యవహరించారు. ఈ అఘాయిత్యాలను ఊహించిన నగరవాసులు తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకునేందుకు, అఘాయిత్యాలకు తమ కుటుంబ మహిళలు బలికాకుండేందుకు వారి కుత్తుకలను తమ ఖడ్గాలతో కోసివేసి, ఆ తరువాత తమ ఆయుధాలతో తమ్ముతాము అంతం చేసుకున్న సంఘటనలు అసంఖ్యాకంగా జరిగాయి. ఈ కారణంగా కచ్చా చలాన్ ప్రాంతంలోని గృహాలు రక్త సిక్తమయ్యాయి. రహదారుల మీద రక్తపుటేరులు పారాయి. కచ్చా చలాన్‌లోని ఏ ఇల్లు కూడా గృహస్తుల రక్తపు చారికల బారి నుండి మినహాయించబడలేదని

ఆంగ్లేయాధికారులు స్వయంగా తమ గ్రంథాలలో రాసుకున్న వివరాలను **The Great Mutiny** లో రచయిత Christopher Hibbert పలు చోట్ల ఉటంకించాడు.

ఈ విధంగా ఒక్క ఢిల్లీలో మాత్రమే సాగలేదు. ఆంగ్లేయులకు వ్యతిరేకంగా ఎదురు నిలబడిన ప్రతి వ్యక్తి, ప్రతి గ్రామం, ప్రతి పట్టణంలో ఇటువంటి దుర్మార్గాలు జరిగాయి. **మేము అన్ని చోట్లా పద్దాం. ఎదురు తిరిగేవారిలా ఏమాత్రం కన్పించినా స్థానికులను నరికేశాం. ఈ ట్రిప్పులను మేము బాగా ఎంజాయ్ చేశాం** అని ఆనాటి సంఘటనలలో పాల్గొన్న ఆంగ్ల సైనికులు తమ కుటుంబీకులకు ఇక్కడి సంగతులు తెలుపుతూ రాసిన లేఖలలో పేర్కొన్నారని **Indian Mutiny** గ్రంథంలో Charles Ball ఆ వివరాలను పలుచోట్ల వివరించాడు.

## శవాల దిబ్బగా మారిన ఢిల్లీ

ఢిల్లీ నగరవాసుల మీద ఆంగ్ల సైన్యాలు సాగించిన పైశాచిక దమనకాండ వలన నగరవాసులలో అత్యధికులు నిహతులయ్యారు. నగరంలో అతి భయానకంగా సాగిన హత్యాకాండ ఫలితంగా ఢిల్లీ నగరంలో ఏమూల చూసినా, ఏ వీధిలో చూసినా శవాలతో నిండిపోయి రాకపోకలకు కూడా వీలుకాలేదు. నగరంలో మృతదేహాలు గుట్టలు గుట్టలుగా దర్శనమిచ్చాయి. నగరంలోని వీధుల్లో పడిఉన్న మృతదేహాలను కదిలించే వారు లేకపోవటం, మృతులకు దహన సంస్కారాలు, అంత్యక్రియలు జరిపించేందుకు ఎవ్వరూ కానరాకపోవటం వలన ఢిల్లీ నగరం పూర్తిగా శవాల దిబ్బగా మారింది.

1857 పోరాటంలో పాల్గొన్న ఆంగ్లేయాధికారి Field Marshall Lord Roberts ఈ విషాద చిత్రాన్ని వర్ణించాడు. Lord Roberts కాన్పూరు నుండి తన బలగాలను ఢిల్లీకి స్వయంగా నడిపించాడు. బలగాలతో ఢిల్లీ నగరంలో ప్రవేశిస్తున్నప్పుడు కన్పించిన దారుణ దృశ్యాలను చూసిన ఆ ఆంగ్లేయసైనికాధికారి కూడ అమితంగా చలించి పోయాడు. ఆయన కళ్ళారా చూసిన ఢిల్లీ నగరాన్ని, ఢిల్లీ నగర ప్రజల దుస్థితిని 1857 సెప్టంబరు 24న ఉన్నతాధికారులకు రాసిన నివేదికలో ఈ విధంగా పేర్కొన్నాడు :

That march through Delhi in the early morning light was a gruesome proceeding. Our way by the Lahore Gate from Chandani Chowk led through a veritable city of the dead; not a sound was to be heard but the falling of our footsteps; not a living creature was to be seen. Dead

bodies were strewn about in all directions, in every attitude that the death-struggle had caused them to assume, and in every stage of decomposition. We marched in silence or involuntarily spoke in whispers, as though fearing to disturb those ghastly remains of humanity. The sights we encountered were horrible and sickening to the last degree. Here dog gnawed at an uncovered limb, there a vulture disturbed by our approach from its loathsome meal, but too completely gorged to fly, fluttered away to a safer distance. In many instances, the positions of the dead bodies were appallingly life-like. Some with their arms uplifted as if beckoning, and, indeed, the whole scene wired and terrible beyond description. Our horses seemed to feel the terror of it as much as we did, for they shook and snorted in evident terror. The atmosphere was unimaginably disgusting, laden as it was with the most noxious and sickening odors. (**Muslims in India**: S. Abul Hasan Ali Nadwi, P. 109)

పండిత ప్రముఖులు, సంపన్నులు నివసించే కచ్చా చలాన్ ప్రాంతంలో జరిగిన దారుణాలు వర్ణించనలవి కావు. ఆంగ్ల సైనికులు రోజుల తరబడి సాగించిన కిరాతకాలతో తమ రాక్షస దాహం తీరక ఆ ప్రాంతానికి చెందిన ప్రముఖులతోపాటుగా మరో14 వందల మంది స్త్రీ-పురుషులను రాజ్‌ఘాట్ వద్దకు తీసుకునిపోయి సామూహికంగా కాల్చి చంపారు. ఆ మృతదేహాలను యమునా నదిలో విసిరేశారు. ఈ పరిస్థితిని ముందుగానే పసిగట్టిన ఆడపడుగులు కచ్చా చలాన్‌లోని బావులలో దూకి ప్రాణత్యాగాలు చేశారు. ఈ విషాదంలో పిల్లలు, పెద్దలు అను తేడా లేకుండా పోయింది. ఈ విధంగా ఏర్పడిన శవాల గుట్టల విషాదాలన్నిటిని స్వయంగా చూసిన మహాకవి గాలిబ్ తన **దాస్తాన్-యే-గదర్** గ్రంథంలో పేర్కొంటూ **ఏమని రాయను ? ఎన్నని రాయను? నా కలం ఇంకా రాయలేకపోతుంది** అంటూ విలవిల్లాడారు.

ఆంగ్లేయ సైనికుల చేతుల్లో హతమైన స్త్రీ-పురుషుల వివరాలు పూర్తిగా లేవు. ఆంగ్ల సేనల అరాచకాలకు తట్టుకోలేక నగరవాసులు చాలా మంది నగరం వదిలి వెళ్ళి పోయారు. ఆ విధంగా వెడుతున్న వార్ని కూడా వదల కుండా వెంటాడి మరీ వధించారు. నగరం నుండి బయటపడే వీలు లేక ఉండిపోయిన మహిళల మీద అఘాయిత్యాల నుండి, ఆంగ్లేయుల రాక్షసత్వం నుండి తమ్ముతాము కాపాడుకునేందుకు మహిళలు

ఆత్మాహుతికి పాల్పడ్డారు. స్వయంగా తమనుతాము తగులబెట్టుకున్నారు. ఈ విషయాలను Martin Montgomey తన గ్రంథం **The Indian Empire** లో పలు నివేదికలను, గ్రంథాలను ఉటంకిస్తూ సవిరంగా పేర్కొన్నాడు.

## యథేచ్ఛగా సాగిన విధ్వంసం-దోపిడి

ఆంగ్లేయాధికారులు స్వయంగా బయలుదేరి నగరంలోని సంపన్నుల గృహాలను గుర్తించి మరీ ఆ గృహాలలోకి జొరబడి దోచుకున్నారు. నగరం వదలి వెళ్ళిన నగర ప్రముఖుల, సంపన్నుల గృహాలలో దాచి పెట్టబడిన సంపదను వెలికి తీయడానికి ప్రత్యేకంగా శిక్షణ పొందిన వ్యక్తుల బృందాలను కూడా ఆంగ్లేయాధికారులు ఉపయోగించారు. ఆ నిపుణుల సహాయంతో నగరంలోని భవంతులన్నిటిని కూలగొట్టారు. భవనాల నేలను పూర్తిగా తవ్వివేసి నేలమాగళిని సైతం పెళ్ళగించారు.

అంతటితో సరిపెట్టుకోకుండా తమ ప్రమేయం లేకుండా 'ప్రైజ్ ఏజెంట్స్' అను ప్రత్యేక వ్యక్తులను కూడా ఆంగ్లేయులు నియమించారు. ఈ ప్రైజ్ ఏజెంట్స్ కంపెనీ బలగాల సహాయంతో నగరంలో స్వైరవిహారం చేశారు. ఆంగ్ల సైనికుల కంటే భయానకంగా వ్యవహరిస్తూ సంపన్నులను, సామాన్యులను హింసించి, తుపాకులతో అదిలించి, చంపేస్తామని బెదిరించి మరీ గుప్త సంపదను వెలికి తీయించారు.

ఆ సమయంలో తిరుగుబాటు యోధులతో యుద్ధం చేయటం కంటే ప్రజల మీద విజృంభిస్తూ అమానవీయ చర్యలకు పాల్పడుతున్న సైనికులను నిరోధించటం ఆంగ్లేయాధికారులకు కష్టతరమైంది. పలు విధ్వంసకర చర్యలకు పాల్పడుతున్న ఆంగ్లసైన్యాలను ఆపేందుకు ప్రత్యేకంగా గస్తీ దళాలను కూడా నియమించాల్సి వచ్చింది. స్వంత సైనికుల స్వైరవిహారాన్ని ఆపేందుకు మరింత ముందుకు వెళ్ళి విధులలో లేని సైనికులు సైనిక స్థావరాలలో మాత్రమే ఉండాలని, అలా కాకుండా బయట నగరంలో ఎక్కడ కన్పించినా వారిని తీవ్రంగా శిక్షించటం మాత్రమే కాదు ఉరిశిక్షలు కూడా తప్పవని తీవ్రంగా హెచ్చరించాల్సిన పరిస్థితి వచ్చింది.

ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలు పురోగమించే కొద్దీ ప్రతిచోట దోపిడి, వినాశకర కార్యాలు ముమ్మరంగా సాగాయని 1857నాటి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం గురించి వ్యాసాలు రాసిన ఫెడ్రిక్ ఏంగెల్స్ కూడా వివరించాడు. ఈ విధ్వంసకర చర్యలు

అంతర్జాతీయ న్యాయసూత్రాలకు, సహజ న్యాయసూత్రాలకు భిన్నంగా సాగడంతో, 1858 మే 25న **న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్‌లో** ఫ్రెడ్రిక్ ఏంగెల్స్ రాసిన వ్యాసంలో **అసలు విషయం మేమిటంటే, ఇంతటి పశుప్రాయ మైన సైన్యం ఒక్క బ్రిటన్‌లో తప్ప యూరప్‌లోగాని, అమెరికాలోగాని మరెక్కాడా లేదు. దోపిడీ, అత్యాచారం, ఊచకోత-ఈ ఘోరాలు ఇతరత్రా పూర్తిగా స్వస్తి చెప్పినప్పటికీ-ఇవి మాత్రం బ్రిటీష్ సైన్యానికి అశ్రుతంగా** సంక్రమిస్తూన్న ప్రత్యేక సౌకర్యాలూ, సహజమైన హక్కులే...ఇకపోతే మధ్యయుగాల **నాటి అనవాయితీ** ప్రకారంగా దాడి చేసి స్వాధీన పర్చుకున్న నగరాన్ని కొల్లగొట్టే **హక్కు ఇతరత్రా అన్నిదేశాల్లో నిషేధించబడినప్పటికీ, బ్రిటీష్ సైన్యంలో మాత్రం నేటికీ**



ఉరికంబాలు చాలక వృక్షాలకు ఉరితాళ్లను కట్టి తిరగబడిన ప్రజలను ఉరితీస్తున్న దృశ్యం

**నియమం తప్పకుండా యుధావిధిగా అమలు జరుపబడుతోంది**, అని పేర్కొన్నాడు. (**ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం,1857-1859,** మార్బ్-ఏంగెల్స్, ప్రగతి ప్రచురణాలం, మాస్కో, 1857 -1859, పేజి.166)

సంపన్నులు - సామాన్యులు అని కాకుండా గృహాలలో జొరబడి స్వయంగా దోపిడికి పాల్పడుతున్న అధికారులలో ఇరువురు ప్రజల చేతిలో హత్యకు కూడా గురయ్యారు. ఆంగ్ల సైనికులు స్వైరవిహారం చేస్తున్న సందర్భంలో ఆంగ్లేయాధికారులకు వీసమెత్తు నష్టం కల్గించినా ఎదురయ్యే భయానక పరిస్థితుల గురించి తెలిసి ఉండి

కూడా అధికారుల హత్యకు ప్రజలు సిద్ధమయ్యారంటే, ఆ అధికారుల పట్ల వారెంతగా విసిగిపోయారో అవగతం చేసుకోవచ్చు. అధికారుల హత్యతో మరింతగా రెచ్చిపోయిన ఆంగ్లేయ సైనికుల క్రూరత్వాన్ని కచ్చా చలాన్‌లో బ్రతికి బట్టకట్టినవారు చవిచూడాల్సి వచ్చింది. ఈ పరిస్థితి ఎంతగా చేయిదాటి పోయిందంటే, ప్రథమ స్వాతంత్ర సంగ్రామ జ్వాలలు పూర్తిగా సమసిపోక ముందే దోపిడీకి సిద్ధపడుతున్న సైనికులను నిరోధించేందుకు, ప్రస్తుతం సాగుతున్న అత్యంత క్రూర స్వైరవిహారం ఆగి పోయేంతవరకూ యుద్ధ చర్యలను స్వస్తి చెబుతున్నట్టు ఆంగ్లేయ సైనికాధికారి జనరల్ కాంబెల్ ప్రత్యేంగా ఉత్తర్వులు జారీచేయాల్సి వచ్చింది.

## క్రౌర్యానికి ప్రతిరూపమైన ఆంగ్లేయాధికారి

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో స్వదేశీ యోధుల పట్ల ప్రతి ఆంగ్లేయాధికారి రాక్షసంగా వ్యహరించాడు. ఈ విధంగా వ్యవహరించిన అధికారులలో జనరల్ నీల్ తరువాత స్థానం కెప్టన్ హడ్సన్ దే. ప్రజల నుండి ప్రభువుల వరకు, స్వదేశీ యోధుల నుండి ముహమ్మద్ బాకర్ లాంటి కలం యోధుల వరకు ఎవ్వర్నీ వదలకుండా హత్యా కాండకు గురిచేసిన రాక్షసుడితడు. **ప్రపంచ నాగరికులలో ఉత్తములమ**ని చెప్పుకునే ఆంగ్లేయులలోని అనాగరికతకూ, క్రూరత్వానికీ ప్రతిరూపమీ '**మహా నాగరికుడు**' !

చక్రవర్తి బహదూర్ షా జఫర్‌ను అరెస్టు చేయడానికి హుమాయూన్ సమాధుల వద్దకు సాయుధ బలగాలతో వెళ్ళిన అతడు సమాధుల నిర్మాణం జరిగిన భవంతిలోకి ప్రవేశించినా చక్రవర్తిని అరెస్టు చేయడానికి సాహసించలేక, చక్రవర్తి, ఆయన కుటుంబీకుల ప్రాణాలకు రక్షణ కల్పిస్తామని వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానాన్ని విశ్వసించి స్వయంగా బయటకు వచ్చిన జఫర్‌ను అరెస్టు చేశాడు. ఆ తరవాత జఫర్‌కు ఇచ్చిన మాటను తప్పి మొగల్ కుటుంబీకులందర్ని మృత్యువాతకు గురిచేసిన హడ్సన్ ఆ తరువాత మొగల్ రాకుమారులను నడివీధిలో నిరాయుధుల్ని చేసి కాల్చి చంపిన ఘన చరిత్రగలవాడు. ఆ రాక్షస ఆంగ్లేయాధికారి క్రౌర్యం గురించి ఆంగ్ల చరిత్రకారుడొకడు ఈ విధంగా వ్యాఖ్యానించాడు :

**మానవుని బాధ అతనిలో ఎట్టి ఆవేదనా రేకెత్తించదు. రక్తపాతం అతనిలో ఏమాత్రం నొప్పి కల్గించదు. ప్రాణం తీయడం వల్ల అతనికి మానసిక బాధ ఏమీ**

**ఉండదు...అతని ఆనందమల్లా ఓడిపోయి పరారవుతున్న వార్ని నరకడం, పరాజితుల ఆస్తులను కొల్లగొట్టడం**, మాత్రమే. (**భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్ర**, ప్రచురణ కృష్ణా జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, విజయవాడ, 1984. పేజీ. 24)

ఆనాడు వివిధ స్థాయిలలో తిరుగుబాటులో పాల్గొన్న వారి మీద దేశమంతటా పలు ప్రాంతాలలో పలు ఆరోపణలను మోపి కంపెనీ పాలకులు వివిధ దుర్మార్గపు చర్యలను తీసుకున్నారు. ప్రజల ఆస్తులను జప్తు చేశారు. తిరుగుబాటుకు సహకరించిన, తిరుగుబాటులో పాల్గొన్న వారి కుటుంబీకులను చెరబట్టారు. ఆ కుటుంబీకుల ఆస్తిపాస్తులను ధ్వంసం చేశారు. గృహాలను కూలగొట్టి వారిని నిరాశ్రయులను చేశారు. స్వస్థలాల నుండి తరిమి కొట్టారు. ప్రజలను మూక్మడిగా నిర్బధించి అప్పటికప్పుడు విచారణలు పూర్తి చేసి బహిరంగంగా కఠిన శిక్షలు విధించారు. ఆ శిక్షలను భయానక చిత్రహింసలు పెడుతూ బహిరంగంగా అమలు చేశారు.

## ముస్లింల పట్ల రగిలిన విద్వేషాగ్ని

అజేయులమన్న అహంకారంతో అంతులేని అధికారాన్ని, స్వదేశీయుల మీద హద్దులు దాటిన ఆధిపత్యాన్ని సాగిస్తున్న ఆంగ్లేయులకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వీరులు పెద్ద సవాలు విసిరారు. ఈ సవాలుతో ఆంగ్లేయులు ముస్లింల మీద పూర్తిగా పేట్రేగి పోయారు. ఈ తిరుగుబాటుకు ప్రధాన ప్రేరణశక్తి ముస్లింలని స్థిరాభిప్రాయానికి వచ్చిన కంపెనీ సైనికులు, అధికారులు ప్రతీకార జ్వాలతో రగిలిపోయారు. ఈ సందర్భంగా హిందూ-ముస్లిం ఉమ్మడి వారసత్వాన్ని ఛిన్నం చేయాలన్న దుష్ట సంకల్పంతో ఆంగ్లేయులు వ్యవహరించడం వలన ఈ ప్రతికార జ్వాలలకు ప్రధానంగా ముస్లిం ప్రజానీకం బలయ్యింది. ప్రజల మీద విరుచుకుపడ్డ ఆంగ్లేయులు ఈ సందర్భంగా తమ సన్నిహితులుకు రాసుకున్న లేఖలలో, ఉన్నతాధికారులకు పంపుకున్న నివేదికలలో ముస్లిం యోధుల పట్ల వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఆనాటి వారి మనస్థితిని వెల్లడి చేస్తుంది.

ప్రతి ముస్లింను ఆంగ్లేయాధికారులు **తిరుగుబాటుదారు**నిగా సరిగణించారు. తమ దారిలో ఎదురుపడ్డ ప్రతి ఒక్కరిని నిర్బంధించటం, ఆ వ్యక్తి హిందువా? లేక ముస్లిమా? అని ప్రశ్నించటం-విచారించటం, ఆ అభాగ్యుడు కనుక ముస్లిం అయినట్టయితే

ఎటువంటి ప్రాథమిక విచారణ కూడా లేకుండా అక్కడికక్కడే ఆ క్షణాన్నే కాల్చి చంపడం ఆంగ్లేయాధికారులకు ఆనవాయితీగా మారింది.

(An English officer had made it a principle to treat every Muslim as a rebel. He would enquire from every one he saw, If he was a Hindu or a Muslim, and would shoot him dead right there if he turned out to be a Muslim' - Quoted in S. Abul Hasan Ali Nadwi, **Muslims in India**, P. 110)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో స్వయంగా పాల్గొన్న ఆంగ్లేయాధికారి లార్డ్ రాబర్ట్స్ (Lord Roberts) తన చెల్లెలు Harriet కు లేఖ రాస్తూ ఆ లేఖలో తిరుగుబాటు యోధులను ఫిరంగులకు కట్టి కాల్చి వేసిన దృశ్యాలను వివరించాడు. తిరుగుబాటు దారుల పట్ల, ప్రధానంగా ముస్లింల పట్ల ఆంగ్ల సైన్యాలు సాగించిన పైశాచికకాండను పూర్తిగా సమర్థించుకుంటూ, ముస్లింల పట్ల అతనిలోనున్న కసీ, ద్వేషాలను వ్యక్తం చేశాడు. అటువంటి ఒక లేఖలో **భగవంతుని దయవలన ఆంగ్లేయులు భారతదేశానికి ఇంకా యజమానులేనన్న విషయాన్ని ధూర్తులైన ముస్లింలకు తెలియచేయటం** తమ ఉద్దేశ్యమని పేర్కొన్నాడు.

('The Death that seems to have the greatest effect is being blown from a gun. It is rather a horrible sight, but in these times, we can not be particular.' The purpose of this 'business' was to show 'these rascally Musalmans that, with Gold's Help, English will still be the masters of India' - **Rise of Muslims In Indian Politics**, Rafiq Zakaria, Somaiya Publications, New Delhi, 1986, P. 7)

బ్రిటీష్ అధికారులు తమ సంబంధీకులకు రాసిన లేఖలలో అంతటి క్రూరత్వాన్ని వ్యక్తంచేశారంటే నిజంగా తిరుగుబాటుదారులతో వారు ఇంకా ఎంత రాక్షసంగా వ్యవహరించి ఉంటారో మనం ఊహించవచ్చు. ఆనాడు ఆంగ్లేయులకు ముస్లింల మీద కసీ, ద్వేషం ఎంతగా పెచ్చరిల్లిందంటే, ముస్లింల మత మనోభావాలకు తీవ్ర విఘాతం కల్గిస్తూ వారిని హేళన చేస్తూ మానసికంగా మరింత క్షోభకు గురి చేసేందుకు కడు నీచమైన చర్యలకు కూడా పాల్పడ్డారు. పట్టుబడిన ప్రతి ముస్లింను అవమానకర పద్ధతులలో అంతం చేశారు. వారి మత మనోభావాలకు తీవ్రమైన విఘాతం కలిగేలా ప్రవర్తించారు.

పట్టుబడిన **ముస్లింలను** బ్రతికుండగానే పంది **తోలుకు** కుట్టారు. పంది మాసం వాళ్ళ **నోళ్ళల్లో కుక్కారు...గాయపడిన ఖైదీలను బతికి ఉండగానే కాల్చేశారు.** (భారత స్వాతంత్ర్య **సంగ్రామ చరిత్ర,** ప్రచురణ కృష్ణా జిల్లా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం, విజయవాడ, 1984, పేజి. 26)

## తాజ్‌మహల్ కూలగొట్టాలన్న దుష్టాలోచన

అనూహ్యంగా సాగిన స్వదేశీ యోధుల పోరాటం, ఆంగ్లేయుల పట్ల స్థానికులు వ్యక్తం చేసిన ఆగ్రహం ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారుల అభిజాత్యానికి పెద్ద సవాలు



మరణించిన వారి నుండి కూడా అందినంత దోచుకుంటున్న ఆంగ్లేయాధికారులు

విసిరింది. ఆంగ్లేయులలో ప్రతికార జ్వాలను మరింతగా మండించింది. ఆ కారణంగా భారతీయుల మీద సాగిన ప్రతీకారచర్యలలో భాగంగా ముస్లింల ఆర్థిక–ఆధ్యాత్మిక వ్యవస్థలను నాశనం చేయటమే కాకుండా ముస్లిం ప్రభువులు నిర్మించిన కట్టడాలను కూడా విధ్వంసం చేయాలన్న నిర్ణయానికి వచ్చారు.

ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారి విలియం రస్సెల్ తిరుగుబాటులో పాల్గొన్న ముస్లింల గురించి వ్యాఖ్యానిస్తూ **విష్ణువును–శివుడ్ని ఆరాధించే హిందువుల కంటే ముస్లింలంటే తనకు బద్ధ శత్రుత్వమని** పేర్కొన్నాడు. **ముస్లింలు తమ పరిపాలనకు**

ఎంతో ప్రమాదకారులని ప్రకటించాడు. అంతటితో ఆగని ఆ అధికారి **ముస్లింల ఆచార వ్యవహారాలకు విఘాతం కల్గించి ప్రార్థనాలయాలను నేలమట్టం చేసినట్టయితే అది అటు క్రైస్తవ విశ్వాసానికి, ఇటు బ్రిటీషర్లకు చాలా మంచిదని** కూడా సలహా ఇచ్చాడు.

(Our antagonism to the followers of Muhammed is far stronger than between us and the worshippers of Shiva and Vishnu. They are unquestionably more dangerous to our rule...If we could eradicate the traditions and destroy the temples of Muhammad by one vigor's efforts it would be well for the Christian faith and for the British. - **Rise of Muslims in Indian Politics**, Rafiq Zakaria's, Somaiya Publications, Bombay, 1986, P.6)

ఈ ప్రభావంతో అప్పట్లో ఢిల్లీ నగరంలోని చరిత్ర ప్రసిద్ధి చెందిన జుమా మస్జిద్, ఆగ్రాలోని ప్రపంచ ఏడు వింతలలో ఒకటైన తాజ్ మహల్‌ను కూలగొట్టాలని అతగాడు ప్రతిపాదించాడు. తాజ్ మహల్ ను పూర్తిగా విధ్వంసం చేస్తే అందులో లభించు చలువ రాళ్ళను విక్రయించాలని, తద్వారా ఆర్థికంగా కూడా చాలా ఆర్జించవచ్చని పథకం వేశాడు. ఈ చర్య వలన తమకు లాభం సంప్రాప్తించటం మాత్రమే కాకుండా ఈ చర్యల వలన ముస్లింల స్థితిగతులు ఎంత దిగజారిపోయి ఉన్నాయో వారికి నిరంతరం గుర్తు చేయవచ్చని విలియం రస్సెల్ లాంటి అధికారులు ఆలోచనలు చేసి ఆ దిశగా విఫల ప్రయత్నాలు చేశారు. (Rise of Muslims in Indian Politics, Rafiq Zakaria : P.7)

ఆనాడు విలియం రస్సెలు మనస్సులో మెదిలిన ఆలోచనలే ఇరత ఆంగ్లేయ అధికారులలో కూడా కలిగాయి. రస్సెల్ తాజ్‌మహల్, జుమా మస్జిద్ లాంటి ప్రముఖ చారిత్రక కట్టడాల మీద దృష్టి సారించగా హ్యూస్ చెసిస్టర్ (Hugh Chishester) లాంటి సైనికాధికారులు ముస్లింల ప్రార్థనాలయాలన్నిటిని విధ్వంసం చేసి పూర్తిగా రూపుమాపాలని అనుకున్నారు. ఢిల్లీలోని ప్రముఖ మసీదులతోపాటు చిన్నా చితకా ఇతర మసీదులన్నిటిని కూడా ధ్వంసం చేయాలని సంకల్పించారు. హ్యూస్ చెసిస్టర్ తన కుటుంబీకులకు ఒక లేఖ రాస్తూ **గత మూడు రోజుల నుండి ఈ విలన్లను కాల్చి చంపటం తప్ప మాకు వేరే పనిలేదు. నిన్నటి రోజున మూడు నుండి నాలుగు వందల మందిని కాల్చేశాము. నగరంలో చాలా అందమైన మసీదులు ఉన్నాయని, ఆ మసీదు లన్నిటిని మొత్తంగా కూల్చివేయడం చూడాలని ఉంది నాకు** అని చెప్పుకున్నాడు.

(' There has been nothing but shooting these villains for past three day's Some 300 or 400 were shot yesterday...There are several mosques in the city most beautiful to look at. But I should like to see them all destroyed.' - **The Great Mutiny**, Christopher Hibbert, Penguin Books, India, 1980 P. 318)

ఈ విధంగా ముస్లింలను తమ ప్రధాన శత్రువులుగా భావించిన ఆంగ్లేయులు ఈ గడ్డ మీద నుండి ముస్లింలను భౌతికంగా రూపుమాపటం మాత్రమే కాకుండా ఆధ్యాత్మికంగా కూడా అన్ని విధాలా బలహీనపర్చాలని ఆలోచనలు సాగించారు. ఆ మేరకు పలు పథకాలను రూపొందించారు. శతవిధాలుగా ప్రయత్నించారు. (**Rise of Muslims in Indian Politics,** P.7)

## ముస్లింలు 'గర్విష్టులు..క్రూరులు'

బెంగాల్ సివిల్ సర్వీసెస్‌లో ఉన్నతాధికారిగా బాధ్యతలు నిర్వహించిన Henry Harrington Thomas ముస్లింలకు వ్యతిరేకంగా చాలా తీవ్రమైన అభిప్రాయాలను వ్యక్తంచేశాడు. ఆనాడు ఆంగ్లేయాధికారులలో ముస్లిం మీద ఉన్న అంతటి కసీ ద్వేషానికి కారణం ఏంటో, ముస్లిం పట్ల ఉన్న వ్యతిరేకత స్థాయి ఏపాటిదో అర్థం చేసుకునేందుకు హెన్రీ హ్యారింగ్‌టన్ థామస్ వెల్లడించిన అభిప్రాయాలు చాలా వరకు ఉపయోగపడ్తాయి.

1858లో Henry Harrington Thomas 'Late Rebellion in India an Our Future Policy' అను శీర్షికతో ఒక కరపత్రం రాశాడు. ఆ కరపత్రంలో **ప్రథమ ఖలీఫా నుండి ప్రస్తుత ముస్లింల వరకు అంతా గర్విష్టులు, అసహనపరులు మరియు క్రూరులు. ఏ మార్గం ద్వారానైనా ఆధిపత్యం లక్ష్యంగా మహ్మదీయులు పనిచేస్తారు. క్రైస్తవుల పట్ల నిరంతరం విద్వేషాన్ని ప్రోత్సహిస్తుంటారు. పర మతస్థుల పాలనలో వారెప్పుడూ కూడా మంచి పౌరులుగా మసలుకోలేరు** అంటూ ముస్లింల పట్ల తన విద్వేషాన్ని వెల్లగ్రక్కాడు.

ఆంగ్లేయులలో ముస్లింలకు వ్యతిరేకంగా స్థిరీకరించబడిన అభిప్రాయాల మూలంగా తిరుగుబాటు యోధులతోపాటుగా తిరుగుబాటులో పాల్గొనకున్నా, తిరుగు బాటుకు సహకరించకున్నా, అసలు తిరుగుబాటు గురించి ఏమాత్రం తెలియకున్నా కూడా గ్రామాలలో నివసిస్తున్న ముస్లింలు ఇతర ప్రజలతోపాటుగా పెద్ద సంఖ్యలో ఆంగ్ల సైన్యాల దుర్మార్గాలకు బలయ్యారు.

మహాకవి గాలిబ్ రాసిన లేఖలలోనూ , ఈస్ట్ ఇండియా కంపెనీ ఉన్నతాధికారి Moinuddin Hasan రాసిన తన గ్రంథం **Gadar 1857**లోనూ, తిరుగుబాటు సమయంలో తమ భవంతుల దర్వాజాలను బిగించుకుని, తమ వీధుల ద్వారాలను కూడా పూర్తిగా బంద్ చేసి అటు ఆంగ్లేయులకు గాని ఇటు తిరుగబడిన యోధులకు కాని ఏమాత్రం సహాయం-సహకారం అందించకుండా తమమానాన తాము మే 11 నుండి సెప్టెంబరు 20 వరకు గడిపిన ముస్లిం కుటుంబాలు కూడా ఆంగ్ల సైనికుల దాష్టీకాల బారిన పడక తప్పలేదన్న సమాచారం పుష్కలంగా ఉంది.

# ఫిరంగి గొట్టాలకు కట్టి పేల్చివేతలు

స్వాతంత్ర్య సంగ్రామ యోధులను అంతం చేయడానికి ప్రధానంగా మూడు విధానాలను ఆంగ్ల సైన్యాలు అనుసరించాయి. అవి ఉరితీతలు, ప్రత్యేక దళాల చేత తుపాకులతో కాల్చి చంపటం, ఫిరంగులకు కట్టి పేల్చివేయటం. ఆంగ్ల సేనలకు ఆహుతైన తిరుగుబాటు వీరులను అటు కాల్చివేసేందుకు, ఇటు ఉరితీతలకు, ఇంకోకవైపున పేల్చివేతలకు సరిపడా సామగ్రి, ఉరికంబాలు, ఫిరంగులు అందుబాటులో లేనందున జట్లు జట్లుగా యోధులను ఆంగ్లేయులు బలిచ్చారు.

ఈ విధంగా తిరుగుబాటు యోధులను తుదముట్టించిన దుస్సంఘటనలు పెషావర్, అలహాబాద్, ఢిల్లీ, ఫిరోజ్‌పూర్, ఫతేపూర్, కాన్పూరు, లక్నో, హైదరాబాద్ తదితర ప్రాంతాలలో పెద్ద ఎత్తున జరిగాయి. అత్యధిక సంఖ్యలో తిరుగుబాటు యోధులను ఫిరంగులకు కట్టి పేల్చివేశారు. తిరుగుబాటు పూర్తి స్థాయిలో విస్తరించక ముందే ఆంగ్లేయుల ఆజ్ఞలు ఖాతరు చేయకుండిన స్వదేశీ సిపాయిలను ఫిరంగి గొట్టాలకు కట్టి పేల్చివేయడంతో ఆరంభించిన ఆంగ్ల సైనికాధికాలు తిరుగుబాటును అణిచి వేశాక ఆ దుష్కార్యాన్ని మరింత భారీ స్థాయిలో కొన సాగించారు.

ప్రజల మీద విరుచుకు పడ్డ ఆంగ్ల సైనికులు, తమకు పట్టుబడిన వారిలో ప్రభుత్వ వ్యతిరేకత వ్యక్తం చేసిన వారి మీద పేల్చివేతలకు పాల్పడ్డారు. ఈ కార్యక్రమం భారీ సంఖ్యలో పెషావర్, ఫిరోజ్‌పూర్, కాన్పూరు, లక్నో, ఔరంగాబాద్ తదితర ప్రాంతాలలో నిర్వహించారు. తిరుగుబాటు యోధులను జట్లు జట్లుగా తెచ్చి ఫిరంగులకు కట్టి పేల్చివేయటం ఆంగ్లేయాధికారులకు ఒక **వినోద** క్రీడగా మారింది. ఈ చర్యవలన మృత్యువాత పడిన యోధులు చివరి క్షణాలలో పడే బాధను, వ్యథను, ఫిరంగులతో

పేల్చివేయటం వలన యోధుల శరీర భాగాలు ఎంతెంత దూరంగా విసిరేయబడ్డాయో ఆతీరును, ఆ పేల్చివేతతో రక్తసిక్తమైన ఆ ప్రాంతం ఎంత భయానకంగా కన్పించిందీ, పేల్చివేత శిక్షను అనుభవించేందుకు ఆ స్థలంలో వేచి ఉన్న ఇతరులు పడుతున్న మనోవేదనా స్థితిని ఆంగ్లేయాధికారులు **క్రీడా వినోదంగా** వివరిస్తూ తమ కుటుంబీకులకు లేఖల ద్వారా, ఉన్నతాధికారులకు నివేదికల ద్వారా తెలుపుకున్నారు.

ఈ విధంగా తిరుగుబాటుయోధులను ఫిరంగి గొట్టాలకు కట్టి పేల్చివేసిన సంఘటన దృశ్యాన్ని నిజాం సంస్థానం పరగణాలోని బ్రిటీష్ సైనికాధికారి Captain Abbot తన లేఖలలో వివరంగా పేర్కొన్నాడు. ఆ లేఖ ప్రకారంగా : **'...ఒకడ్ని**



**తిరుగుబాటు యోధులను మూక్ముడిగా ఫిరంగులకు కట్టి పేల్చివేస్తున్న దృశ్యం.**

**ఫిరంగులతో పేల్చివేశాం. ఆ దృశ్యం ఎంతో భయంకరంగా ఉంది. వాడి తల దాదాపు 20 గజాల పైకి ఎగిరింది. వాడి రెండు చేతులు రెండు వైపులకు దాదాపు ఎనిమిది గజాల దూరంలో పడ్డాయి...పట్టుబడ్డ ఖైదీలలో ఇద్దర్ని పేల్చివేశాం...ఇంకా మేము చేయాల్సిన ఇటువంటి పని ఎంతో ఉంది...'** (నిజాం- బ్రిటీష్ **సంబంధాలు**, సరోజిని రెగాని, మీడియా హౌస్ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2002, పేజి. 326).

తిరుగుబాటు యోధులను ఫిరంగులకు కట్టి పేల్చిన దృశ్యాలను ఆంగ్ల పత్రిక **The Illustrated London News**, 1857 August 22 నాటి సంచిక ఈ విధంగా వివరించింది: **మర్దాన్‌లో** నలభై మంది **తిరుగుబాటుదారులను చంపిన తీరు చూడదానికి**

భయానకం. దోషుల కాళ్ళూ చేతులూ ఫిరంగి చక్రాలకు కట్టేసి వీపులు తుపాకి గొట్టాలకు ఆన్చారు. పేలుడుకు శరీరం రెండు ముక్కలైంది. ఉన్నవి పది ఫిరంగులే కావడం వల్ల ఖండిత శరీరాలను నాలుగుసార్లు తొలగించి కొత్తవారిని ఎక్కించాల్సి వచ్చింది...తిరగబడ్డ వారందరినీ అధికారులు కఠినంగా శిక్షించారు...51వ సైనికదళం సాయంత్రానికల్లా నాశనమైంది. మూడు గోతులు తవ్వి 700 మంది శవాలను పారేశారు. (**1857 మనం మరచిన మహాయుద్ధం**, ఎం.వి.ఆర్.శాస్త్రి, దుర్గాపబ్లికేషన్స్, హైదరాబాద్, 2007, పేజీ.1)

ఈ లేఖల ద్వారా, అధికారుల నివేదికల ద్వారా ఆంగ్లేయుల క్రూర క్రీడా వినోద మనస్తత్వంతో పాటుగా మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొన్న యోధులు మృత్యువుకు ఏమాత్రం భయపడకుండా ఎంతో ధైర్యంగా, మరెంతో నిబ్బరంగా ఉన్న వాస్తవం కూడా వెల్లడవుతుంది. విముక్తి పోరాటంలో పాల్గొన్న తాము సైనిక యోధులం కనుక తమను నేరస్థుల్లా ఉరితీయడం, ఫిరంగులతో పేల్చి వేయడం కాకుండా యుద్ధ వీరుల్లా తుపాకులతో కాల్చివేయమని మాత్రమే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు కోరారు తప్ప, వారెన్నడూ క్షమాభిక్షను గాని ప్రాణభిక్షను గాని అర్థించకపోవటం భారతీయులంతా అత్యంత విషాదంలో కూడా తమ పూర్వీకుల మాతృదేశభక్తి, ధైర్య సాహసాలను స్మరించుకుంటూ గర్వించదగిన అంశం.

## ఉరితీతల పరంపర

పరాయి పాలకుల మీద తిరగబడ్డ యోధులకు విధించిన ఉరిశిక్షలను కూడా ఆంగ్లేయులు చాలా క్రూరంగా నిర్వహించారు. అనుమానం వచ్చిన ప్రతివారినీ పట్టుకు రావటం, తూ..తూ మంత్రంగా విచారణ జరపటం, వెంటనే ఉరిశిక్ష ప్రకటించటం, ఆ మరుక్షణమే ఉరిశిక్షలను అమలు చేయటం యథేచ్ఛగా సాగింది. ఈ విధంగా సాగిన ఉరితీతల పరంపరకు అంతులేకుండా పోయింది. ఢిల్లీ నగరంలో అప్పటికప్పుడు సిద్ధం చేసిన ఉరివేదికల మీద శిక్షలు అమలు జరిపితే తిరుగుబాటు దారులు విజృంభించిన మిగిలిన ప్రాంతాలలో, తిరుగుబాటు యోధులకు ఆశ్రయం కల్పించిన గ్రామాలలో, ఆంగ్లేయులకు ఆశ్రయం కల్పించ నిరాకరించిన చోటల్లా స్థానిక ప్రజల పట్ల దారుణంగా వ్యవహరిస్తూ భయానక రీతిలో ఉరిశిక్షల క్రౌర్యాన్ని సాగించారు.

ఉరిశిక్ష విధించేందుకు ప్రత్యేకంగా నిర్దేశించబడిన విధానాలను మాత్రమే

కాకుండా కొత్త కొత్త పద్ధతులను అప్పటికప్పుడు అమలుచేశారు. చెట్లను నరికి వచ్చిన కలపతో ఉరివేదికలను తయారు చేయటం మాత్రమే కాకుండా నేరుగా చెట్లనే ఉరికంబాలుగా వాడుకున్నారు. ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన ఉరి వేదికల మీద మాత్రమే కాకుండా తిరుబాటు యోధులను ఎండ్ల బండ్ల మీద నిల్చోబెట్టి, ఉరితాడును బిగించి అకస్మాత్తుగా ఎడ్లను ముందుకు అదిలించి కాళ్ళ క్రింద బండిని లాగి వేయటం ద్వారా ఉరి బిగుసుకుపోవడం తద్వారా ప్రాణాలు హరించటం ఒక రకం.

ఎడ్ల బండ్లను వాడటం మాత్రమే కాకుండా కొన్ని ప్రాంతాలలో ఏనుగులను రప్పించి తమదైన పద్ధతిలో నేరస్థులుగా నిర్ధారించిబడిన స్వదేశీ యోధులను ఆ ఏనుగుల మీద కూర్చోబెట్టి ఉరితాడు బిగించి ఉరిశిక్షలు విధించటం మరోరకం. ఈ పద్ధతిలో స్వదేశీ యోధుల మెడలను వంచి ఉరితాడు తగిలించి, ఆ తరువాత భయానకంగా అరుస్తూ ఏనుగులను అదిలించి పరుగులెత్తించడంతో తిరుగుబాటు యోధుల కంఠాలకు బిగించిన ఉరితాడు మరింత బిగుసుక పోవటం ద్వారా ప్రాణాలను తీశారు.

ఈ పద్ధతులు అత్యవసర పద్ధతులుగా ఆంగ్లేయులు చెప్పుకోగా ఉరి వేదికల మీద కాకుండా చెట్లను కూడా ఉరివేదికలుగా వాడుకుని ఉరిశిక్షలు విధించారు. ఈ రకంగా ఢిల్లీ నగర పరిసరాల్లో మాత్రమే కాకుండా తిరుగుబాటు జరిగిన ప్రతి పట్టణం, ప్రతి గ్రామంలో వేలాదిగా యోధులు చెట్లకు వేలాడుతూ ప్రాణాలు కోల్పోయారు. గ్రామాలలో కన్పించిన ప్రతి చెట్టును తిరుగుబాటు వీరులను ఉరితీసేందుకు ఉపయోగించారు. ఈ విధంగా సాగిన ఉరిశిక్షల అమలుకు అనుసరించిన పద్ధతులను చరిత్రకారుడు Charles Ball తన గ్రంథం **History of Indian Mutiny** లో చాలా వివరంగా పేర్కొన్నాడు.

ఉరితీతలకు గురవుతున్న యోధులతో ఆంగ్ల సైనికులు అత్యంత క్రూరంగా వ్యవహరించారు. ఉరితీత నిర్ణయమైన యోధులను శిక్ష అమలుకు ముందు బాయెనెట్‌లో పొడిచి పొడిచి హింసించారు. ఆ యోధుల దేహాల నుండి రక్తం స్రవిస్తూంటే రక్తం రుచి మరిగిన పులుల్లా ఆనందం వ్యక్తంచేశారు. ఆ యోధుల జుట్టు పట్టుకుని వెంట్రుకలను బలవంతంగా ఊడబెరికారు. గడ్డాలను పట్టుకుని బరబరా ఈడ్చుతూ, గిరగిరా తిప్పుతుండగా, ఆ భాధకు తట్టుకోలేక విలవిలలాడి పోతున్న బాధితుల చుట్టూచేరి కేరింతలు కొడుతూ ఆనందించారు. ఈ చిత్రహింసలను భరించలేక తమను త్వరితగతంగా

ఉరితీయమని స్వదేశీసైనికులు అభ్యర్థిస్తూన్నా ఆంగ్ల సైనికులు తమకు సంతోషాన్ని కలిగించే హత్యాకాండను చాలా తాపీగా సాగించేవారని Christopher Hibbert పలు గ్రంథాలను, నివేదికలను ఉటంకింస్తూ తన **The Great Mutiny** లో పేర్కొన్నాడు.

ఉరిశిక్ష ప్రకటించిన తరువాత ఒక్కొక్కరినీ ఉరితీయటం కాకుండా జట్లు జట్లుగా యోధులను సామూహిక ఉరికి బలివ్వడం ఆంగ్లేయులు అనుసరించిన మరొక ప్రత్యేకత పద్ధతి. ఒక జట్టులోని యోధులను వివిధ పద్ధతులలో ఉరిశిక్షల ద్వారా ప్రాణాలు హరిస్తూ, ఆ దృశ్యాలను ఆ తరువాతి జట్టు చూచేలా ప్రత్యేక ఏర్పాట్లు చేయడం, ఎవరైనా ఆ భయానక దృశ్యాలను చూడకుండా ఇష్టం లేక ముఖం తిప్పుకుంటే వారిని బాయనెట్‌లతో పొడిచి మరీ ఉరితీతలను చూసేలా చేసి ఆంగ్లేయ సైనికులు ఆనందించారు. ప్రాణాలు హరించే తంతును చూసి తిరుగుబాటుదారులలో ఎవ్వరైనా ఉద్వేగానికి లోనై ఆక్రందన చేస్తే, ఆంగ్లసైనికులతోపాటుగా, సైనికాధికాధికారులు కూడా మరింతగా సంతోషాన్ని వ్యక్తంచేస్తూ ఆనందించారు.

ఈ దృశ్యాలను చూసి ఆనందించేందుకు ఆంగ్లేయాధికారులు తమ కుటుంబీకులను కూడా ఉరితీతల వేదికల వద్దకు తీసుకవచ్చి వారి కోసం ప్రత్యేక ఏర్పాట్లు చేసి మరి తమ ఘాతుకాలను **ఘనకార్యాలు**గా చూపించారు. అల్పాహారాన్ని తీసుకుంటూ, విలాసంగా సిగార్లు తాగుతూ ఆంగ్లేయ మహిళలు కూడా ఆ దృశ్యాలను చూసి కేరింతలతో సంబరపడ్డారు. ఆ దృశ్యాలను చూడలేని మహిళలు కళ్ళుమూసుకుని తిరుగుబాటు యోధుల ఆక్రందనలను విని సంతసించేవారని చరిత్ర గ్రంథాలు చెబుతున్నాయి. ఢిల్లీలోని చాందనీ చౌక్ వద్ద పెద్ద సంఖ్యలో సాగిన ఈ ఉరితీతలను తిలకించడానికి వచ్చేవారు తాపీగా కూర్చోడానికి కూడా తగిన ఏర్పాట్లు చేసిన సందర్భాలున్నాయని Christopher Hibbert, Charles Ball, Moinuddin Hasan లు పేర్కొన్నారు.

గ్రామాలలోని తిరుగుబాటు యోధుల కుటుంబీకులను కూడా ఉరివేదికల వద్దకు బలవంతంగా ఈడ్చుకొచ్చి తమ తండ్రులు, అన్నా-తమ్ముళ్ళు, బిడ్డల కంఠాలకు ఉరితాళ్ళు గట్టిగా బిగుసుకుంటుండగా వారు గిలగిలా కొట్టుకుంటూ ప్రాణాలు వదులుతున్న భయానక దృశ్యాలను బలవంతంగా చూపించడం జరిగింది. కళ్ళ ఎదురుగా తమ ఆత్మీయులు ప్రాణాలు కొల్పోతుంటే, గుండెలు పగిలేలా వారు రోదిస్తుంటే ఆంగ్ల సైనికులు, అధికారులు పగలబడి నవ్వుతూ ఆనందించేవారని ఆంగ్లేయ చరిత్రకారులు

స్వయంగా వెల్లడించారు. ఈ సందర్భంగా ఆంగ్ల సైనికులు, ఆంగ్లేయాధికారులు అమానుషంగా వ్యవహరించారని ఆంగ్లేయ చరిత్రకారులే పేర్కొన్నారు.

ఉరిశిక్షకు గురైన వ్యక్తుల ప్రాణాలు త్వరితంగా పోకుండా, గొంతుకు ఉరి గట్టిగా బిగుసుకోవడం త్వరితగతిన జరగకుండా ఉండేందుకు తలారిలను ఆంగ్లసైన్యాలు బతిమిలాడటమే కాకుండా వారికి లంచాలు ఇచ్చి మరీ తమకు ఆనందం కల్గించే రీతిలో తిరుగుబాటు యోధులను ఉరితీయించారు. ప్రాణం వెంటనే పోకుండా బాధతో విలవిలలాడి పోతూ ఉరికంబానికి ఎక్కువ సమయం వేలాడే విధంగా సరికొత్త పద్ధతులు కనిపెట్టమని తలారులను సైనికులు, సైనికాధికారులు ప్రోత్సహించారని, ఆ విధంగా



ఆంగ్ల సైన్యాలు గ్రామాలు తగులపెడుతుంటే తరలివెళుతున్న ప్రజలు

సాగిన ఉరిశిక్షల పరంపరను చూసి ఆంగ్ల సైనికులు, అధికారులు, ఆంగ్లవనితలు ఎంతో సంతోషించారని, ఆ దృశ్యాలను చూసేందుకు ఆంగ్లేయుల కుటుంబాలు పిక్నిక్‌కు వెడలినట్టుగా తరలి వచ్చాయని Christopher Hibbert తాను రాసిన **The Great Mutiny** సవివరంగా పేర్కొన్నాడు.

అలహాబాద్‌లో అలాంటి దారుణకాండను స్వయంగా చూసిన భోలానాథ్ చంద్ర అను స్వదేశీయుడు, **దాదాపు ఆరు వేల మందిని ఈ రీతిన శీఘ్రంగా హతమార్చారు. వారి శవాలు పట్టణమంతటా చెట్లకూ, స్తంభాలకూ రెండేసి మూడేసి చొప్పున వేలాడుతూ**

**కనిపించాయి...రెండు నెలలపాటు రోజూ రెండు బండ్లు ఉదయం నుంచి సూర్యాస్తమయం దాకా ఊరంతా తిరుగుతూ, కూడళ్ళలో, బజార్లలో వేలాడే శవాలను పట్టుకుపోయి గంగలో పారేసేవి** అని వివరించాడు. (**1857 మనం మరచిన మహా యుద్ధం**, ఎం.వి.ఆర్. శాస్త్రి, పేజి. 3).

1857లో ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారిగా ఢిల్లీలో పదవీ బాధ్యతలు నిర్వహించి, తిరుగుబాటును స్వయంగా చూసిన మొయినుద్దీన్ హసన్ (Moinuddin Hasan) రాసిన **'గదర్ 1857'** గ్రంథంలో ఉరితీతల పరంపర గురించి రాస్తూ **ప్రతిరోజు ఉరితీతలు సాగాయి. వేలాదిగా ఉరికి గురయ్యారు. ప్రతిరోజు ఉదయం 10 గంటల నుండి వేలాదిగా ఉరితీయబడ్డారు. భారత దేశ వైస్రాయి జాన్ లారెన్స్ పంజాబు నుండి ఢిల్లీ వచ్చాక మాత్రమే ఉరితీతలు ఆగాయి. ఆయన వచ్చాక విచారణలు జరిపి శిక్షలు విధించటం ఆరంభమైంది** (పేజి.47) అని పేర్కొన్నారు.

## ఆంగ్లేయ 'నాగరికుల' అనాగరికత

ఈ రకమైన విధ్వంసం, హత్యాకాండలను ఆంగ్లేయ సైన్యాలు ప్రతిచోటా సాగించాయి. 1857 తిరుగుబాటు ఆరంభమయ్యాక ఢిల్లీకి తరలి వస్తూ దారిలోని ప్రతి గ్రామం, ప్రతి అనుమానితునికి వ్యతిరేకంగా ఆరంభించిన రాక్షస కాండను ఢిల్లీ నగరం తిరుగుబాటు యోధుల నుండి చేజిక్కించుకున్నాక కూడా ఢిల్లీ నగరవాసుల నుండి పరిసర ప్రాంతాల ప్రజల వరకు సాగింది.

ఢిల్లీని చేజిక్కించుకున్నాక దేశంలోని పలు ప్రాంతాలలో ప్రజ్వరిల్లిన తిరుగుబాటు జ్వాలలను అదుపులోకి తెచ్చిన ఆంగ్లేయులు ఆయా ప్రాంతాలలో కూడా తమ విధ్వంస కాండను యధేచ్ఛగా సాగించారు. ఈ వినాశకర కృత్యాలకు అవధ్, కాన్పూరు, అలహాబాద్, పరూఖ్‌ఖాబాద్, రోహిల్ ఖండ్ తదితర సంస్థానాల కేంద్రస్థానాలు, ఆ సంస్థానాల పరిధిలోగల ఇతర గ్రామాలు బలయ్యాయి. ప్రధానంగా అవధ్, కాన్పూరు సంస్థానాలు అంగ్ల సైనికుల దోపిడి, హత్యాకాండలకు గురయ్యాయి.

లండన్‌లోని **ది టైమ్స్** పత్రికకు ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ వార్తలను పంపించడానికి ప్రత్యేకంగా ఇండియా వచ్చిన పాత్రికేయుడు విలియం హోవర్డ్ రస్సెల్ (William Howard Russell) లక్నోలోని రాజప్రసాదాలలో ప్రవేశించిన అంగ్ల సైనికులు, సైనికాధికారులు సాగించిన దోపిడీ-విధ్వంసాల గురించి ది టైమ్స్ కు వివరాలు పంపాడు.

అవధ్ రాజధాని లక్నోలోని కైసర్ బాగ్‌లో 1858 మార్చి 15న జరిగిన దోపిడి కాండకు ఆయన ప్రత్యక్షసాక్షిగా ఉన్నాడు. సంపన్నుల గృహాలలో, రాజప్రాసాదాలలో జొరబడిన ఆంగ్ల సైనికులు, అధికారులు, అధికారుల ఏజెంట్లు దోపిడీ సమయంలో ఎంత దుర్మార్గంగా వ్యవహరించారో ఆయన తన వార్తలలో సవిరంగా పేర్కొన్నాడు.

1858 మే 25న **న్యూయార్క్ డైలీ ట్రిబ్యూన్** కు ఫ్రెడరిక్ ఏంగెల్స్ రాసిన వ్యాసంలో అవధ్ రాజధాని లక్నోలో ఆంగ్ల సైన్యాలు సాగించిన దోపిడీ-విధ్వంస కాండలను దృష్టిలో పెట్టుకుని ఈ విధంగా వ్యాఖ్యానించాడు :

**పందొమ్మిదవ శతాబ్దిలో నాగరిక సైన్యం ఇలాంటి చర్యలు అవలంబించవలసి వచ్చిందంటే పరిస్థితులు నిజంగా ఎంతగా దిగజారిపోయాయో తెలుస్తుంది ; ప్రపంచంలో మరెక్కడైనా సరే మరేదేశం సైన్యాలైనా ఈ అత్యాచారంలో పదోవంతు జరిపి ఉండిన పక్షంలో బ్రిటీష్ పత్రికలు వాటిని ఎంత అపకీర్తి పాల్జేసి ఉండేవో కదా! ఇవన్నీ బ్రిటీష్ సైన్యమే కావించిన ఘనకార్యాలై ఉండడం కారణంగా, ఇవన్నీ యుద్ధం తరువాత స్వభావికంగా సంభవించే పర్యవసానాలేనని మనతో ఇప్పుడు చెబుతున్నారు... విచ్చలవిడిగా జరుగుతూన్న బందిపోట్లనూ అత్యాచారాలనూ ఆపడానికి, యుద్ధం మధ్యలో తన సైన్యాన్నే నిరాయుధులను చేయడం కాంబెల్‌కి తప్పింది కాదంటే..ఇంత పశుప్రాయ మైన సైన్యం ఒక్క బ్రిటన్ బ్రిటన్‌లో తప్ప యూరప్‌లోగాని మరెక్కడాగాని లేదు...పన్నెండు దినాలు అహోరాత్రులు లక్నోలో బ్రిటీష్ సైన్యమంటూ లేనేలేదు. అక్కడున్నదల్లా ఆ పట్నం నుండి తరిమివేయబడిన సిపాయిల కంటె హద్దూపద్దూ మీరి పోవడంలోనూ, దౌర్జన్యంలోనూ, దురాశలోనూ ఎట్టిపోలికా లేకుండా మించిపోయి బందిపోటు ముఠాల కింద దిగజారిపోయి తప్పతాగి పశుప్రాయంగా స్వైరవిహారం చేస్తూన్నట్టి అల్లరి మూకే. 1858లో లక్నోను కొల్లగొట్టిన ఘటన బ్రిటీష్ సైనికశాఖ కంతటికి కళంకంగా కలకాలమూ చరిత్రలో నిలబడి పోతుంది...ఇండియాలో నాగరికతనూ మానవత్వాన్ని ఉద్ధరించేందుకు పురోగమించుతూ బరితెగి పోయినట్టి సైనికులు, దేశీయుల యొక్క చరాస్తులను మాత్రమే నిరాటంకంగా కాజేయగా, వీరి వెనువెంటనే బ్రిటీష్ ప్రభుత్వం రంగంలోకి ప్రవేశించి దేశీయులను నిలువునా వొలిచేసి వారి స్థిరాస్తులను కాజేస్తూంది.**

(ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం **1857-1859**, మార్క్స్-ఏంగెల్స్, ప్రగతి ప్రచురణాలయం,మాస్కో, 1983, పేజిలు. 161-167).

# ఘనీభవించిన క్రౌర్యం

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం చివరి దశలో అవధ్ రాజధాని లక్నో పట్టుబడ్డాక ఆంగ్లేయ సైనికులు, శిక్కు సైనికులు కలసి సాగించిన కిరాతకాలకు అడ్డూఅపూ లేకుండా పోయింది. నిలువెల్లా రాక్షసత్వం పుణికి పుచ్చుకున్న సైనికులు లక్నోలో జరిపిన పలు కిరాతక చర్యలలో ఒక సంఘటన గురించి మెజెనీది (Majendie) అను ఆంగ్ల సైనికాధికారి ఈ విధంగా వివరించాడు :

**తమ దళాధిపతి చనిపోయాడన్న కోపంతో సిక్కులు, కొంతమంది ఆంగ్లేయులు కలసి, తమ కోపాన్నంతా ఒక్క మనిషి మీద చూపారు. అతనిని రెండు కాళ్ళతో పైకి లేపి, రెండుగా చీల్చడానికి ప్రయత్నించారు. చేతకాక, నేల మీద ఈడ్చుకొని వెల్తూ అతని ముఖాన్ని కత్తులతో పొడిచారు. మీద పడుతున్న దెబ్బలకు ఓర్వలేని అతని దేహం వంకలు తిరిగింది. విచ్చుకత్తులతో గుంటలు పడుతున్న అతని నోరు పెడబొబ్బలు పెట్టింది. ఆ దేహంల్లోంచి ప్రాణాలు పోకమునుపే చితిని పేర్చి, దాని మీద అతనిని కూర్చుండ బెట్టి నొక్కి పెట్టారు. మంటల బాధతో పిచ్చెత్తిపోయిన ఆ నికృష్టుడు మండే దేహంతో పరిగెత్తిపోడానికి ప్రయత్నించి కొన్ని అడుగులు వేశాడు. చుట్టు ఉన్న యమ కింకరులు అతనిని మళ్ళీ లాక్కెళ్ళి మంటలపై వేసి నుసి అయిందాక కాపాలా ఉన్నారు.**
( **Lucknow 1857**, Roshan Taqui, New Royal Book Co, Lucknow, 2001, P. 266)

ఈ విధంగా ఆంగ్ల సైనికుల చేతుల్లో బందీలైన బాధితులు భౌతికంగా వంకర్లు తిరిగిపోయిన సంఘటనలను ఉదాహరిస్తూ, మెజెనీది ఉటంకించిన సంఘటలను పలు మార్లు రూఢిచేస్తూ Christopher Hibbert కూడా చాలా సంఘటనలను పూసగుచ్చి మరీ వివరించాడు. ఆంగ్ల సైనికులు పెట్టిన భయంకర చిత్రహింసల మూలంగా తరచుగా బాధితులు ఎనిమిది అంకెగా వంకర్లు తిరిగిపోయేవారని ఆయన పేర్కొన్నాడు.

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం తరువాత హిందూ-ముస్లింల మధ్య విభేదాలు సృష్టించి తమ పాలనకు హిందూ జనసముదాయాల మద్దతు సాధించేందుకు కుట్ర పూరితంగా వ్యవహరించిన ఆంగ్లేయ పాలకులు ముస్లింల పాలన కంటే తాము మెరుగైన

మంచి పాలన ప్రజలకు అందించడానికి ఇండియాను పరిపాలిస్తున్నామని గొప్పలు చెప్పుకొచ్చిన ఆంగ్లేయులు ఎంత క్రూరంగా వ్యవహరించాలో, నిజానికి వారి ఆర్భాటపు ప్రకటనలలో ఉన్న వాస్తవమెంతో బహిర్గతం చేసేవిధంగా ఆనాడు ఫ్రెడరిక్స్ ఎగెంల్స్ చేసిన వ్యాఖ్యానం ఈ విధంగా ఉంది :

**నాగరికత చెంది ఔదార్య సాహసాది సుగుణాలను కల్గి సాధుస్వభావులైన ఈ బ్రిటీష్ సైనికుల మహామ్మారి వాతకంటె, మిడతల దండులాగు పట్నాల మీదపడి దారిలో కనబడిన దానిదల్లా తుడిచిపెట్టేసిన చెంగిజ్ ఖాన్, తైమూర్ల కాల్మీక్ మూకలే వెయ్యిరెట్లు క్షేమకరమని ఏ దేశానికైనా అనిపించి ఉంటుంది. చెంగీజ్ ఖాన్, తైమూర్ల దండులు**



ప్రజలను దారుణ మారణకాండకు గురిచేస్తున్న ఆంగ్ల సైన్యాలు

**తాత్కాలికంగా దేశం మీద పడి దోచుకుని, మరో దేశం మీద పడడానికి వాటి మానాన అవి ఎటు పడితే అటు పోయేవి; కాని అన్ని విషయాలనూ ఒక క్రమపద్ధతిలో యధావిధిగా జరిపించడమనేది ఒక స్వాభావిక గుణంగా కలిగిన ఇంగ్లీసు వారు మాత్రం లూటీని ఒక విశిష్ట విధానం కింద రూపొందించి, లూటిచేయబడిన చోరీ అస్తులను అందుకొని వెల యేర్పర్చే ఏజెంట్లను తమసైన్యాలతో కూడా తీసుకొచ్చి, వీరి చేత లూటీ వస్తువును ప్రతి దానినీ చిఠ్ఠా పుస్తకాలలో నమోదు చేయించి, లూటీ వస్తువులను వేలం వేయించి, బ్రిటీష్ సామ్రాజ్య పరాక్రమాలకు మొత్తంగా ముట్టవలసిన పారితోషికంలో ఎట్టి మోసమూ**

**జరగకుండా ధర్మంగానూ న్యాయంగానూ అణాపైసాలతో సహా ముట్టేటట్టు వెయ్యి కళ్ళతో కనిపెడుతున్నారు.** (**ప్రథమ భారత స్వాతంత్ర్య** సంగ్రామం **1857–1859**, కారల్ మార్క్స్, పేజిలు. 161–167).

ఈ విధంగా ఉత్తమోత్తమ సంస్కృతి–సభ్యతలు, అత్యుత్తమ నాగరికతకు వారసులుగా గొప్పలు చాటుకునే ఆంగ్లేయులు తమ ప్రతీకారచర్యలలో భాగంగా భారతీయ యోధుల పట్ల అమానవీయంగా, ప్రజల పట్ల అత్యంత అమానుషంగా వ్యవహరించడాన్ని స్వయంగా ఇటు ఆంగ్ల చరిత్రకారులు, ఆంగ్ల సైనికాధికారులు కూడా తప్పుబట్టారంటే ఆంగ్లేయుల స్థాయి ఎంతటి అధ:పాతాళానికి దిగజారిందో అర్థంచేసుకోవచ్చు.

★ ★ ★

## అధ్యాయం - 8



# త్యాగాలొకరివి-భోగాలొకరివి

**అది** 2002 ఏప్రిల్ 21వ తేది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం, కృష్ణా జిల్లాలోని పరిటాల గ్రామానికి చెందిన షేక్ మౌలా సాహెబ్‌ను పలకరించడానికి వెళ్ళాను. 1947లో చివర్లో అంటే 55 సంవత్సరాల క్రితం నిజాం సంస్థానంలో భాగమైన పరిటాల గ్రామం నిజాం సంస్థానం నుండి వేరుపడి స్వతంత్ర రిపబ్లిక్‌ను ప్రకటించుకుంది. ఆవిధంగా సంచలనం సృష్టించిన గ్రామం బిడ్డడు షేక్ మౌలా సాహెబ్. అప్పుడు మౌలా వయస్సు సుమారు 22 సంవత్సరాలు.

జాతీయ ఆలోచనలు వ్యక్తం చేయటమే మహా నేరంగా పరిగణిస్తున్న కాలంలో పరిటాలలో **పరిటాల రిపబ్లిక్ పతాకం** ఎగురవేసిన యువకుడు మౌలా సాహెబ్ రిపబ్లిక్ యోధులను ఉత్సాహపరుస్తూ గతంలో పాడుతూ వచ్చిన ఈ క్రింది పాటను పాడారు.

'దూర్ హటో దునియా వాలో
హిందూస్థాన్ హమారాహై
..................................
షురూహువాహై జంగ్ హమారా

జాగ్ ఉఠో యే హిందూస్థానీ జాగ్ ఉఠో

.................................

తుమ్ నా కిసీకే ఆగే ఝుక్‌నా
జర్మన్ హో యా జపానీ

.................................

షురూహువాహై జంగ్ హమారా
జాగ్ ఉఠో యే హిందూస్థానీ జాగ్ ఉఠో'

ఆ పాటతో పులకరించి పోయిన పరిటాల రిపబ్లిక్ వీరులు స్వతంత్ర రిపబ్లిక్ పతాకానికి గౌరవ వందనం చేశారు. **యుద్ధం ప్రారంభమైంది , మేల్కోండి భారతీయులారా మేల్కోండి**..., అంటూ పాటలు పాడటమే కాదు, 1947నాటి చారిత్రాత్మక పరిటాల రిపబ్లిక్ స్థాపనలో మౌలా సాహెబ్ క్రియాశీలక పాత్రను పోషించారు.

ఆ సాహసోపేత చర్య వలన షేక్ మౌలా పేరు పరిటాల పరగణా అంతా వ్యాపించింది. ఆయనకు కడగండ్లు ఆరంభమయ్యాయి. నైజాం సంస్థానాధీశుడు మతం రీత్యా **ముస్లిం** కనుక ఆయనకు వ్యతిరేకంగా ముస్లింలెవ్వరూ వ్యవహరించ కూడదని మతపెద్దల నుండి తాఖీదులు అందాయి. ఆ ఆదేశాలను షేక్ మౌలా బే ఖాతర్ చేశారు. జాగీర్దార్ బలగాలు భౌతిక చర్యలకు సిద్ధమయ్యాయి. మౌలా లాంటి వ్యక్తుల మీద కారాలు మిరియాలు నూరారు. ఆ పరిస్థితిని గమనించిన తల్లితండ్రుల ఒత్తిడి మీద పొలాల్లో, పర్వత ప్రాంతాల్లో మౌలా కొంత కాలం రహస్య జీవితం గడిపారు.

భౌతిక దాడులకు లొంగక పోవటంతో నైజాం పాలకులు మార్గం మార్చు కున్నారు. మానసికంగా ఒత్తిడి తెచ్చి పరిటాల రిపబ్లిక్‌ను చిన్నాభిన్నం చేయడానికి కుయుక్తులు పన్నారు. షేక్ మౌలా సాహెబ్‌కు నయానా భయాన నచ్చచెప్పేందుకు నిజాం తాబేదారులు పరిటాల చేరుకున్నారు. మత పంచాయితి పెట్టి మౌలాకు వ్యతిరేకంగా తీర్మానం చేయించారు. ఒక సమయంలో నెత్తి మీద చెప్పులు పెట్టి ఆయనను అవమానించారు. మౌలా సాహెబ్ కుటుంబాన్ని సాంఘిక బహిష్కరణకు గురిచేశారు. ఈ దాష్టీకాలకూ, అవమానాలకూ మౌలా ఏ మాత్రం చలించలేదు.

చివరకు 1948 సెప్టెంబర్ మాసంలో నైజాం సంస్థానం ఇండియన్ యూనియన్ లో విలీనమైంది. అటు నైజాం విలీనం కాగానే ఇటు పరిటాల రిపబ్లిక్ కూడా ఇండియన్ యూనియన్‌లో భాగమై పోయింది. చిన్ననాటి నుండే తన అభిప్రాయాలను నిక్కచ్చిగా

వ్యక్తం చేసే స్వభావంగల షేక్ మౌలా సాహెబ్ ఆ తరువాత రాజకీయాల పట్ల ప్రత్యేక ఆసక్తి చూపలేదు. ఆయన ఆర్థిక ప్రయోజనాల పట్ల ఎటువంటి ఉత్సుకత చూపలేదు. ఆయన తన గ్రామం వరకు పరిమితమయ్యారు. ఆయన సహచరులు రాజకీయంగా మంచి స్థానాలు సంపాదించుకున్నా ఆయన మాత్రం సామాన్యుడిగా మిగిలిపోయారు.

బ్రిటీషర్ల నుండి ఇటు నైజాం సంస్థానాధీశుల నుండి తమ గడ్డను స్వతంత్ర్యం చేసుకోగలగడంలో సాహసోపేతంగా వ్యవహరించిన మౌలా సాహెబ్ తన కుటుంబాన్ని మాత్రం పేదరికం కోరల నుండి విముక్తం చేసుకోలేక పోయారు. నిజాం పోలీసుల తుపాకీ గుళ్ళకు, కరకు కత్తులకు, ఎత్తులకు భయపడని ధైర్యశాలి మౌలా పేదరికానికి బెదిరిపోలేదు. రెక్కల కష్టం మీద ఐదుగురు ఆడపిల్లలు, ఇద్దరు మగబిడ్డల గల భారీ కుటుంబాన్ని మోస్తూ కష్టాలతో సహవాసం చేశారు. కాయకష్టం చేసు కుంటూ, కొండలెక్కి కట్టెలు కొట్టుకొచ్చి విక్రయించుకుని ఆ విధంగా లభించిన అత్తెసరి ఆదాయంతో బ్రతుకు బండిని నెట్టుకొచ్చారు. మౌలా దంపతులు తమ పిల్లలకు వివాహాలు చేశారు. వివాహాలు చేసుకున్న పిల్లలు రెక్కలొచ్చిన పక్షుల్లా తమ జీవితాలను నిర్మించుకు నేందుకు తలోదిక్కూ వెళ్ళిపోయారు. మౌలా దంపతులకు మళ్ళీ కాయకష్టం తప్పలేదు.



షేక్ మౌలా సాహెబ్

2002 ఏప్రిల్ 21న మౌలాసాహెబ్ గృహానికి రచయిత, ఇతర మిత్రులతో కలిసి వెళ్ళినప్పుడు ఆయన భార్య షేక్ మహబూబ్బీ చిల్లులు పడిన సత్తు పాత్రలో గొడ్డు కారం కలుపుకుని అన్నం తింటున్నారు. ఆ విషయం ఆమెతో ప్రస్తావించగా **'..కూలి చేసుకు బ్రతుకుతున్నాం. కూలికి వెళ్ళకపోతే ఎలా? ఆయనకు కళ్ళు సరిగ్గా కనపట్టం లేదు. కూలీ-నాలీ చేయలేక పోతున్నాడు. ఇద్దరం కష్టపడితేనే కదా ముద్దనోట్లోకి వెళ్ళేది..'** అని కట్టుకున్న చిరుగుల చీరను సరిచేసుకుంటూ కళ్లల్లో నీళ్ళను కొంగుతో ఒత్తుకుంటూ చెప్పారు.

షేక్ మౌలా సాహెబ్, ఆయన సన్నిహిత మిత్రుడు, అలనాటి పరిటాల రిపబ్లిక్ అధ్యక్షులు మాదిరాజు దేవరాజు పరిటాల రిపబ్లిక్ ప్రకటించుకున్న నాటి నుండి ఈనాటి వరకు జరిగిన విశేషాలను రచయితకు వివరించారు.

శిథిలావస్థలో ఉన్న చిన్న ఇంట్లో మౌలా సాహెబ్ దంపతులు ప్రస్తుతం నివసిస్తున్నారు. కట్టెలు కొట్టుకొచ్చి అమ్ముకునే శక్తి మౌలాలో నశించటంతో, వృద్ధాప్యంలో పాత రిక్షాను మౌలా బ్రతుకు బండిగా మార్చుకున్నారు. ఓపిక ఉన్న రోజున జాతీయ రహదారి మీద పేడను సేకరిస్తారు. ఆ పేడతో పిడికలు చేస్తారు, ఎరువుగా మార్చుతారు. ఆ విధంగా తయారు చేసిన పిడకలను, ఎరువును రైతులకు అమ్ముకుని తద్వారా లభించినంతలో జీవిస్తున్నారు.

కంటి చూపు మందగించడంతో భారీ వాహనాలతో రద్దీగా ఉండే జాతీయ రహదారి మీద పేడ సేకరించటం ప్రాణాంతకంగా మారింది. పలుమార్లు ప్రమాదాల నుండి ఆయన తృటిలో తప్పించుకుని బ్రతికి బయటపడ్డారు. ఆ స్థితిలో కుటుంబీకులు కోపగించుకున్నాక, ఆ పని కూడా ప్రస్తుతం చేయటం లేదు. భార్య సంపాదన ప్రధాన ఆధారంగా జీవనయానం సాగిస్తున్నారు. ఆయన చేయగలిగిన పని ఉంటే చేసుకోవడం లేకుంటే గ్రామంలోని మసీదులో ప్రార్ధన చేసుకుంటూ కాలం గడపటం ఆయన దినచర్యగా మారింది.

ఆనాడు అష్టకష్టాలుపడి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం పోరాడిన స్వాతంత్ర్య సమరయోధులు, వారి వారసులు ఎదుర్కొంటున్న దుస్థితికి మన రాష్ట్రానికి సంబంధించి నంత వరకు ఒక విషాద వాస్తవమిది. జాతీయ స్థాయి చరిత్రలోకి తొంగి చూస్తే ఇటువంటి విషాద యదార్థాలు మన ముందుకు చాలా వస్తాయి.

**1857** నాటి సంగ్రామం ఆరంభమైనప్పుడు మక్కాలో ఉన్న బహుదూర్ షా జఫర్ వారసులలో ఒకరైన షెహజాదా ఫిరోజ్ షా ఇండియాకు తిరిగి వచ్చి తనదంటూ సైన్యాన్ని తయారు చేసుకుని మాతృభూమి విముక్తి కోసం ఆంగ్ల సైన్యాలతో తలపడ్డారు. ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు తాంతియాతోపే, నానా సాహెబ్, అజీముల్లా ఖాన్, బేగం హజరత్ మహల్, మౌల్వీ అహమ్మదుల్లా ఫైజాబాది లాంటి మహాయోధులతో కలసి ఆయన ఆంగ్ల సైన్యాల మీద విరుచుకపడ్డారు. ఈ విజృంభణను తట్టుకోలేకపోయిన ఈస్ట్ ఇండియా కంపెనీ ఆయనను పట్టిచ్చినవారికి పదివేల

రూపాయల బహుమతి కూడా ప్రకటించాల్సి వచ్చింది. అంత మొత్తంలో బహుమతులు ప్రకటించిన ఆ యోధుడ్ని బంధించటం ఈస్ట్ ఇండియా కంపెనీ సైనికాధికారులకు చివరి వరకు సాధ్యం కాలేదు.

1857 సెప్టంబరు మాసంలో ఢిల్లీ పతనమైంది. లక్నో ఆంగ్లేయుల చేత చిక్కింది. రోహిల్లా వీరులు ఉరితీబడ్డారు. నమ్మక ద్రోహంవల్ల మౌల్వీ అహ్మదుల్లా షా హత్యకు గురయ్యారు. నానా సాహెబ్, బేగం హజరత్ హహల్, అజీముల్లా ఖాన్ లాంటి స్వాతంత్ర్య సంగ్రామ యోధులు అడవుల పాలయ్యారు. ఈ ప్రతికూల పరిస్థితులు ఫిరోజ్ షా కు నిరాశ కల్గించలేదు. ఆయన సిరోంజ్ అడవుల్లో తలదాచుకుని మళ్ళీ పోరుకు తయారు



ఆవశాన దశలో షెహజాదా ఫిరోజ్‌షా

కాసాగారు. ఆ సందర్భంగా బ్రిటీష్ మహారాణి విక్టోరియా చేసిన ప్రకటనను దృష్టిలో ఉంచుకుని పోరాటాన్ని విరమించడం ఉత్తమమని కొందరు హితవు పలికారు. ఆగ్రాకు చెందిన డాక్టర్ నజీర్‌ఖాన్ షెహజాదా ఫిరోజ్ షా తరుపున ఈ విషయమై మధ్యవర్తిగా వ్యవహరించాడు. 1859 జూన్ 4న విక్టోరియా రాణి ప్రతినిధికి ఫిరోజ్ షా తరపున లేఖ పంపారు.

ఒకవైపు సంప్రదింపులు జరుపుతూ మరోవైపు బ్రిటీష్ గూఢాచారుల కళ్ళుగప్పి ఇండియా నుండి అదృశ్యమైన ఫిరోజ్ షా బ్రిటీషర్లకు వ్యతిరేకంగా సాగుతున్న పోరాటానికి మధ్య ఆసియా, పశ్చిమ దేశాల అధినేతల సహకారం కోరుతూ పర్యటనలు గావించారు.

1860 నాటికి ఫిరోజ్ షా కాందహార్ చేరుకుని, అక్కడ నుండి 1862 లో టెహరాన్ వెళ్లారు. మార్గమధ్యంలో పలువురు రాజ్యాధినేతలను కలసి తమ విముక్తి పోరాటానికి సహాయం కోరారు. అతి కష్టం మీద సేకరించిన ధనంలో ఆయుధాలను సమకూర్చు కునేందుకు లక్ష రూపాయలను అమెరికాకు పంపారు. ఆయుధాలు అందక పోవటమే కాదు అక్కడకు పంపిన ధనం కూడా ఏమైందో ఆ తరువాత అంతుపట్టకుండా పోయింది.

ఈ లోగా ఫిరోజ్‌షా ప్రయత్నాలను తెలుసుకున్న బ్రిటీష్ ప్రభుత్వం సరిహద్దు దేశాధినేతలకు లేఖలు రాసి ఫిరోజ్‌కు ఏవిధంగానూ సహకరించవద్దంది. ఆయన మీద గట్టి నిఘా ఏర్పాటు చేసి, కదలికలను గమనించసాగింది. బ్రిటీషర్ల కన్నుగప్పి కార్యకలా పాలు సాగించటం ఫిరోజ్‌కు కష్టమైపోయింది. ఆర్థిక ఇబ్బందులు చుట్టుముట్టాయి. విరామమెరుగక సాగుతున్న సంచారం వలన సరైన ఆహారం, తగినంత విశ్రాంతి కరువు కావటంతో అనారోగ్యంతో పాటుగా, కంటిచూపు తగ్గింది. రోజురోజుకూ బలపడుతున్న బ్రిటీష్ సామ్రాజ్య వాదుల బలాన్ని ఎదుర్కోవటం అసాధ్యమైంది. బలపడిన సామ్రాజ్యవాద శక్తుల ఆదేశాలను కాదని ఫిరోజ్‌కు సహాయపడగల స్వతంత్ర శక్తులు లేకుండా పోయాయి.

చిగురంత ఆశను కల్గించే వాతావరణం కూడా కరువయ్యింది. అనారోగ్యం బాధిస్తుండగా చివరకు ఆయన 1875లో మక్కా చేరుకున్నారు. ఆ రాచ దంపతులను ఆదుకునే వారు కరువయ్యారు. భార్యాభర్తలకు కనీసం తిండీ బట్టా కూడా కరువైపోయింది. ఆ సమయంలో ఆర్థిక సహాయం కోసం కనబడినవారినల్లా అర్థించారని చెబుతారు. ఆ దుర్భర పరిస్థితులలో కూడా ఫిరోజ్ షా ఆంగ్లేయ వ్యతిరేక చర్యలకు స్వస్తిపలుకలేదు. ఆ అవిశ్రాంత శ్రమ వలన చివరకు ఆయన కళ్ళే కాకుండా కాళ్ళు కూడా సహకరించడం మానేశాయి. ఆర్థికంగా, ఆరోగ్యపరంగా ప్రతికూల పరిస్థితులు చుట్టుముట్టడం, మాతృదేశాన్ని వదిలి పరదేశంలో తలదాచుకోవాల్సిన దుస్థితి రావడం ఆయనను కుంగ దీసింది. ఆ వ్యథ నుండి ఆయన కోలుకోలేకపోయారు. చివరకు 1877 డిసెంబరు 8న మొగల్ రాకుమారుడు ఫిరోజ్ షా తన 45 సంవత్సరాల వయస్సులో మక్కాలో అంతిమ శ్వాస విడిచారు.

షెజాదా ఫిరోజ్ షా మరణానంతరం కష్టసుఖాల్లో సదా ఆయన వెంట నడిచిన ఆయన భార్యకు కష్టాలు తప్పలేదు. పరాజితులైనప్పటికి రాజకుటుంబీకులకు లభించే ఆర్థిక సదుపాయాలు లభించకపోవడం వలన చివరివరకు అతి దుర్భరమైన జీవితాన్ని గడుపుతూ కష్టాలు-కడగండ్ల సహవాసంతో ఆమె కన్నుమూశారు.

ఆంగ్లేయులు శత్రు శేషం పట్ల చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. అన్ని రకాలుగా తమ అడుగులకు మడుగులొత్తే వ్యక్తులను మాత్రమే తాము హస్తగతం చేసుకున్న రాజ్యాలకు అధిపతులు చేశారు. పరాజితుల వారసులు ఆత్మగౌరవం గలవారుగా భావించినా, భవిష్యత్తులో ఆ వారసుల నుండి ప్రమాదం రాగలదని అనుమానించినా అటువంటి వారిని స్వజనం నుండి, స్వంత ప్రజల నుండి, స్వంతగడ్డ నుండి బహుదూరంగా పంపి వేయడం బ్రిటిషర్ల అనుసరించిన రాజనీతి.

ఈ రాజనీతిలో భాగంగానే మైసూరు పులి టిపూ సుల్తాన్‌ను 1799లో శ్రీరంగపట్నం యుద్ధంలో పరాజితుడ్ని చేయగానే ఆయన స్థానంలో గతంలోలా



లక్నోలోని బేగం హజరత్ మహల్ స్మారక పార్క్

ఆయన వారసులను కాకుండా రాజా వడయార్ వారసులను గద్దె మీద కూర్చొబెట్టారు. ఆ తరువాత కొంత కాలం తరువాత అక్కడ నుండి మద్రాసు ప్రెసిడెన్సీ ప్రాంతం పరిధిలో గల చరిత్ర ప్రసిద్ధి చెందిన వెల్లూరు (Vellore) కోటకు టిపూ వారసులను తరలించారు.

1806 సంవత్సరం జూలై 9న టిపూ సుల్తాన్ కుమార్తె పెళ్ళి సందర్భాన్ని పురస్కరించుకుని వెల్లూరు కోటలో సుమారు 1500 మంది స్వదేశీ సైనికులు తిరుగుబాటు చేసి మూడు వందల మంది ఆంగ్ల సైనికులను మట్టుబెట్టారు. ఆ వెంటనే టిపూ కుమారుడు ఫతే హైదర్‌ను తమ రాజుగా ప్రకటించారు. ఈ సందర్భంగా అమితోత్సాహంతో సంబరాలు

జరుపుకున్నారు. ఆ సంబరాలలో మునిగి తేలుతున్న తిరుగుబాటు యోధులు భద్రత దృష్ట్యా కోట ద్వారాలను మూసి వేయకుండా నిర్లక్ష్యం చేయడంతో, ఇతర ప్రాంతాలనుండి తరలించబడిన ఆంగ్ల సైన్యాలు కోటలోకి దూసుకువచ్చాయి.

ఆ విధంగా వచ్చిన ఈస్ట్ ఇండియా కంపెనీ సేనలు చారిత్రాత్మక వెల్లూరు తిరుగుబాటును దారుణంగా అణిచివేశాయి. ఈ సందర్భంగా 1044 మంది తిరుగుబాటు యోధుల మీద సైనిక విచారణ సాగింది. ఆ విచారణ పర్యవసానంగా సుమారు 350 మందిని కాల్చివేసి వెల్లూరు కోటను ఆంగ్ల సైనికులు తిరిగి స్వాధీనం చేసుకున్నారు. ఈ తిరుగుబాటుకు టిపూ సుల్తాన్ కుమారుడు ఫతే హైదర్ కారకుడని ఆంగ్లేయాధికారులు భావించారు. ఆ కారణంగా టిపూ వారసులను వెల్లూరు నుండి దూరంగా కలకత్తాకు తరలించారు. (**Tamils Dispute Indian Mutiny** Date, LR Jagdeeshan, BBC News, Madras)

ఈ విధంగా స్వంత గడ్డకు దూరమైన టిపూ వారసులు చాలా దుస్థితిని, పలు కడగండ్లను అనుభవించారు. టిపూ వారసులు చిన్నాచితకా పనులు చేసుకుంటూ బ్రతుకులు వెళ్ళమార్చుతున్నారని కథనాలు వినరాసాగాయి. చివరకు కలకత్తాలో టిపూ వారసులొకరు జట్కా బండిని నడుపుకుంటూ బ్రతుకు బండిని అతి కష్టం మీద నడుకుంటున్నారని పత్రికలు కథనాలను వెల్లడించాయి.

**అవధ్** నవాబు వాజిద్ అలీషాను అవధ్ గద్దె నుండి దించేశాక ఆయన వారసులెవ్వరూ బ్రిటీష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తిరిగి తలెత్తకుండా ఆయన పరివారాన్ని మొత్తంగా లక్నోకు దూరంగా కలకత్తాకు తరలించాలనుకున్నారు. ఆంగ్లేయుల అభీష్టం మేరకు నవాబుతో కలసి కొందరు కలకత్తా వెళ్ళారు. ఆయన భార్య బేగం హజరత్ మహల్ మాత్రం అవధ్ రాజధాని నగరమైన లక్నోలో ఉండిపోయారు. ఆమె ఈస్ట్ ఇండియా కంపెనీ మీద తిరుగుబాటు ప్రకటించి ఆంగ్లేయుల నుండి లక్నోను విముక్తం చేసి పది మాసాల పాటు స్వతంత్రంగా రాజ్యపాలన చేశారు. చివరకు పరాజయం పాలైన ఆమె నేపాల్ అడవులలో తల దాచుకుంటుండగా 20 లక్షల రూపాయల భరణం ఇస్తామని, లక్నో మీద తమకున్న వారసత్వ హక్కులను వదులుకోమని కంపెనీ పాలకులు ఆమె వద్దకు రాయబారం పంపారు. ఆ ప్రతిపాదనలను తిరస్కరించిన బేగం హజరత్ మహల్ పలు ఇక్కట్లు పడుతూ చివరకు నేపాల్ రాజ్య రాజధాని ఖాడ్మండులో 1874 ఏప్రిల్ మాసంలో కన్నుమూశారు.

ఆమె మరణించాక ఆమె బిడ్డడు, అవధ్ వారసుడు బిర్జిస్ ఖదీర్ అడ్డు కూడా తొలగించుకుని అవధ్ మీద పూర్తి ఆధిపత్యం సాగించేందుకు బ్రిటీషర్లు కుట్ర పన్నారు. ఆ కుట్రలు -కుతంత్రాలను బిర్జిస్ ఖదీర్ ఎదుర్కొంటూ వచ్చారు.

ఆ తరువాత తలెత్తిన కొన్ని సమస్యలను పరిష్కరించుకునేందుకు కలకత్తా రమ్మని ఆయనను ఆంగ్లేయులు ఆహ్వానించారు. ఆ ఆహ్వానం మేరకు సమస్యలను సానుకూలంగా పరిష్కరించుకునేందుకు కలకత్తా వచ్చిన బిర్జిస్ ఖదిర్ గౌరవార్థం 1893 ఆగస్టు 13న ఆంగ్లేయులు రాచవిందు ఏర్పాటు చేశారు. ఆ విందుకు కుమారుడు ఖుర్షీద్ ఖదీర్, కుమార్తె జమాల్ ఆరా బేగంలతో సహా బిర్జిస్ ఖదీర్ హాజ రయ్యారు. ఆంగ్లేయులు పథకం తమ ప్రకారంగా విందు కోసం తయారు చేసిన ఆహార పదార్థాలలో విషం కలిపి, ఆ పదార్థాలను వారికి వడ్డించారు. పరాయి పాలకుల ఆతిథ్యంలో నున్న దుష్ట బుద్ధిని, అందులో దాగి ఉన్న కుట్రనూ గ్రహించలేక అమాయకంగా విషాహారాన్ని స్వీకరించిన బిర్జిస్ ఖదీర్, ఇరువురు బిడ్డ లతో సహా ప్రాణాలు విడిచారు.


బిర్జిస్ ఖదీర్

బిర్జిస్ ఖదీర్ భార్య మొహబత్ ఆరా బేగం, చిన్న కుమార్తె హుస్నా అదా బేగం ఆ విందుకు హాజరు కాక పోవ డంతో బ్రిటీషర్ల ప్రాణాంతక కుట్ర నుండి బతికి బయట పడగలిగారు. ఆ తరువాత కూడా ఆ బిర్జిస్ ఖదీర్ కుటుంబ సభ్యులను ఆంగ్లేయులు వదిలిపెట్టలేదు. ఆ రాచకుటుంబం ఆంగ్లేయుల నిర్లక్ష్యానికి గురయ్యి బ్రతుకు గడవడానికి ప్రకటించిన పెన్షన్ డబ్బు కోసం అధికారుల దయా దాక్షిణ్యాల మీద ఆధారపడాల్సిన దుస్థితిని ఎదుర్కోవాల్సి వచ్చింది. **(అవధ్ కీ బేగం (హిందీ),** డాక్టర్ సుధా త్యాగి, భారత ప్రభుత్వ ప్రచురణలు, న్యూఢిల్లీ,1992, పేజీ 20)

**భారత** దేశాన్ని పాలించిన మొగల్ ప్రభువులలో చివరి వాడు, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ నాయకుడు బహదూర్ షా జఫర్ వారసులు కూడా ఈ కోవలోకి చేరుకున్నారు. మూడు వందల సంవత్సరాలకు పైగా రాజ్యమేలి, 'ది గ్రేట్ మొగల్ ఎంపైర్' అని శత్రువు చేత కూడా కీర్తించబడిన మొగల్ వంశస్థులు 1857 తరువాత

దారుణమైన పరిస్థితులను ఎదుర్కొన్నారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామానికి ప్రతీకగా నిలిచారన్న ఆగ్రహంతో బహదూర్ షా జఫర్ పట్ల రాక్షసంగా వ్యవహరించిన ఆంగ్లేయుల చర్యల ఫలితంగా ఆయన వారసులు పూట గడవటం కూడా కష్టమై భారంగా బ్రతుకులీడ్చారు.

బహదూర్ షా జఫర్ మీద సైనిక విచారణ జరిపిన ఈస్ట్ ఇండియా కంపెనీ అధికారులు తిరుగుబాటు యోధులను తమ ప్రాంతాలకు దూరంగా ఉంచాలన్న ఆంగ్లేయుల విధానంలో భాగంగా జఫర్, ఆయన భార్య జీనత్ మహల్‌ను, జఫర్ వారసులు మిర్జా జవాన్ భక్త్, మిర్జా షా అబ్బాస్ వారి భార్యలు మరికొంత మంది సేవకులతో 1858 అక్టోబర్ 7న రంగూన్ తరలించారు. ఆ విధంగా రంగూన్ చేరుకున్న బహదూర్ షా జఫర్ 1862 నవంబరు 7న అతి సామాన్యుడిగా చివరిశ్వాస విడిచారు.

చక్రవర్తి మరణించినా అయన పట్ల విద్వేషం తగ్గని ఆంగ్లేయులు ఆయన అంత్యక్రియల పట్ల గానీ, ఆయన సమాధి పట్ల ఎంటువంటి శ్రద్ధ చూపలేదు. ప్రజలు ఆయన సమాధిని చూడాలన్నా కంపెనీ ప్రభువులు అనుమతించలేదు. ఆ కారణంగా కొంత కాలం తరువాత మొగల్ చక్రవర్తి సమాధి ఎక్కడుందో కూడా తెలియని పరిస్థితులు ఏర్పడ్డాయి. ఈ పరిస్థితిని ముందుగా ఊహించిన జఫర్‌లోని కవి, **నా మరణం తరువాత ఎవరైనా ఎక్కడ ఫాతెహా చదువుతారు? నా సమాధి జాడలు కూడా కనీసం కన్పించవు కదా** అంటూ జఫర్ తనలో తాను ప్రశ్నించుకుంటూ తనలో రగిలిన ఆవేదనను ఆ విధంగా కవిత్వీకరించుకున్నాడు.

(After the death of Zafar ! where can one recite the Fatiha? For even the sign of a broken grave that had remained is obliterated through tramping and treading heavily up and down.' - **Bahudur Shah II and The War of 1857 in Delhi with Its Unforgettable Scenes**, Mahdi Husain, M N Publishers and Distributors, New Delhi,1987, P. 429)

అంతేకాదు తన సమాధి వద్ద పుష్పాలు సమర్పించడానికి ఎవరైనా ఎందుకు రావాలి ? ఎవరైనా ఫాతెహా చదవడానికి ఎందుకు రావాలి? అని ప్రశ్నించుకున్నారు.

(' Why Should anyone come to my grave with an offering of flowers ? Why should anyone visit my grave to recite Fatiha ? such an embodiment of misery I shall become, on dying' - **Bahudur Shah II**, Mahdi Husain, P. 431)

బహదూర్ షా జఫర్ తాను పుట్టిపెరిగిన గడ్డ మట్టిలో కలసిపోవాలని బలంగా ఆకాంక్షించారు. ఆ కోర్కె మేరకు స్వయంగా తన సమాధి కోసం కుతుబ్ మీనార్ వద్ద స్థలం కూడా ఆయన ఎంపిక చేసి పెట్టుకున్నారు. ఆయన ఆకాంక్షకు వ్యతిరేకంగా రంగూన్‌కు తరలించటంతో తీవ్రంగా వ్యథ చెందారు. మాతృభూమిలో తన సమాధికి రెండు గజాల స్థలం కూడా కరువైన స్థితిని తలచుకుని సువిశాల మొగల్ సామ్రాజ్యానికి చెందిన చక్రవర్తి తన తుది రోజుల్లో దీనంగా విలపించాడు. ఆయన తన గుండె లోతుల్లోంచి పెల్లుబుకుతున్న ఆవేదనతో **నువ్వెంత దురదృష్టవంతుడివి జఫర్ ! నీ సమాధికోసం నీ మాతృభూమిలో రెండు గజాల స్థలం కూడా నీకు కరువయ్యింది.** (కిత్‌నా బద్‌నసీబ్ జఫర్. దఫన్‌కే లియే, దో గజ్ జమీన్ భీ న మిలీ కూ-యే-యార్ మే) అని భవిష్యత్తు పరిణామాల పట్ల ఆవేదన వ్యక్తం చేశారు.



రంగూన్‌లో జఫర్ సమాధి వద్ద స్మారక నిర్మాణం కోసం నిధుల

1903లో రంగూన్‌లోని జఫర్ సమాధిని చూడ్డానికి కొందరు ప్రముఖులు రంగూన్ వచ్చేంత వరకు మొగల్ చక్రవర్తి సమాధి ప్రాంతం ఎటువంటి ఆలనా పాలనా లేకుండా ఉండిపోయింది. అసలు ఆయన సమాధి జాడ కూడా కన్పించలేదు. రంగూన్ వచ్చిన ప్రముఖుల బృందం అతి కష్టం మీద స్థానికుల సహకారంతో సమాధి స్థలాన్ని గుర్తించి అక్కడ చక్రవర్తి గౌరవార్థం ఆయన స్మృతి చిహ్నంగా ఒక భవ్య నిర్మాణం చేయదలిచారు. ఈ మేరకు తగిన నిధుల కోసం వినతి పత్రాన్ని, దానితో పాటుగా భవ్వ నిర్మాణం నమూనాను కూడా తయారు చేయించారు. 46 ఏండ్ల తరువాత కూడా మొగల్ పాలకులంటే క్రోధం తగ్గని ఆంగ్లేయులు అడ్డుకోవటంతో ఆ ప్రయత్నం ఆగి పోయింది. కాగా 1934లో ఆయన మరణించిన 74 ఏండ్ల తరువాత మళ్ళీ మరికొందరి ప్రయత్నాల మూలంగా 1903లో అనుకున్నట్టు కాకుండా అతి సాదాసీదాగా బహదూర్ షా జఫర్ సమాధి వద్ద నిర్మాణం జరిగింది.

బహదూర్ షా జఫర్ కోరిక మేరకు ఆయన అవశేషాలలను రంగూన్ నుండి తెచ్చి ఢిల్లీలోని కుతుబ్‌మినార్ వద్ద తన సమాధి కోసం ఆయన ప్రత్యేకంగా ఏర్పాటు చేసుకున్న స్థలంలో మళ్ళీ ఖననం చేయాలని ఆ రోజు నుండి సాగుతున్న ప్రయత్నాలు ఈనాటికి కూడా సఫలం కాలేదు. నూటానలభైయిదు సంవత్సరాల తరువాత కూడా అలనాటి డిమాండ్ ప్రజలలో ఈరోజు వరకూ జీవించి ఉంది. ప్రస్తుత ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ 150 సంవత్సరాల సంబరాల సందర్భంగానైనా రంగూన్‌లోని జఫర్ సమాధిలోని మృతికనైనా తెచ్చి జఫర్ కోర్కె నెరవేరేట్టుగా సమాధి నిర్మించినట్టయితే, ప్రథమ స్వాతంత్ర సంగ్రామ యోధుడు, చిట్ట చివరి మొగల్ ప్రభువును గౌరవించుకున్నట్టు కాగలదు.

బహదూర్ షా జఫర్ చిన్నపాటి కోర్కె నెరవేరడం అసాధ్యంగా మారిన వాతావరణంలో ఆయన వారసుల పరిస్థితులు అంతకంటె భిన్నంగా లేదన్న విషయాన్ని ఆయన వారసులను పలకరిస్తే వారి కన్నీటి కథలు వెల్లడవుతాయి.

**1963**లో ప్రముఖ పాత్రికేయులు ఇబ్బార్ రబ్బీ ఢిల్లీలో నివసిస్తున్న బహదూర్ షా జఫర్ మునిమనవరాలు కమర్ సుల్తానా, ఆమె సోదరుడు షెహజాదా మిర్జా హమిద్‌లను ఇంటర్వ్యూ చేశారు. ఆ సందర్భంగా అన్నాచెళ్ళెలు తమ బాధలను, భారంగా బ్రతుకులీడుస్తున్న తీరును వివరించారు.

భారత ఉపఖండం విభజన సమయంలో ఢిల్లీలో జరిగిన మారణకాండలో కుటుంబ సభ్యులను కోల్పోయిన ఆమె సుదీర్ఘ అనారోగ్యంతో బాధపడుతూ కుమార్తెల సంపాదన మీద ఆధారపడుతున్నానన్నారు. అలనాడు బహదూర్ షా జఫర్ వెంట ఉండి తన దుర్బోధలతో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామానికి, స్వయంగా జఫర్‌కు వెన్నుపోటు పొడిచి అన్ని విధాల ఆంగ్లేయులను సమర్థించిన విప్లవ ప్రతీఘాతకుడు మిర్జా ఇలాహి బక్ష్ జఫర్‌కు స్వయాన వియ్యంకుడు.

ఈయన బ్రిటీషర్లకు అనుకూలంగా ప్రవర్తిస్తూ పోరుబాట సాగుతున్న బహదూర్ షా జఫర్‌ను తొలి నుండి నిరుత్సాహపర్చుతూ వచ్చాడు. 1857 సెప్టంబరు మాసంలో ఢిల్లీ పోరాటం చివరి దశకు చేరుకున్న సందర్భంగా తాడోపేడో తేల్చుకునేందుకు చక్రవర్తి బహదూర్ షా జఫర్ స్వయంగా ఆంగ్ల సేనల మీద దాడి జరిపేందుకు సిద్దపడ్డారు. 1857 సెప్టెంబరు 12 రాత్రి ఆంగ్లేయుల మీద దాడికి చక్రవర్తి ఢిల్లీ నగరం వెలుపలకు

వస్తున్నారని, కనుక హిందూ-ముస్లిం యోధులంతా కదలి రావాల్సిం దిగా ప్రకటించారు. ఆ ప్రకటన విని ఉత్సాహభరితులైన ప్రజలు, సైనికులు అందిన ఆయుధానల్లా తీసుకుని చక్రవర్తి నాయకత్వంలో ఆంగ్ల సైన్యాల మీద విరుచుకపడ్డానికి సిద్ధమై కాశ్మీర్ గేటు వద్ద 70 వేలకు పైగా గుమికూడారు. ఈ పోరాటానికి స్వయంగా చక్రవర్తి సారథ్యం వహించటమే కాకుండా ఆయన యుద్ధభూమికి వస్తున్నారనడంతో ప్రజలు-సైనికులలో ఉత్సాహం పెల్లుబికింది. అమితోత్సాహంతో శత్రువు మీద దాడిచేయడానికి చక్రవర్తి అనుమతి కోసం ఎదురు చూడసాగారు. (**The Great Mutiny**, Christopher Hibbert, Penguin Books, New Delhi, 1978, Pp. 313-314)



రంగూన్‌లో జఫర్ సమాధి వద్ద నిర్మించ తలపెట్టిన స్మారక భవన నమూనా

ఆ సమయంలో నిర్ణాయాత్మకమైన ఆ యుద్ధం జరిగి ఉంటే ఆంగ్లేయులకు పరాజయం తప్పేది కాదు. ఈ ప్రమాదాన్ని గ్రహించిన ఆంగ్లేయుల తొత్తులు తక్షణమే రంగప్రవేశం చేశారు. ప్రమాదఘంటికలు మోగించారు. ముంచుకొస్తున్న ప్రమాదం వివరాలను ఆంగ్లేయాధికారులకు చేరవేశారు. మరోవైపున బహదూర్ షా జఫర్ చెంతచేరి ఆంగ్లేయలు శక్తిసామర్థ్యాలను, బలసంపన్నతను అతిగా చూపి, తిరుగుబాటు యోధుల, ప్రజల బహీనతలను ఆయనకు పదేపదే విన్పించసాగారు. తాడోపేడో తేల్చుకునేందుకు సిద్ధమైన ఆయనను పూర్తిగా నిరుత్సాహపర్చారు. ఆ సమయంలో దాడి మంచిది

కాదన్నారు. ఆంగ్లేయుల విజయం ఖాయమన్నారు. ఆయన కుటుంబ సభ్యుల యోగక్షేమాలు గుర్తుకు తెచ్చారు. ఆంగ్లేయ విజేతల నుండి మొగల్ వంశస్థుల ప్రాణాలు దక్కాలంటే బహదూర్ షా జఫర్ పోరాట ప్రయత్నాలను విరమించక తప్పదని ద్రోహపూరిత సలహాలు ఇచ్చారు.

చివరకు సెప్టంబరు 12వ తేది రాత్రి అంతఃపురం నుండి యుద్ధయోధుడి వస్త్రధారణతో బయలు దేరిన బహదూర్ షా తన వియ్యంకుడైన మీర్జా ఇలాహి బక్ష్, ఆ కుట్రలో ప్రధాన పాత్రధారి, రాజవైద్యుడు అసహనుల్లా ఖాన్‌ల దుర్బోధకు గురయ్యారు. చక్రవర్తిని యుద్ధ విముఖుడ్ని చేయడంలో ఆ ఆంగ్లేయుల తొత్తులు విజయం సాధించారు. సమరశంఖారావం పూరించిన బహదూర్ షా నగరం వెలుపలికి వస్తూ వస్తూ నమాజు సమయం ఆసన్నమైనదంటూ తిరిగి కోటలోనికి వెళ్ళిపోయారు. మళ్ళీ ఆయన కోట బయటకు రాలేదు. చక్రవర్తి రాకకోసం అర్ధ రాత్రి వరకు ఎదురు చూసిన స్వదేశీ యోధులు, ప్రజలు హతాశులై పెద్ద సంఖ్యలో నగరాన్ని వదలి వెళ్ళి పోయారు.

ఆ కారణంగా ఎర్రకోట నుండి ఆంగ్లేయులతో పోరాడుతున్న తిరుగుబాటు యోధుల సంఖ్య బాగా తగ్గిపోయింది. ఆ రాత్రి ఆంగ్ల బలగాల దాడి భయంకర రూపం దాల్చింది. ఎర్రకోట రక్షణకు నిలబడిన కొద్దిపాటి తిరుగుబాటు యోధులు ప్రాణాలకు తెగించి పోరు సాగించారు. చివరకు సెప్టెంబరు 14న కాశ్మీర్ గేటును పేల్చివేసి ఎర్ర కోట లోకి ప్రవేశించాయి. 1857 19న ఎర్రకోట పూర్తిగా ఆంగ్లేయు వశమైంది. (**The Great Mutiny**, Christopher Hibbert, 1978, Pp. 278-279)

ఈ విధంగా మీర్జా ఇలాహి బక్ష్ నమ్మకద్రోహానికి పాల్పడి అటు స్వజనులకు ఇటు స్వదేశానికి తీరని ద్రోహం చేశాడు. ఆ మిర్జా ఇలాహి బక్ష్ గురించి బహదూర్ షా జఫర్ మునిమనుమరాలు కమర్ సుల్తానా ఈ విధంగా చెప్పారు :

**మీర్జా ఇలాహి బక్ష్ బహదూర్ షా జఫర్‌కు వియ్యంకుడు. ఆయన విద్రోహానికి పాల్పడ్డారు. ఆయన మా కుంటుబీకుల నుండి అంతా లాక్కున్నారు. మా నాయనమ్మ ఆయన చెల్లెలు కూతురు. 'మామయ్యా నాకున్న ఆస్తిపాస్తులన్నీ తీసుకో.. నా బిడ్డను మాత్రం ప్రాణాలతో వదిలెయ్యి మామయ్యా' అంటూ మా నాయనమ్మ పలుమార్లు ఆయనను ప్రాధేయ పడింది. మీర్జా ఇలాహీ బక్ష్ మా నాన్నను చంపేస్తారేమోనన్న భయంతో ఆయన్ను అక్కడా-ఇక్కడా దాచి పెట్టేందుకు ఆమె ఎంతో కష్టపడింది. అల్లాహ్ ఆయన ప్రాణాలు కాపాడాడు.**

ఆ ఇలాహీ బక్ష్ ముని మనుమరాలు తైమూర్ జహాఁ బేగం ప్రస్తుతం ఢిల్లీలోని సలీం ఖాన్ వీధిలో ఉంటున్నది. ఆంగ్లేయులు మీర్జా ఇలాహీ బక్ష్ మీద అపార కరుణను కురిపించారు. మా నాయనమ్మ ఆయన చెల్లెలు కూతురు కావటంతో మాకు కూడా అరకొరగా పెన్షన్ లభించింది. బహదూర్ షా జఫర్ పేరు మీద మాత్రం మాకు ఏమీ లభించేది కాదు...మేము ఎవ్వరం కూడా మొగల్ ప్రభువుల వారసులమని ప్రచారం చేసుకోలేదు. మా మానాన మేం బ్రతుకుతున్నాం. ఆడపిల్లల పెళ్ళిళ్ళు చేస్తే చాలు. మాకింకా అంతకంటే ఏమీ అక్కరలేదు. మేం ప్రభుత్వ సహాయం కూడా కోరలేదు.

మీర్జా ఇలాహి బక్ష్ ముని మనుమరాలు పలు చోట్లకు వెళ్ళి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల పోరాటాల గురించి ప్రసంగాలు చేస్తున్నానని మాతో చెప్పింది. ఆ ప్రసంగాల ద్వారా నీకు లాభం చేకూరుతున్నట్టయితే మేం ఎటువంటి ఆటంకాలు కల్పించబోమని ఆమెతో నేను చెప్పాను, (ఆజ్‌కల్ (హింది) మాసపత్రిక, మే 2007, న్యూఢిల్లీ, పేజి. 42-45).



రంగూన్‌లో సాదాసీదా బ్రతుకు గడిపిన బేగం జీనత్ మహల్

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామం నాటి ద్రోహులలో ఒకడైన మీర్జా ఇలాహి బక్ష్ వారసురాలు తైమూర్ జహాం బేగం ప్రస్తుతం అలనాటి వాస్తవ చరిత్రకు భిన్నంగా తమ వంశస్థుల గురించి గొప్పలు చెప్పకుండా, వాటిని ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం నాటి త్యాగమయ గాథలుగా ప్రసంగాలలో వర్ణిస్తూ ఆమె ఏవిధంగా లబ్దిపొందుతున్నదో కమర్ సుల్తానా పాత్రికేయులు ఇబ్బార్ రబ్బీవివరించారు.

ఈ మేరకు తైమూర్ జహా బేగం అన్ని రకాల అవకాశాలను సొమ్ముచేసుకుంటూ హాయిగా బ్రతికేస్తుండగా, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో అన్నీ త్యాగం చేసిన అసలు సిసలైన యోధుల నిజమైన వారసురాలైన కమర్ సుల్తానా బ్రతుకును భారంగా గడుపుతున్న దుస్థితి 1963లో వెల్లడయ్యింది. ఈవిధంగా పలు ప్రాంతాలలో మొగల్

ప్రభువుల వారసులు మాత్రమే కాకుండా అలనాటి యోధుల వారసులు కూడా ఎదుర్కొంటున్న దుర్భర దారిద్ర్య పరిస్థితులను మీడియా కథలు కథలుగా విన్పించడాన్ని మనం చదువుతున్నాం, చూస్తున్నాం, తెలుసుకుంటున్నాం.

**1857**నాటి సంగ్రామంలో ప్రజల మధ్య పటిష్టమైన ఐక్యత వ్యక్తమైనా, అందరూ ప్రాణాలకు తెగించి పోరాడినా భారతీయులు పరాజితులు కావటం వెనుక గల ప్రధాన కారణాలలో ఆనాటి సంస్థానాధీశులలో కొందరు విద్రోహానికి పాల్పడాన్ని ప్రధానంగా పేర్కొనవచ్చు. స్వదేశీ పాలకులు, సంస్థానాధీశులు, స్వదేశీ సైనికులు, ప్రజలు కలసి కట్టుగా ఉమ్మడి శత్రువు మీద సమరశంఖారావం పూరించగా మరికొందరు ప్రత్యక్షంగా పోరాటంలో తాము పాల్గొనక పోయినా ఆ పోరాట యోధులకు సహాయం చేయాల్సింది పోయి ఆంగ్లేయుల పక్షాన నిలిచారు.

ఈ విధంగా బ్రిటీషర్ల తొత్తులుగా మారిన వారి వల్లే ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధులు పరాజితులయ్యారు. ఆ ద్రోహులే ఆంగ్లేయులకు విజయాన్ని సమకూర్చి పెట్టారు. ఈ విద్రోహ చర్యలను ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో స్వయంగా పాల్గొన్న ఆంగ్లేయాధికారులు, ఈస్ట్ ఇండియా కంపెనీ పాలకులు, తిరుగుబాటును తమ పత్రికలకు రిపోర్టు చేయడానికి ఇక్కడకు వచ్చిన ఆంగ్లేయ పాత్రికేయులు చాలా స్పష్టంగా ప్రకటించి ఆ విద్రోహుల చర్యలను నమోదు చేసి చరిత్రకందించారు.

ఆ చరిత్ర కథనం ప్రకారంగా, ఆనాటి గవర్నర్ జనరల్ లార్డ్ కానింగ్ స్వదేశీ పాలకుడైన సింధియా తమకు ఏవిధంగా సహకరించిందీ, సింధియా సహకారం ఆంగ్ల ప్రభుత్వానికి ఏ విధంగా లాభించింది వివరిస్తూ- If Sindia joins the rebels, I will pick off tomorrow....The Princes acted as the break waters to the storm which otherwise would have swept us in one wave అని పచ్చి వాస్తవం పలికాడు. ( '**Untold history of Freedom Struggle**' M. Burhanuddin Qasmi, **The Milli Gazette,** 16-31 May 2007)

స్వదేశీపాలకులలో ప్రముఖులైన కాశ్మీర్, హైదరాబాద్, గ్వాలియర్, జింద్, నభా, కపుర్తలా, ఉదయపూర్, జైపూర్, అల్వార్, కోతా, భోపాల్, పటౌడి, నేపాల్, శిక్కు పాలకులు, మరాఠాలు, సింధియాలు, జోధ్‌పూర్, గ్వాలియర్ తదితర రాజకుటుంబాలు, రాజస్థాని రాకుమారులు పెద్ద సంఖ్యలో బ్రిటీష్ పాలకుల తొత్తులుగా మారారు. ఈ

స్వదేశీ పాలకులంతా ఆంగ్లేయులకు ప్రత్యక్షంగానూ, పరోక్షంగాను సహాయం అందించారు. ఈ పాలకుల సహకారం వల్లే ఆయా ప్రాంతాలలో స్వదేశీ సైనికులు, ప్రజలు ఆరంభించిన తిరుగుబాట్లను ఈస్ట్ఇండియా కంపెనీ పాలకులు అణిచి వేయగలిగారు.

ఈ విషయాన్ని లండన్ నుండి ప్రచురితమవుతున్న **టైమ్స్** పత్రిక పాత్రికేయుడు విలియం రస్సెల్ వివరించారు. ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ వార్తలను తన పత్రికకు పంపించేందుకు రస్సెల్ లండన్ నుండి ఢిల్లీ వచ్చి స్వయంగా ఆనాటి పరిస్థితి చూసి వార్తలను పంపించాడు. ఆంగ్లేయ పాత్రికేయుడు తన పత్రికకు సమాచారం పంపుతూ ఆనాడు పాటియాల, హర్యానాలోని జింద్ రాజుల సహకారం కనుక ఆంగ్ల సైన్యాలకు లభించకుండా ఉండి ఉన్నట్టయితే, శిక్కులను ఆంగ్ల సైన్యంలో చేర్చుకోకుండా ఉన్నట్టయితే ఢిల్లీని స్వాధీనం చేసుకోవడం చాలా కష్టమయ్యేదన్నాడు. లక్నోలో శిక్కు సైనికులు మంచి సేవలందించారని పేర్కొన్నాడు. శిక్కులు సైనికులుగా ఉండటం వలన ఆంగ్ల సైనిక బలగాలకు మంచి శక్తి లభించిందని రాశాడు. ఈ విషయాలు 1858 మే9 నాటి **టైమ్స్** పత్రికలో ఈ క్రింది విధంగా ప్రచురితమయ్యాయి.

(Our Siege of Delhi would have been quite impossiable if the Rajahs of Patiala and of Jhind had had not been our friends, and if the Skhs had not recruited(in) our battalions, and remainend quite in Punjab. The Sikhs at Lucknow did good service... as our arimies were atttending and strengthened by them in the field - Essay titled ' Betrayal of the First War of Independence', Prof. Shamshul Islam, **The Milli Gazette**, 16-31 May 2007)

ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలం కావడానికి, ఆంగ్లేయులు విజయం సాధించడానికి ఆంగ్లేయుల ప్రతిభా సామర్థ్యాల కంటే ఇండియాలోని ఆంగ్లేయుల తొత్తుల సహకారమే ప్రముఖ కారణమని ఆంగ్లేయ పాత్రికేయుడు విలియం రస్సెల్ అభిప్రాయ పడ్డారు. ఆయన తన పత్రికకు వార్త రాస్తూ **వాస్తవం ఏమిటంటే తిరుగుబాటు మీద మనం సాధించిన విజయం ఖ్యాతి మనవాళ్ల కంటె మన శ్రేయోభిలాషులకు దక్కుతుంది. తమ స్వదేశీయుల నుండి ఎంతో ధైర్యసాహసాలతో విజయాన్ని సాధించి మనకు అప్పగిం చారని** అన్నాడు. (Jaynthe se jude kuch sawal, Prof. Shamshul Islam)

మీరట్ నుండి రణనినాదం చేస్తూ ఢిల్లీ చేరుకున్న తిరుగుబాటు యోధులను కట్టడి చేయడానికి పంజాబ్ నుండి ఆంగ్ల సైన్యాలతో జనరల్ ఆన్స్ బయలుదేరినప్పుడు దారిలో ఆంగ్లసైన్యాలకు ప్రజల నుండి, తిరుగుబాటు యోధులనుండి ఎటువంటి ఇక్కట్లూ రాకుండా ప్రయాణ మార్గాన్ని సంరక్షించే బాధ్యతను పాటియాల మహారాజు, జింద్ రాజు చేపట్టి ఆన్స్‌కు సహకరించారు.

ప్రథమ స్వాతంత్ర్యసమరాన్ని అణచివేయటంలో ప్రధాన పాత్ర వహించిన ఆంగ్ల సైనికాధికారి సర్ ఛార్లెస్ అట్చిసన్ (Sir Charles Aitchison) మరోచోట స్వదేశీ సంస్థానాధీశులను ప్రశంసిస్తూ **మా కష్టకాలంలో స్వదేశీ సంస్థానాలు మాకు వెలలేని సేవలను అందిచాయి. స్వదేశీ ప్రముఖులను సక్రమంగా చూసుకోవడం వలన మా పరిపాలనకు భద్రత బాగా పెరిగింది** అన్నాడు.

మరోఆంగ్ల సైనికాధికారి, **A History of the Indian Mutiny** రచయిత జాన్ విలియం కేయి (Jhon William Kaye) ఈ విషయాన్నే మరింత బలంగా చెబుతూ **ఆంగ్లేయులు స్థానిక జాతులకు వ్యతిరేకంగా పోరాడుతున్నా ఆంగ్లేయులకు మద్దతుగా నిలచి సహకరించింది స్థానికులుకావటం తిరుగుబాటు-యుద్ధం ప్రత్యేక లక్షణం. స్థానికుల మద్దతు లేకుండా మేం ఒక్కరోజు కూడా ఇక్కడ మనజాలగలిగేవారం కాము** అని అంగీకరించటం విశేషం.

(It was one of the most curious characteristics of the mutiny-war, that although the English were supposed to be fighting against the native races, they were in reality sustained and supported by the Natives of the country, and could not have held their own for a day with ou the aid of those whom we hated as our national enimies)

ఈ వరవడిలో ఇండియాలో అతి ముఖ్యమైన సంస్థానాధీశుడు, ఆంగ్లేయుల మిత్రుడు నైజాం నవాబుల పట్ల కూడా ఆంగ్లేయులు చాలా జాగ్రత్తలు తీసుకున్నారు. టిపూ సుల్తాన్ కాలం నుండి ఆంగ్లేయలతో స్నేహం నెరపిన **నిజాం జారిపోయినట్టయితే అంతా జారి పోయినట్టే** అని బ్రిటీష్ అధికారులు స్వయంగా ప్రకటించుకున్నారు. అందుకు తగినట్టుగా వ్యవహరించారు. (**History of The Deccan** Vol. II, JD E Gribble, Mittal Publications, New Delhi, 1990, P.236)

ఆ కారణంగా **వందలాది మైళ్ళ దూరం నుండి సముద్రం మీద వచ్చిన**

**బ్రిటీషు వారి సంఖ్య ఎంత? మీరు వారికెందుకు దాసోహమనాలి? ఎదురు తిరగండి. దేశ ప్రజలందరు మీకు అండగా వుంటారు. పరాయి పెత్తనం వద్దు. స్వతంత్రంగా వ్యవహరించండి! లక్షమంది భారతీయులు ఒక్కొక్క ఇంగ్లీషు వాడిని తన్నితే చాలు. అసువులు బాసిపోతారు. వారు చచ్చిన జాడ తెలుపడానికి కూడా ఎవ్వరూ ఉండరు. ధైర్యం చేయండి. దేశమాత పిలుపు వినండి. ఆమెను పరాధీనం చేయకండి!** అని ప్రజలు నిజాంకు ప్రజలు విజ్ఞప్తులు చేసినా (**హైదరాబాదు స్వాతంత్ర్యోద్యమ చరిత్ర**, వెల్దుర్తి మాణిక్యరావు, స్వాతంత్ర్యోద్యమం చరిత్ర పరిశోధనా సంస్థ, హైదారాబాద్, 1984 పేజి. 49)

**బహదూర్ అఫ్జలుద్దౌలా మీద భగవంతుని, ముహమ్మద్ ప్రవక్త దయ ఉంది. ఆయన భయపడకుండా ఉండాలి. ఒకవేళ భయపడినట్టయితే గాజులుతొడుక్కొని ఇంటి దగ్గర కూర్చోవడం మంచిది...ఈ పోస్టర్లలో రాసిన ప్రకారంగా బహద్దూర్ ప్రవర్తించ నట్టయితే ఢిల్లీ నుండి ఇంకొక సుభా వస్తుంది,** అంటూ సంస్థానాధీశుడ్ని అవహేళన చేసినా, నిజాం ప్రభువు మాత్రం ఆంగ్లేయుల పక్షమే వహించాడు. (**నిజాం-బ్రిటీష్ సంబంధాలు (1727-1857)**, సరోజినీ రెగానీ, మీడియా హౌస్ పబ్లికేషన్స్, హైదరాబాద్, 2002 పేజి. 319-320)

1857 తిరుగుబాటు సమయంలో ఆంగ్లేయాధికారులు నిజాం పట్ల చాలా అప్రమత్తులై వ్యవహరించారు. అత్యంత సన్నిహితులుగా, స్నేహితులుగా మసలుకున్నారు. ప్రతిఫలంగా నిజాం కూడా తిరుగుబాటు సమాచారాన్ని బ్రిటీష్ రెసిడెంటుకు చేరవేస్తూ, స్వయంగా చర్యలు తీసుకుంటూ తిరుగుబాటును అణిచిన పాపంలో పాలు పంచుకుని ఆంగ్లేయుల మన్నన పొందాడు.

ఆనాడు ఆంగ్లేయులు తిరుగుబాటును కఠినంగా అణచివేయడానికి, వలస పాలకుల చేతుల్లో స్వదేశీ పాలకులు, ప్రజలు పరాజితులు కాడానికి ఆంగ్లేయులకు కొందరు సంస్థానాధీశులు ఎంత ఘనంగా సహకరించారో ఈ సంఘటనలు స్పష్టం చేస్తున్నాయి. రాజ్యాన్ని కాపాడుకోగలిగినంతగా సహాయసహకారాలు అందించారు కనుక ఆ తొత్తులకు ఆంగ్లేయులు బాగానే నజరానాలు ముట్ట చెప్పారు. ఖాన్ బహదూర్, రావు బహదూర్ లాంటి అవార్డులను, ప్రశంసాపత్రాలను (ఖతీరా) వారికి సమర్పిం చుకున్నారు. అత్యంత విలువైన బహుమతులను అర్పించుకుని ఎంతగానో సంతోష పెట్టారు.

స్వదేశీ సంస్థానాధీశులను అవార్డులు-రివార్డులతో మంచి చేసుకుని, తమ పక్షాన నిలుపుకున్నంత కాలం తాము నిశ్చింతంగా ఇక్కడ పెత్తనంచేస్తూ ఇక్కడి సంపదనంతా తమ బొక్కసాల్లో నింపుకుని లండన్ తరలించవచ్చనీ, ఇక్కడి ప్రజలను యధేచ్ఛగా పాలించవచ్చనీ ఆంగ్లేయాధికారులు గ్రహించారు. ఆ లక్ష్య సాధనాదిశగా నడుచుకుని మిత్రులుగా వ్యవహరించిన సంస్థానాధీశుల, కులీనవర్గాల పెద్దల సహకారంతో ఇబ్బడి ముబ్బడిగా సాకుకూల ఫలితాలను సాధించారు.

ఆంగ్ల సైనికులకు తోడ్పాటు అందించినందుకు మసలన్, పాటియాల, జింద్, కశ్మీర్, నాభా, కపుర్తలా, హైదరాబాదు సంస్థానాధీశులకు అంగ్లేయులు మరోరకంగా కూడా సంతృప్తి పర్చారు. అనాడు తిరుగుబాటులో ప్రధాన పాత్ర వహించి ఆంగ్లేయులతో రాజీలేని పోరాటం సాగించిన అవధ్, గుర్‌గాంవ్, రోహిల్ ఖండ్, ఫర్రూఖ్‌నగర్ నవాబులు, సంస్థానాధీశుల రాజ్యాలలోని పలు ప్రాంతాలను తమకు తొత్తులుగా వ్యవహరించిన రాజ్యాధినేతల, సంస్థానాధీశుల రాజ్యాల సరిహద్దులను బట్టి తిరుగుబాటు యోధుల రాజ్యాలలోని పలు ప్రాంతాలను ధారాదత్తం చేశారు. ఈ విధంగా పటౌడి నవాబుకు ఝుజ్జర్ రాజ్యంలోని ఇలాఖా, సింధియా మహారాజుకు రాణి లక్ష్మీబాయికి చెందిన ఝాన్సీ లభించాయి. దాదరీ పరగణాను జునైద్ మహారాజాకు ప్రదానం చేసి ఆంగ్లేయులు కృత్ఞతాభివందనాలు చెల్లించుకున్నారు. **(గదర్ 1857 ః మొయినుద్దీన్ హసన్)**

ఈ చర్యల వలన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం విఫలం కావడానికి తోడ్పడి, పచ్చి విద్రోహానికి పాల్పడి ఆంగ్లేయులకు అండగా నిలచిన, పరాయి పాలకుల ఎంగిలి మెతుకులకు, వారి దయాదాక్షిణ్యాల కోసం వెంపర్లాడిన స్వదేశీయులు, స్వదేశీపాలకులు ఎంతగానో లాభించారు. ఆంగ్ల ప్రభుత్వం భృత్యులుగా, స్నేహితులుగా అంతులేని సంపదను పోగేసుకున్నారు. ప్రజల మీద తిరుగులేని ఆధిపత్యాన్ని సంపాదించుకున్నారు, అదుపులేని పెత్తనం చలాయించారు. బ్రిటీష్ ప్రభుత్వం కూడా తమకు తొత్తులుగా మెలగిన సంస్థానాధీశులు సుఖభోగాలు అనుభవిస్తూ కృతజ్ఞతాపూర్వకంగా తమ స్నేహం మరువకుండా విశ్వాసపాత్రులుగా పడి ఉండేందుకు అన్ని చర్యలు తీసుకుంది. అన్ని అవకాశాలు కల్పించింది. ఆ విధంగా వచ్చి చేరిన అపార సంపదతో ఆంగ్లేయుల మిత్రులుగా వ్యవహరించిన సంస్థానాధీశులు అపర కుబేరులయ్యారు.

ఆ తరువాత కాలంలో ఆ సంస్థానాధీశుల వారసులు కూడా ఆంగ్లేయుల అడుగులకు మడుగులొత్తుతూ ఆంగ్లేయుల మిత్రులుగా, ఆంగ్ల ప్రభుత్వం దయాదాక్షిణ్యాల

మీద బ్రతుకుతూ సంస్థానాధీశులుగా, ఆ తరువాత జమీందారులుగా ప్రజల మీద పెత్తనం చలాయించారు. ప్రభుత్వం అండదండలతో మరింత సంపదను పోగేసుకున్నారు. ఆంగ్లేయుల కరుణా కటాక్షాలతో వారసత్వంగా అందివచ్చిన అన్ని భోగభాగ్యాలను, అవకాశాలను తమకు అనుకూలంగా మార్చుకుని సర్వసుఖాలను అనుభవించారు.

ఆయా సంస్థానాలలో ప్రజలు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరాటాలు చేస్తున్నా సంస్థానాధీశులు మాత్రం తమ గడపల వద్దకు తరలి వస్తున్న పెత్తనం-సంపదను వదలుకోలేక ప్రజాభీష్టానికి వ్యతిరేకంగా నడుచుకున్నారు. ఆ కారణంగా బ్రిటీష్ వ్యతిరేక ఉద్యమాలను ఏమాత్రం సహించలేదు. సంస్థానాల పరిధిలో ఆంగ్లేయ వ్యతిరేకత లేశమంత వ్యక్తమైనా సహించక జాతీయోద్యమకారుల మీద విరుచుకు పడుతూ ఆంగ్లేయుల పట్ల తమకు వారసత్వంగా లభించిన స్వామి భక్తిని సంస్థానాధీశులు దండిగా చాటుకున్నారు.

ఈ సంస్థానాధీశులలో కొంత మంది రానున్న రాజకీయ వాతావరణాన్ని పసిగట్టి జాతీయోద్యమకారులకు అనుకూలంగా వ్యవహరించారు. జాతీయోద్యమం ఉధృతమౌతూ ఆంగ్లేయుల ఉద్వాసన తప్పని పరిస్థితులు తాండవించడంతో ఊసరవెల్లుల్లా వ్యవహరించి, రంగులు మార్చి, ఆంగ్లేయుల పక్షం నుండి జాతీయ పక్షం చేరుకున్నారు. ఆయాచితంగా లభించి ఉన్న సంపదను వెచ్చించి జాతీయోద్యమంలో ఒక వెలుగు వెలిగారు. అనంతరం అందివచ్చిన అవకాశాలన్నిటినీ సొంతం చేసుకుని రాజకీయంగా మాత్రమే కాకుండా ఆర్థికంగా మరింత సంపన్నులయ్యారు.

స్వతంత్ర భారతంలో ఆ సంపద అండదండలతో సంస్థాధీశులు రంగులు మార్చి రాజకీయవేత్తలుగా రాజకీయ రంగ ప్రవేశం చేశారు. అనాదిగా రాజభక్తి, ప్రభుభక్తి అపారంగా గల భారతీయులు, సుమారు వంద సంవత్సరాల క్రితం నాటి సంస్థానాధీశులు, ఆ సంస్థానాధీశుల వారసులు నిసిగ్గుగా పాల్పడిన విద్రోహాన్ని, అలనాటి వారి పాపాలను పూర్తిగా మర్చిపోయి రాజకీయరంగంలో వారికి పెద్దపీట వేయడం స్వతంత్ర భారతంలోని పెను విషాదం !

ఆ అవకాశాన్ని అందిపుచ్చుకున్న సంస్థానాధీశుల వారసులు క్రమంగా ప్రజాస్వామిక వ్యవస్థలోని లోటుపాట్లను తమకు అనుకూలంగా మలచుకుని, తిన్నగా రాజకీయ రంగంలో గట్టి పట్టును సంపాదించుకున్నారు. ప్రస్తుత ప్రజాస్వామిక

రాజకీయాలలో మంత్రులు, ముఖ్యమంత్రులు, గవర్నర్‌గిరీ లాంటి పెద్దపెద్ద పదవులను సంపాదించుకుని అందలాలెక్కి అధికారం చలాయిస్తున్నారు. అందివచ్చిన సంపదతో పెద్దపెద్ద పారిశ్రామికవేత్తలుగా మారి మరింత సంపన్నులుగా మరికొందరు ప్రజా జీవితాలను శాసించగలగుతున్నారు. అత్యధికులు అధికారంతోపాటు మరింత సంపద కూడ బెట్టుకునే అవకాశాలను తమ గుప్పెట పెట్టుకుని అన్ని సౌఖ్యాలు అనుభవిస్తున్నారు.

ఆనాడు ఆంగ్లేయులకు వ్యతిరేకంగా పోరుబాట సాగిన యోధుల వారసులలో చాలా మంది సర్వం కోల్పోయి ఆచూకి కూడా కానరాని దుస్థితిలో ఉన్నారు. చిన్నాచితకా పనులు చేసుకుంటూ బ్రతుకులు వెళ్ళమార్చుతున్నారు. అలనాటి త్యాగమూర్తుల కుటుంబాలను ఎవ్వరూ పట్టించుకోవడం లేదు. ప్రభుత్వాలు, ప్రభుత్వాధి నేతలు కూడా తమ ప్రయోజనాలకనుసారంగా వ్యవహరిస్తున్నారు. ప్రజలలో బాగా ప్రచారం పొందిన యోధుల గురించి మాత్రమే మళ్ళీ మళ్ళీ కార్యక్రమాలు నిర్వహిస్తూ ప్రజలలో తామేదో చేస్తూన్నామన్న ప్రచారాన్ని కల్పించుకుంటున్నారు. ప్రజలు మర్చిపోయిన, ప్రజలకు తెలియని త్యాగధనులలను, సాహస వీరులను ఏమాత్రం గుర్తుకు చేయడంలేదు. ఆ యోధుల స్మృతిగా చిన్నపాటి కార్యక్రమాలు కూడా నిర్వహించడం లేదు. ఆ కారణంగా అలనాటి యోధుల స్మృతులు, ఆ యోధుల వారసుల పరిస్థితులు ప్రజలకు తెలియకుండా పోతున్నాయి.

అలనాటి మహోన్నత చరిత్రకు ప్రాణం పోసిన పోరాట యోధుల చరిత్ర తెలుసుకుందామని ప్రయత్నించే చరిత్రకారులు, నిత్యాన్వేషకులైన పాత్రికేయులు, చరిత్ర పట్ల ప్రత్యేకాసక్తి గల ప్రజల కృషి పుణ్యమా అని అప్పుడప్పుడు అక్కడక్కడా అలనాటి యోధుల వారసులు కొంత మంది వెలుగులోకి వస్తున్నారు. ఆ విధంగా మీడియా ద్వారా పదిమందికి దృష్టికి వచ్చినా వారు గుర్రపుబండి నడుతున్నారనో బడ్డీకొట్టు పెట్టుకున్నారనో, టీ-కాఫీలు అమ్ముకుంటున్నారనో, రిక్షా లాగుతున్నారనో, ఎవ్వరూ లేని అనాధలా మందుల కోనుగోలుకు కూడా శక్తిలేక కటిక పేదరికంలో కన్నుమూశారనో ప్రత్యేక కథనాలలో మాత్రమే ఆ త్యాగధనుల వారసుల దుర్భర బ్రతుకు గాధలు వెల్లడి కావడం, అప్పుడప్పుడు తెరల మీద దర్శనమిస్తుండటం చారిత్రక విషాదం.

★ ★ ★

## అధ్యాయం - ౨




# విస్మరణకు గురైన త్యాగాలు

**1957**లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం వందేళ్ళు పూర్తి చేసుకున్న సందర్భంగా భారత ప్రభుత్వం శతాబ్ది సంబరాలను ప్రకటించింది. ఈ సందర్భంగా దేశ వ్యాప్తంగా పలు కార్యక్రమాలు జరిగాయి. అలనాటి యోధులను సంస్మరణార్థం సభలూ సమావేశాలు నిర్వహించారు. ఆ యోధుల సాహసోపేత త్యాగాలను గుర్తుచేస్తూ పలు గ్రంథాలు ప్రచురితమయ్యాయి.

ఈ సంబరాల పరంపరలో మాతృభూమి పట్ల అపార ప్రేమాభిమానాలు వెల్లడిస్తూ, ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని అసమాన ధైర్య సాహసాలతో అపార బలసంపత్తి కలిగిన ఆంగ్ల సైన్యాలతో పోరాడి సర్వం త్యాగం చేసిన ముస్లిం యోధుల త్యాగాలను ప్రభుత్వాలు, ప్రజలు తగినంత గుర్తింపు-గౌరవం ఇవ్వకుండా విస్మరించారు.

ఈ విధంగా విస్మరణకు గురైన ప్రముఖులలో బేగం హజరత్ మహల్, మౌల్వీ అహ్మదుల్లా ఫైజాబాది, అజీముల్లా ఖాన్, ఖాన్ బహదూర్ ఖాన్, బేగం అజీజున్, మౌల్వీ లియాఖత్ అలీ, మౌల్వీ అహ్మద్ అలీ ఖాన్, సర్దార్ హిక్మతుల్లా , షెహజాదా ఫిరోజ్ షా లాంటి యోధులు ఎందరో ఉన్నారు.

ప్రస్తుతం ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామం 150 సంవత్సరాలను పూర్తి చేసుకున్న చారిత్రక సందర్భాన్ని పురస్కరించుకుని భారత ప్రభుత్వం నూటాయాభై సంవత్సరాల సంబరాలను ప్రకటించింది. 2007 మే 11 నుండి 2008 మే 11 వరకు ఈ సంబరాలను నిర్వహించేందుకు మూడు వందల కోట్లు కేటాయించినట్టు తెలుస్తుంది. ఈ ప్రకటన మేరకు వివిధ రాష్ట్రాలు కూడా సంబరాల నిర్వహణకు పూనుకున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా 2007 ఆగష్టు నుండి 2008 ఆగష్టు వరకు వివిధ కార్యక్రమాలు నిర్వహణకు నడుంకట్టింది.

ఈ మేరకు ఇటు దేశ వ్యాప్తంగానూ అటు పలు రాష్ట్రాలలోనూ కార్యక్రమాలు ఆరంభమయ్యాయి. ఈ సంస్మరణ కార్యక్రమాలలో ఇతర ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామ యోధుల సరసన ముస్లిం యోధులకు తగిన స్థానం గానీ, ప్రాధాన్యత గానీ దక్కడం లేదు. ప్రముఖ యోధుల పేర్లను నామమాత్రంగా కూడా స్మరించకుండా ప్రభుత్వాల ఆధ్వర్యంలో కార్యక్రమాలు జరుగుతున్నాయి. ఆయా నేతల చిత్రపటాలు కూడా లేకుండా సభలు సమావేశాలు సాగుతున్నాయి. బ్రిటీష్ సైన్యాల పాలిట అరివీర భయంకరులుగా ఖ్యాతిగాంచి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో వీరవిహారం చేసిన యోధానుయోధుల ప్రస్తావనలు లేకుండా ప్రముఖుల ప్రసంగాలు జరుగుతున్నాయి.

ప్రజా సంఘాలు, ప్రజలు పలు కార్యక్రమాలను నిర్వహిస్తున్నప్పటికీ ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొన్న ముస్లిం యోధుల గురించి తెలియాల్సినంతగా వారికి తెలియకపోవటంతో తమకు తెలిసిన యోధుల మేరకు మళ్ళీ మళ్ళీ కార్యకలాపాలు జరుపుకుంటూ, వారిని గుర్తు చేసుకుంటూ గౌరవించుకుంటున్నారు.

ఈ పరిస్థితిని గమనిస్తే 1957 నాటి విస్మరణ రమారమి 2007లో కూడా పునరావృతం అయిందన్పిస్తుంది. ఈ విస్మరణను ప్రశ్నించిన వారు లేరు. ప్రశ్నించాల్సిన అవసరం ఉందన్న విషయం కూడా మేధావులకు కలగడం లేదు. స్వాతంత్ర్య సంగ్రామ యోధులు మతాలకు కులాలకు **అతీతంగా** పోరుబాట సాగించారు కనుక మతం పేరిట వారిని విడదీసి కార్యక్రమాలు జరపటం ఉచితం కాదని కొంతమంది వాదిస్తూ ముస్లిం యోధులను స్మరించటమే మర్చిపోతున్నారు ! దురదృష్టవశాత్తు ఈ రకమైన మానసిక వాతావరణం బాగా తయారై ఉంది. ఈ వాతావరణం ఏర్పాటుకు గత చరిత్ర చాలా ఉంది. ఆ చరిత్రను సక్రమంగా అవగాహన చేసుకుంటే గాని ఈ విస్మరణ మానసిక స్థితికి కారణం సరిగా అవగతం కాదు.

అవధ్ నవాబు వాజిద్ అలీ ఖాన్‌ను ఆంగ్లేయులు గద్దె దించి కలకత్తాకు పంపించినా, ఆయన భార్య బేగం హజరత్ మహల్ మాత్రం అవధ్ రాజధాని లక్నోలో ఉండిపోయి స్వదేశీపాలకులను, ప్రజలను ఏకం చేసి ఆంగ్లేయుల నుండి లక్నోకు విముక్తి కలిగించి 10 మాసాల పాటు తన బిడ్డడు బిర్జిస్ ఖదీర్ పేరిట స్వతంత్రంగా రాజ్యం చేశారు. ఆంగ్ల సేనలతో పలుమార్లు తలపడి, చివరకు లక్నోను భారీ సంఖ్యలో బ్రిటీష్ బలగాలు చుట్టుముట్టగా పోరాటం సాగిస్తూనే గత్యంతరం లేని పరిస్థితులలో ఆమె నేపాల్ అడవుల్లోకి నిష్క్రమించారు. అజ్ఞాతంలో బలగాలను సమకూర్చుకుంటున్న ఆమెకు 20 లక్షల నజరానా ఇస్తామని ప్రకటించినా మాతృభూమి తప్ప తనకు మరొకటి అక్కర లేదంటూ పోరుబాట వీడకుండా ముందుకుసాగుతూ 1874 లో నేపాల్ అడవుల్లో సామాన్య మహిళగా కన్నుమూసింది. ఆమె భౌతికకాయాన్ని ఖాట్మండులో ఇమాంబారాలో ఖననం చేశారు. ఆ సమాధి ప్రాంతం 1957నాటికల్లా శిథిలావస్థకు చేరుకుంది

1957లో ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ శతాబ్ది ఉత్సవాలు జరుపుకుంటున్న సందర్భంగా ఖాట్మండులోని ఆ మహాయోధ సమాధికి ఏర్పడిన దుస్థితిని ఆమె వంశజుడు మిర్జా ఆజం ఖదీర్ స్వయంగా ప్రధాని పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ దృష్టికి తెచ్చారు. ఆ మహాయోధురాలి స్మృతి చిహ్నంగా మిగిలి ఉన్న సమాధి నిర్లక్ష్యానికి గురికావడం గురించి తెలుసుకున్న ప్రధాని నెహ్రూ బాధను వ్యక్తం చేస్తూ తగిన శ్రద్ధ తీసుకుంటానని తెలిపి బేగం హజరత్ మహల్ సమాధి ఫోటోలు తీయించి ఆజం ఖదీర్‌కు పంపారు. ఆ ఫోటోలతోపాటుగా నేపాల్‌లోని భారత రాయబార కార్యాలయం ఆ సమాధి సంరక్షణ బాధ్యతను కూడా తీసుకుంటుందని ప్రధాని నెహ్రూ హామీ ఇచ్చారు.

ఆ హామీలు అమలుకు నోచుకోలేదు సరికదా ఆ సంవత్సరం ఉత్తరప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో జరిగిన ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామ శతాబ్ది ఉత్సవాలలో బేగం హజరత్ మహల్ ప్రస్తావన కూడా రాలేదు. నేపాల్‌లోని బేగం హజరత్ మహల్ సమాధి మరింతగా విస్మరణకు గురై పూర్తిగా శిథిలావస్థకు చేరుకున్న విషయాన్ని ఆ తరువాత పత్రికలు, ప్రజలు నెత్తీనోరు కొట్టుకున్నాకగాని ప్రభుత్వానికీ, ప్రభుత్వాధి నేతలకూ ఆ విషయం పట్టలేదు. ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం మీద విమర్శలు చెలరేగడంతో లక్నోలోని ఒక పార్కుకు బేగం హజరత్ మహల్ పేరు పెట్టి ప్రభుత్వం చేతులు దులుపుకుంది.

1857 నాటి ప్రముఖ యోధాగ్రేసులలో ఒకరైన మౌల్వీ అహ్మదుల్లా ఫైజాబాది లాంటి వారిని కూడా 1957లో పూర్తిగా విస్మరించారు. ఆయన ఆంగ్ల సైన్యాలను పలు మార్లు పరాజితుల్ని చేసి బ్రిటీష్ సైన్యాధికారుల గుండెల్లో గుబులు పుట్టించారు. ఆ యోధుని ధాటికి తట్టుకోలేక పోయిన కంపెనీ ప్రభుత్వం మౌల్వీని సజీవంగా గానీ నిర్జీవంగా గానీ పట్టి ఇచ్చిన వారికి 50 వేల రూపాయల నజరానా ప్రకటించింది. ఆనాడు మరెవ్వరి కోసమూ అంతటి నజరానాను బ్రిటీష్ ప్రభుత్వం ప్రకటించిన దాఖలాలు లేవు. నూటాయాభై సంవత్సరాల క్రితం ఒక వ్యక్తి తలకు ఆంగ్ల ప్రభుత్వం 50వేల రూపాయల ఖరీదు కట్టిందంటే ఆ యోధుడు ఎంతటి రణధీరుడో అర్థం చేసుకోవచ్చు.

ఆరంభం నుండి ఆంగ్లేయులకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటం సాగించి అసువులు బాసిన బేగం హజరత్ మహల్, బేగం అజీజున్ ఎందుకు, ఎలా విస్మరణకు గురయ్యారు? అదే సందర్భంలో గత్యంతరంలేని పరిస్థితుల్లో, డోలాయమాన మానసిక అవస్థలో యుద్ధరంగ ప్రవేశం చేసిన ఝూన్సీ రాణి లక్ష్మీబాయి లాంటివాళ్ళు అన్ని వేళలా ఎలా స్మరణకు వస్తున్నారు? ఇదే విధంగా ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో సాహసోపేత చర్యల ద్వారా చరిత్రలో ప్రత్యేక అధ్యాయాలను సృష్టించిన అజీముల్లా ఖాన్, ఖాన్ బహదూర్ ఖాన్, భక్త ఖాన్, మౌల్వీ లియాఖత్ అలీ, మౌల్వీ అహ్మద్ అలీ ఖాన్, సర్దార్ హిక్మతుల్లా, ఫిరోజ్ షా లాంటి యోధులు ప్రజల స్మృతిపథంలోకి ఎందుకు రావడం లేదు. ప్రభుత్వాల విస్మరణకు ఎందుకు గురయ్యారు?

ఈ పరిస్థితికి ఒకవైపు ప్రభుత్వాల నిర్లక్ష్యం మరొకపైపు హిందూ-ముస్లింల మధ్య ఏర్పడిన **మానసిక ఎడం** ప్రధాన కారణాలుగా చెప్పుకోవచ్చు. ఈ అవాంఛనీయ మానసిక వాతావరణం ఏర్పడడానికి ఆంగ్ల ప్రభుత్వం, ఆంగ్ల చరిత్రకారులు 1857 నుండే బీజాలు వేశారు. ఆ విధంగా మొలిచిన మొలకలకు ఆంగ్ల చరిత్రకారుల కథనాల మీద ఆధారపడి స్వదేశీ చరిత్రకారులు సృష్టించిన చరిత్ర నీళ్ళుపోసి-ఎరువు వేసి వృక్షాలుగా ఎదగడానికి సహాయపడింది. ఈ వృక్షాలను మతోన్మాదం ఆసరాతో రాజ్యాధికారాన్ని చేపట్టాలన్న లక్ష్యంతో చరిత్ర రచనకు మతతత్వం దృక్పథాన్ని జోడించి నిరంతరం ఆ దిశగా కృషి సల్పుతున్న శక్తులూ-వ్యక్తులూ వటవృక్షాలుగా మార్చుతున్నారు. ఆ కారణంగా హిందూ-ముస్లింల మధ్య మానసిక విభజన రేఖ మరింతగా బలపడుతూ విషపూరిత, విస్మరణ వాతావరణం సృష్టించబడుతోంది.

ఇండియాను క్రమంగా చేజిక్కుంచుకున్న బ్రిటీష్ ప్రభుత్వం తన పరిపాలనకు స్థానిక ప్రజల సమ్మతి సాధించేందుకు సృష్టించిన చరిత్ర ఈ మానసిక విభజన రేఖ ఏర్పడడానికి ప్రథమ కారణం మాత్రమే కాకుండా ప్రధాన కారణంగా కూడా చెప్పుకోవచ్చు. ఆంగ్లేయులకు పూర్వం భారత భూభాగంలోని అత్యధిక భాగానికి పాలకులుగా ఉన్న ఇస్లాం మతావలంబకులైన రాజుల పాలన కంటే తమ పాలన **అద్భుతం**గా ఉందన్న అభిప్రాయం ప్రజలలో కలిగించడానికి ఆంగ్లేయాధికారులు ఒక పథకం ప్రకారంగా ప్రయత్నాలు చేశారు; ఆ ప్రయత్నాలను పలు మార్గాల ద్వారా సాగించారు.

ఆ ప్రయత్నాలలో భాగంగా 1857, తరువాత భారతీయుల పట్ల తాము అనుసరిస్తున్న రాజకీయ వైఖరిని ఆంగ్లేయులు పునస్సమీక్షించుకుని, 1821 నాటి తమ **'విభజించి పాలించు'** (Divide et impera) విధానాన్ని 1857 తరువాత మరింత ముమ్మరంగా అనుసరించటం ఆరంభించారు. ఈ అనుసరణలో భాగంగా **గతంలోని ముస్లింల పాలన కంటే ఆంగ్లేయులు పాలన చాలా బాగుందన్న** ప్రచారాన్ని నిర్వహించారు.

భారత దేశంలో ముస్లిం రాజులు ప్రవేశించక ముందు ఇక్కడి **సభ్యత-సంస్కృతి** మహోన్నతంగా ఉన్నాయని, ముస్లింల ప్రవేశం తరువాత, ముస్లిం పాలకుల చర్యల వలన అవి అథోదశకు చేరుకున్నాయని ప్రచారం చేశారు. ఈ దుష్ప్రచారం కోసం ప్రత్యేకంగా కొందరు అధికారులను, చరిత్రకారులను నియమించి, కుప్పలు తెప్పలుగా గ్రంథాలు రాయించారు. ఆ గ్రంథాలలోని విషయాలను ప్రజలలో ప్రచారానికి పెట్టారు. ఈ కార్యక్రమానికి ఆంగ్లేయ ప్రభుత్వం, అధికారులు అన్ని మార్గాలను, అన్ని అవకాశాలను సమర్థవంతంగా ఉపయోగించుకున్నారు.

ఈ విషయంలో సర్ విలియం జోన్స్, థామస్ ముర్రే, ఛార్లెస్ గ్రాంట్, జేమ్స్ మిల్, యెచ్.యం. ఇలియట్ లాంటి ఆంగ్లేయ చరిత్రకారులు, అధికారులు చాలా బలమైన పాత్ర పోషించారు. ఈ లక్ష్యాన్ని ప్రచారంలో పెట్టేందుకు పలు పుస్తకాలు రాశారు. కరపత్రాలు ప్రచురించారు. ఆంగ్ల ప్రభుత్వ ఆర్థిక సహాయం మీద ఆధారపడిన తైనాతీల చేత తాము కోరిన విధంగా ఆంగ్లేయులు చరిత్ర గ్రంథాలను రాయించుకున్నారు. ఆ విధంగా రాయబడిన చరిత్రను తమ అనుకూల ప్రచారానికి ఉపయోగించుకున్నారు.

ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ J.S. Grewal తన పుస్తకం **Muslim Rule in India : The Assessment of British Historians** (Oxford University

Press,1970) లో British administrators, scholars, historians and missionaries, all became seriously involved in making the people to believe that British rule was better than the medieval Muslim Rule అన్నాడు.

బ్రిటీషర్ల పాలన **ముస్లింల పాలన** కంటే భేషైనదన్న భావం ప్రజలలో కలుగు చేయాలన్న లక్ష్యంతో రంగంలోకి దిగిన ఆంగ్లేయులు తొలుతగా Ancient Indian Civilization ను శ్లాఘిస్తూ గ్రంథాలు సృష్టించారు. ఆనాటి శ్లాఘనీయ Ancient Indian Civilization వినాశనానికి ముస్లిం పాలకుల దాడులు కారణమని ఆరోపణలు చేశారు. ఈ కృషిలో Sir William Jones, Thomas Maurice లాంటి చరిత్రకారులు ప్రధాన పాత్ర వహించారు. ఆంగ్లేయులు నిర్దేశించుకున్న గమ్యం దిశగా చరిత్ర రచన చేసిన ఈ రచయితలు తమ గ్రంథాలలో ముస్లింల పట్ల పచ్చి విద్వేషాన్ని వెళ్లగ్రక్కారు. Sir William Jones ఆరంభించిన విద్వేష ప్రచారాన్ని Thomas Maurice కొనసాగిస్తూ, తాను రాసిన **Modern History of Hindustan** లో ముస్లిం విద్వేషకుని పాత్రను ప్రతిభావంతంగా పోషిస్తూ, ముస్లిం ప్రభువులను విధ్యంసకులు, కాముకులు, కర్కశులు, వినాశకులు, భోగలాలసులని అభివర్ణించాడు.

ముస్లిం వ్యతిరేక వారసత్వాన్ని మరింత ముందుకు తీసుకువెడుతూ ఇస్లాం విద్వేషకుడిగా ప్రసిద్ధిపొందిన Charles Grant ముస్లిం పాలకులను **కాముకులు, మత దురహంకారులు**గా (Sensual, begotted) చిత్రిస్తూ వినాశకరమైన రంగులను పులిమాడు. G.R Cleig ఇస్లాం మీద దాడి ఆరంభించాడు. ముహమ్మద్ ప్రవక్త జీవితం మీద ఆధారాలు లేని **విమర్శనాత్మక** బాణాలను సంధించాడు. ముస్లిం పాలకుడు ముహమ్మద్ ఘోరి చర్యలను దుయ్యబడుతూ మతావేశంగల అతడు హిందూ దేవాలయాల విధ్వంసకుడనీ, జలాలుద్దీన్ ఖిల్జీని వంశపాలన కోసం రక్తపుటేరులు పారించిన భయంకరుడనీ, ముహమ్మద్ బిన్ తుగ్లక్‌ను రాక్షసుడని, ఆడమగ వృద్ధులు, పసివారన్న తేడా లేకుండా భయంకర హత్యాకాండ జరిపిన దుర్మార్గుడని రాసుకున్నాడు.

ఈ విధంగా తమ లక్ష్యానికి అనుగుణంగా అత్యధిక సంఖ్యలో ఉన్న ముస్లిమేతర ప్రజల మనస్సులో **ముస్లిం** పాలకుల పట్ల విద్వేష భావజాలాన్ని పెంచి పోషించే గట్టి వాతావరణం ఏర్పాటు చేసుకున్న తరువాత తమ ప్రభుత్వానికి నైతిక మద్దతును కూడగట్టే ప్రయత్నంలో, ముస్లిం ప్రభువులు **నియంత**లన్న అపప్రధను ఆంగ్లేయ రచయితలు, చరిత్రకారులు విజయవంతంగా అంటగట్టారు.

ఆ క్రమంలో ఆంగ్లేయ చరిత్రకారుడు జేమ్స్ మిల్ (James Mill) **History of British India** గ్రంథాన్ని రచించి, ఆ గ్రంథంలో పాలకుల మతాన్ని బట్టి భారతదేశ చరిత్రను 'హిందూ యుగం', 'ముస్లిం యుగం', 'బ్రిటీష్ యుగం' అని విభజించాడు. హిందూ రాజుల పాలనను హిందూ యుగంగా, ముస్లిం రాజుల పాలనను ముస్లిం యుగంగా, ఆంగ్లేయుల పాలనా కాలాన్ని మాత్రం క్రైస్తవ యుగం అనకుండా బ్రిటీష్ యుగంగా విభజించి చరిత్రకు మతాన్ని జోడించి దుర్మార్గం చేశాడు. ఆ దుర్మార్గంలో భాగంగా ముస్లింల పాలనను a notorious tale of unprovoked aggression, unprincipled ambition, insurrection, disorder, insecurity, tyranny as well as dynastic revolutions అని అభివర్ణిస్తూ తన భాధ్యతను మరింత విజయవంతంగా నిర్వహించాడు.

ఈ రాతలు రాస్తున్నప్పుడు ఇండియాలోని ముస్లింలలో అత్యధికులు భూమి పుత్రులన్న విషయాన్ని బ్రిటీష్ చరిత్రకారులు ఉద్దేశ్యపూర్వకంగా విస్మరించారు. ముస్లింలు అనగానే **విదేశీయులన్న** భావనను స్థానికంగా ఉన్న ముస్లిమేతర ప్రజలలో లంగా ప్రచారం చేశారు. ఆ విధంగా ప్రచారం చేసి ముస్లింలను ఇండియాలోని ముస్లిమేతరుల నుంచి దూరం చేయాలని ఆంగ్లేయులు ఉద్దేశించారు. ఈ క్రమంలో బ్రిటీష్ ప్రభుత్వం ప్రజలకు, ముఖ్యంగా హిందూ ప్రజలకు, లభించిన **గొప్ప వరంగా** అభివర్ణిస్తూ, అందుకు అనుగుణంగా గ్రేట్ బ్రిటన్ నైతికంగా, మేధోపరంగా ఇండియాను పాలించగల అత్యుత్తమ సత్తా కలిగిఉందని చెప్పుకొచ్చారు, ప్రచారం చేసుకున్నారు.

రాజ్యాలు పోయినా, రాజరికం అంతరించినా, అధికారాలను కొల్పోయినా ముస్లిం ప్రభువుల, ఆ పాలకుల వారసులపట్ల స్థానికులు, ప్రధానంగా **హిందువులు** చూపుతున్న విధేయతను ఆంగ్లేయులు జీర్ణం చేసుకోలేక పోయారు. అధికారాలు లేకున్నా స్థానిక పాలకుల పట్ల ప్రజలలో గాఢంగా నెలకొన్న గౌరవాభిమానాల దృష్ట్యా, ఆంగ్లేయులకు భారత దేశం మీద సంపూర్ణ ఆధిపత్యం సంప్రాప్తించినా పరిపాలన మాత్రం స్థానిక ప్రభువుల పేరిట మాత్రమే సాగించాల్సి వచ్చింది. 1765 నాటి షా ఆలం దగ్గర నుండి 1857 నాటి చివరి మొగల్ ప్రభువు బహదూర్ షా జఫర్ వరకు ఈ పద్ధతిని ఆంగ్లేయులు పాటించాల్సిన అగత్యం ఎదురయ్యింది.

ఒక సమయంలో బహదూర్ షా జఫర్ చక్రవర్తిగా తన వారసుడ్ని ప్రకటించే

అధికారాన్ని కూడా రద్దు చేసేందుకు, చక్రవర్తి పరివారాన్ని ఎర్రకోట నుండి కుతుబ్ (Qutub) కు తరలించేందుకు Lord Ellenborough ఎత్తులు వేశాడు. ప్రజల నుండి వ్యతిరేకత వ్యక్తం కాగలదన్న భయంతో ఆ ప్రయత్నాలను మానుకుని మిన్నకుండిపోయాడు. ముస్లిం ప్రభువులు కట్టించిన నిర్మాణాలను కూల్చివేయాలని, జుమా మసీదు, తాజ్ మహల్ లాంటి చారిత్రక కట్టడాలను, ఢిల్లీలోని ప్రతి మస్జిద్‌ను పూర్తిగా విధ్వంసం చేయాలనీ ఆంగ్లేయ సైనికాధికారులు హ్రస్వదృష్టితో ఆలోచించినా అటువంటి చర్యలకు అన్ని వర్గాల ప్రజల నుండి వ్యతిరేకత ఎదురు కాగలదన్న భయంవల్ల ఆ ఆలోచనలకు స్వస్తి చెప్పాల్సి వచ్చింది.

ఈ విధంగా స్వదేశీ పాలకుల పట్ల ప్రజలు ఏర్పర్చుకున్న అతి బలమైన మానసిక అనుబంధం పటిష్టతను గమనించిన ఆంగ్లేయులు ఆ బంధాలను క్రమంగా బలహీన పర్చడానికి, చివరకు విచ్ఛిన్నం చేయడానికి నడుం బిగించారు. ఈ బంధాన్ని బలహీన పర్చినట్టయితే ఇటు స్థానిక ప్రజలతో స్థానిక ప్రభువులు కలిగియున్న సంబంధాలు అంతరించడమే కాకుండా హిందూ-ముస్లింల మధ్యనున్న ఐక్యతకు విఘాతం కలిగించవచ్చన్న పన్నాగం పన్నారు.

ఆ నిర్ణయం మేరకు ముస్లిం పాలకుల పట్ల హిందూ జనసముదాయంలో వ్యతిరేకత పెంపొందించేందుకు ప్రత్యేకంగా ప్రయత్నాలు ఆరంభించారు. ప్రధానంగా మధ్యయుగాల నాటి ముస్లిం ప్రభువుల మీద బురద చల్లేందుకు సన్నాహాలు ఆరంభించారు. మొగలులు ఇండియా ప్రవేశం చేసేంత వరకు చరిత్ర నమోదు చేయటం అలవాటు లేని భారతీయులకు తాము వారి చరిత్రను అందిస్తున్నామంటూ తమ ప్రయోజనాలకు అనుకూలంగా చిత్రించిన, వక్రీకరించిన చరిత్రను గ్రంథాల రూపంలో అందించారు.

ఈ గ్రంథాల ద్వారా **ముస్లిం ప్రభువుల నియంతృత్వం** ప్రధానాంశం చేశారు. ముస్లిం పాలకులు స్థానిక ప్రజల పట్ల అత్యంత క్రూరంగా వ్యవహరించారని చెప్పుకొచ్చారు. ముస్లిం ప్రభువులంతా మత దురహంకారులని, ఇస్లాం మత ప్రచారం, వ్యాప్తి వారి లక్ష్యమని ప్రకటించారు. **పరమత విద్వేషకులైన** ముస్లిం పాలకులు హిందువుల పవిత్ర దేవాలయాలను అపవిత్రం చేశారన్నారు. ఆధ్యాత్మిక ప్రాధాన్యత గల ఆలయాలను కూలద్రోశారన్నారు.

వాస్తవ చరిత్ర వెల్లడిస్తున్న సత్యాలను, వాస్తవాలను పూర్తిగా మరుగున పెట్టి, ఈ

గ్రంథాల ఆధారంగా బ్రిటీష్ ప్రభుత్వం, బ్రిటీష్ అధికారులు, బ్రిటీష్ మేధావులు, క్రైస్తవ మిషనరీలు కూడగట్టుకుని మధ్యయుగాల ముస్లిం రాజులను హిందువుల పట్ల, హిందూ మత గ్రంథాల పట్ల, హిందూ దేవాలయాల పట్ల అత్యంత క్రౌర్యంగా వ్యవహరించిన హంతకులని, విధ్వంసకులని, నియంతలని ప్రచారంచేశారు. ఈ వరుసలో అల్లావుద్దీన్ ఖిల్జీ, ముహమ్మద్ బిన్ తుగ్లక్ దగ్గర నుండి చివరకు బాబర్, అక్బర్, ఔరంగజేబ్ లను అప్రతిష్టపాల్జేసి అన్ని విధాల హిందువులను హింసించిన **హిందూ వ్యతిరేకులుగా, ప్రజల సంక్షేమం పట్టని భోగలాలసులుగా** చిత్రించగలిగారు.

ఆ బాటలో Sir Henry William Elliot లాంటి ఆంగ్లేయాధికారి తాను సంకలనం చేసిన గ్రంథం ప్రస్తావనలో **ముస్లింలు తమతో వివాదం పెట్టుకున్న హిందువులను నిర్దాక్షిణ్యంగా హతమార్చేవారు. వారి దేవాలయాలను ధ్వంసంచేసి, వారి దేవతా విగ్రహాలను ఛిన్నాభిన్నం చేసేవారు. బలవంతపు మతమార్పిడులు, బలవంతపు మతాంతర వివాహాలు, సామూహిక హత్యలు జరిపేవారు, మరణదండనలు, దేశ బహిష్కార శిక్షలు, కొరడా దెబ్బలు లాంటి కఠిన శిక్షలు విధించేవారు. ముస్లింలు త్రాగుబోతులు, భోగలాలసులు** అని రాశాడు. (**భారతీయ ముస్లింలు**, షాలీ రహంతుల్లా, అనంతపురం, 2003, పేజిలు. 27–28)

ఈ విధంగా అటు చరిత్ర గ్రంథాలను రూపొందించడం, ఆ చరిత్ర గ్రంథాలకు ప్రజలలో మంచి ప్రచారం కల్పించడం, వాటిని పాఠశాలలు–కళాశాలలలో విద్యార్థులకు బోధించడం మొదలైన చర్యల ద్వారా **ముస్లిం ప్రభువుల పాలన కన్నా ఆంగ్లేయ పాలన మిన్న** అనే భావజాలాన్ని ప్రజలలో ప్రచారం చేసి అత్యధిక ప్రజా శ్రేణుల సమ్మతిని సాధించటంలో బ్రిటీష్ ప్రభుత్వం చాలా వరకు విజయం సాధించగలిగింది.

ఈ ప్రయత్నాల ప్రభావం చాలామంది భారతీయ మేధావుల మీద కూడా గాఢంగా పడింది. ఈ మేధావులు ఆంగ్లేయులు సృష్టించిన అవాస్తవ చరిత్రను వాస్తవ చరిత్రగా నమ్మి ముస్లిం ప్రభువుల పట్ల మాత్రమే కాకుండా ముస్లిం ప్రజల పట్ల కూడా వ్యతిరేక భావనలను ప్రతిష్టించుకున్నారు. ప్రభువులు–పాలకులు వేర్వేరన్న విషయాన్ని పరిగణలోకి తీసుకోకుండా పాలకుల తప్పిదాలను పాలితులకు అంటకట్టారు. పాలకులు ఎవ్వరైనా పాలితుల పట్ల ఒకే రకంగా వ్యవహరిస్తారనీ, తమ అధికారాన్ని, పెత్తనాన్ని ప్రశ్నించే ప్రజల పట్ల హిందూ ప్రభువులైనా, ముస్లిం పాలకులెవ్వరైనా ఒకే రకంగా ప్రతిస్పందిస్తారన్న

విషయాన్ని విస్మరించి, ముస్లిం పాలకులు క్రూరులని తీర్మానించుకున్న కొందరు ముస్లిం ప్రజలకు కూడా ఆ క్రూరత్వాన్ని అంటగట్టారు.

బ్రిటీష్ చరిత్రకారుల గ్రంథాల మీద ఆధారపడి వాస్తవాలకు అతీతంగా ముస్లిం వ్యతిరేక నిర్ణయాలకు వచ్చిన స్వదేశీయులు, స్వదేశీ చరిత్రకారులు, ఆంగ్లేయుల బాటలో నడిచి పరాయి పాలకుల పెత్తనం కమ్మగా ఉందన్న అభిప్రాయాన్ని తమ చర్యల ద్వారా, రచనల ద్వారా ప్రజలో కలుగ చేశారు. ఓ నిర్దిష్ట ప్రయోజనాన్ని రాబట్టేందుకు ప్రయత్నిస్తున్న ప్రయోజనవాదులైన ఆంగ్లేయ చరిత్రకారుల ఎత్తులను అర్థం చేసుకోలేక కొందరు, ఆంగ్లేయుల చరిత్ర రచనను వాస్తంగా భావించిన మరికొందరు, ఆంగ్లేయుల అనుగ్రహం కోసం ఉద్దేశ్యపూర్వకంగా ఇంకొందరు, ముస్లింలంటే ద్వేషభావం కలిగి ఉన్న మరికొందరు ఆంగ్లేయుల పక్షాన వకాల్తా తీసుకుని తమ రచనలలో **ముస్లింల క్రూర పాలన** అను అంశాన్ని ప్రధానంగా ప్రస్తావించారు.

ఈ నేపథ్యంలో ఆంగ్లేయుల అనుకూల ప్రక్రియ **ఆధునిక భారత పితామహుడు** (Father of Modern India) గా ఖ్యాతిగాంచిన ప్రముఖుడు రాజా రాంమోహన్ రాయ్ నుండి ప్రారంభమైంది. ఆంగ్లేయులు **హిందువులను ముస్లిం నియతృత్వం నుండి విముక్తి కలిగించారన్న** భావనకు ఆయన మద్దతు నిచ్చాడు. ఆయన బ్రిటీష్ రాజుకు రాసిన ఒక లేఖలో **బ్రిటీష్ పాలన భారతీయులకు లభించేంత వరకు తరచుగా వారి (హిందువుల) ఆస్తులు కొల్లగొట్టబడ్డాయి. వారి మతం అవమానించబడింది. వారి రక్తం చిందించ బడింది**, అని రాశాడు.

(Their property was often plundered, their religion insulted and their blood wantonly shed.... till divine providence at last in its abundant mercy, stirred up the British nation to break the yoke of these tyrants and receive the oppressed nations of Bengal under its Protection - **History and Culture of the Indian people** Vol. IX, Bharathiya Vidya Bhavan, Bombay, P.11)

ఆధునిక యుగ ప్రవక్తగా, హిందూ-ఇస్లామిక్-పాశ్చ్యాత్య సంస్కృతుల సమ్మిశ్రిత వ్యక్తిత్వం గల మహనీయుడిగా భావించబడుతున్న రాజా రాంమోహనరాయ్ అభిప్రాయం వెల్లడయ్యాక స్థానిక మేధావులు, సంస్కర్తలు, చరిత్రకారులు ఆ భావాలను యదార్థాలుగా

భావించి యథాతథంగా స్వీకరించారు. ఆయన కంటె మరొక అడుగు ముందుకేసి తమదైన శైలిలో ఆంగ్లేయ చరిత్రకారులు సృష్టించిన భావజాలానికి మరింత పదనుపెట్టారు.

ఆ క్రమంలో ద్వారకానాథ్ టాగూరు, రాజనారాయణ బసు, బంకిం చంద్ర ఛటర్జీ లాంటి ప్రముఖులు రాజా రాంమోహన్ రాయ్ భావాల అడుగుజాడల్లో నడిచారు. బ్రిటీష్ ప్రభుత్వం అందించిన **వరాలను** వివరిస్తూ ద్వారకానాథ్ ఠాగూర్ **ముస్లింల పాలనను** తీవ్రంగా దుయ్యబట్టారు. ఆధునిక జాతీయవాద పితామహుడుగా ఖ్యాతిగాంచిన రాజనారాయణ బసు తన ప్రసిద్ధ బెంగాలి గ్రంథం **Viridha Hindur Asha** (Old Hindus Hope) లో ప్రతిపాదించిన **మహాసమితిలో** మనుస్మృతి ప్రకారం ముస్లింలకు స్థానం లేదన్నాడు. ముస్లింలు ప్రత్యేకంగా తమదైన **మహా ముస్లిం సమితిని** ఏర్పాటు చేసుకోవాలని సూచించాడు. 1886లో రాసిన ఈ గ్రంథంలో వేర్పాటువాద బీజాలను నాటారు. బసు సహచరుడు నాబగోపాల్ 1867లో **జాతి మేలా** ఆరంభించగా, అదికాస్తా **హిందూ మేలాగా** రూపాంతరం చెంది యవనుల (ముస్లింల) పట్ల కఠినంగా వ్యవహరించాలన్నది; పూర్వ సంస్కృతి-సభ్యతల ఔన్నత్యాన్ని పునరుద్ధరించాలన్నదే **హిందూ మేలా** ప్రధాన ఆశయమని ప్రకటితమైంది.

ఆ తరువాత రంగప్రవేశం చేసిన బంకిం చంద్ర చటర్జీ తాను రాసిన **ఆనందమఠం** నవలలోని పాత్రల ద్వారా **ముస్లిం పాలన** పట్ల వ్యతిరేకత వ్యక్తం చేశాడు. ఆంగ్లేయ చరిత్రకారుల బాటలో సాగుతూ బెంగాలు నవాబును **కుల సంపదల రక్షణ విశ్వాసఘాతకుడు, మనుష్యులలో కళంకుడు...ఆత్మరక్షణ చేసుకోలేని బలహీనుడు. ..కడుపునిండా తాగి పడుకుంటాడు** అని తూలనాడాడు. (ఆనంద మఠం, బంకించంద్ర చటర్జీ, జయంతి పబ్లికేషన్స్, విజయవాడ, ఆగష్టు 1998, పేజి. 20). మహామ్మదీయ పాలనలో ధర్మం జరగదని చెబుతూ **మహమ్మదీయులను పాలద్రోలితే మాత్రమే ధర్మం నిలుస్తుంది** అని పాత్రల ద్వారా పలికిస్తాడు (పేజి. 31). **నవాబుల ఇల్లు దోచి సముద్రంలో కలిపివేయాలన్న సంకల్పంతో వున్నాము, ఇప్పుడా తరుణం ఆసన్నమైంది** అంటాడు. (పేజి. 59). ఈ విధంగా ముస్లిం పాలకుల పట్ల వ్యతిరేకతను వ్యక్తంచేసిన బంకించంద్ర అనంద మఠం నవల చివరల్లో ఆంగ్ల రాజ్యం స్థాపనపట్ల అత్యంత మక్కువ చూపుతాడు.

ముస్లింల పాలన అంతరించి ఆంగ్లేయుల పాలన కావాలని కోరుకున్న బంకిం చంద్రుడు తన నవలలోని పాత్రలద్వారా తన వాంఛను ఈ విధంగా వ్యక్తం చేశాడు :

ఆంగ్లేయుల రాజ్యం వస్తే తప్ప, సనాతన ధర్మం ఇక్కడ పునఃస్థాపితం కాదు... **ఆంగ్లేయుల రాజ్యం వచ్చేట్లయితే...హిందువులు జ్ఞానవంతులు, గుణవంతులు, వీర్యవంతులు అవుతారు...రాజదండం ఆంగ్లేయులకు రావడం కోసం సంతానులు ఇన్నాళ్ళు పనిముట్లుగా ఉండి పోరాడారు...ఆంగ్ల రాజ్యం నీవల్ల స్థాపించబడింది... పృథ్వి సస్యశ్యామలం అవుతుంది. జనానికి ఐశ్వర్యం ఎక్కువ అంతుతుంది...ఆంగ్లేయులు మిత్రులు. ఆంగ్లేయులతో యుద్ధం చేసి విజయం సాధించడం ఇప్పటి పరిస్థితులలో సాధ్యం అయ్యే పనికాదు.** (అనందమఠం, బంకించంద్ర చటర్జీ, పేజీలు 126-128) చివరకు సదానందుని పాత్రనుద్దేశించి **నీవు చేయవలసిన పని పూర్తి అయింది. సత్యానందా ! నీవిక ఇక్కడ చేయవలసినది లేదు. అంగ్ల రాజ్యం యిక్కడ సుస్థాపితమయి పోయింది** అని ప్రకటన చేస్తాడు. (పేజి.126)

ఈ విధంగా ఆంగ్లేయుల రాజ్యం రావాలని ఆకాంక్షించిన బంకించంద్రుడు ఆంగ్లేయుల పట్ల ఆరాధనా భావాన్ని వ్యక్తం చేశాడు. ఆయన రాసిన 'రాజసింఘ' (Rajasingha) లో ఔరంగజేబు గురించి రాస్తూ అతడు **మహిళల చేతిలో బంది** అని దారుణమైన వ్యాఖ్యా చేస్తాడు. ఆంగ్లేయ చరిత్రకారులు ఆశించిన విధంగా ముస్లిం పాలకులను, పాలనను తూలనాడాడు.

ఈ వాతావరణం కొందరికి మాత్రమే వరకు పరిమితం కాలేదు ! ఆనాటి మేధావుల రచనల్లో, మాటల్లో, ప్రవర్తనలలో **ముస్లింల నియంతృత్వ పాలన కంటె ఆంగ్లేయుల పాలన చాలా మెరుగైనది** అన్న భావన బలంగా వెల్లడయ్యిందని **Hindu Revivalism in Bengal** గ్రంథ రచయిత K.K. Ghatak పైన ఉదాహరించిన విషయాలన్నిటిని ఉటంకిస్తూ, This was the general attitude of the leading men of the period. Their nationalism was Hindu Nationalism and they preferred British rule of Law to Muslim Tyranny అని అభిప్రాయపడ్డాడు. (For more information see K.K. Ghatak, Hindu Revivalism in Bengal : Rammohan to Ramakrishna, Calcutta,1991, Pp 34-35)

ఆ తరువాతి రోజుల్లో జాతీయవాదం, పునరుద్ధరణవాదం జోడు గుర్రాల్లా సాగాయి. ప్రయోజనవాదులైన ఆంగ్లేయ చరిత్రకారులు సృష్టించిన అవాస్తవ, వక్రీకరణల చరిత్ర ఆధారంగా చరిత్ర రచనకు పూనుకున్న జాతీయవాద-పునరుద్ధరణవాద చరిత్రకారులు జాతీయవాద భావజాలానికి తిరుగులేని బలాన్ని తక్షణమే చేకూర్చాలన్న

తహతహలో హిందూ రాజులుగా తాము భావించిన వారితో యుద్ధాలు చేసిన వారందరినీ **పరాయి దేశస్థులుగా/పరాయివారు**గా చిత్రీకరించారు. **ముస్లిం రాజులతో** యుద్ధాలు చేసినవారందర్ని **జాతీయవాదులు**గా అభివర్ణించారు.

ఈ క్రమంలో అచారిత్రకంగా **జాతీయ పోరాటాలు, జాతీయోద్యమం, విమోచనోద్యమం** వంటి భావజాలాన్ని పొందుపర్చడం జరిగింది. కాకతీయులు, రాజపుత్రులు, విజయనగర రాజులు, మహారాష్ట్రులు వంటి **హిందూ రాజులు**, ఢిల్లీ సుల్తానులు, బహమనీ సుల్తానులు, మొఘలులు వంటి **ముస్లిం పాలకులకు** వ్యతిరేకంగా చేసిన రాజకీయ యుద్ధాలను 'జాతీయ పోరాటాలు'గా,'జాతీయోద్యమం'గా, 'విమోచనోద్యమం'గా పేర్కొంటున్నారు. (చరిత్ర పాఠ్యపుస్తకాల పై మతతత్వం నీడలు, డాక్టర్ జి. సాంబశివా రెడ్డి, **గీటురాయి** వారపత్రిక, 2006 ఆగష్టు 4). ఈ మేరకు సాగిన చరిత్ర రచనలో ముస్లింల మీద ఆంగ్లేయుల సాగించిన దుష్ప్రచారాన్ని స్వదేశీ చరిత్రకారులు యథాతథంగా స్వీకరించారు. ప్రధానంగా **ముస్లిం పాలకుల నియంతృత్వం, కిరాతకత్వం,మతదురహంకారం** అను అంశాల చుట్టూతా చరిత్ర రచన సాగించారు.

ఈనాటికీ ఈ ప్రభావం మన విద్యార్థులు అధ్యయనం చేస్తున్న సెక్యులర్ ప్రభుత్వ చరిత్ర పాఠ్య పుస్తకాలపై ఎంత తీవ్రంగా ఉందన్న విషయాన్ని డాక్టర్ జి. సాంబశివా రెడ్డి సోదాహరణంగా వివరించారు. జాతీయవాదుల నిర్వాకం వల్లనే భారతదేశ చరిత్రలో "మహోజ్వలమైన భారతీయ/ హిందూ సంస్కృతి', "ముస్లింపాలన/విదేశీ పాలన", "హిందూ-ముస్లింపోరాటాలు", "హిందూ-ముస్లిం సంస్కృతి", "జాతీయ వీరులు", "స్వతంత్ర హిందూ సామ్రాజ్యం", "స్వతంత్ర (ముస్లిం) మహమ్మదీయ సామ్రాజ్యం" వంటి ధోరణులు/భావాలు ప్రవేశించి, ఘనీభవించాయి. వీటి వలన మతతత్వ భావజాల-మతతత్వ చరిత్ర రచనా దృక్పథం బలపడింది.' **(చరిత్ర పాఠ్యపుస్తకాల పై మతతత్వం నీడలు, డాక్టర్ జి.సాంబశివారెడ్డి, గీటురాయి వారపత్రిక, జూలై 14, 2006)** అను పదాలు, వాక్యాలు ఉధృతంగా కన్పిస్తాయి.

ఆ కారణంగా మతతత్వ చరిత్ర దృక్పథం గుండా ముస్లిం వ్యతిరేక చరిత్ర తిన్నగా పాపులర్ చరిత్ర గ్రంథాలు, పాఠ్యగ్రంథాలు, కళా-సాహిత్య రంగాలలో ప్రవేశించింది. ఆ మీదట మతతత్వ భావజాల-మతతత్వ చరిత్ర రచనా దృక్పథం చరిత్ర రచనలో మరింత బాగా బలపడింది. ఈ వరవడిలో ఉద్భవించిన గ్రంథాలలో,

సాహిత్య– కళారూపాలలో ఆలోచితంగా గానీ అనాలోచితంగా గానీ **ముస్లిం నియంతృత్వ –ముస్లింల అరాచకాలు** తదితర అంశాలు బలంగా వేళ్ళూనుకున్నాయి.

Prince of Wales ఇండియా రాక సందర్భంగా ప్రముఖ హింది రచయిత భారతేందు హరిశ్చంద్ర రాసిన ఒక కవితలో **బ్రిటీషర్ల పాలన శతాబ్దాల ముస్లిం పాలన పీడనలను** పెళ్లగించిందని ప్రశంసించాడు. భారతీయులలోని మేధాసంపత్తిని, శక్తి సామర్థ్యాలను, సంపదను, విద్యాగంధాన్ని **ముస్లింల పాలన** విధ్వంసం చేసిందన్న ఆరోపణలతో హరిశ్చంద్ర తన సాహిత్య ప్రస్తానాన్ని సాగించారు. మరొక హిందీ రచయిత ప్రతాప్ నారాయణ మిశ్రా కూడా హరిశ్చంద్ర దారిలో సాగుతూ ముస్లింలను **విదేశీయులు, అపవిత్రులు** అని దూషించాడు. సతీ సహగమనం, పర్దా లాంటి సామాజిక రుగ్మతలు ముస్లింలు భారత దేశంలోకి అడుగిడటం వలననే వచ్చాయని ప్రకటించాడు. సుప్రసిద్ధ హిందీ రచయిత రాధాచరణ గోస్వామి బెంగాలీ నుండి హిందీలోకి అనువదించిన ప్రఖ్యాత నాటకం **Bharat Me Yavan Raj** లో మరింత వెనక్కు వెళ్ళి యవనులు, ముస్లింల కబంధహస్తాల నుండి ఆర్యులను విముక్తం చేసినందుకు ఆంగ్లేయులకు కృతజ్ఞతలు తెలుపుకున్నాడు. ఈయనగారు జాతీయోద్యమ నాయకుడు కూడా కావటం గమనార్హం !

ఈ మార్గంలో హిందీ, బెంగాలీ, గుజరాతీ, మరాఠీ తదితర భాషలకు చెందిన సాహితీ ప్రముఖులు గోపాల్‌రావు హరి దేశ్‌ముఖ్, నర్మదా శంకర్, దల్పత్ రాం లాంటి చాలామంది ముస్లిం వ్యతిరేక భావజాలంతో రచనలు చేశారు. ఆంగ్లేయుల భాష, భావజాలాన్ని ఈ రచయితలు-కవులు అనుసరించారు. ఈ రచనలు ప్రజలలో బాగా పాపులర్ కావటం ద్వారా ఆ భావజాలాన్ని ప్రజానీకంలో ప్రజ్వలింప చేశాయి. (**Roots of Communalism In India**, MAK Siddiqui, Abadi Publications, Culcutta, 1999;**Communalisam**, Rampunyani, BSFC, Mumbai, 2005, P. 28)

ఈ విధంగా 19, 20 వ శతాబ్దాల నాటి ప్రముఖ వ్యక్తులు, కవులు, రచయితలు, చరిత్రకారులలో అత్యధికులు ముస్లిం పాలకుల మీద అసత్య, అర్ధసత్య ప్రచారాలను సాగించారు. అవాస్తవాలను సృష్టించి ముస్లింల పట్ల ముస్లిమేతర ప్రజానీకంలో అపోహలు, అపార్థాలు కలుగచేశారు. ఈ గడ్డ మీద పుట్టి ఈ గడ్డ మీద పెరిగి స్వమతంలోని స్వజనుల ఉచ్ఛనీచాల చూపులకు, చేతలకు గురౌతున్న ప్రజలను

కౌగలించుకుని, స్నేహహస్తం అందించి సాంఘిక–ఆధ్యాత్మిక సమానత్వం ప్రతిపాదించిన ఇస్లాంను స్వీకరించిన సాధారణ ముస్లింలను, ఆనాటి ముస్లిం పాలకులను ఒకేగాటకట్టేసి అర్థం లేని, అసత్య విమర్శలకు పూనుకుని, భూమిపుత్రులైన సామాన్య ముస్లిం జనసముదాయాల పట్ల ముస్లిమేతరులలో వ్యతిరేక భావజాలం ఏర్పడానికి ప్రధానంగా కారణమయ్యారు.

1926లో ప్రముఖ బెంగాలీ రచయిత శరత్‌చంద్ర చట్టోపాధ్యాయ ముస్లిం జనసముదాయాల గూర్చి వ్యాఖ్యానిస్తూ **వాస్తవంగా ముస్లింలు హిందువులతో కలసిమెలసి జీవిస్తారని చెప్పటం పెద్ద బూటకం. ముస్లింలు రాజ్యాలను స్థాపించడానికి భారత దేశానికి రాలేదు, దోచుకోవడానికి వచ్చారు. దోపిడితో సంతృప్తి చెందక దేవాలయాలను ధ్వంసం చేశారు; దేవతా విగ్రహాలను పగులగొట్టారు. మహిళలను మానభంగం చేశారు. ఇతర మతాలకు చేసిన అగౌరవం, మానవతకు చేసిన గాయం ఊహించ వీలుకానిది** అని అన్నాడు. ఆయన సామాన్య ప్రజలను మాత్రమే కాకుండా అక్బర్ గురించి కూడా వ్యాఖ్యానిస్తూ **వీరు రాజులైన తరువాత కూడా తమ అసహ్యకర కాంక్షల నుండి విముక్తం కాలేదు. సహనానికి మారు పేరైన అక్బర్ ఈ విషయంలో అపఖ్యాతి పాలైన ఔరంగజేబు కంటే మంచి వాడేమీ కాదు** అని పేర్కొన్నాడు. ( India's Freedom Movement and Muslims : M.K.A Siddiqi)

ఈ విధంగా **ముస్లిం ప్రభువులు** అనగానే ఇస్లాం మతాన్ని స్థాపించేందుకు, ముస్లిమేతరులందర్నీ ముస్లింలుగా మార్చడానికి మాత్రమే ఇండియా వచ్చినట్టు తమ రచనల ద్వారా ప్రచారంగావించారు. ఆ విధంగా వచ్చిన ముస్లిం ప్రభువుల రాజ్య విస్తరణ కాంక్షను అడ్డుకున్న వారందర్నీ, ముస్లిం పాలకులతో పోరాడిన చిన్నాచితక రాజులనూ **హిందూమతోద్ధారకులని** ప్రశంసించారు. మన రాష్ట్రానికి చెందిన కొమర్రాజు వేంకట లక్ష్మణరావు లాంటి మేధావులు కూడా ఈ భావజాలం పరిధిలోనే పనిచేశారన్న విషయాన్ని బాబాసాహెబ్ అంబేద్కర్ కేంద్రీయ విశ్వవిద్యాలయం (లక్నో) చరిత్ర శాఖాధిపతి మహబూబ్ బాషా తన సుదీర్ఘ వ్యాసంలో విపులంగా వివరించారు. (జాతీయ తత్వం ఒళ్ళో మతతత్త్వం : కొమర్రాజు రచనల పరిశీలన, మహబూబ్ బాషా, వీక్షణం మాసపత్రిక, జూన్, జూలై, ఆగష్టు, సెప్టంబరు 2007 నాటి సంచికలు, హైదరాబాద్)

1908లో కొమర్రాజు వేంకట లక్ష్మణరావు వెలువరించిన **మహమ్మదీయ**

**మహోయుగం** గ్రంథంలోని **విజయనగర సామ్రాజ్యము** అను అధ్యాయంలో విజయనగర రాజులు హిందూమతోద్ధరణకు నడుంకట్టినవారుగా, ముస్లిం పాలకులు ఇస్లాంమత వ్యాప్తి కోసం అందర్నీ ముస్లింలుగా మార్చినవారుగా ప్రకటించారు. ఆయన ప్రకటన ఈ క్రింది విధంగా సాగింది :

**ఉత్తర హిందూ దేశము నుండి మహాప్రవాహముతో వెడలి దక్షణ హిందూ దేశమందలి హిందూ మతమును హిందూ రాజ్యములను రూపుమాపుటకు సిద్ధముగానున్న మహమ్మదీయులనుబడు మహానదిని రెండువందలయేబది సంవత్సముల వరకు నడ్డగించి హిందూ మతమును హిందువుల ప్రాభవమును రక్షించిన విజయనగర సామ్రాజ్యమును వేయినోళ్ళ గొనియాడినను తనివి తీరదు. క్రీ.శ 1307లో మహమ్మదీయలు దేవగిరి రామరాజును చెపట్టిరి; 1310లో ద్వార సముద్రలోని బళ్ళాల రాజులనంత మొందించిరి; 1323లో నోరుగంటి ప్రతాపరుద్రుని ఢిల్లీ గొంపోయిరి. ఇట్లు దక్షిణ దేశములోని హిందూ రాజ్యములన్నియు నడుగంటినందున హిందూ మతము తదుద్ధరణమునకు నాధారమేమియు లేకపోయెను. దక్షణ హిందూ దేశమున కట్టి విపన్నావస్థ ప్రాప్తించినపుడు దాని నుద్ధరించుటకు నవతరించిన రాజ్యమే విజయనగర సామ్రాజ్యము. ఈ ప్రభుత్వమప్పుడు దుదయించి యుండని యెడల బదునాల్గవ శతాబ్దమునందే యనగా నేటికి నైదువందల సంవత్సరములకు బూర్వమే దక్షణ దేశమంతయు బూర్తిగ దురుష్కులపాలై, హిందూమత మంతయు నడుగంటి, నేటికి మనమందరము మహమ్మదీయులమై యుందుమనుట యతిశయోక్తి కానేరదు. (మహమ్మదీయ మహాయుగము అను హిందూ దేశ కథాసంగ్రహము**, కొమర్రాజు వేంకట లక్ష్మణరావు, అనువాదం : అక్కినేని రమాపతి రావు, సుపథ ప్రచురణలు, 2004, పేజి. 234)

ఈ రచనల ప్రభావం వలన ఆ తరువాతి తరానికి చెందిన చరిత్రకారులు తమ గ్రంథాలలో ముస్లిం ప్రభువుల పట్ల అలనాటి ప్రముఖులు వ్యక్తం చేసిన అభిప్రాయాలనే సుస్థిరం చేసుకుంటూ రచనలు సాగించారు. ఆ కారణంగా పాఠ్యగ్రంథాలలో కూడా అవాస్తవాలు వాస్తవాలుగా చోటుచేసుకున్నాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రచురించిన డిగ్రీ చరిత్ర గ్రంథాలలో ఈ భావజాలం ఎంత అలవోకగా ప్రవేశించిందో డాక్టర్ జి. సాంబశివారెడ్డి **చరిత్ర పాఠ్యపుస్తకాలలో మతతత్వం నీడలు** అను సుదీర్ఘ వ్యాసంలో బట్టబయలు చేస్తూ ఆ విషయాలను ఈ క్రిందివిధంగా ఉటంకించారు.

'భారతదేశంలో... ఇస్లాం మతాన్ని వ్యాపింపచేయటం మహమ్మదీయుల పవిత్ర కర్తవ్యమని ఖుర్‌ఆన్ బోధించింది. ఈ మత ప్రభావం వలన అరబ్బులు మతావేశంతో 'ఇస్లాం' వ్యాప్తికి కృషిచేశారు".." (ముస్లింలనే'వారు) ఇస్లాం మతం స్వీకరించని హిందువులను...అనేక మందిని వధించారు లేదా బానిసలుగా చేశారు".. '...మహమూద్ గజనీ అనేకమంది ('హిందువుల'ను)ని బలవంతంగా ఇస్లాం మతంలోకి మార్చాడు"..., 'హిందువుల సహనాన్ని ఆసరాగా తీసుకొని కొంతమంది ముస్లిం సన్యాసులు అద్భుత శక్తులు(?) ప్రదర్శించి హిందువులను ఇస్లాం మతంలోకి మార్చగలిగారు" .."(ఫిరోజ్ తుగ్లక్)... ప్రజలు ఇస్లాం మతం స్వీకరించడానికి అనేక ప్రోత్సాహకరమైన బహుమతులను ప్రకటించాడు." ... "(ఢిల్లీ) సుల్తానులలో కొందరు ఇస్లాం మతావేశపూరితులై సంకుచిత మతవిధానం అవలంబించి అనేకమంది హిందువులను హింసించి, ..వారిని బలవంతంగా ఇస్లాం మతం స్వీకరించేటట్లు చేసారు"..,"వారు ('ముస్లిం'లు) హిందువులను ఇస్లాం మతంలోకి మార్చాలని, భారతదేశాన్ని ఇస్లాం రాజ్యంగా తీర్చిదిద్దాలని చాలా ఉత్సాహం తోనూ, ఆవేశంతోనూ కృషిచేశారు"..'కొన్ని సందర్భాల్లో రాజుల ఆజ్ఞమేరకు బలవంతంగా మతమార్పిడులు జరిగాయి"..'ఔరంగజేబు' అనే పాఠ్యాంశంలో, 'ఇస్లాం మత స్వీకారం చేసిన వారి (హిందువులకు)కి ప్రభుత్వోద్యోగాలు, ఇతర సౌకర్యాలు కలిగించాడు"..

ఈ భావజాలాన్ని డాక్టర్ సాంబశివా రెడ్డి మరింత స్పష్టం చేస్తూ ఇటు వంటి పదజాలంలోని మతతత్వ భావజాలం 'మహమ్మదీయులనే' వారిపట్ల 'హిందువులనే' వారిలో శతృభావాన్ని కల్గిస్తుంది/కల్గిస్తోంది. మహమ్మదీయుల మతాభిమానాన్ని 'మతావేశం'తో, 'విపరీతమైన మతావేశం'తో, 'మత సహనం లేనివారు' (హిందువులు మాత్రమే మతసహనంగలవారు అనే అర్థంతో) అనే (తీవ్ర) పదజాలంతో పోల్చడం, ('ముస్లింలనే' వారు) మతం తప్ప మరో ధ్యాసలేనివారు, (బలవంతంగా) మతమార్పిడే వారి ('ముస్లింలనే'వారి) లక్ష్యం అనే అవగాహన కలిగేటట్లు పదజాలాన్ని రాయడం గర్హించదగింది అని వ్యాఖ్యానించారు.

ఈ రాతల వలన ముస్లిం ప్రభువుల పట్ల ముస్లిమేతర ప్రజానీకంలో తీవ్రమైన అపోహలు; అపార్థాలు చిట్లం కట్టుకపోయాయి. ప్రభువులు ఎవరైనా ప్రథమంగా రాజ్యాధికారాన్ని హస్తగతం చేసుకుంటారు. ఆ దిశగా అన్ని ప్రయత్నాలు చేస్తారు. రాజ్యాధికారం ప్రధానమైన రాజ్యాధినేతలు మతవ్యాప్తిని ప్రధానంగా భావించరు. అలా

భావించి తమ మతం కోసం మాత్రమే జీవించినట్టయితే హిందూ రాజులు హిందూ రాజులతో చేసిన యుద్ధాలు, ముస్లిం రాజులు ముస్లిం రాజులతో చేసిన పోరాటాలు చరిత్రలో కన్పించేవి కావు. ప్రత్యర్థి హిందువైనా, ముస్లింమైనా రాజ్య విస్తరణకాంక్ష కలిగిన ప్రభువుకు సంబంధం లేదు. అతనికి రాజ్యమే ప్రధానం. ఇది ఇలా ఉండగా ముస్లిం ప్రభువు సైన్యంలో హిందువులు, హిందూ పాలకుని సైన్యంలో ముస్లింలు ఉంటూ ఆ రాజుల పక్షాన తలపడిన సంఘటనలు కోకొల్లలుగా చరిత్రలో కన్పిస్తాయి.

ఈ విషయం చారిత్రక వాస్తవం కాగా, ఆంగ్ల చరిత్రకారులు పాలకుల మతం ఆధారంగా చేసిన చరిత్ర యుగ విభజన ఊబిలో పడిపోయి, మతతత్త్వ దృక్పథంతో చరిత్ర రచన సాగటంతో ప్రభువుల మతాన్ని బట్టి ఆ మతం కోసం మాత్రమే వారంతా పోరాటాలు చేసినట్టుగా, ఆయా మతస్థులు వారి వెంట నడిచినట్టుగా చరిత్రకారులు వాస్తవ దూరమైన విషయాలను గ్రంథస్థం చేశారు.

ఈ మార్గంలో సాగిన చరిత్ర రచన మూలంగా పాలకుల మతం పాలితుల మతం ఒక్కటే అయినట్టయితే ప్రభువులను-పాలితులను ఒక్క గాటన కట్టి చూడటం జరిగింది. ఇది **మతతత్వ చరిత్ర రచనా దృక్పథం వలన జరిగింది...దీని ప్రభావంతో మధ్య యుగంలోని అరబ్బు, టర్కు, ఆఫ్ఘన్, మొఘల్ జాతుల పాలకులను వారు అనుసరించే మహమ్మదీయ మతాన్ని బట్టి వారిని 'ముస్లింరాజులు' అనీ, వారి దండ యాత్రలను "ముస్లిం దండయాత్రలు" అనీ, వారి రాజ్యాలను "ముస్లిం రాజ్యాలు" అనీ, వారి పరిపాలనను "ముస్లిం పరిపాలన" అనీ, మతతత్వదృక్పథం మరింత మితిమీరి/ ఘనీభవించి "ఇస్లాం రాజ్యాలు" అని పాఠ్యపుస్తకాలలో రాయడం జరిగింది. (చరిత్ర పాఠ్యపుస్తకాలలో మతతత్వం నీడలు**, డాక్టర్ జి.సాంబశివారెడ్డి, **గీటురాయి వారపత్రిక**, పేజి.2, 28-7-2006, హైదరాబాద్ ).

ఆ క్రమంలో ముస్లిం పాలకులను పాలితులలోని జనమూహంలోని ముస్లింలను ఒకేగాట కట్టారు. ముస్లిం పాలకుల మంచి చెడ్డలను పాలితులలోని ముస్లింలకు కూడా అంటగట్టారు. ప్రభువులు హిందువైనా ముస్లిమైనా పాలనాపరంగా ప్రభువులంతా రాజ్యాధికారాన్ని కాపాడుకోవడానికి ఒకేరకంగా వ్యవహరిస్తారన్న వాస్తవకోణాన్ని విస్మరించారు. ఈ విస్మరణ ఫలితంగా ముస్లిం పాలకుల పాపాల భారాన్ని పాలిత ముస్లింలు మోయాల్సిన అగత్యం ఏర్పడింది.

ఈ సందర్భంగా చరిత్ర పాఠ్యగ్రంథాలలో ముస్లిం ప్రభువుల గురించి, ఆ ప్రభువుల మతమైన ఇస్లాం గురించి **నకారాత్మక** భావనలు చరిత్ర పాఠ్య పుస్తకాలలో ఏ విధంగా సాగాయో, చరిత్రోపన్యాసకులు డాక్టర్ జి.సాంబశివా రెడ్డి తన వ్యాసం **చరిత్ర పాఠ్య పుస్తకాలలో మతతత్వం నీడలు** (గీటురాయి వారపత్రిక, 28-7-2006) లో ఈ క్రింది విధంగా ఉల్లేఖించారు :

'భారతదేశంలో ముస్లిం రాజ్యస్థాపన' అనే పాఠ్యాంశంలో, "ఇస్లాం మతాన్ని వ్యాపింప జేయడం మహమ్మదీయుల పవిత్రకర్తవ్యమని ఖుర్ఆన్ బోధించింది" .. "...తురుష్కులు...అరబ్బులకంటే ఆవేశపరులు, క్రూరులు. వీరు ఇస్లాం మతాన్ని స్వీకరించి విపరీతమైన (మత)ఆవేశంతో, ఉత్సాహంతో, పట్టుదలతో, హింసావిధానాన్ని అనుసరించి భారతదేశంలో ఇస్లాం మత వ్యాప్తికి ఆత్రుతతో పూనుకున్నారు."..' అల్లాఉద్దీన్ హిందువులపై భరించరానంతగా పన్నులు విధించి, మతపరంగా ద్వేషించి, హింసించాడు" .. "అల్లాఉద్దీన్ హిందువుల పట్ల క్రూరంగా వ్యవహరించాడు".. '...అతడు (నాసరుద్దీన్ ఖుస్రూషా) హిందువులకు అనుకూలంగా ఉండేవాడు. (అందువలన) ముస్లింలు అతనిని ఏవగించుకొనేవారు. ప్రత్యేకంగా ముస్లిం ప్రభువర్గం ఒక హిందువు సుల్తానుగా ఉండటాన్ని వ్యతిరేకించారు."...,'అతడు (ఫిరోజ్‌తుగ్లక్) పరమతద్వేషి. చాలా సంకుచితమైన మతవిధానాన్ని (హిందువుల పట్ల) అనుసరించాడు. ఫిరోజ్ స్వయంగా.. (హిందూ) ప్రజలందరనీ వధించాల్సిందిగా తన సైన్యాన్ని ఆజ్ఞాపించాడు. (దీనివలన) అనేక వేల మంది హతులయ్యారు...(ఈవిధంగా) ఐదు సంవత్సరాల వరకు, ప్రతి సంవత్సరం సుల్తాన్ ఈ మారణహోమం గావించాడు...". 'ఆనాడు (తైమూరు దండయాత్ర సమయంలో) హిందువులు ముస్లింలకు భయపడి తమ బాలికలకు చిన్నతనంలో వివాహం చేసారు"...'బాబర్ దండయాత్ర నాటి భారతదేశ రాజకీయ, ఆర్థిక, సాంఘిక పరిస్థితులు' అనే పాఠ్యాంశంలో, "భారతదేశంలోని ముస్లిం రాజులు ఇస్లాం మతాన్ని రాజ్యమతంగా ప్రకటించారు"..."(షాజహాన్) హిందూమతాన్ని ఆదరించలేదు...ఇస్లాంమతం ఔన్నత్యాన్ని ప్రశ్నించినవారిని కఠినంగా శిక్షించాడు"...'ఔరంగజేబు' అనే పాఠ్యాంశంలో, (ఔరంగజేబు) ఖాల్సా భూములనుంచి హిందువులను తొలగించాడు. ఇస్లాం మత స్వీకారం చేసిన వారికి ప్రభుత్వోద్యోగాలు, ఇతర సౌకర్యాలు కలిగించాడు', "...అబ్దుల్‌నబి అనే ఫౌజ్దార్ అనేక క్రూర పనులు చేశాడు. హిందూ దేవాలయాలను పడగొట్టడమే కాకుండా

అనేకమంది హిందూ స్త్రీలనుకూడా చెరపట్టాడు' 'ఆంధ్రప్రదేశ్ భౌగోళిక స్వరూపం' అనే పాఠ్యాంశంలో, 'ముస్లిం రచనల్లో మధ్యయుగపు ఆంధ్రుల చారిత్రక విశేషాలు సందర్భానుసారంగా తెలుస్తున్నాయి"..'ముసునూరి, రెడ్డి, వెలమ రాజ్యాలు' అనే పాఠ్యాంశంలో, 'కాకతీయ సామ్రాజ్య పతనానంతరం కళింగం మినహా తెలుగుదేశమంతా మహమ్మదీయ అధికారుల దుష్టపరిపాలనను చవిచూడడం తెలిసిందే" (పే.92), 'తెలంగాణాలో జాతీయోద్యమం-1921 నుంచి' అనే పాఠ్యాంశంలో "కొంతమంది ముస్లిం తీవ్రవాదులు హిందువులను కించపరుస్తూ హతమార్చమని విశ్వవిద్యాలయంలోనే ఉపన్యాసాలిచ్చేవారు" (పేజి. 122) వంటి మతతత్వ పదజాలం ఉంది.

ఈ విధంగా మధ్యయుగాల చరిత్రనుండి ఆధునిక చరిత్ర వరకు ఎన్నో అంశాలను పాఠ్యగ్రంథాలలో పొందుపర్చడం వలన భావిభారత పౌరుల మనస్సుల మీద ముస్లిం ప్రజానీకం పట్ల ఎటువంటి వికృత-విద్వేష భావాలు స్థిరపడతాయో అవగతం చేసుకోవచ్చు. ఈ ప్రమాదకర భావజాలం విద్యార్థినీ/విద్యార్థులను పూర్తిగా తప్పుదారి పట్టించి, వారిలో మతతత్వ పోకడలను పెంపొందించింది (పెంపొందిస్తోంది) అని డాక్టర్ సాంబశివారెడ్డి చరిత్ర పాఠ్యపుస్తకాలపై మతతత్వం నీడలు (గీటురాయి వారపత్రిక, 11-8-2006, హైదరాబాద్, పేజిలు 1-2) అను తన వ్యాసంలో వ్యాఖ్యానిస్తూ SV University, Thirupathi, Three Year Degree (B.A Regular) Examinations, March and October 2005, History, Part - II, Paper I and IVలలో విద్యార్థులు పేర్కొన్న సమాధానాలను ఉటంకించారు. ఆ సమాధానాలు ఇలా ఉన్నాయి :

'శ్రీకృష్ణదేవరాయలను' గురించి, "...శ్రీకృష్ణదేవరాయలపైన, హిందూ సంస్కృతిపైన బిజాపూర్ సుల్తాన్ యూసుఫ్ ఆదిల్‌షా 'జిహాద్' (ప్రకటించాడు)...", "...(విజయనగర రాజుల కాలంలో) హిందువులు ఎక్కువగా ఉండేవారు. మహమ్మదీయులు అల్పసంఖ్యాకులు...","...విజయ నగర సామ్రాజ్యంలో మహమ్మదీయులైన బహమనీ సుల్తానులు విజయనగరంపై జిహాద్ ప్రకటించారు...", "...మహమ్మద్ అలీ (ఆదిల్‌షా) విజయనగరంపై జిహాద్ ప్రక టిస్తాడు (ప్రకటించాడు)...", "అళియరామ రాయల' పై "...ప్రపంచంలో ఎక్కడా జరుగని దారుణం విజయనగర సామ్రాజ్యంలో (తళ్ళికోట యుద్ధం సమయంలో) జరిగింది....", "అళియ రామరాయల' పై ముస్లిం దురభిమానాన్ని రెచ్చగొట్టాడు...", "...ఈ యుద్ధం

(తళ్ళికోట యుద్ధం)లో అనేక లక్షల మంది హిందువులు మరణించిరి...", 'మహమ్మద్‌బిన్ తుగ్లక్'ను గురించి, "...ఇతడు ముస్లిం అయినందున మహమ్మదీయుల దగ్గర 1/4వంతు హిందువుల వద్ద 1/2వ వంతు పన్నులను వసూలు చేసెను... ఇతని కాలంలో హిందువులు చాలా కష్టనష్టములు అనుభవించారు...(ఇతడు) హిందువులను చాలా కష్ట పెట్టెడివాడు. ..తమ మతమువారిని బాగా చూసుకోనెడివాడు..." ..."... మహమ్మద్ బిన్ తుగ్లక్ ముస్లిం రాజు కాబట్టి తమ మతమును బాగా ప్రచారంలోనికి తీసుకొనివచ్చి నాడు. హిందువులను హింసించెను. (హిందువులను) చాలామందిని ముస్లిములుగా మరల్చినాడు (మార్చినాడు)...హిందూ దేవాలయములను పడగొట్టించి, (వాటిపై) ముస్లిం దేవాలయాలను పెద్దపెద్ద భవన ములుగా (మసీదులుగా) నిర్మించినాడు...", "...ఇతడు పరమతద్వేషి. హిందూ దేవాలయాలను కొల్లగొట్టెను...(హిందువులను) ఇస్లాంమతంలో చేరమని బలవంత పెట్టేవాడు (బలవంతం చేసేవాడు), భారతీయ సంస్కృతిపై ఇస్లాంమత ప్రభావం'అనే దానికి, "...(మహమ్మదీయులు) అతి నీచంగా హిందూస్త్రీలను బలవంతంగా తీసుకొని వెళ్ళారు. దాన్ని భరించలేక హిందువులు (తమ) స్త్రీలను చిన్న వయస్సునందే బాల్య వివాహాలు చేయడం మొదలెట్టారు....", "...ముస్లింలు మన భారతదేశంలో ఎన్నో చోట్ల కలహాలను సృష్టించారు. అల్లాఉద్దీన్ ఖిల్జీ వంటివారు ముస్లింమతంలో చేరకపోతే హింసించుట, ఎక్కువపన్నులు విధించుట వంటివి చేసెడివారు... ముస్లింల వంటివారు మతకలహాలను సృష్టించినవారు ఎక్కువగా ఉంది (ఉండేవారు). ముస్లింలు హిందువుల ఆలయాలలో బాంబులు పెట్టి పేల్చెడివారు. (అందువలన) చాలామంది ముస్లిం, హిందూ ప్రజలు చనిపోయేడివారు", 'జహంగీర్ పరిపాలన'పై, "....ఇతడు హిందువులను ఎప్పుడూ హింసించేవాడు. హిందువులను చాలా హీనంగా చూసేవాడు. తన మతంలో (ఇస్లాంమతంలో) చేరమని బలవంతపెట్టే వాడు", "...ఇతడు హిందువులపై జిజియా పన్ను విధించాడు....", 'బాబర్'ను గురించి, "...బాబర్ పరమతద్వేషి. అనేక హిందూ దేవాలయాలను ధ్వంసం చెసెను. హిందువులను హింసించెను", "...బాబర్ కాలంలో బాబ్రిమసీదు నిర్మించడం జరిగింది", 'ఔరంగజేబు'ను గురించి, "...ఔరంగజేబు భారత దేశంలో హిందువులపట్ల ద్వేషాన్ని చూపిస్తూ బలవంతంగా ఇస్లాంమతంలో చేర్చదానికి ప్రయత్నించేవాడు...హిందూ విద్యా లయాలను, దేవాలయాలను ధ్వంసం చేసాడు", "ఔరంగజేబు 200లకు పైగా హిందూ

దేవాలయాలనూ, పాఠశాలలనూ కూల్చాడు. హిందువులను భ్రష్టుల్ని చేసాడు" వంటి సమాధానాలను అనేకమంది విద్యార్థినీ/విద్యార్థులు రాసారు. దీనినిబట్టి పరిశీలనలో ఉన్న పాఠ్యాంశాలలోని పదజాలం విద్యార్థినీ/ విద్యార్థుల ఆలోచనలను ఏవిధంగా ప్రభావితం చేసి, మతతత్వం వైపు మళ్ళించి, వారిలో మతతత్వ ధోరణులను ఎంత తీవ్రతరం చేసిందో/చేస్తోందో గమనించవచ్చును.

ఈ విధంగా పాఠ్యగ్రంథాల ద్వారా విద్యార్థుల మనస్సులలోకి ప్రవేశిస్తున్న మతతత్వ భావనల దుష్ప్రభావాన్ని డాక్టర్ సాంబశివారెడ్డి మరింత వివరంగా స్పష్టీకరిస్తూ పాఠ్యాంశాల్లో ఉన్న మతతత్వభావజాల ప్రయోగాన్నీ, విద్యార్థినీ/విద్యార్థుల వివిధ సమాధానాల సారాంశాన్నీ పరిశీలిస్తే మతతత్వ భావజాల- మతతత్వ చరిత్ర రచనా దృక్పథం పాఠ్యాంశాలను పూర్తిగా దుర్గంధపూరితం చేసి, కలుషితం చేసాయని (చేస్తున్నాయని) స్పష్టంగా తెలుస్తుంది. ఇది చాలా దారుణ మైన/ఘోరమైన విషయం. ముఖ్యంగా 'జిహాద్', 'జిజియా', 'పరదాపద్ధతి' వంటి భావాలను విద్యార్థినీ/విద్యార్థులు మత తత్వంతో కూడిన భావజాలంతో విశృంఖలంగా ప్రయోగించడం చూస్తే పాఠ్యాంశాలు ఏవిధంగా వారి మెదళ్ళను పూర్తిగా తప్పుదారి పట్టించి, మతతత్వంతో (నింపివేసాయో) నింపివేస్తున్నాయో పరిశీలించవచ్చును. దీనిద్వారా పాఠ్యాంశాలు ఎంత దయనీయమైన స్థితిలో ఉన్నాయో, అవి ఎంత కుంచించుకుపోయాయో ఊహించవచ్చును. అంతేకాకుండా ఇవి విద్యార్థినీ/విద్యార్థులలో సంకుచితతత్వాన్నీ (Narrow mindedness), మతవిద్వేషాన్నీ (Religious hatred) కల్గించే విధంగా భావజాలాన్ని కలిగి ఉన్నాయి. సమాజంలో మతోన్మాదభావాలు పెచ్చరిల్లిపోవడానికి చాలావరకు ఈ మతతత్వచారిత్రక దృక్పథంతో రచింపబడుతున్న పాఠ్యపుస్తకాలే మూల హేతువులవుతున్నవి. ఇవి విచ్ఛిన్నకర శక్తులకూ, సంఘవిద్రోహక శక్తులకూ, దుర్మార్గ పాలకవర్గాలకూ మహదవకాశాన్ని ఇస్తున్నాయి అని ప్రకటించారు. (గీటురాయి 11-08-2006, పేజి. 1-2).

ప్రజల మీద అరాచకాలు సాగించిన పాలకుల ఆ పాలకుల సైన్యాలను వారి పేర్లతో తప్పనిసరిగా ఉటంకించవచ్చు. అలా కాకుండా పాలకుడు ఇస్లాం మతస్థుడయితే అతని పాలనను **ముస్లిం పాలనగా**, అతడు ప్రదర్శించిన క్రౌర్యాన్ని హిందూ మతస్థులకు వ్యతిరేకంగా సాగిన **ముస్లిం క్రౌర్యంగా**, అతని సైన్యాలను **ముస్లిం సైన్యాలుగా** వర్ణించటం అచారిత్రకం. అత్యంత దారుణం.

ఈ ప్రమాదకరమైన వర్ణన ప్రజల మీద ముస్లిం వ్యతిరేకతను గాఢంగా స్థిరపర్చుతుంది. ఈ విధమైన **విద్వేష-వ్యతిరేక ప్రచారం** పాఠ్యగ్రంథాల ద్వారా ఆరంభమై, ఆ తరువాత ఉనికిలోకి వచ్చే పాపులర్ గ్రంథాలు, ఆ గ్రంథాల ఆధారంగా రూపుదిద్దుకునే కళలు-కళారూపాలు-సాహిత్యం ద్వారా ముస్లిం వ్యతిరేకత సమాజంలోకి ప్రవేశించి చివరకు ఘనీభవించడం వలన ఆ దుష్ప్రభావం మరింత ప్రకోపించి యావత్తు సమాజాన్ని ఎవిధంగా చుట్టేస్తుందో అర్థం చేసుకోవచ్చు.

ఈ పరిస్థితిని చక్కబెట్టేందుకు, విద్వేష పూరిత చరిత్ర రచనా క్రమాన్ని ప్రశ్నించే దిశగా తగినంత కృషి జరగలేదు. బ్రిటీష్ చరిత్రకారులు బీజం వేసి పోషించిన మొలకలు కొందరు స్వదేశీ చరిత్రకారులు, సాహిత్యకారుల నిర్వాకం మూలంగా ప్రజల హృదయాలలో మహా వృక్షాలుగా పెరుగుతున్నా అలనాటి అపోహలను-అపార్థాలను -అర్థసత్యాలను- అసత్యాలను పెద్దగా ఖండిచటం కానీ, ప్రజలకు చరిత్రకు సంబంధించిన వాస్తవాలు తెలుపటం గానీ జరగాల్సిన స్థాయిలో జరగలేదు.

**ముస్లిం** పాలకులను **పరదేశీయులు**గా చిత్రించటం వలన ముస్లిం ప్రభువులను, బ్రిటీష్ ప్రభుత్వాన్ని కలిపి విమర్శించడం, **ముస్లిం** పాలకులతో పోరాడిన ప్రతి **స్వదేశీ** పాలకుడ్ని **జాతీయవాది**గా ప్రశంసించడం జాతీయోద్యమకాలంలో ఆనవాయితీగా మారినందున ముస్లిం వ్యతిరేక భావజాల ప్రసరణను అడ్డుకోడానికి ఎక్కువ మంది రచయితలు - చరిత్రకారులు ప్రయత్నించలేదు. ఈ విషయం మీద తగినంతగా దృష్టి సారించలేదు, సాహసించలేదు. ఆ కారణంగా ప్రచారంలో ఉన్న అసత్యాల పునాదులను ప్రశ్నిచడం జరగలేదు.

చారిత్రక అవాస్తవాలు ప్రశ్నించబడని చోట అసత్యాలు సత్యాలుగా ప్రజల మస్తిష్కాలలో బలంగా తిష్టవేసి కూర్చున్నాయి. కానీ అబద్దాలను సవాల్ చేసిన చోట అటువంటి అవాస్తవాలను కావాలని సృష్టించిన వ్యక్తులు తోకముడిచి చెంపలేసుకున్న సందర్భాలున్నాయి.

బ్రిటీష్ రచయిత Charles Stewart లాంటి వారు ఏమాత్రం విచక్షణ లేకుండా ముస్లిం పాలకులను ద్వేషిస్తూ పలువిధాలుగా దూషించారు. అసత్యాలను సత్యాలుగా నమ్మించి నమోదు చేశారు. ఆ ప్రయత్నాలలో భాగంగా లౌకిక ప్రభువుగా ఖ్యాతిగాంచిన టిపూ సుల్తాన్‌ను అసహనమూర్తిగా, బలవంతపు మత మార్పిడిలకు పాల్పడిన మత

దురహంకారిగా, హిందువులను ఊచకోత కోసిన దుష్టుడిగా చిత్రీకరించబడ్డాడు. ఈ కారణంగా టిపూ గురించి యిప్పటికీ పలు దుర్భావనలు చోటుచేసుకొని ఉన్నాయి.

ఆ దుర్భావనల ప్రభావం వలన టిపూ సుల్తాన్‌ను **మతోన్మాది**గా చిత్రీకరించేందుకు కలకత్తా విశ్వవిద్యాలయం సంస్కృత విభాగం అధిపతి డాక్టర్ డా॥ హర ప్రసాద్ శాస్త్రి లాంటి వారు చేసిన దుష్టపన్నాగాలు డాక్టర్ బి.యన్. పాండే లాంటి నిష్పాక్షిక చరిత్రకారుని కృషి వలన బట్టబయలైంది.

బ్రిటీష్ రచయిత Charles Stewart ప్రచారం చేసిన దుర్భావనల మార్గంలో పయనించిన డాక్టర్ శాస్త్రి టిపూ బలవంత మత మార్పిడికి పాల్పడినందున మతాంతీకరణ యిష్టంలేని మూడు వేలమంది బ్రాహ్మణులు ఆత్మహత్యలు చేసుకున్నారని, ఆ ఆత్మహత్యల దుస్సంఘటనలకు టిపూ కారణమని తాను రాసిన మెట్రిక్యులేషన్ స్థాయి చరిత్ర పాఠ్యపుస్తకంలో పేర్కొన్నారు. (Three thousand Brahmins committed suicide as Tipu wanted to convert them forcibly into the fold of Islam. - **Arungazeb and Tipu Sultan, Evalution of Their Religious Polices**, Dr.B.N.Pande, IOS, New Delhi, 1996, P. 14)

ఈ పుస్తకం ఆనాడు బెంగాల్, అస్సాం, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలోని ఉన్నత పాఠశాల విద్యార్థుల చరిత్ర పాఠ్య గ్రంథంగా చలామణీ అయ్యింది. ఈ విషయం ప్రఖ్యాత చరిత్ర పరిశోధకులు, పార్లమెంటు సభ్యులు, రాజస్థాన్ గవర్నర్‌గా పనిచేసిన డా॥ బి.యన్. పాండే దృష్టికి 1928-1929 ప్రాంతంలో వచ్చింది. ఆ సమయంలో ఆయన Religious Policy of Tipu Sultan అనే విషయం మీద పరిశోధన చేస్తున్నారు. టిపూను **లౌకిక ప్రభువు**గా నిరూపించే పలు దృష్టాంతాలు, ఫర్మానాలు, మఠాలకు, మఠాధికారులకు, జగద్గురువులకు, పీఠాధిపతులకు రాసిన వందలాది లేఖలను అధ్యయనం చేసిన ఆయనకు ఈ ఆరోపణ ఆశ్చర్యానికి లోనుచేసింది. సర్వమతాలు, మత విశ్వాసాలు, మతస్థుల పట్ల సమాన గౌరవాన్ని ప్రదర్శించిన టిపూ మీద వచ్చిన ఆరోపణలను బి.యన్. పాండే నమ్మలేక పోయారు.

ఈ విషయం గురించి వాస్తవం తెలుసుకోవాలని ఆయనలో ఉత్సుకత పెరిగింది. ఆ సమాచారానికి ఆధారాలేవో తెలుపమని డా॥ హరప్రసాద్ శాస్త్రి గారికి ఆయన పలు లేఖలు రాసారు. డాక్టర్ శాస్త్రి నుండి ఎటువంటి సమాధానం రాలేదు. డాక్టర్ పాండే పట్టువదలని విక్రమార్కునిలా ఉత్తరాలు రాసిరాసి అలసిపోయి, చివరకు ఎటువంటి

సమాధానం రాకపోయేటప్పటికే, ఈ చర్యను **మేధోపరమైన వంచన**గా పరిగణించాల్సి వస్తుందని డాక్టర్ శాస్త్రిని హెచ్చరించారు. ఆ హెచ్చరికతో ఈ సంఘటన వివరాలు **మైసూరు గెజిట్** లో ఉన్నాయంటూ ఒక్క మాట రాసి డాక్టర్ శాస్త్రి అక్కడితో ఆ విషయాన్ని సరిపెట్టి తప్పించుకోచూశారు.

డాక్టర్ శాస్త్రి పేర్కొన్న ప్రకారంగా బి.యన్. పాండే **మైసూరు గెజిట్**లో ఈ సంఘటన కోసం అన్వేషించారు. ఈ విషయమై మైసూరు చరిత్ర మీద నిష్ణాతులైన ప్రొఫెసర్ శ్రీకాంతయ్య, బ్రిజేంద్రనాథ్ సీల్‌లను ఆయన సంప్రదించారు. మైసూరు రాజ్య చరిత్ర మీద మంచి పరిజ్ఞానం కలిగిఉన్న ప్రముఖ చరిత్రకారుడు శ్రీకాంతయ్య ఈ విషయమై పాండేకు లేఖ రాస్తూ **మైసూరు రాజ్యచరిత్ర అధ్యయనశీలిగా మూడు వేల మంది బ్రాహ్మణుల ఆత్మహత్య సంఘటన తన దృష్టికి రాలేదని, అటువంటి సంఘటన జరగలేదని తాను ఘంటాపథంగా చెప్పగలనని** రాశారు.

ప్రొఫెసర్ శ్రీకాంతయ్య అంతటితో ఊరుకోలేదు, బి.యన్. పాండే ఆసక్తిని బట్టి టిపూను లౌకిక ప్రభువుగా రుజువు చేయగల పలు పత్రాలను, ముఖ్యమైన డాక్యుమెంట్ల కాపీలను ఆయనకు పంపారు. ఈ డాక్యుమెంట్లను పరిశీలించి టిపూ మీద దురుద్దేశ్యపూర్వకంగా సాగిన ఆరోపణల మీద డాక్టర్ శాస్త్రి పాత్ర గురించి డాక్టర్ పాండే ఓ నిర్ధారణకు వచ్చారు. ఈ సంఘటనకు సంబంధించిన నిజానిజాలను తెలుపమంటూ కోరిన మీదట శ్రీకాంతయ్య స్పందనను, తాను సేకరించిన ఇతర పత్రాల వివరాలను డాక్టర్ శాస్త్రి దృష్టికి తెస్తూ ఆయన పాఠ్య గ్రంథంలో టిపూ గురించి ఉటంకించిన సంఘటనకు ఆధారాలు చూపాలని మళ్ళీ కోరుతూ డాక్టర్ పాండే ఆయనకు ఉత్తరం రాశారు. ఆ ఉత్తరానికి డాక్టర్ శాస్త్రి స్పందిస్తూ టిపూకు సంబంధించిన విషయాన్ని ఆంగ్లేయ సైనికాధికారి కల్నల్ మాల్సన్ రాసిన హిస్టరీ ఆఫ్ మైసూరు (History of Mysore) గ్రంథం నుండి గ్రహించానని తెలిపారు.

ఆ గ్రంథం ఎక్కడుందో తెలుపమని మళ్ళీ కోరగా అది లండన్‌లోని విక్టోరియా మహారాణి వ్యక్తిగత గ్రంథాలయం నుండి సంపాదించానని డాక్టర్ శాస్త్రి సరిపెట్టుకున్నారు. డాక్టర్ పాండే అంతటితో ఆ విషయాన్ని వదిలిపెట్టలేదు. విక్టోరియా మహారాణి వ్యక్తిగత గ్రంథాలయానికి చెందిన అధికారికి సదరు గ్రంథం తనకు కావాలని రాయగా అటువంటి గ్రంథం గానీ, దాని రాత ప్రతిగానీ తమ గ్రంథాలయంలో లేదని ఆ అధికారి స్పష్టం చేస్తూ డాక్టర్ పాండేకు లేఖ పంపారు.

ఆ సమాధానాలన్నిటినీ డాక్టర్ పాండే డాక్టర్ శాస్త్రికి పంపుతూ ఏ ఆధారంతో టిపూ మీద ఆ ఆరోపణ చేశారో తెలుపమని మళ్ళీ మళ్ళీ కోరుతూ ఎన్ని ఉత్తరాలు రాసినా డాక్టర్ శాస్త్రి నుండి ప్రత్యుత్తరం రాకపోవటంతో డాక్టర్ శాస్త్రి రాసిన సంఘటన వాస్తవం కాదనీ, అది **అభూతకల్పన** అనీ బి.యన్. పాండే నిర్నయానికొచ్చారు.

డాక్టర్ పాండే ఈ విషయం మీద మరింత పరిశోధన జరిపి, టిపూ మీద ఇటువంటి అసత్య ఆరోపణలను డా॥ హరప్రసాద్ శాస్త్రి ఉద్దేశ్యపూర్వకంగానే రాశారని నిర్ధారించుకున్నారు. అనంతరం ఈ పూర్తి వ్యవహారాన్ని, దీనికి సంబంధించిన పత్రాలను కలకత్తా విశ్వ విద్యాలయం వైస్ఛాన్సలర్ డాక్టర్ అసుతోష్ ముఖర్జీకి పంపారు. టిపూ మీద డాక్టర్ శాస్త్రి ఉద్దేశ్యపూర్యకంగా చేసిన అసత్యాలను తగిన రుజువులతో సహా ఆయన దృష్టికి తీసుకువచ్చారు. ఆ విషయం తెలుసుకున్న విశ్వవిద్యాలయం అధికారులు తమ విశ్వవిద్యాలయం పాఠ్య గ్రంథాల జాబితా నుండి డాక్టర్ శాస్త్రి రాసిన పుస్తకాన్ని తొలగించారు. ఈ తొలిగింపు జరిగే సరికే అనేక సంవత్సరాలు గడిచి పోవడంతో మేధోవంచనకు పాల్పడిన డాక్టర్ శాస్త్రి, టిపూ మీద వేసిన అభాండాలు, చేసిన అసత్య ఆరోపణలు అక్షరసత్యాలుగా బహుళ ప్రచారం పొందాయి.

ఆ తరువాత కూర్గు, మలబారు **హిందూ** జనసమూహాల పట్ల టిపూసుల్తాన్ చాలా దారుణంగా, అత్యంత క్రూరంగా వ్యవహరించారని, ఈ క్రూరత్వానికి టిపూ మతదురహంకారం కారణమని మరొక ఆరోపణ ప్రచారంలోకి వచ్చింది. ఈ ఆరోపణలలోని నిజానిజాలను కూడా నిగ్గు తేల్చుతూ, టిపూ కూర్గు ప్రజల పట్ల కఠినంగా వ్యవహరించింది వాస్తవమే అయినా, ఆ వ్యవహార సరళికి **రాజకీయాలు** మాత్రమే కారణమని, ఆయన కఠిన వైఖరికి **మతం, మత విశ్వాసాలు** ఏమాత్రం కారణం కావని శ్రీ బి.యన్. పాండే లాంటి పలువురు పరిశోధకులు తేల్చి చెప్పారు.

టిపూ సుల్తాన్ ప్రదర్శించిన మత సామరస్య వైఖరి మూలంగా వాస్తవంగా ఆయన పలువురి ప్రశంసలను అందుకున్నారు; ప్రజల మన్నన పొందారు. టిపూ మత సామరస్య వైఖరిని కొనియాడుతూ 1930 జనవరి 23 నాటి **యంగ్ ఇండియా** (Young India) లో మహాత్మాగాంధీ **విదేశీ చరిత్రకారులు ఫతే అలీ టిపూ సుల్తాన్‌ను మత పిచ్చకలవాడిగా చిత్రించారు. తన రాజ్యంలో గల హిందువులను బలవంత మత మార్పిడికి టిపూ ప్రయత్నించాడని ఆరోపించారు. అతను అలాంటి వ్యక్తికాదు. ఆయన మీద**

**సాగిన పలు అసత్య ఆరోపణలకు భిన్నంగా, హిందూ ప్రజానీకంతో టిపూకు చాలా మంచి సంబంధాలు ఉండేవి.** అని పేర్కొన్నారు.

("...Fathe Ali Tipu Sulthan of Mysore is represented by foreign historians as a fanatic, who opposed his Hindu subjects and converted them to Islam by force... But he was nothing of the kind. On the other hand his relations with Hindu subjects were perfectly cordial." **Young India,** January 23, 1930 P. 31)

డాక్టర్ పాండే లాగా సత్యాన్వేషణలో విరామమెరుగక వెంటబడి వాస్తవాన్ని నిగ్గుతేల్చగల చరిత్రకారులు, పరిశోధకుల సంఖ్య తక్కువకావటంతో అసత్య ప్రచారాలు కొనసాగుతూనే ఉన్నాయి. ఆనాడు డాక్టర్ పాండే పరిశోధనల ఫలితంగా పాఠ్యగ్రంథాల నుండి తొలిగించబడిన డాక్టర్ శాస్త్రి అసత్య పాఠ్యాంశం 1972లో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని జూనియర్ పాఠశాలల చరిత్ర గ్రంథంలో పాఠ్యాంశంగా మళ్ళీ ప్రత్యక్షం కావడంతో అది చూసిన డాక్టర్ పాండే మరోమారు ఆశ్చర్యపోవాల్సి వచ్చింది !

డాక్టర్ బి.యన్.పాండే లాంటి చరిత్ర పరిశోధకులు తక్కువ కావటం మూలంగా ముస్లిం వ్యతిరేక భావజాలం జాతీయోద్యమ సమయంలో కూడా బ్రతికిబట్టకట్టగలిగింది. 1906 నాటి బెంగాల్ విభజన తరువాత ఆరంభమైన జాతీయోద్యమంలో భాగంగా సాగిన స్వదేశీ ఉద్యమం, ఆ తరువాత ఖిలాఫత్ ఉద్యమ సమయంలో హిందూ-ముస్లింల మధ్య 1857 నాటి భౌతికంగా-మానసికంగా చాలా గాఢమైన ఐక్యత వ్యక్తమైనప్పటికీ **ముస్లిం వ్యతిరేకత యొక్క** తీవ్రత మాత్రం తగ్గుముఖం పట్టలేదు.

ఆ కారణంగానే భారతదేశాన్ని ఆంగ్లేయుల పాలన నుండి విముక్తి చేసే బాధ్యత హిందువులదే తప్ప మరెవ్వరిదీ కాదు; ఎందుకంటే హిందువులు మాత్రమే ఈ గడ్డ యొక్క సహజ బిడ్డలు. ముస్లింలు పరాయివాళ్ళు అన్న భావన జాతీయోద్యమ సమయంలో చాలా మంది బుద్ధిజీవుల రచనలలో వ్యక్తమయ్యింది.

ఈ విషయాన్ని శరత్‌చంద్ర చటోపాధ్యాయ మరింత విస్పష్టం చేస్తూ **భారత దేశం హిందువుల మాతృభూమి. అందువలన హిందువులు మాత్రమే ఈ జాతిని బానిసత్వ సంకెళ్ళ నుండి విముక్తం చేయాలి. ముస్లింలు టర్కీ, అరేబియాల వైపు చూస్తారు. వారి హృదయాలు ఇండియాలో ఉండవు. ఈ వాస్తవాన్ని దాచిపెట్టటం వలన ఏం ప్రయోజనం? భూమి పుత్రులుగా వారిని అభ్యర్థించటం ఇటుక గోడకు మొరపెట్టుకున్నట్టే. ప్రస్తుతం మనం ఈ విషయాన్ని అర్థం చేసుకోవడం చాలా ప్రధానం. ఈ పని ప్రధానంగా**

హిందువులది; మరెవ్వరిదీ కాదు. ముస్లింల సంఖ్య ఎంతన్న విషయం గురించి లెక్కలు గట్టడం అనవసరం. ప్రపంచంలో సంఖ్యాబలం పరిపూర్ణ సత్యం కాదు. ప్రపంచంలో గొప్ప సత్యాలు చాలా ఉన్నాయి. ఆ సత్యాల గణనలో గణాంక శాస్త్రం, అంకెలు ఎటువంటి విలువలను కలిగి ఉండవు...హిందూ-ముస్లింల మధ్య ప్రకృతి విరుద్ధమైన ఐక్యత కోసం ప్రయత్నించటం మనముందున్న సమస్యకాదు. మన లక్ష్యమల్లా మనలో మనం ఐక్యతకు కృషి చేయటం అని పేర్కొన్నాడు.

(Hindustan is the homeland of the Hindus (alone). Therefore, it is the duty of the Hindus alone to free this nation from the chains of servitude. Muslims look towards Turkey and Arabia; their hearts are not in India. What is the use of bemoaning this fact? To appeal to them in the name of the Soil of Mother India is as pointless as talking to a brick wall. Today it is vital that we understand this point. This work is the work of Hindus, and no one else. There is no need to get agitated counting how numerous is the Muslim Population. Numbers are not ultimate truth in this world. There are greater truths, in whose scale of values the arithmetic of counting heads has no place...The problem before Hindus, therefore, is not to bring about this unnatural union between Hindus and Muslims. Their task is to achieve unity within their own community... (**India's Freedom Movement and Muslims**: MKA Siddiqi, New Delhi )

తొలితరం జాతీయవాదులలో ప్రజల గౌరవాభిమానాలను అపారంగా పొందిన ప్రముఖులలో లోకమాన్య తిలక్, లాలా లజపత్‌రాయ్, అరవింద ఘోష్, బిపిన్ చంద్రపాల్ లాంటి వారు కూడా తాము చేసిన ప్రసంగాలు, రాసిన గ్రంథాలలో ముస్లింలను ఇతర జనసముదాయాల నుండి పూర్తిగా మినహాయిస్తూ తమ అనుచరవర్గాన్నీ, ప్రజలనూ ప్రభావితం చేశారు.

ఆ ప్రభావం కారణంగా ఈ గడ్డమీద పుట్టిపెరిగి ఇక్కడి మట్టిలోనే కలసిపోయిన మొగల్ వంశజులను కూడా **పరాయివాళ్ళు**గా పరిగణించడం జరిగింది. ముస్లిం పాలకులకు పూర్వం ఇండియాలోని రాజ్యాల మీద పలు ప్రాంతాలకు చెందిన ఇతర పాలకులు కూడా దాడులు చేశారు. ఆ విధంగా ఎవరు దాడులు చేసినా పరాజిత రాజ్యాన్ని అందిన కాడకు దోచుకుని తిరిగి తమ స్వదేశాలకు వెళ్ళిపోయారు.

ఈ విషయంలో **స్వదేశీ పాలకులు** కూడా మినహాయింపు కాదు. ఇండియాలో కూడా రాజులు పరస్పరం యుద్ధాలు చేసుకోవడం, దాడులకు పాల్పడటం పరాజిత

రాజ్యంలోని ప్రజల మీద దాడులు చేయడం, అక్కడి సంపదను తమ భూభాగాలలోకి ఎత్తుకపోవడం యుద్ధనీతిలో భాగమని భావించటం ఇక్కడ కూడా సర్వసాధారణమైన సంఘటనలుగా సాగాయి. చరిత్ర వెల్లడి చేస్తున్న ఈ పచ్చినిజాలను పూర్తిగా విస్మరించి, బయట నుండి వచ్చిన వారు మాత్రమే యుద్ధాలు చేశారని, వారంతా రాజ్యవిస్తరణ కాంక్షాపరులని, ఆక్రమణదారులని, విధ్వంసం సృష్టించారని, సంపదను కొల్లగొట్టారన్న అతి తీవ్రమైన భావజాలాన్ని ప్రచారం చేశారు. ఇండియాలో హిందూ రాజుల మధ్య, ముస్లిం రాజుల మధ్య, హిందూ-ముస్లిం రాజుల మధ్య ముమ్మరంగా జరిగిన యుద్ధాల విషాద వాస్తవాలను మరచి **ముస్లిం ప్రభువుల**కు మాత్రమే **పరాయితనం** అంటగట్టి, వారిని **దోపిడిదారులు**గా, **విధ్వంసకులు**గా చిత్రించడం, ప్రచారం చేయడం, సామాన్య ముస్లిం ప్రజానీకాన్ని దానికి బాధ్యుల్ని చేయడం హిందూ-ముస్లిం ప్రజల మధ్య అంతులేని మానసిక ఎడం ఏర్పడడానికి ప్రబల కారణమయ్యింది.

ఈ విధంగా ఆంగ్లేయులు నమోదు చేసిన చరిత్ర, ఆ చరిత్ర ఆధారంగా స్వదేశీ చరిత్రకారులు రాసిన చరిత్ర, ఆ చారిత్రక గ్రంథాలలోని సమాచారం ఆధారంగా మధ్యయుగాల నాటి ముస్లింల పాలనను నియంతృత్వ పాలనగా ముస్లిం పాలకులను నియంతలుగా, క్రూరులుగా, హిందూ మత వ్యతిరేకులుగా అభివర్ణించడం ప్రజలను బాగా ప్రభావితం చేసింది. ఆ తరువాతి కాలంలో పాలకులు పాలితుల మధ్య తేడాను ఏమాత్రం గమనించ కుండా పాలకుల **పాపాలను** పాలితులకు అంటగడ్తూ, ఆ పాపభారాన్ని పాలితుల మీద మోపుతూ పాలకులను-పాలితులను కూడ సమదృష్టితో చూడడం వలన ఈ గడ్డ బిడ్డలైన సామాన్య ముస్లిం జనసముదాయాలను కూడా విదేశీయులుగా, పరాయివారుగా పరిగణించగల దృఢమైన మానసిక పరిస్థితి ముస్లిమేతర ప్రజలలో ఏర్పడింది.

ఈ దృక్పథం నుండే ముస్లిం యోధుల మీద దృష్టిసారిస్తున్న చరిత్రకారులకు, రచయితలు-కవులకు భారత దేశ విముక్తికోసం పోరాటాలు చేసిన ముస్లింలలో మాతృ భూమి పట్ల గౌరవాభిమానాలు ఏ మాత్రం కన్పించడం లేదు. ఈ యోధులు చేసిన పోరాటాలలో వారికి ప్రధానంగా మతభక్తి-మతపిచ్చి మాత్రమే కన్పిస్తుంది. భారతదేశాన్ని రెండు వందల సంవత్సరాల పాటు పట్టిపీడించి, ఇక్కడి సంపదనంతా తమ దేశానికి తరలించిన ఆంగ్లేయులు మాత్రం ముస్లిం యోధులు ఆరంభించిన పోరాటాలు తమను

తమ మాతృభూమి నుండి తరిమి వేయడానికి మాత్రమేనని స్పష్టంగా అంగీకరిస్తున్నా, ముస్లిం యోధులు మాతృభూమి పట్ల అంతులేని ప్రేమాభిమానాలు గల దేశభక్తులుగా వారు కీర్తిస్తున్నా, జాతీయవాదం పేరుతో ముస్లిం వ్యతిరేకతను వెదజల్లుతున్న కొంత మంది మేధావులకు మాతృభూమి విముక్తి పోరాటంలో పాల్గొన్న ముస్లింలు స్వేచ్ఛా-స్వాతంత్ర్యాల కోసం కాకుండా కేవలం **మతం కోసం చేసిన పోరాటం** లో పాల్గొన్నవారుగా కన్పించటం విషాదం.

ఆంగ్లేయులకు వ్యతిరేకంగా అవిశ్రాంతంగా పోరాడిన మౌల్వీ అహమ్మదుల్లా షా ఫైజాబాది గురించి 1857 నాటి పోరాటాలలో పాల్గొన్న బ్రిటీష్ సైనికాధికారి General Holems తన **The Sepoy War** అను గ్రంథంలో గురించి రాస్తూ,'..The Moulvi was a true patriot. He had not stained his sword with assassination. He had connived at no murders; he has fought manfully, honorably and stubbornly in the battle field against the stranger who had seized his country, and his memory is entitled to the respect of the brave and true-hearted of all nations...' (**Muslims In India**, S.Abul Hasan Ali Nadvi,1980,P. 107) అన్నాడు.

మౌల్వీ అహమ్మదుల్లా షాతో పలు పోరాటాలు చేసిన కల్నల్ జి.ఎ.మాల్సన్, (G.B. Malleson) మౌల్వీ చర్యలను పూర్తిగా సమర్థిస్తూ **'..తన దేశాన్ని ఆక్రమించుకుని ధ్వంసం చేస్తున్న వాళ్ళకు వ్యతిరేకంగా కుట్రపన్ని, యుద్ధం చేసి, స్వాతంత్ర్యం సంపాదించుకోవడం దేశభక్తి అయితే తప్పకుండా మౌల్వీ గొప్ప దేశభక్తుడు...ఆయన అమాయకుల ప్రాణాలు తీయలేదు....తన దేశాన్ని వశంచేసుకున్న విదేశీయుల మీద గౌరవప్రదమైన యుద్ధం చేశాడు. వీరుడుగా, నీతిమంతుడుగా గుర్తించబడిన ఆయన అన్ని దేశాలు గౌరవించదగిన యోధుడు..'**, అని **ప్రశంసించాడు.**

మౌల్వీ తనతో కలసి వచ్చే స్వదేశీపాలకులను ఏకం చేసే ప్రయత్నాలలో భాగంగా షాజహాన్‌పూర్ జిల్లాలోని పోవెన్ (POWAIN) రాజు జగన్నాథ సిన్హాతో చర్చలు జరిపేందుకు వెళ్ళిన సందర్భంగా ఆంగ్లేయుల ఎంగిలి మెతుకులకు ఆశపడిన పోవెన్ రాజు సోదరుడు విశ్వాసఘాతుకానికి పాల్పడి మౌల్వీ మీద కాల్పులు జరిపిన కారణంగా ఆయన ప్రాణాలు కోల్పోయారు. ఈ విషయాన్ని వి.డి.సావార్కర్ తన **1857 స్వరాజ్య సంగ్రామం** గ్రంథంలో వివరిస్తూ **రాజా ప్రక్కనే ఉన్న అతడి సోదరుడు మౌల్వీ పై**

**గురిచూసి కాల్పులు జరిపాడు. ఆ దుర్మార్గుని హస్తాలలో మౌల్వీ హతుడైపోయాడు. ఆ పిరికిపందలు...మౌల్వీ శిరస్సు ఖండించి, దాని పై గుడ్డ కప్పుకొని చేరువనే 13 మైళ్ళ దూరాన ఉన్న బ్రిటీషు ఠాణా– షాజహన్‌పూరుకు తీసుకువెళ్ళారు...రక్తం ఓడుతున్న ఆ పవిత్ర శిరాన్ని ఆ నీచులు ఆంగ్లేయుల ముందు కానుకగా ఉంచి వారి పాదాల చెంత మోకరిల్లారు..నీచమైన దేశద్రోహానికి తలపడిన ఆ పోవెన్ పశువుకు 50 వేల రూపాయల పారితోషికం లభించింది!** అని ఆగ్రహించాడు. (**1857 స్వరాజ్య సంగ్రామం,** వినాయకరావు దామోదర్ సావార్కర్, అనువాదం : విజయ, నవయుగ భారతి ప్రచురణలు, హైదరాబాదు, 2001, పేజీ156).

ఈ విధంగా మాతృభూమి విముక్తి కోసం మౌల్వీ అకుంఠిత దీక్షతో సాగించిన పోరాటాన్ని, ఆయనలోని అద్వితీయ శక్తిసామర్థ్యాలను బ్రిటీష్ సైనికాధికారులు, చరిత్రకారులు స్వయంగా సాక్ష్యాత్కరింపజేశారు. ప్రథమ **స్వాతంత్ర్య** సంగ్రామంలో పలువురు మౌల్వీలు ఆంగ్ల సైన్యాలతో తలపడి ప్రాణాలు అర్పించారు. ఆ తరువాత భయానక చిత్రహింసలకు, ఉరితీతలకు, ఫిరంగి ప్రేలుళ్ళకు, తుపాకి కాల్పులకు పెద్ద సంఖ్యలో మౌల్వీలు గురయ్యారు. ఈ యోధులు ఇస్లామిక్ పండితులైనంత మాత్రాన **వారి పోరాటం మతం కోసం మాత్ర**మేననటం దుస్సాహసం కాగలదు.

అంతటి దుస్సాహసం ఇటీవల కాలంలో Biman Bihari Majundar అను రచయిత చేశారు. ఆయన **Militant Nationalism in India and its Socio-Religious Background** అను తన గ్రంథం ప్రచురిస్తూ దానిలో ప్రముఖ జాతీయోద్యమకారులు మౌల్వీ ఒబైదుల్లా సింధీ గురించి అనుచిత వ్యాఖ్యలు చేశాడు.

ప్రథమ స్వాతంత్ర్యసంగ్రామంలో ఆయుధం చేతబూని ఈస్ట్ ఇండియా కంపెనీ సైన్యాలను ఎదుర్కొన్న ప్రముఖులు 1857 పోరాటం తరువాత ఆయుధాల స్థానంలో ఆంగ్లేయులతో మేధోపరమైన యుద్ధం సాగించేందుకు అవసరమైన సైనికులను తయారు చేయాలనుకున్నారు. ఆ ఉద్దేశ్యంతో ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలో ఏర్పడిన దియోబంద్ విద్యా సంస్థకు చెందిన విద్యార్థి మౌల్వీ ఒబైదుల్లా సింధీ. జాతీయోద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన మౌలానా ముహ్మదుల్ హసన్ శిష్యుడిగా గురుపు అజ్ఞానుసారం బ్రిటీష్ వ్యతిరేక పోరాటాన్ని బలోపేతం చేయడానికి 1915లో ఆఫ్ఘనిస్థాన్‌కు వెళ్ళి 1916లో రాజా మహేంద్ర వర్మ, బర్కతుల్లా భోపాలి తదితరులతో కలిసి ప్రప్రథమ ప్రవాస భారత ప్రభుత్వాన్ని కాబూల్ కేంద్రంగా ఏర్పాటు చేశారు.

భారత స్వాతంత్ర్యసంగ్రామంలో **సిల్క్ అక్షరాల కుట్ర** గా ఖ్యాతి గాంచిన విప్లవ కార్యక్రమాన్ని రూపొందించటంలో ఒబైదుల్లా ప్రముఖ పాత్ర వహించారు. ఒక వైపున విప్లవ కార్యకలాపాలలో పాల్గొంటూనే ప్రముఖ జాతీయోద్యమ నాయకుడు డాక్టర్ యం. అన్సారి సహకారంతో కాబూల్‌లో భారత జాతీయ కాంగ్రెస్ శాఖను ప్రారంభించారు. ఈ విషయాన్ని అన్సారి ప్రస్తావిస్తూ this was the first branch of the Congress outside the boundaries of the British empire, and I am proud to say that I was its first president అని సంతోషం వ్యక్తం చేశారు.

మౌల్వీ ఒబైదుల్లాను **ప్రమాదకర వ్యక్తి**గా పరిగణించిన బ్రిటీష్ పాలకులు ఆయనను ఆఫ్ఘనిస్థాన్ నుండి బయటకు పంపేందుకు గానీ, వీలుచిక్కితే అంతం చేయడానికి గానీ ప్రయత్నాలు సాగించారు. ఆ ఒత్తిడి వలన సుమారు 7 సంవత్సరాల తరువాత ఒబైదుల్లా ఆఫ్ఘనిస్థాన్‌ను విడిచిపెట్టి నిరంతరం నీడలా వెంటాడుతున్న బ్రిటీష్ ఏజెంట్ల కన్నుగప్పి 1922 డిసెంబరులో మాస్కో చేరుకున్నారు. 1926లో కాన్‌స్టాంటి నోపిల్‌లో ఉన్నప్పుడు తాను నిరంతరం కలలుగంటున్న స్వతంత్ర భారత దేశానికి అవసరమైన రాజ్యాంగాన్ని మౌలానా ఒబైదుల్లా సింధీ తయారు చేశారు.

ఆ రాజ్యాంగానికి **The Constitution of the Fedarated Republic of India, 1926** అని పేరు పెట్టారు. ఆయనను కానిస్టాంటినోపుల్‌లో కలసిన పండిట్ జవహార్‌లాల్ నెహ్రూ ఆ రాజ్యాంగ ప్రతిని చూసి ఇది మన దేశం ఎదుర్కొంటున్న **కమ్యూనల్ ప్రాబ్లంను** (మతతత్వ సమస్య) **సమర్ధవంతంగా పరిష్కరించగలదని** అభిప్రాయడ్డారు. ఆ విషయాన్ని ఆయన తన 'ఆత్మకథ'లో He (Obidullah) had produced a scheme for the United States or United republics of India Which was quite an able attempt to solve the communal problems' అని ఒబైదుల్లో కృషిని కొనియాడారు. ఈ విషయాన్ని ప్రముఖ చరిత్రకారుడు Dr. Tarachand తన **History of Freedom Movement in India** లో ప్రస్తావిస్తూ,"..Obidulla has made the independence of India his life mission.. He sacrified much and risked much for its sake అని అన్నాడు.

చివరకు 1939లో అరవై ఏడు సంవత్సరాల పెద్ద వయస్సులో, 24 సంవత్స రాల ప్రవాస జీవితం తరువాత, ఆయన స్వదేశానికి తిరిగి వచ్చారు. అసమాన పోరాట

యోధుడూ, అద్వితీయ విప్లవాకారుడూ మౌలానా ఒబైదుల్లా సింధీ, తాను కలలుకన్న స్వేచ్ఛా భారతదేశ స్వతంత్ర పతాకం రెపరెపలు చూడకుండానే, అస్వస్థతకు లోనై 1944 అగష్టు 22న కన్నుమూశారు.

ఈ యోధుడి పోరాట చరిత్ర ఇలా ఉండగా, Biman Bihari Majundar తన గ్రంథం **Militant Nationalism in India and Its Socio-Religious Background**లో, **మౌల్వీ ఉబైదుల్లా శిక్కు మతం నుండి ఇస్లాంలోకి మతాంతీకరణ చెందాడు. ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షహరాన్‌పూర్ లోని దియోబంద్ వద్ద కొంతమంది అనుచరులను తీసుకుని ఇండియా మీద ముస్లింల దాడి చేయడానికి కృషిచేశారు** అని అనుచిత వ్యాఖ్యలు చేశారు.

(Moulvi Obidulla, who had been converted to Islam form Sikhism, gathered a band of followers at Deoband in Saharanpur district of UP with the idea of promoting a great Muslim attack on India. He can not be called a nationalist at all - **India's Freedom Movement and Muslims**, M.K.A Siddiqui, IOS, New Delhi,1998.)

భారత స్వాతంత్ర్య సంగ్రామ చరిత్రలో భాగంగా ఇతర దేశాల సహాయంతో ఆంగ్లేయుల మీద యుద్ధం ప్రకటించాలని ప్రయత్నాలు చేసిన నేతాజీ సుభాష్ చంద్రబోస్ లాంటి నాయకులున్నారు. ఆ మహాయోధుల విధానాన్ని కూడా ఉబైదుల్లా సింధీ అనుసరించిన విధానంతో పోల్చి నేతాజీ కూడా **జాతీయవాది** అని పిలువబడడానికి అర్హులు కారని చెప్పడానికి ఎవరైనా సాహసించగలరా? Biman Bihari Majundar సూత్రీకరణల వెనుక మాతృభూమి కోసం అహర్నిశలు శ్రమించిన ముస్లిం యోధుల పట్ల వ్యతిరేకత ఏస్థాయిలో దాగుందో వెల్లడవుతుంది.

ఈ వ్యతిరేకత ఏ స్థాయిలో ఉందో గ్రహించడానికి జాతీయోద్యమం నాటి మరో రెండు సంఘటనలను ఇక్కడ ఉటంకించాలి. మాతృభూమి పట్ల తిరుగులేని గౌవరాభిమానాలకు పెట్టింది పేరైన యోధులలో ప్రముఖ జాతీయోద్యమకారులు మౌలానా అబ్దుల్ కలాం ఆజాద్, విప్లవ యోధుడు అష్ఫాఖుల్లా ఖాన్‌లు కూడా ఆరోజుల్లో ముస్లింల పట్ల ఉన్న వ్యతిరేక భావజాలం, వివక్షకు గురయ్యారు.

ఈ విషయాన్ని అబుల్ కలాం ఆజాద్ తన **ఇండియా విన్స్ ఫ్రీడం** గ్రంథంలో విస్తారంగా తెలిపారు. ఆ రోజుల్లో యువకుడు అబుల్ కలాం ఆజాద్ బెంగాల్‌కు

చెందిన విప్లవగ్రూపు **అనుశీలన సమితిలో** సభ్యత్వం కోరారు. మౌలానా ముస్లిం కావడం వల్ల ఆయనను అనుమానించి సమితిలో సభ్యత్వం ఇవ్వడానికి సమితి నాయకులు ఇష్టపడలేదు. చివరకు గత్యంతరం లేక మౌలానా స్వయంగా తానే **దారుల్ ఇర్షాద్** అనే విప్లవ సంఘాన్ని స్థాపించారు. మాతృభూమి విముక్తి కోసం ప్రాణాలను త్యాగం చేయడానికి సిద్దపడ్డ యువకులను **దారుల్ ఇర్షాద్** సభ్యులుగా చేర్చుకుని వారి చేత ఖుర్‌ఆన్ మీద ఖిద్దిపూర్ స్మశానంలో ప్రమాణాలు చేయించారు. ఆ తరువాత కొంత కాలానికి బెంగాలు విప్లవకారులు తమ తప్పును గ్రహించి మౌలానాను గౌరవించడమే కాకుండా, ఆయన సలహాల మేరకు విప్లవ కార్యకలాపాలను పలు ప్రాంతాలకు విస్తరింపచేశారు.

ఈ విషయాలను మౌలానా అబుల్ కలాం ఆజాద్ తన **ఇండియా విన్స్ ఫ్రీడం** గ్రంథంలో ప్రస్తావిస్తూ,' In fact, all the revolutionary groups were then actively anti-Muslim. At first they did not fully trust me and tried to keep me outside their inner council..' (**India Wins Freedom**, Moulana Abul Kalam Azad, Orient Longman, Delhi, 1998, P. 5) అని పేర్కొన్నారు.

మాతృదేశం కోసం ప్రాణాలు తృణప్రాయంగా భావించి త్యజించడానికి ముందుకురికిన ముస్లిం విప్లవకారులకు కూడా ఇలాంటి చేదు అనుభవాలు తప్పలేదు. ఆంగ్లేయుల నుండి విముక్తికోసం సాయుధపోరాటం చేసి చివరకు అత్యంత ధైర్యసాహసాలతో ఉరికంబం ఎక్కిన విప్లవకారుడు అష్ఫాఖుల్లా ఖాన్‌కు కూడా మౌలానా అబ్దుల్ కలాంకు ఎదురైన చేదు అనుభవం కలిగింది.

చిన్న వయస్సులోనే విప్లవోద్యమం పట్ల ఆకర్షితుడైన ఉత్తరప్రదేశ్ రాష్ట్రంలోని షాజహాన్‌పూర్‌కు చెందిన అష్ఫాఖుల్లా ఖాన్ అనాడు రాంప్రసాద్ బిస్మిల్ నాయకత్వంలోని విప్లవదళంలో చేరాలనుకున్నాడు. ఆ దిశగా ఎన్ని ప్రయత్నాలు చేసినా ఆయన ముస్లిం కనుక విప్లవదళంలో చేర్చుకునేందుకు తొలుత బిస్మిల్ అంగీకరించలేదు. ఈ విషయాన్ని బిస్మిల్ స్వయంగా తన ఆత్మకథలో ప్రస్తావిస్తూ **నాకు బాగా గుర్తు, చక్రవర్తి క్షమాప్రకటన అనంతరం నేను షాజహాన్‌పూర్ తిరిగి వచ్చినప్పుడు నీవు మొదట నన్ను స్కూలులో కలిసావు. నన్ను కలుసుకోవాలనే కోర్కె నీ మనస్సులో ఎంతగానో ఉండింది. మైన్‌పురి కుట్ర గురించి నాతో కొంత మాట్లాడాలని నీవు కోరావు. స్కూలులో చదివే ఒక ముస్లిం విద్యార్థి నాతో యిలాంటి విషయాల గురించి ప్రస్తావిస్తున్నాడని శంకించి నేను నీ**

ప్రశ్నలకు ఎంతో ఉపేక్షతో జవాబు ఇచ్చాను. నీకప్పుడు ఎంతో ఖేదం కలిగింది. నీ హృదయంలోని భావాలు నీ ముఖకవళికల్లో స్పష్టంగా గోచరించాయి. అయితే నీవంతటితో విరమించుకోక ధృఢనిశ్చయంతో నిలిచావు. ఏదోవిధంగా వీలు చూసుకుని లక్నో కాంగ్రెసులో నాతో మాట్లాడావు...నీ మిత్రులతో చెప్పించి నాకు నమ్మకం కలిగించ ప్రయత్నించావు. చివరకు నీవే నెగ్గావు. నీ ప్రయత్నాల వలన నా హృదయంలో నీకు చోటు దొరికింది, అని రాసుకున్నారు. (బిస్మిల్ ఆత్మకథ, హిందీ మూలం : శ్రీ రాం ప్రసాద్ బిస్మిల్, తెలుగు సేత : శ్రీ ఇంగువ మల్లికార్జున శర్మ, మార్క్సిస్టు అధ్యయన వేదిక, హైదరాబాదు,1989, పేజి.105).

మాతృభూమి విముక్తి కోసం ఉద్యమంచిన జాతీయోద్యకారులలో కూడా ముస్లింల పట్ల అనుమానం, వ్యతిరేకభావనలు ఏ మేరకు బలపడిపోయాయో ఈ సంఘటనల ద్వారా విదితమౌతుంది.

అలనాటి బ్రిటీష్ చరిత్రకారులు, ఆ చరిత్రకారుల రచనలను భూమికగా తీసుకుని చరిత్ర రచన సాగించిన స్వదేశీ చరిత్రకారులు ఆ ప్రభావం వల్ల సృజనాత్మక రచయితలు-కవులు సృష్టించిన ముస్లిం వ్యతిరేక సాహిత్య ప్రచారం కారణంగా రూపొందిన కళలు-కళారూపాల వలన సామాన్య ప్రజలలో ముస్లిం వ్యతిరేక మనస్తత్వం గాఢంగా స్థిరీకరించబడింది. ఈ రకమైన ముస్లిం వ్యతిరేక ప్రచారం మూలంగా ఆనాడు, ఈనాడు కూడా ముస్లింల పట్ల ఒకరకమైన వ్యతిరేకత పెంచి పోషించబడుతుంది. ఈ ప్రచారాన్ని ఎదుర్కోడానికి నిర్మాణాత్మక కృషి జరగక పోవడంతో ముస్లిం వ్యతిరేకత కాస్త మరింత బలం పుంజుకుని మత మనోభావాలను రెచ్చగొట్టి అధికార పగ్గాలను చేపట్టాలనుకుంటున్న శక్తులకు-వ్యక్తులకు ఆలంబన అవుతోంది.

ఈ మనస్తత్వం మరింతగా ప్రచారం కాకుండా సుమిత్ సర్కార్, తానికా సర్కార్, బి.యన్.పాండే, ఒంకార్ ప్రసాద్, సుధీర్ చంద్ర, కెకె ఘటక్, బిపిన్ చంద్ర, రొమిల్లా థాపర్, హర్బన్స్ ముఖియా, ఇర్ఫాన్ హబీబ్, అథర్ అలీ, ఇందీవర్ కామ్వేకర్ లాంటి ప్రముఖ చరిత్రకారులు, రచయితలు కొంత మంది చరిత్రకు సంబంధించిన వాస్తవాలను వెల్లడి చేస్తూ రచనలు చేస్తున్నారు. ఆ దిశగా సాహిత్య సృష్టి జరుగుతున్నా అది అనుకున్నంత స్థాయిలో, అవసరమున్నంత పరిమాణంలో జరగక పోవటం వలన శతాబ్దాలుగా సాగిన దుష్ప్రచారాన్ని కూకటి వేళ్ళతో పెళ్ళగించ లేకుంది. ఈ ప్రయత్నం అవసరమైనంత బలంగా లేకపోవటం వలన ముస్లిం విద్వేషకుల, ముస్లిం వ్యతిరేకశక్తుల

ఆటలు సాగుగుతున్నాయి. ముస్లిం ప్రజలను, ప్రభువులను అపఖ్యాతి పాల్జేయగల వ్యాఖ్యానాలు అతి సులువుగా ముస్లిం వ్యతిరేక శక్తులు-వ్యక్తులు ప్రకటిస్తున్నారు.

ప్రపంచంలో ఎక్కడా కన్పించనీ ఇండియాలో మాత్రమే శతాబ్దాలుగా దర్శనమిచ్చే అంటరానితనం, మహిళలు అనుసరించు పర్దా పద్ధతికీ, బాల్య వివాహాలకూ, సతీ సహగమనానికీ **ముస్లిం పాలకులు, ముస్లింల దుష్టపాలన, ముస్లిం సంస్కృతి** ప్రధాన కారణమని నమ్మించడానికి ప్రయత్నాలు బహుముఖంగా జరుగుతున్నాయి. ఏ మార్గం ద్వారానైతేనేమి రాజ్యాధికారం చేపట్టాలన్న తృష్ణతో మతోన్మాద స్వార్థపర రాజకీయ శక్తులు తమ చర్యల ద్వారా ముస్లిం వ్యతిరేక మనస్తత్వాన్ని పెంచి పోషిస్తున్నాయి. ఈ ప్రచారాన్ని చాలా నిస్సిగ్గుగా పటిష్టమైన పథకం ప్రకారంగా సాగిస్తున్నాయి. భారత దేశంలోనికి ముస్లింలు ప్రవేశించిన తరువాత మాత్రమే అంటరానితనం ప్రబలిందని చారత్రిక అవాస్తవాల్ని అసలుసిసలైన వాస్తవాలుగా పదే పదే చెబుతు ప్రచారంలో పెడుతున్నారు.

1995 జూన్ 15న విశ్వహిందూ పరిషత్ ప్రధాన కార్యదర్శి అశోక్ సింఘాల్ వారణాశిలో జరిగిన ఓ కార్యక్రమంలో మాట్లాడుతూ Dalits were the creation of Non- Hindutva forces, which ruled this country before the British...I say that Untouchability is a creation of Islam అని ప్రకటించారు. (**The Hindustan Times,**16 June, 1995 and **The Sunday Observer,** July 30-August 5, 1995) అంటరానితనం, దళితుల ఆవిర్భావం ఎవరి వల్ల, ఏ శక్తులు వల్ల, ఎప్పుడు ఉనికిలోకి వచ్చాయో స్వయంగా **హిందూ** ధార్మిక గ్రంథాలు ఒకవైపు ఘోషిస్తుండగా ఆ సత్యాన్ని మరుగున పర్చి ముస్లిం వ్యతిరేకతను మరింతగా రెచ్చగొట్టేందుకు శరపరంపరగా సాగుతున్న దుష్ప్రచారంలో భాగమిది.

ఈ దుష్ప్రచారాన్ని ప్రముఖ రచయిత ఇంతిజార్ నయీమ్ (Intizar Nayeem) తన Dalit Samsya : Jad Main Kaun (హిందీ) అను గ్రంథంలో సమాధానం ఇచ్చారు. సాహిత్య సౌరభ్ (న్యూఢిల్లీ) 1996లో ప్రచురించిన ఈ గ్రంథంలో దళితుల సమస్యకు, అంటరానితనానికి కారకులెవ్వర్న విషయాన్ని హిందూ మతానికి చెందిన పలు ధార్మిక గ్రంథాలు, ముస్లిమేతర రచయితలు, కవులు రాసిన పలు గ్రంథాలలో ఈ సమస్య ఆవిర్భావం గురించిన వెల్లడించిన వాస్తవాలను ఉటంకించారు. రెండు వందల తొంభైయిదు పటల ఈ గ్రంథంలో ఎక్కడా కూడా ముస్లిం రచయితల ఏ ఒక్క వాక్యాన్ని

